# వివిధజ్ఞాతవ్యవిషయాః

## షోడశకర్మల వివరణము

మానవులు (ముఖ్యముగా బ్రాహ్మణులు) ఆచరింపవలసిన పదియారు సంస్కారములను, అవి నిర్వహింపవలసిన పద్ధతిని ఆపస్తంబ, ఆశ్వలాయన, బోధాయనాది మహర్షులు తమ గృహ్యసూత్రములలో తెల్పినారు. వీటికే షోడశకర్మలనిపేరు. వీనిలో ఆగర్భాది మరణపర్యంతము చేసికొనవలసిన సంస్కారములకు పంచదశ(15) సంస్కారము లని పేరు. 16వదగు పితృమేధసంస్కారము మృతులైన మాతాపితరులనుగూర్చి పుత్రులు చేయు సంస్కారము.

శ్లో॥ గర్భాధానం పుంసువనం సీమంతోన్నయనం తథా।
జాత నామాన్న చౌలాని మౌంజీ వ్రతచతుష్టయమ్॥
శ్లో॥ గోదానాఖ్యం స్నాతకం చ వివాహంపైతృమేధికం।
షోడశైతాని కర్మాణి సమంత్రం కారయేత్తతః॥

అను శ్లోకముల ప్రకారము 1. గర్భాదానము, 2.పుంసవనము, 3.సీమంతము, 4.జాతకర్మ, 5.నామకర్మ, 6.అన్నప్రాశనము, 7.చౌలము, 8.ఉపనయనము, 9.ప్రాజాపత్యవ్రతము, 10.సౌమ్యవ్రతము, 11.ఆగ్నేయవ్రతము, 12.వైశ్వదేవము, 13.గోదానవ్రతము, 14.సమావర్తనము,15.వివాహము,16.పితృమేధము – అనునవి షోడశ (16) కర్మలు. ఇందులో మొదటి 15 సంస్కారములను వివరించు గ్రంథమునకు 'పూర్వప్రయోగ' మనియు, చివరిదగు పితృమేధసంస్కారమును వివరించు గ్రంథమునకు 'అపర ప్రయోగ' మనియు పేరులు. ఈగ్రంథము పూర్వప్రయోగమును వివరించునది. ఈ సమస్తకర్మల నిర్వహణ కవసరమైన మౌలికమైన విష్వక్సేనారాధన, గణపతిపూజ, పుణ్యాహవాచన, అగ్నిముఖ, విచ్ఛిన్నాగ్నిసంధాన, ఔపాసన, అంకురార్పణ, ఉదకశాన్తి, ప్రతిసరబంధ, జననకాలశాంత్యాది ప్రయోగములును ఈగ్రంథములో వివరింపబడినవి. అంతేకాక ఉపాకర్మ, సంధ్యావందన, నూతనగృహనిర్మాణ, గృహప్రవేశ,

పుత్రస్వీకారప్రయోగములును ఇందులో చెప్పబడినవి. ఈకర్మలన్నియు తత్తన్మంత్ర ములతో చేయవలెనని 'షోడశైతాని కర్మాణి సమంత్రం కారయేత్' అను దళము తెల్పు చున్నది. కాని స్త్రీలకు జాతకర్మనుండి చౌలమువఱకు గల కర్మలను అమంత్రకముగా చేయవలె ననియు, వివాహాది పుంసువనమువఱకు గల కర్మలను సమంత్రకముగా చేయవలె ననియు శాస్త్రము విధించుచున్నది.

ఈకర్మలయొక్క కర్తృకమునుగురించి, ధర్మశాస్త్రము లిట్లు చెప్పుచున్నవి. గర్భాధాన, పుంసువన, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌలములు ఏడును, ఉపనయనమందు కుమారభోజనమువఱకును పితృకర్తృకము. ఉపనయన ములో క్షురకర్మ మొదలుకొని పాలాశకర్మాంతమున్ను, మరియు ఉపాకర్మ, వేద వ్రతచతుష్టయము, గోదానవ్రతమువరకున్ను ఆచార్యకర్తృకములు. స్నాతకవివాహ ములు స్వకర్తృకములు. పితృమేధము పుత్రకర్తృకము.

ఈకర్మల ప్రయోజన మిట్లు చెప్పబడినది. గర్భాధాన,పుంసువన,సీమంత, జాత కర్మ,నామకరణ,అన్నప్రాశన,చౌల, ఉపనయన, (ఉపాకర్మ), ప్రాజాపత్య,సౌమ్య, ఆగ్నేయ,వైశ్వదేవ,గోదాన, స్నాతక, వివాహ,పైతృమేధికకర్మలు స్థూలశరీరమును సంస్కరించునవి. ఇట్లు సంస్కరింపబడిన శరీరమే కర్మశరీరము. ఇట్లు చేకూరిన సంస్కారసంపత్తియే వేదము చదువుటకును, తదుక్తయజ్ఞయాగాదికర్మలు చేయుట కును అర్హతను, అధికారమును కల్పించును. ఇట్లు సంస్కారియైనవాడే సభార్హుడు, పూజ్యుడు. అందుచేత ఈసంస్కారములను యథాశాస్త్రముగ నాచరించుట శిష్టుల కర్తవ్యము.

## అభ్యుక్షణాదిపదవివరణము

ఈగ్రంథములో చెప్పబోవు అగ్నిసంధానాదులలో అభ్యుక్షణము, అవోక్షణము మున్నగు పారిభాషికపదములు తరచుగా వచ్చును. సౌలభ్యమునకై వాని అర్థమిక్కడ ముందుగానే వివరింపబడినది.

*శ్లో॥ ఉత్తానేన తు హస్తేన కర్తవ్యం ప్రోక్షణం బుధైః*
*అవాచీనేన హస్తేన కర్తవ్యం స్యాదవోక్షణమ్॥*

*అవాఙ్ముష్టిప్రకారేణ, అభ్యుక్షణముదీరితమ్।*
*తిర్యగ్భూతేన హస్తేన, పర్యుక్షణమితి స్మృతమ్॥*

అనగా వెల్లకిల నున్న చేతితో నీటిని చల్లుటను ప్రోక్షణమనియు, బోర్లించిన చేతితో నీటిని చల్లుటను అవోక్షణమనియు, బోర్లించిన పిడికిటి ద్వారా నీటిని చల్లుటను అభ్యుక్షణ మనియు, అడ్డముగా నుంచిన చేతి పిడికిలితో నీటిని చల్లుటను పర్యుక్షణ మనియు అందురు.

## ఇధ్మముల లక్షణములు

"పాలాశః ఖాదిరో వా స్యాదిధ్మః పంచదశ స్మృతః।" - ఇతి బోధాయనః.
"ప్రఘూరౌ ప్రాదేశసంమితౌ। ద్వ్యః ప్రాదేశో భవేదిధ్మః। త్రిః ప్రాదేశస్తు మధ్యమః।
స్థవిష్ఠో దక్షిణార్థస్స్యాత్త్రిరనామిక ఇష్యతే। త్రిర్మధ్యమం చోత్తరార్థ్యః పరిధీనాం
ప్రమాణకమ్। సంఖ్యా వింశతిధాతోఽప్యేకాన్యైకవింశతిధా క్వచిత్॥"
- ఇతి నారసింహస్మార్తకారికావృత్తిః.

అనగా ఇధ్మములు మోదుగవిగాని, చంద్రవిగాని పదునైదుండవలెనని బోధాయన మహర్షి చెప్పెను (సూచన: ఇవియే కాక, జమ్మి, మఱ్ఱి, రావి, వెదురు, మేడి, జువ్వి, గఱిక, దర్భలు మొదలగు అన్యవృక్షజన్యమైనవి గూడ నుండవచ్చును గాని, యాజ్ఞిక కోటిలో సర్వసాధారణముగా మోదుగపుల్లలనే ఇధ్మములుగా వాడుట జరుగుచున్నది). ఇధ్మముల లక్షణములు నృసింహపండితుని స్మార్తకారికావృత్తిలో నిట్లు చెప్పబడినవి: "ఇధ్మకట్టలో మొత్తము 20 సమిధలుండవలెను. వీనిలో 15 ఇధ్మములు; ఇవి రెండు జిట్టల పొడవుండవలెను. మిగిలినవానిలో రెండు ఆఘారసమిధలు; ఇవి జిట్టెడు పొడవుండవలెను. ఇవి అగ్నికి తూర్పున గేటువలె నుంచునవి. ఇంకను మిగిలిన 3 సమిధలకు పరిధులని పేరు; వీనిలో మధ్యమపరిధి అగ్నికి పడమటను, దక్షిణపరిధి అగ్నికి దక్షిణమునను, ఉత్తరపరిధి అగ్నికి ఉత్తరమునను ఉంచబడునవి. ఇందులో మధ్యమపరిధి 3 జిట్టల పొడవుండవలెను. దక్షిణపరిధి 3 అనామికల పొడవుండవలెను; అనామిక యనగా చాచిన అంగుష్ఠానామికలకు మధ్యగల దూరము. ఉత్తరపరిధి 3

మధ్యమముల పొడవుండవలెను; మధ్యమమనగా చాచిన మధ్యమాంగుష్ఠములకు మధ్యగల దూరము. (సూచన: శ్రౌతకర్మలయందుపై 20 సమిధలే కాక మఱొక సమిధ - అసూయాజసమిత్తు అనునది - ఉండును. కాని స్మార్తకర్మలలో 20 సమిధలే యుండును.)

ఈసమిధల స్థౌల్య మెంతయుండవలెనో ఈక్రింది శ్లోకములు తెల్పుచున్నవి.

శ్లో॥ కనిష్ఠికాగ్రపర్వణ్యాం యావత్ స్థౌల్యం ప్రదీయతే।
తావత్ స్థౌల్యం సమిత్కాష్ఠం గృహ్యభాష్యాద్వినిశ్చితమ్॥
శ్లో॥ తథైవానామికాగ్రస్య చర్మకాష్ఠస్య మానతః।
శిష్టాఙ్గుళిత్రయాస్యాద్యం మానాః పరిధయః ఖలు॥

అనగా, చిటికెనవ్రేలి చివరికణుపు ఎంతలావుండునో సమిధలు అంత లావుండవలెను. అట్లే ఉంగరపువ్రేలి చివరికణుపంత లావున్న దొకటి, మిగితా రెండువ్రేళ్ల మొదటి కణుపంత లావుగలవి రెండుసమిధలు పరిధులుగ నుండవలెను.

## పరిధులను అగ్నికి చుట్టు నుంచు విధానము

ఈపరిధులలో అన్నింటికంటె లావుగ నుండు దానిని అగ్నికి పడమటను (స్థవిష్ఠో మధ్యమః), దానికంటె సన్నగను పొడవుగను ఉండు పరిధిని అగ్నికి దక్షిణమునను (అణీయాన్ ద్రాఘీయాన్ దక్షిణార్ధ్యః), ఇంకను సన్నముగను పొట్టిగను ఉండు పరిధిని అగ్నికి ఉత్తరమునను (అణిష్ఠో హ్రసిష్ఠ ఉత్తరార్ధ్యః) ఉంచవలెను. ఆఘార సమిధలను రెండును కుడిచేత పట్టుకొని మధ్యమపరిధికి తాకించి అగ్నికి తూర్పున దక్షిణోత్తరములందు ఉర్ధ్వాగ్రములుగా నుంచవలెను.

## పరిధులకు శమ్యలకు భేదము

పైన చెప్పిన పరిధులు కొన్ని సంస్కారములలో శమ్యలుగా భావింపబడుచున్నవి. పరిధులుగా భావింపబడినప్పుడు ఈసమిధలను హోమాంతమున అగ్నిలో వేయుచున్నారు. శమ్యలుగా భావింపబడినప్పుడు వీనిని అగ్నిలో నుంచక తీసివేయు

చున్నారు. ఇదియే పరిధులకు, శమ్యలకు గల భేదము. ఏయే సంస్కారములలో నివి శమ్యలుగా భావించుచున్నారో ఆవిషయము నీ క్రింది శ్లోకములు తెల్పుచున్నవి.

శ్లో॥ వివాహోపనయన స్నానే సీమన్త క్షౌరకర్మసు।
ప్రాయశ్చిత్తేషు గోదానే శమ్యాన్యత్ప్రహరే తథా॥

శ్లో॥ వ్రతేషు శాన్తిహోమేషు విభ్రష్టేష్టౌ వృషోత్సృజే।
చరోః ప్రధానకే కుర్యాచ్ఛమ్యా ఏవ న సంశయః॥

అనగా వివాహము, ఉపనయనము, స్నాతకము, సీమంతము, చౌలము, ప్రాయశ్చిత్తహోమము, గోదానవ్రతములయందు శమ్యలుగా నెంచవలెను. ఇతరకర్మలలో పరిధులుగా నెంచి వీనిని అగ్నిలో నుంచవలెను. వేదవ్రతములందును, శాన్తిహోమములందును, విభ్రష్టేష్టియందును, వృషోత్సర్జనమందును, చరుప్రధానమైన అన్ని కర్మలయందును శమ్యలుగా నెంచవలెను.

## పరిధులను అగ్నిలో నుంచు విధానము

పరిధులను, ఆఘారసమిధలను అగ్నిలో పరిహరించు పద్ధతి ఈక్రింది శ్లోకము తెల్పుచున్నది.

శ్లో॥ ప్రహృత్య మధ్యమం పరిధి మితరే యుగపత్ క్షిపేత్।
ఆఘారసమిధావగ్నౌ యుగప త్సంప్రయోజయేత్॥

హోమాంతమున పరిధులను, ఆఘారసమిధలను అగ్నిలో వేయుట జరుగుచున్నది. దీనికై మధ్యమపరిధిని మొదట అగ్నియందుంచి, తదుపరి దక్షిణోత్తరపరిధులు రెండును రెండు హస్తములలో గ్రహించి ఒకేసారి అగ్నియందుంచవలెను. తరువాత ఆఘారసమిధలు రెండును తీసి ఉత్తరమున నున్న సమిధయొక్క అగ్రమును అగ్నిలోనికి త్రోసివేసి, రెండవదానిని అగ్నియందుంచవలెను.

## ఇధ్మమును అగ్నిలో నుంచు విధానము

పైన చెప్పిన 3 పరిధులు (లేక శమ్యలు), రెండు ఆఘారసమిధలు పోగా సమిధల కట్టలో 15 సమిధలు మిగిలియుండును. ఈ 15 సమిధలకట్టకు ఇధ్మము అని పేరు.

అగ్నిముఖములో అగ్నిని స్థాపించిన తర్వాత ఈ ఇధ్మమును అగ్నిలో వేయవలసి యుండును. ఇట్లు వేయుటకు 'ఇధ్మాధాన' మని పేరు. దానికై కర్త ఈ ఇధ్మముల యొక్క మూలము, మధ్యముల మధ్యగల భాగమును ఎడమచేతను, మధ్యము, చివరల మధ్యగల భాగమును కుడిచేతను పట్టుకొని, ఇధ్మమూలమును నేతిలో నద్ది, బ్రహ్మానుజ్ఞను పొంది, కొంచెము పైకి లేచి ఇధ్మముకొనలు తూర్పునకుండునట్లుగా అగ్నిలో వేయవలెను. ఒంటిచేత ఇధ్మాధానమును చేయగూడదు.

## హోమపాత్రల వివరములు

కొన్ని హోమములు నాల్గు హోమపాత్రలతోను, మఱికొన్ని ఆఱు హోమపాత్రలతోను చేయుచున్నారు.వీనికి వరుసగా చతుష్పాత్రప్రయోగము, షట్పాత్రప్రయోగము - అని పేర్లు. పితృసంబంధమైన అనేకహోమములు చతుష్పాత్రప్రయోగముతోనే చేయుచున్నారు. చతుష్పాత్రప్రయోగమునకు వాడు పాత్రలు:

**దర్వీ:** ఆజ్యమును, హవిర్హవిష్యాదులను అగ్నియందు వేసి ప్రధానహోమము చేయుటకుపయోగించు పాత్ర. దీనికే "స్రుక్కు" అనియు, "ప్రధానదర్వి" అనియు పేరులు.

**ఇతరదర్వీ:** ఆజ్యమును స్రుక్కునందుంచుట కుపయోగించు పాత్ర. దీనకే "స్రువ" మనియు పేరు. ప్రధానహోమమునకు ఆనుషంగికమైన అనాజ్ఞాతాదిహోమములు స్రువముతోనే చేయుచున్నారు. సృక్స్రువములకు యాజ్ఞికులు సామాన్యముగా మోదుగాకులను వాడుట చూచుచున్నాము. అట్లుగాకున్న వీనికై కఱ్ఱతో చేసిన పాత్రలు గూడ వాడవచ్చును.

**ఆజ్యస్థాలి:** సంస్కరింపబడిన హోమార్థమైన ఆజ్యము నుంచు పాత్ర.

**ప్రోక్షణి:** ఇతర హోమపాత్రలను ప్రోక్షించి, సంస్కరించు జలముంచు పాత్ర.

ఈ క్రిందివి షట్పాత్రప్రయోగములో నుపయోగించు రెండు అదనపు పాత్రలు:

**ప్రణీతి:** నీటిని నింపి ఉంచుకొను పాత్ర. ఇది పాత్రాసాదన చేసినపుడు అగ్నికి ఉత్తరమున నుంచి, అందులో నీటిని నింపి, పూర్ణాహుతి తర్వాత కర్త తనను తన కుటుంబమును ప్రోక్షించుకొనుటకై నీటి నుంచుకొను జలపాత్ర.

**ఇధ్మము:** పైన చెప్పినట్లుగా 20 సమిధలు గలిగి, దర్భత్రాటిచే కట్టబడిన సమిధల కట్ట.

ఈపాత్రలకే దేవపాత్రలని పేరు.ఆయాహోమవిధులందు చెప్పబడినట్లుగా అగ్నికి ప్రక్కన పూర్వాగ్రముగా దర్భలను పఱచి, వానిపైపైహోమపాత్రలను బోర్లించి యుంచవలెను. ఇట్లు పాత్రల నుంచుటకే పాత్రాసాదన మని పేరు. శుభకార్యములందు వీనిని జంటజంటగా రెండుచేతులలో పట్టుకొని రెండువరుసలలో అగ్నికి ఉత్తరమున ఎడమవైపు పరచిన దర్భలపై ఎడమచేతిలోని పాత్రను, కుడివైపు పరచిన దర్భలపై కుడిచేతిలోని పాత్రను బోర్లించి యుంచవలెను. 'దర్వ్యాజ్యస్థాల్యౌ, ప్రోక్షణీపూర్ణపాత్రే, ఇధ్మస్రువావితి|'- అను సూత్రము వీని నుంచు క్రమము తెల్పుచున్నది. అనగా దర్వీని, అజ్యస్థాలీని కుడి, ఎడమచేతులలో నొకేసారి గ్రహించి, బోర్లించి యుంచవలెను. అట్లే ప్రోక్షణిని, ప్రణీతిని జంటగాను, ఇధ్మకట్టను, ఇతరదర్విని మఱొక జంటగాను కుడి, ఎడమచేతులలో నొకేసారి పట్టుకొని బోర్లించి యుంచవలెను. పితృకార్యములందు జంటగా గాక, ఒక్కొక పాత్రనే క్రమముగా బోర్లించి యుంచవలెను. ఇక మనుష్య సంబంధమైన పాత్రలనన్నిటిని ఒకేసారి అగ్నికి సమీపమున నుంచవలెను. అనగా ఉపనయనాదులలో అవసరమైన మౌంజీ, మేఖలా, వస్త్ర, యజ్ఞోపవీతాదులన్నియు నొక తట్టలో నుంచి, ఆ తట్టను అగ్నిసమీపమున నుంచవలెను.

పై పాత్రలే కాక, ఈ క్రింది పాత్రలును తరచుగా కొన్ని ప్రయోగములలో ప్రసక్తమగును:

**అభ్యుక్షణతోయపాత్ర:** ఇతరపాత్రలను ప్రోక్షించుటకై నీటి నుంచు పాత్ర. ఇది షట్పాత్రప్రయోగములోను, చతుష్పాత్రప్రయోగములోను రెంటిలోను ఉండును.

**చరుపాత్ర:** చరువును - అనగా బియ్యము, పెసరపప్పు మున్నగువానిని కలిపి అగ్నిపై వండుట కుపయోగించు పాత్ర.

**హవిఃపాత్ర:** హోమార్థమైన హవిస్సును (అన్నమును) ఉంచు పాత్ర.

**హవిష్యపాత్ర:** హోమార్థమైన హవిష్యమును (కూరను) ఉంచు పాత్ర.

**మేక్షణము:** దర్వీని తుడుచుటకు, హవిస్సును తోడుటకు ఉపయోగించెడు సమిధ.

**ఆయామతము:** ప్రోక్షణ్యాజ్యపాత్రాదిసంస్కారములకై వాడునట్టి రెండుదర్భలతో కట్టిన పవిత్రము. దర్భలతుదకు అగ్రములు ఒక అంగుళము పొడవు కనబడునట్లు ఒక ముడిని వేసి, ఆ ముడి తరువాత మూడు అంగుళములకు క్రిందుగా ఆ దర్భలను నఖములతో గాక అన్యవిధముగా త్రుంచవలెను (చెంబుయొక్క అంచుతో ఈదర్భలను త్రుంచుట సర్వత్ర యాజ్ఞికకోటిలో చూచుచున్నాము). ఇదియే ఆయామతము. ఇట్టివానిని శ్రీవిష్వక్సేనారాధనయందును, గణపతిపూజయందును, పుణ్యాహవాచనము, అగ్నిముఖాదికర్మలయందును ఉపయోగించుచున్నారు. పితృకార్యములలో దీనిని రెండు దర్భలకు బదులు ఒక్కదర్భతో కట్టుచున్నారు.
**అర్ఘ్యపాత్రలు:** శ్రాద్ధములో స్వాముల కీయవలసిన అర్ఘ్యజలము నుంచు పాత్రలు.

## అగ్నిలో ఆహుతుల నుంచు విధానము

అగ్నిలో ఆజ్యాహుతులు గాని, చర్వాది ఇతరాహుతులు గాని వేసినప్పుడు వానిని 'స్వాహా' అని ఉచ్చరించిన తర్వాతనే అగ్నిలో వేసి, 'న మమ' అని త్యాగము నుచ్చరింపవలెను. ఇట్లు ఆజ్యాహుతి నుంచునప్పుడు ఎడమచేతితో ఆజ్యపాత్రను లేదా హృదయమును తాకుచు, స్వాహాంతముగా మంత్రమును చదివి కుడిచేతితో నేతిని అగ్నిలో నుంచవలెను. స్రువముతో స్రుక్కులోనికి ఎన్నిమారులు ఆజ్యమును వేసికొనవలెనన్నది ఆయాప్రయోగములు నిర్ణయించును. ఉదా: 'అగ్నయే స్వాహా' అను మంత్రముతో ఆజ్యహోమమును చేయునప్పుడు 'స్వాహా' అన్న తర్వాత అగ్నిలో నేతిని వేసి, 'అగ్నయ ఇదం న మమ' అని త్యాగము నుచ్చరింపవలెను. 'అగ్నయ ఇదం న మమ' అను త్యాగమునకు - 'ఈ సమర్పించిన ఆహుతి అగ్నికే చెందును కాని నాకు చెందదు' అని అర్థము.

## స్థండిలలక్షణము

హోమార్థము అగ్ని ప్రతిష్ఠించుటకై ఏర్పరచు వేదికకు స్థండిల మని పేరు. వైఖానసగృహ్యసూత్రములో స్థండిలలక్షణ మిట్లు చెప్పబడినది: *'ప్రాక్ప్రవణే చోత్తరప్రవణే వా శుద్ధే దేశే శుద్ధాభిస్సికతాభిః ప్రాక్పశ్చిమం దక్షిణోత్తరఞ్చ ద్వాత్రింశదంగుళాయతం*

*ద్వ్యంగుళోన్నతం యథాలాభోన్నతం వా స్థండిలమగ్న్యాయతనం భవతి* – అనగా, 'తూర్పునకు గాని, ఉత్తరమునకు గాని వాలుగల శుద్ధమైన ప్రదేశమున స్వచ్ఛమైన ఇసుకను రెండంగుళముల ఎత్తుగా (అవసరమైన అంతకంటెను ఎత్తుగా గాని) నేర్పి, తూర్పు, పడమర, ఉత్తర,దక్షిణదిశలందు మూలలు గలిగిన 32 అంగుళముల చతురస్రముగా నేర్పాటు చేయవలెను. ఇదియే హోమాగ్ని నుంచు స్థండిలము' – అని దీని కర్థము. అంగుళమనగా హోమకర్త లేక పురోహితునియొక్క కుడిచేతి నడిమివ్రేలి యొక్క నడిమిగణుపునకు సమాన మని *'సర్వేషాం యాజ్ఞికానాంయజమానస్యాధ్వర్యో వా దక్షిణహస్తస్య మధ్యమాంగుళేర్మధ్యమపర్వణా మానమాచరతి'* – అను శ్రౌతవాక్యము తెల్పుచున్నది. ఈ అంగుళప్రమాణము దాదాపుగా ఈనాడు మనము వాడుచున్న 'Inch' నకు సమముగా నున్నది.

## షట్పాత్రప్రయోగద్వైవిధ్యము

షట్పాత్రప్రయోగములో అగ్నిముఖము, అజ్యభాగము అని రెండు విధములు గలవు. అగ్నిముఖములో పరిధులను, ఆజ్యభాగములో శమ్యలను ఉపయోగింతురు. (లోగడ చెప్పినట్లుగా, అదేసమిధలను అగ్నిముఖములో పరిధులని, ఆజ్యభాగములో శమ్యలని వ్యవహరింతురు). అగ్నిముఖాంతమున *'ఓం భూర్భువస్సువ స్స్వాహా'* అని హోమము చేయుటకు ముందుగా *'అగ్నయే స్వాహా అగ్నయ ఇదం న మమ'* అని హోమము చేయవలెను. ఆజ్యభాగములో ఈహోమముతో పని లేదు. వివాహము, ఉపనయనము, సమావర్తనము, సీమంతము, చౌలము, గోదానవ్రతము, ప్రాయశ్చిత్త హోమములు – వీనియందు ఆజ్యభాగమును, ఉపాకర్మ, వేదవ్రతాదులందు అగ్ని ముఖమును చేయవలెను. పుంసువనము, స్థాలీపాకములను గూడ ఆజ్యభాగముతోనే చేసినప్పటికి, వానిలో శమ్యలకు బదులు పరిధులనే వాడవలెను.

హోమాంతమున ఆఘారసమిధలను పరిహరించు విధానములో గూడ ఆజ్య భాగమునకు, అగ్నిముఖమునకు భేదము గలదు. అగ్నిముఖములో హోమాంతమున పరిధులను అగ్నిలో వేసి, రెండు ఆఘారసమిధలయొక్క చివరలు సగభాగములను తూర్పువైపు అగ్నియందు గుచ్చవలెను. ఆజ్యభాగములో శమ్యలను తీసివేసిఆఘార

సమిధలను అగ్నిలో పడవేయవలెను. మిగితా పాత్రాసాదన, పాత్రసంస్కారాది విధాన ములలో ఆజ్యభాగమునకు, అగ్నిముఖమునకు భేదము లేదు.

## దర్భలు, హోమపాత్రల విచారము

1. హోమపాత్రలు కఱ్ఱతో చేసినవి గాని, చిన్న చిన్న గిన్నెలు గాని, మోదుగ దొప్పలు గాని నుండవచ్చును. దర్వులకు మేడి, లేక రావి, లేక మోదుగాకు లను వాడవచ్చును. కాని మామిడాకులను మాత్రము వాడకూడదు. యాజ్ఞిక కోటిలో మోదుగాకులను వాడుటయే అచారముగా నున్నది.
2. అన్ని శుభకార్యములందును ఆయామతములు, పవిత్రములు, భుగ్నములు రెండేసి దర్భలతో కట్టవలెను. పరిస్తరణలను 16 దర్భలతో కట్టవలెను. ప్రతి పుణ్యాహవాచనమునకు వేర్వేరుగా పవిత్రములను, కూర్చలను, ఆయామత ములను చేసికొనవలెను. ఒక పుణ్యాహములో వాడిన వానిని మఱొక పుణ్యాహ ములో వాడగూడదు.
3. షట్పాత్రప్రయోగములో అగ్నిముఖములోను, ఆజ్యభాగములోను వాడవలసిన దర్భల సంఖ్య నీక్రింది శ్లోకములు తెల్పుచున్నవి.

శ్లో॥ అగ్నిం షోడశభిర్దర్భైః పురతస్తు పరిస్తరే।
పరిస్తరణ మన్యేషామేవం సంఖ్యా విధీయతే॥

తాత్పర్యము: అగ్నికి తూర్పున 16దర్భలచేత పరిస్తరణము చేయవలెను. ఇట్లే మిగితా దక్షిణ,పశ్చిమ,ఉత్తరదిశలందును చేయవలెను. (అందుచేత పరిస్తరణ లకు 16x4=64 దర్భలు కావలెను.)

శ్లో॥ పాత్రాణాంతు ద్విషట్కం స్యాత్ ప్రణీతాసాదనే తథా।
అష్టభిరాచ్ఛాదనం కుర్యాత్త్రిభి ర్బ్రహ్మాసనం తథా॥

తాత్పర్యము: అగ్నికి ఉత్తరమున పాత్రాసాదన చేయుటకు 12, ప్రణీత (పూర్ణ జలపాత్ర) నుంచుటకు 12, ప్రణీతపై కప్పుటకు 8, బ్రహ్మాసనమునకై 3, మొత్తం 35 దర్భలు కావలెను.

శ్లో॥ ద్వౌదర్భౌతు పవిత్రస్య తథా ప్రత్యయనస్య చ।
సంమార్జనం త్రిభిర్దర్భై ర్జ్వలనస్యైక ఉచ్యతే।
పర్యగ్ని కరణస్యైక మేవ మష్టోత్తరం శతమ్॥

తాత్పర్యము: ఆయామతమునకు 2, దర్భాగ్రములు త్రుంచి ఆజ్యపాత్రయందు వేయుటకు 2, స్రుక్సంమార్జనకు 3, అవద్యోతనమునకు 1, పర్యగ్నికరణము నకు 1, మొత్తం 9.

(పైన పేర్కొన్న 64, 35 దర్భల సంఖ్యతో గలిపి ఇట్లు మొత్తం 108 దర్భలు కావలెను. చతుష్పాత్రప్రయోగములో ప్రణీతి, బ్రహ్మస్థానములు లేవు గనుక 85 దర్భలు చాలును.)

శ్లో॥ ఏకాదశాఙ్గుళీదేశే దశమే నవమేఽష్టమే।
సేచనం పరిధిశ్చైవ తరణం పూజనం క్రమాత్॥

తాత్పర్యము: స్థండిలమునకు 11 అంగుళముల దూరములో సేచనము, 8 అంగు ళముల దూరములో అలంకారమును చేయవలెను. 9 అంగుళముల దూరములో పరిస్తరణలను, 10 అంగుళముల దూరములో పరిధులను ఉంచవలెను.

## కూర్చలక్షణములు

శ్లో॥ కూర్చం తు త్రివిధం జ్ఞేయ ముత్తమం మధ్య మాధమే।
నవభి స్సప్తభి ర్దర్భైః పంచభి ర్గ్రంధి సంయుతమ్।
తన్మూలం ద్వాదశాఙ్గుళ్యం తదగ్రం చతురఙ్గుళమ్।
కూర్చాగ్రే తు గీర్దేవీ కూర్చమధ్యే తు పార్వతీ।
కూర్చమూలే స్థితా గఙ్గా ఏతాః కూర్చాధిదేవతాః॥

అర్థము: కూర్చ మూడు విధములు. 9 దర్భలతో కట్టినది ఉత్తమము, 7 దర్భలతో కట్టినది మధ్యమము, 5దర్భలతో కట్టినది అధమము. అందుచేత 9 గాని, 7 గాని, 5 గాని కొనలు గల దర్భలను తీసికొని, కొనలు సమముగా నుండునట్లు సరిచేసికొని, కొనలనుండి 4 అంగుళములకు క్రిందుగా దర్భల నన్నటిని కలిపి ముడివేసి, ఒక దర్భను క్రిందివైపునకు విడదీసి, దానిని మిగితా దర్భల చుట్టును చుట్టుకొనుచు వచ్చి

12 అంగుళము లైన తర్వాత ఈదర్భను మొదళ్లవైపు ముడి వేసి, మిగిలిన మొదళ్ళను కోసివేయవలెను. ఇట్లు కట్టిన కూర్చయొక్క అగ్రమునకు సరస్వతి, మధ్యభాగము నకు పార్వతి, మొదటికి గంగాదేవి అధిష్ఠానదేవతలని పై శింగాభట్టీయమునందలి శ్లోక ములు చెప్పుచున్నవి. ఐనను శుభకార్యములందు కొందరు 12 దర్భలతో కూర్చను కట్టుట చూడవచ్చును.

## సప్తాగ్ని జిహ్వలు

ఏడు జిహ్వలు కలవాడు గావున అగ్నికి 'సప్తజిహ్వ' అని పేరు. వివిధకర్మలలో వివిధజిహ్వలయందు హోమద్రవ్యము నుంచవలసియుండును. అందుచే నీ క్రింది శ్లోకములలో వివరింపబడిన జిహ్వల లక్షణముల నెరిగి హోమము చేయవలెను.

శ్లో॥ హిరణ్యా కనకా కృష్ణా రక్తా చైవాథ సుప్రభా।
అతిరక్తా బహురూపా సప్తజిహ్వాః ప్రకీర్తితాః॥

శ్లో॥ హిరణ్యా పశ్చిమే జిహ్వా, కనకాత్వగ్ని మధ్యగా।
రక్తాచైవోత్తరే జిహ్వా, కృష్ణా దక్షిణదిక్ స్థితా॥

శ్లో॥ సుప్రభాచైవ పూర్వాయా మతిరక్తాగ్ని దిక్ స్థితా।
బహురూపా చ శార్వాయాం జిహ్వాస్థానం ప్రకీర్తితమ్॥

తాత్పర్యము: హిరణ్యా, కనకా, కృష్ణా, రక్తా, సుప్రభా, అతిరక్తా, బహురూపా అనునవి అగ్నియొక్క సప్తజిహ్వలకు పేర్లు. హిరణ్య పడమటియందు, కనక మధ్య యందు, రక్త ఉత్తరమందు, కృష్ణ దక్షిణమందు, సుప్రభ తూర్పునందు, అతిరక్త ఆగ్నే యమందు, బహురూప ఈశాన్యమందు ఉండును. ఇవి జిహ్వాస్థానములు.

శ్లో॥ వివాహే వారుణీ జిహ్వా, మధ్యమా జాతకర్మసు।
ఉత్తరేతూపనయనే, దక్షిణా పితృకర్మణి॥

శ్లో॥ కామ్యకర్మసు పూర్వాయా, మభిచారేగ్ని దిక్ స్థితా।
శాన్తికర్మణి శార్వాయాం స్థానకర్మ సమీరితమ్॥

శ్లో॥ ఆగ్నేయే తిలహోమస్స్యా, దైశాన్యాం గృహకర్మసు।
రక్తాయాం చరుహోమస్స్యా, త్సుప్రభా సక్తుహోమకే॥

శ్లో॥ పుష్పం స్యాద్బహురూపాయాం, శేషాస్వాజ్యాహుతి ర్భవేత్।
పూర్వాదిక్సర్వహోమార్థమితి హోమస్య లక్షణమ్॥

తాత్పర్యము: ఏయే కర్మలలో ప్రధానహోమముల నేయే జిహ్వలయందు చేయవలెనో పైశ్లోకములు తెల్పుచున్నవి. వీని సారాంశ మీక్రింది పట్టికలో సమీకరింపబడినది.

| కర్మ | హోమము చేయవలసిన జిహ్వ |
|---|---|
| వివాహము | పశ్చిమ(హిరణ్య)జిహ్వ |
| జాతకర్మ,ఘృతహోమము | మధ్య(కనక)జిహ్వ |
| ఉపనయనము,చరుహోమము | ఉత్తర(రక్త)జిహ్వ |
| పితృకర్మలు | దక్షిణ(కృష్ణ) జిహ్వ |
| కామ్యకర్మలు, సక్తు(పేలపిండి),అన్ని ద్రవ్యములు | తూర్పు (సుప్రభ) జిహ్వ |
| తిల,అభిచారహోమములు | ఆగ్నేయ(అతిరక్త) జిహ్వ |
| శాంతి, గృహకర్మలు,పుష్పహోమము | ఈశాన్య(బహురూప) జిహ్వ |

## అగ్నినిర్ణయము

గృహస్థుడు వివాహాగ్నిని పరిరక్షించుకొని అందులో నిత్యౌపాసనములు చేయు చుండవలెను. ఇట్టిఅగ్నికి ఔపాసనాగ్ని, లేక ధార్యాగ్ని లేక స్మార్తాగ్ని అనిపేరు. ఇట్లు గాక స్వగృహము, లేక శ్రోత్రియాగారమునుండి తెచ్చి ప్రతిష్ఠించిన అగ్నికి లౌకికాగ్ని యనిపేరు. కొన్ని కర్మలు లౌకికాగ్నిలోను, మఱికొన్ని ఔపాసనాగ్నిలోను చేయవలసియుండును. నృసింహపండితుని 'స్మార్తకారికావృత్తి' ననుసరించి, ఏయే కర్మలకు సంబంధించిన హోమముల నేయే అగ్నిలో చేయవలెనో ఇచ్చట చెప్పబడు చున్నది.

**లౌకికాగ్నిలో చేయవలసినవి:** జాతకర్మ మొదలు వివాహాంతము గల కర్మలు, కామ్య వ్రతములు, ఉద్యాపనములు, భార్యాయుక్తుడైనవాడు చేసికొనునట్టి ద్వితీయభార్యా వివాహకర్మ.

**ఔపాసనాగ్నిలో చేయవలసినవి:** పుంసువనము,సీమంతము,శాంతికాదిహోమములు, మాతామహీమాతామహులయొక్కయు, మాతాపితరులయొక్కయు, తనభార్య

యొక్కయు ప్రత్యాబ్దికములందలి అగ్నౌకరణము, వాస్తుహోమము, గృహప్రవేశ హోమము, ఆగ్రయణేష్టి, వివాహానంతరము చేయవలసిన సప్తపాకయజ్ఞములు – అనగా, ఔపాసనము, వైశ్వదేవము, స్థాలీపాకము, మాసిశ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము, సర్పబలి, ఈశానబలి – అను ఏడు కర్మలు.

## దీపారాధనము

ఈగ్రంథములో నటనట 'దీపారాధనం కారయిత్వా' అను వాక్యము వచ్చుచుండును. దీనికి కర్మ నాచరించు స్థానములో (సుమంగళులచేత) దీపమును వెలిగింపజేసి, అట్లు వెలిగించినదీపమును ఆరాధించి అని అర్థము. ఈవిషయములో, 'సంస్కారప్రకాశిక' యను గ్రంథము

*'శ్లో॥ భో దీప! త్వం బ్రహ్మరూప అంధకారనివారక।*
*ఇమాం మయా కృతం పూజాం గృహ్ణన్ తేజః ప్రవర్ధయ॥*
*ఓం దీపాయ నమః।'*

అని ప్రార్థించి పుష్పాక్షతలు వేసి దీపమును పూజింపవలెనని తెల్పుచున్నది.

## అప ఉపస్పృశ్యస్థానాని

వైదికకర్మలలో 'అప ఉపస్పృశ్య' అనగా నీటిని తాకి (చేయి కడిగికొని) అను నిర్దేశము తరచుగా వచ్చుచుండును. ఇట్లు చేయవలసిన స్థలము లీక్రింది సూత్రము తెల్పుచున్నది.

సూ॥ రౌద్ర రాక్షస నైర్ఋత పైతృక భేదన ఛేదన ఖనన పర్యగ్నికరణ అవద్యోతన అవఘ్రాణ ఆత్మాభిమర్శనానిన చ కృత్వా అప ఉపస్పృశేత్.

అనగా, ప్రయోగములో రుద్రశబ్దము, రాక్షసశబ్దము (ఉదా: 'రక్షోభ్య ఇదం'), నైర్ఋత శబ్దము (ఉదా: 'నైర్ఋత్యాం దిశి నిరస్య'), పితృశబ్దము (ఉదా: 'పితృభ్య ఇదం') – ఇటువంటి పదముల నుచ్చరించి నపుడు, చీల్చుట, కోయుట, త్రవ్వుట, పర్యగ్నికరణము (జ్వలితదర్భచే చుట్టుట), అవద్యోతనము (జ్వలితదర్భప్రతిబింబ

మును ఆజ్యపాత్రలో చూచుట), ఆఘ్రాణించుట (వాసన చూచుట), హృదయమును ముట్టుట (ఉదా:'మయి మహో' అను మంత్రము)– ఇవి చేసిన వెనుకను - 'అప ఉప స్పృశ్య' అని చెప్పి (ప్రోక్షణిలోని, లేక ఉదకపాత్రలోని) నీటిని తాకవలెను.

## ఆచమనవిధానము

ఈగ్రంథములో పలుచోట్ల 'ఆచమ్య' అను పదము వచ్చుచుండును. 'ఆచమ్య' అనగా 'ఆచనము చేసి' అని అర్థము. ఈ ఆచనమును చేయు విధాన మిచ్చట చెప్ప బడుచున్నది.

ఆచమనము చేయుటకై కర్త ఒక చెంబులో నీటిని తీసికొని తూర్పునకు గాని, ఉత్తరమునకు గాని మళ్లి తొడలలోనికి చేతులు వచ్చునటులు కుక్కుటాసనముతో (గొంతుకాళ్లతో) కూర్చుండి, ఎడమచేతిలో నీటిచెంబును పట్టుకొని దానిలోని నీటిని గోకర్ణాకృతిలో పట్టుకొన్న కుడి అరచేతిలో మొదటిసారి పోసికొని 'అచ్యుతాయ నమః' అని లోపలికి పుచ్చుకొని, రెండవసారి పోసికొని 'అనంతాయ నమః' అని పుచ్చుకొని, మూడవసారి పోసికొని 'గోవిందాయ నమః' అని లోపలికి పుచ్చుకొన వలెను. ఆతర్వాత ఈ క్రింది మంత్రములను చెప్పుచు అంగస్పర్శ చేయవలెను (ఇట్లు మంత్రయుతముగ శరీరాంగములను మార్జనము చేయుటచే అవి శుద్ధమగునని విశ్వా సము.)

1. కేశవాయ నమః (కుడిచేతి బొటనవ్రేలితో కుడి దవుడను తాకవలెను)
2. నారాయణాయ నమః (పైవిధముగానే ఎడమదవుడను తాకవలెను)
3. మాధవాయ నమః (కుడిచేతి ఉంగరపు, బొటనవ్రేళ్లను చేర్చికుడికంటిని తాకవలెను)
4. గోవిందాయ నమః (పైవిధముగానే ఎడమకంటిని తాకవలెను)
5. విష్ణవే నమః (కుడిచేతి చూపుడు, బొటనవ్రేళ్లను చేర్చి ముక్కుకుడివైపును తాకవలెను)
6. మధుసూదనాయ నమః (పైవిధముగానే ముక్కుఎడమవైపును తాకవలెను)
7. త్రివిక్రమాయ నమః (కుడిచేతి చిటికెన, బొటనవ్రేళ్లను చేర్చి కుడిచెవిని తాకవలెను)
8. వామనాయ నమః (పైవిధముగానే ఎడమచెవిని తాకవలెను)
9. శ్రీధరాయ నమః (కుడిచేతి నడిమి, బొటనవ్రేళ్లను చేర్చి కుడిభుజమును తాకవలెను)

10.హృషీకేశాయ నమః (పైవిధముగానే ఎడమభుజమును తాకవలెను)

11.పద్మనాభాయ నమః (కుడిచేతి అన్నివ్రేళ్లతో నాభిని తాకవలెను)

12.దామోదరాయ నమః (కుడిచేతితో శిరమును తాకవలెను)

పై విధముగా మూడుసార్లు నీటిని పుచ్చుకొని, అంగస్పర్శ చేయుటకే ఆచమన మని పేరు. స్మార్తులలో పైనిచ్చిన 12 మంత్రములకు బదులు 24 మంత్రములను చెప్పు ఆచారమున్నది. కాని వైష్ణవులలో పై 12 మంత్రములను చెప్పునట్టి ఆచారమే యున్నది.

## ప్రాణాయామము

ఈగ్రంథములో పలుచోట్ల 'ప్రాణానాయమ్య' అను పదము వచ్చుచుండును. 'ప్రాణానాయమ్య' అనగా 'ప్రాణాయామము చేసి' అని అర్థము. ఈ ప్రాణాయామము చేయు విధాన మిచ్చట చెప్పబడుచున్నది.

కుడిచేతియొక్క బొటనవ్రేలు, చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేళ్లతో (లేక అన్ని వ్రేళ్లతో) ముక్కును బిగించి (పీడించి)

*' ఓం భూః। ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యమ్। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్। ఓమాపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్।''*

అను మంత్రమును చెప్పుచు గాలిని నిర్బంధించుటయే ప్రాణాయామము. ఇచ్చట '*ఓమాపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ*' వరకు మంత్రమును చెప్పి, కుడిచేతితో కుడిచెవిని తాకి, ఆపైని '*భూర్భువస్సువరోమ్*' అని చెప్పి ముగించవలెను.

గాలియొక్క ప్రసారము రేచకము, పూరకము, కుంభకమని మూడు విధములు. ఎడమముక్కురంధ్రమునుండి గాలిని పూరించుట పూరకము. మంత్రము నుచ్చరించుచున్నంతసేపు గాలిని బంధించుట కుంభకము. కుడిముక్కురంధ్రమునుండి గాలిని విడుచుట రేచకము. మొదట చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేళ్లతో ఎడమముక్కును మూసి చాలా నిదానముగా రేచకము చేసి, తుదకు బొటనవ్రేలితో కుడిముక్కును మూసి, ఎడమముక్కును విడిచి దానితో నిదానముగా పూరకము చేసి, తరువాత చిటికెనవ్రేలు,

ఉంగరపువ్రేళ్లతో ఎడమ ముక్కును కూడ మూసి, పెదవులతో మూతిని మూసి, పై మంత్రమును జపించుచు జపించుచున్నంతసేపు గాలిని బంధించియుంచుటకే ప్రాణాయామమని పేరు. కుడిచేతియొక్క బొటనవ్రేలితో కుడిముక్కును, చిటికెనవ్రేలితో ఎడమముక్కును మూసి, ఉంగరపువ్రేలిని ముక్కుపైనుంచి ముక్కును పట్టుకొని గాలిని బంధించుటకు ఓంకారముద్ర అని పేరు. అన్నివ్రేళ్లతో పట్టుకొని గాలిని బంధించుటకు ప్రణవముద్ర అని పేరు. ప్రణవముద్ర గృహస్థవానప్రస్థులకును, ఓంకారముద్ర బ్రహ్మచారులకు, యతులకును విహితమైనదని శాస్త్రము.

## పత్నీపుత్రస్థాననిర్ణయము

వివాహోపనయనాదికర్మలు చేయునప్పుడు పత్నీపుత్రులు యజమానునికి కుడివైపునకు గూర్చొనవలెనా లేక ఎడమవైపునకు గూర్చొనవలెనా యను సంశయము కల్గుచున్నది. ఈ సంశయము నీక్రింది కారికలు నివారణ చేయుచున్నవి.

శ్లో॥ జాతకే నామకే చైవ హ్యన్నప్రాశన చౌలయోః।
ఉపాయనే వివాహే చ సీమంతాధాన పుంసవే।
కర్తా చ వామత స్తిష్ఠే త్పత్నీ పుత్రస్తు దక్షిణే॥ 1

శ్లో॥ కన్యాదానే చ శ్రాద్ధే చ అధ్వరే సోమ దర్శనే।
స్వయ ముత్తరతః తిష్ఠే త్పత్నీపుత్రస్తు దక్షిణే॥ 2

శ్లో॥ సంస్కార్యః పురుషో వాఽపి స్త్రీ వా దక్షిణతో భవేత్।
సంస్కారకస్తు సర్వత్ర తిష్ఠే దుత్తరత స్తథా॥ 3

శ్లో॥ పుణ్యాహవాచనే చైవ సంకల్పేషు తథైవ చ।
ఆశీర్వచనకాలే చ నిత్యోపాసనకర్మణి।
రక్షాబంధనకాలే చ పత్నీ యోక్త్రవిమోచనే।
ఏతేషూత్తర స్తిష్ఠే ద్వధూ రన్యత్ర దక్షిణే॥ 4

పై కారికలను పరిశీలింపగా పుణ్యాహవాచనము, సంకల్పము, ఆశీర్వచనము, నిత్యోపాసనము, రక్షాబంధనము – వీనిని చేయునప్పుడును, యోక్త్రము విప్పునప్పుడును స్త్రీ పురుషునికి ఎడమవైపుండవలెను, మిగితా అన్ని కార్యములందును కుడివైపుండవలె

నను అర్థము సిద్ధించుచున్నది. ఇట్లు నాల్గవకారిక చెప్పినను, మూడవకారికకే వైష్ణవులు ప్రాధాన్యము నిచ్చుచున్నారు. అందుచేత సంస్కర్తయైన యజమానుడు సంస్కరింపవలసిన స్త్రీపురుషులను (అనగా, పత్నీపుత్రపుత్రికాదులను) తనకు కుడివైపునకు కుర్చుండబెట్టుకొని కర్మలు నిర్వహించుటయే వైష్ణవులకు ఆచారముగా నున్నది.

## బృహస్పతి,బ్రహ్మస్థాననిర్ణయము

శ్లో॥ బృహస్పతి స్సదా తిష్ఠేద్దిశ్యుదీచ్యాం సమాహితః।
స్మార్తకర్మసు సర్వత్ర నిశ్చితోక్తం కపర్దినా॥

అను కపర్దికారక బృహస్పతిని (వాధ్యారును) కర్మస్థలమునకు ఉత్తరమున దక్షిణ ముఖముగా కూర్చుండబెట్టవలెనని తెల్పుచున్నది. సర్వహోమప్రయోగములందును 'బ్రాహ్మణం దక్షిణతో దర్భేషు నిషాద్య' అని యుండుటచేత, బ్రహ్మస్థానమునందలి బ్రాహ్మణుని హోమస్థలమునకు దక్షిణమున మూడుదర్భలను పూర్వాగ్రముగా వేసి వానిపై ఉత్తరముఖముగా కూర్చొనబెట్టవలె ననుట స్పష్టము.

## మంత్రస్నానము

ప్రయోగములలో కొన్నిసార్లు మంత్రస్నానము, లేక మానసికస్నానము చేయవలసిన అవసరము కల్గుచుండును. వీని విధానము లిచ్చట వివరింపబడినవి.

కర్త ఆచమనము చేసి, ప్రాణాయామము చేసి, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం మంత్రస్నానం కరిష్యే*' - అని సంకల్పించి, ఎడమచేతిలో నీటిచెంబును పట్టుకొని,ఆనీటిని కుడిచేతి బొటనవ్రేలుతో నద్దుకొని ఈక్రిందివిధముగా 'ఆపోహిష్ఠామయో భువః' అను మంత్రముతో ప్రోక్షించుకొనవలెను.

'*ఆపోహిష్ఠా మయోభువః*'–అని పాదములపై, '*తాన ఊర్జే దధాతన*'–అని తలపై, '*మహే రణాయ చక్షసే*'–అని ఎదపై, '*యో వశ్శివతమో రసః*'–అని తలపై, '*తస్య భాజయతేహ నః*'–అని ఎదపై,'*ఉశతీరివ మాతరః*'–అని పాదములపై, '*తస్మా అరం గమామ వః*' –అని ఎదపై,'*యస్య క్షయాయ జిన్వథ*' –అని పాదములపై, '*ఆపో జనయథా చ నః*'–అని తలపై, ప్రోక్షించుకొనవలెను. ఇదియేమంత్రస్నానము.

## మానసికస్నానము

శ్లో॥అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా।
యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాంభ్యంతర శ్శుచిః॥

అని మననము చేయుచూ జలమును తలపై ప్రోక్షించుకొనుచూ శ్రీవైకుంఠమునందున్న శ్రీమన్నారాయణుని పాదాంగుష్ఠమునుండి వెలువడిన గంగానది బ్రహ్మరంధ్రము గుండా తనలో ప్రవేశించి తనను పరిశుద్ధుని చేసినట్లు ఎంచుటయే మానసికస్నానము.

## ఊర్ధ్వపుండ్రధారణవిధిః

పైరెండు స్నానములను నదిలోనో చెరువులోనో ఇంటిలోనో జలముతో స్నానము చేయుటకు వీలుగాని పరిస్థితులందే చేయవలెను గాని దానికి ప్రత్యామ్నాయముగా చేయగూడదు. ఇట్లు సంకల్పపూర్వకముగా అఘమర్షణాదిమంత్రముల పఠించుచు జలములో మునిగి చేయు స్నానమునకు వారుణస్నాన మని పేరు. ఇట్లు శుచిగా స్నానము చేసిన పిమ్మట మడిబట్టలను కట్టుకొని, దర్భాసనముపై గాని, చిత్రాసనముపై గాని తూర్పు లేక ఉత్తరముఖముగా కూర్చుండి వైష్ణవుడు తప్పకుండ ద్వాదశోర్ధ్వ పుండ్రములను ధరింపవలెను. అనుకూలము లేనిచో ద్వాదశోర్ధ్వపుండ్రధారణకై ప్రోక్త మైన మంత్రములన్నియు పఠించి లలాటమందొక ఊర్ధ్వపుండ్రమునైనా ధరింపవలెను. ఇట్లు ధరింపనిదే ఏకర్మయు చేయకూడదు.

ద్వాదశోర్ధ్వపుండ్రధారణవిధి వేర్వేరు గ్రంథములలో కించిద్భిన్నముగా నున్నది. ఇచ్చట పాద్మసంహితలో చెప్పబడిన విధానము వ్రాయబడుచున్నది. పైవిధముగా ఆసనముపై కూర్చొని, తిరుమణిపెట్టెను, శుద్ధిచేసిన చెంబులో మంచితీర్థమును చెంత నుంచుకొని '*ఓం నమో నారాయణాయ*' అను మూలమంత్రమును,

'*ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణేన శతబాహునా/ భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ/మృత్తికే హన మే పాపం యన్మయా దుష్కృతం కృతమ్/త్వయా హతేన పాపేన జీవామి శరదశ్శతమ్/మృత్తికే దేహి మే పుష్టిం త్వయి సర్వం ప్రతిష్ఠితమ్/గన్ధద్వారాం దురా-ధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్/ ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్/*'

అను వేదమంత్రమును పఠించుచు, ఎడమచేతిలో తిరుమణిని నీటితో కలుపుకొని మర్దింపవలెను. ఇట్లేర్పడిన తిరుమణి పంకమును మరల '*ఓం నమో నారాయణాయ*' అను మూలమంత్రముతో నభిమంత్రించి ఈ క్రిందివిధముగా ధరింపవలెను:

1. ఓం కేశవాయ నమః– అని లలాటమున,
2. ఓం నారాయణాయ నమః - అని పొట్టపై,
3. ఓం మాధవాయ నమః - అని వక్షమునందు,
4. ఓం గోవిందాయ నమః - అని కంఠమున
5. ఓం విష్ణవే నమః - అని కడుపు కుడిభాగమున
6. ఓం మధుసూదనాయ నమః - అని కుడి భుజమున
7. ఓం త్రివిక్రమాయ నమః - అని కంఠము కుడిభాగమున
8. ఓం వామనాయ నమః - అని కడుపు ఎడమభాగమున
9. ఓం శ్రీధరాయ నమః - అని ఎడమభుజమున
10. ఓం హృషీకేశాయ నమః - అని కంఠము ఎడమభాగమున
11. ఓం పద్మనాభాయ నమః - అని వీపు క్రిందిభాగమున
12. ఓం దామోదరాయ నమః - అని కంఠము వెనుక జుట్టు క్రిందిభాగమున

ధరించి, మిగిలిన తిరుమణి పంకమును 'ఓం వాసుదేవాయ నమః - అని తలపై ధరింప వలెను. అనుకూలము లేకున్నచో పై 13 నామములను స్మరించుచు నొక్క లలాటమం దైన ధరింపవలెను. తరువాత ఎడమచేతిలో శ్రీచూర్ణమును కల్పుకొని, ఆశ్రీచూర్ణపంక మును '*ఓం శ్రీం హ్రీం ఐం శ్రియై నమః*' అనియు,

'*శ్రియై జాతః శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జరితృభ్యో దధాతు। శ్రియం వసానా అమృతత్వమాయన్ భజన్తి సద్యస్సమిథ మితద్రౌ। శ్రియ ఏవైనం తచ్ఛ్రియమాదధాతి। సన్తతమృచా వషట్కృతగ్ం సంధత్తగ్ం సన్ధీయతే ప్రజయా పశుభిః। య ఏవం వేద। మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్న్యై చ ధీమహి। తన్నో లక్ష్మీః ప్రచోదయాత్।*'

అను మంత్రముతోను, మరల '*ఓం శ్రీం హ్రీం ఐం శ్రియై నమః*' అనుచును అభిమంత్రించి, ముందు పెట్టుకొన్న తిరుమణిరేఖలకు మధ్యన ఈక్రింద చెప్పిన క్రమములో దానిని నిలువుగా పెట్టుకొనవలెను.

1. ఓం శ్రియై నమః– అని లలాటమున,
2. ఓం అమృతోద్భవాయై నమః - అని పొట్టపై,
3. ఓం కమలాయై నమః - అని వక్షమునందు,
4. ఓం చంద్రసోదర్యై నమః - అని కంఠమున
5. ఓం వరారోహాయై నమః - అని కడుపు కుడిభాగమున
6. ఓం హరివల్లభాయై నమః - అని కుడి భుజమున
7. ఓం విష్ణుపత్న్యై నమః - అని కంఠము కుడిభాగమున
8. ఓం వైష్ణవ్యై నమః - అని కడుపు ఎడమభాగమున
9. ఓం శార్ఙిణ్యైనమః - అని ఎడమభుజమున
10. ఓం దేవదేవికాయై నమః - అని కంఠము ఎడమభాగమున
11. ఓం మహాలక్ష్మ్యై నమః - అని వీపు క్రిందిభాగమున
12. ఓం భువనేశ్వర్యై నమః - అని కంఠము వెనుక జుట్టు క్రిందిభాగమున

ధరించి, మిగిలిన శ్రీమూర్ణపంకమును ' ఓం సురసుందర్యై నమః - అని తలపై ధరించి చేతులు జోడించి చక్రాంకనగురుధ్యానశ్లోకముల ననుసంధానము చేసి, ఈ క్రింది గురుపరంపరాశ్లోకమును చెప్పవలెను.

శ్లో॥ అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యానశేషాన్గురూన్
శ్రీమల్లక్ష్మణయోగిపుంగవ మహాపూర్ణౌ మునిం యామునమ్।
రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం
సేనేశం శ్రియ మిందిరాసహచరం నారాయణం సంశ్రయే॥

## నూతన యజ్ఞోపవీతధారణవిధిః

ఒక వెండి లేక రాగి లేక కంచుతట్టలోగాని, బెత్తం తట్టలోగాని, ఇవేవి లేకున్న ఒక విస్తరాకులో గాని బియ్యమును పోసి, సమముగా నెరపి, ఆ బియ్యముపై బ్రహ్మముడి

పైన శ్రీచూర్ణమును (కుంకుమను) అలదిన నూతనయజ్ఞోపవీతము(ల) నుంచి, కర్త తూర్పుముఖముగా దర్భాసనము పై కూర్చొని, ఆ తట్టను తనముందు పెట్టుకొని, రెండుసార్లు ఆచమనము చేసి, పవిత్రమును ధరించి, ప్రాణాయామము చేసి, అంజలి బద్ధుడై, క్రింద నిచ్చిన '*శ్రీమాన్ వేఙ్కటనాథార్యః*' '*శుక్లాంబరధరం*', '*యస్య ద్విరదవక్త్రాద్యాః*' అను శ్లోకములను చెప్పి, '*హరిరోం తత్సత్ ---నూతనయజ్ఞోప వీతధారణం కరిష్యే*' -అని సంకల్పించి '*స్వశేషభూతేన మయా*' అను శ్లోకమును చెప్పి సాత్వికత్యాగము చేయవలెను. (సాత్వికత్యాగము చేసిన పిమ్మట కొందఱు యజ్ఞోపవీతమునకు 'విష్వక్సేనారాధన'లో చెప్పినట్లుగా షోడశోపచారపూజను చేయుచున్నారు.)

ప్రార్థనా

*"శ్రీమాన్ వేఙ్కటనాథార్యః కవితార్కికకేసరీ/*
*వేదాన్తాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది/*
*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//*

**సంకల్పః**: *'హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహా పురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహ కల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరా - ణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభ యోగ, శుభకరణ ఏవం గుణవిశే - షణవిశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవ త్కైంకర్యరూపం శ్రౌతస్మార్తనిత్యకర్మానుష్ఠాన యోగ్యతాసిద్ధ్యర్థం నూతనయజ్ఞోప వీతధారణం కరిష్యే'*

## సాత్త్వికత్యాగః

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥'

## యజ్ఞోపవీతధారణమ్

తరువాత యజ్ఞోపవీతముయొక్క బ్రహ్మముడియొక్క శృంగములు కుడిదిక్కునకు వచ్చునట్లు కుడి అరచేతిని వెల్లకిల సాచియు, బోర్లించిన ఎడమ అరచేతిలోనికి యజ్ఞోపవీతముయొక్క క్రిందిభాగము వచ్చునట్లును యజ్ఞోపవీతమును పట్టుకొని, కుడి చేతిని ముఖసమముగ నెత్తి, '*యజ్ఞోపవీతధారణమంత్రస్య బ్రహ్మ ఋషిః*।' అనుచు కుడిచేతితో తలను, '*త్రిష్టుప్ ఛన్దః*।' అనుచు మూతిని, '*వేదాస్త్రయో దేవతాః*।' అనుచు ఎదను తాకి, '*యజ్ఞోపవీతధారణే వినియోగః*।' - అనుచు కుడిచేతిని ముఖసమముగా, ఎడమచేతిని నాభిసమముగాను పట్టుకొని,

*మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥*

అను మంత్రమును పఠించి, యజ్ఞోపవీతమును శిరమునుండి దూర్చి, ఎడమభుజముపై నుండునట్లును, కుడివంకకు క్రిందుగా నుండునట్లును ధరింపవలెను. ఇట్లు బ్రహ్మచారులొకే యజ్ఞోపవీతమును, గృహస్థులు రెండును ధరింపవలెను. కొందరు గృహస్థులు ఉత్తరీయార్థము మూడవయజ్ఞోపవీతమును కూడ ధరించు పద్ధతి యున్నది.

## గృహస్థులు రెండవ యజ్ఞోపవీతమును ధరించుట

ద్వితీయయజ్ఞోపవీతధారణకై గృహస్థులు మరల ఆచమించి, ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం గార్హస్థ్యార్థం ద్వితీయయజ్ఞోపవీతధారణం కరిష్యే*।' – అని సంకల్పించి, ఇదివరకు చెప్పిన మంత్రములతోనే, ఇదివరకు చెప్పినట్లుగనే రెండవ యజ్ఞోపవీతమును ధరించవలెను.

ఒకవేళ గృహస్థులు మూడవయజ్ఞోపవీతమును ధరింప దలచినచో, మరల ఆచమించి, ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవ*

*దాజ్ఞయా శ్రీమన్నా రాయణ ప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ఉత్తరీయార్థం తృతీయ యజ్ఞోపవీతధారణం కరిష్యే॥* – అని సంకల్పించి, ఇదివరకు చెప్పిన మంత్రములతోనే, ఇది వరకు చెప్పినట్లుగనే మూడవ యజ్ఞోపవీతమును ధరించవలెను.

## మంత్రజపః, ఉపస్థానమ్

పైవిధముగా యజ్ఞోపవీతము(ల)ను ధరించిన పిదప

*మం॥ ' ఓం భూః। ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యమ్। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్। ఓమాపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్।*

అను మంత్రమును పదిసార్లు జపించి, లేచి నిలబడి అంజలిబద్ధుడై,

*మం॥ ఉత్తమే శిఖరే దేవీ భూమ్యాం పర్వతమూర్ధని। బ్రాహ్మణేభ్యో హ్యనుజ్ఞానం గచ్ఛ దేవి యథాసుఖమ్॥*

అను మంత్రమును పఠించి, కూర్చొని అచమనము చేసి, ప్రాత యజ్ఞోపవీతమును తీసివేయవలెను.

## ప్రాత యజ్ఞోపవీతమును త్యజించుట

మరల ఆచమించి, ప్రాణాయామము చేసి,

శ్లో॥ *ఉపవీతం భిన్న తంతుం జీర్ణం కశ్మల దూషితం।*
*విసృజామి యశో బ్రహ్మ వర్చో దీర్ఘాయురస్తు మే॥*

అను శ్లోకమును చెప్పి ప్రాత యజ్ఞోపవీతమును తీసివేసి ఆచమింపవలెను.

## నూతనయజ్ఞోపవీతప్రాణప్రతిష్ఠ

క్రొత్తగా వడకిన యజ్ఞోపవీతమును ధరించుటకు ముందుగా దానికి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. ఆవిధాన మిక్కడ చెప్పబడుచున్నది.

ప్రయోగః: గోమయముచే నలుకబడి శుచియైన ప్రదేశములో నొక బెత్తపుతట్టలోగాని, కంచు, ఇత్తడి, వెండి ఇత్యాది లోహపుతట్టలోగాని బియ్యమును పఱచి, ఆబియ్యముపై పూర్వాగ్రముగా రెండు దర్భలు వేసి, వానిపై జలముతో నిండిన కలశమునుంచి, ఆ

కలశములో కూర్చను, ఒక చిన్న మామాడికొమ్మను ఉంచి, ‘ఓంభూర్భువస్సువ రోమ్’ అని చెప్పుచు నూతనయజ్ఞోపవీతమును ఆకలశములో నుంచి గంధాదులతో నర్చింపవలెను. ఆ తర్వాత పైన యజ్ఞోపవీతధారణవిధిలో చెప్పినట్లుగా ప్రాణాయామము చేసి, దేశకాలముల కీర్తించి, ‘*యజ్ఞోపవీతప్రతిష్ఠాం కరిష్యామి*’ అని సంకల్పించి, సాత్త్వికత్యాగమును చేసి, యజ్ఞోపవీతమును తాకుచు

*ఓం భూః। యజ్ఞోపవీతం ప్రతిష్ఠాపయామి।*

*ఓం భువః। యజ్ఞోపవీతం ప్రతిష్ఠాపయామి।*

*ఓగ్ం సువః। యజ్ఞోపవీతం ప్రతిష్ఠాపయామి।*

*ఓం భూర్భువస్సువః। యజ్ఞోపవీతం ప్రతిష్ఠాపయామి।*"

అను మంత్రములతో దాని నక్కడ ప్రతిష్ఠించి, క్రింద నిచ్చిన ‘*భూరగ్నిం చ పృథివీం చ*’ అను మంత్రములతో నభిమంత్రించవలెను.

మం: భూరగ్నిం చ పృథివీం చ మాం చ। త్రీగ్ శ్చ లోకాన్ సంవత్సరం చ। ప్రజాపతిస్త్వాసాదయతు। తయా దేవతయాంగిరస్వ ధ్రువా సీద। భువో వాయుం చాన్తరిక్షం చ మాం చ। త్రీగ్ శ్చ లోకాన్ సంవత్సరం చ। ప్రజాపతిస్త్వాసాదయతు। తయా దేవతయాంగిరస్వ ధ్రువా సీద। స్వరాదిత్యం చ దివం చ మాం చ। త్రీగ్ శ్చ లోకాన్ సంవత్సరం చ। ప్రజాపతిస్త్వాసాదయతు। భూర్భువస్స్వశ్చన్ద్రమసం చ దిశశ్చ మాం చ। త్రీగ్ శ్చ లోకాన్ సంవత్సరం చ। ప్రజాపతిస్త్వాసాదయతు। తయా దేవతయాంగిరస్వ ధ్రువా సీద। (తై.బ్రా.3.10.5)

పైమంత్రములతో నభిమంత్రించి, ‘ఓం పృథివీమావాహయామి’ ఇత్యాది 9 మంత్రములతో నవతంతుదేవతల నావాహన చేయవలెను.

‘*ఓం పృథివీమావాహయామి। ఓం ఆప ఆవాహయామి।*

*ఓం అగ్ని మావాహయామి। ఓం వాయుమావాహయామి।*

*ఓం ఆకాశమావాహయామి। ఓం ప్రాణమావాహయామి।*

*ఓం ఆత్మానమావాహయామి। ఓం అంతరాత్మానమావాహయామి।*

*ఓం పరమాత్మానమావాహయామి।'*

పిదప తరువాతి 4 మంత్రములతో గ్రంథిత్రయదేవతల నావాహన చేయవలెను.

*'ఓం గ్రంథిత్రయదేవతాః। ఓం బ్రహ్మాణమావాహయామి।*

*ఓం విష్ణుమావాహయామి। ఓం రుద్రమావాహయామి।'*

తరువాత *'ఓం యజ్ఞోపవీతదేవతాం పరమాత్మానం శ్రియఃపతిమావాహయామి'* అనుచు శ్రియఃపతి శ్రీనివాసుని గూడ నావాహనచేసి, *'యజ్ఞోపవీతదేవతాభ్యో నమః'* అని ఆరంభించి, 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో నిచ్చినట్లుగా గుడ నైవేద్యమును సమర్పించుచు షోడశోపచారపూజ చేయవలెను. ఆతర్వాత యజ్ఞోప వీతమును మోదుగు సమిధ, కూర్చములతో కలిపి పట్టుకొని సూర్యునివైపు తిరిగి 'సంధ్యావన్దనవిధిః' అను అధ్యాయములో నిచ్చిన 'ఆసత్యేన రజసా' అను మంత్ర మును చెప్పుచు యజ్ఞోపవీతమును సూర్యునకు చూపించి, యజ్ఞోపవీతమును మఱల మునుపటి స్థలములో నుంచి, 108 సార్లు గాయంత్రీమంత్రమును జపించి, చివరికి 'త్ర్యంబకం యజామహే' అను మంత్రమును జపించి, ఇట్లు ప్రాణప్రతిష్ఠ చేసిన యజ్ఞోప వీతమును పూర్వోక్తవిధముగా ధరింపవలెను.

## పంచతీర్థముల విషయము

తర్పణాదులయందు జలమును విడుచునప్పుడు వివిధతీర్థముల ప్రస్తావన వచ్చు చుండును. ఈతీర్థములైదు విధములు. వీని లక్షణముల నీక్రింది కారిక తెల్పుచున్నది.

శ్లో॥ హస్తాదౌ బ్రహ్మతీర్థంచ, హస్తాగ్రే దేవతీర్థకమ్।
హస్తపార్శ్వే ఋషేస్తీర్థ మంగుష్ఠే పితృతీర్థకమ్।
తన్మధ్యేచాగ్నితీర్థంచ, పంచతీర్థం ప్రతిష్ఠితమ్॥

అనగా, అంజలిమూలమునుండి, అనగా మణికట్టునుండి (వెనుకకు) విడుచు తీర్థము నకు బ్రహ్మతీర్థ మనియు, అంజలి చివరనుండి, అనగా వ్రేళ్లకొనలనుండి ముందుకు విడుచు తీర్థమునకు దేవతీర్థ మనియు, అంజలియొక్క మధ్యనుండి (చిటికెన వ్రేళ్ల సందునుండి) విడుచు తీర్థమునకు ఋషితీర్థ మనియు, కుడిచేతి చూపుడువ్రేలు, బొటన వ్రేళ్ల సందునుండి విడుచు తీర్థమునకు పితృతీర్థ మనియు, అంజలిమధ్యనుండి విడుచు

తీర్థమునకు అగ్నితీర్థ మనియు పేరులు. ఉపాకర్మలో ఋషులకు తర్పణమును ఋషి తీర్థముచేతను, బ్రహ్మకు తర్పణమును బ్రహ్మతీర్థముచేతను చేయుచున్నారు. పితృ కార్యములందు పితరులకు పితృతీర్థముచేతను, విశ్వేదేవులకు, విష్ణువునకు దేవతీర్థము చేతను తర్పణమును చేయుచున్నారు.

## కొన్ని తర్పణనియమములు

శ్లో॥ కేవలైస్తణ్డులైర్దేవా నృషీం త్సతిలతణ్డులైః।
పితౄ న్సాక్షాత్తిలైరేవ తర్పయే ద్ద్విజసత్తమః॥

శ్లో॥ పూర్వాశాభిముఖో దేవా నుత్తరాభిముఖ స్త్వృషీన్।
పితౄంస్తు దక్షిణాస్యస్తు జలమధ్యేతు తర్పయేత్॥

అనగా, దేవతలకు (విశ్వేదేవులకు) కేవలము బియ్యముతోడను, (ఉపాకర్మ, వేదవ్రతములయందలి) ఋషులకు బియ్యము, నువ్వులు కలిపియు, పితరులకు కేవలము నువ్వులతోడను తర్పణమును చేయవలెనని మొదటి శ్లోకమున కర్థము. అనగా వీనిని చేతిలో తీసికొని జలముతో గూడ పైన చెప్పిన (పంచ)తీర్థములతో వదల వలెనని తాత్పర్యము.

అట్లే కర్త దేవతర్పణమును తూర్పుముఖముగా నుండియు, ఋషితర్పణమును ఉత్తరముఖముగా నుండియు, పితృతర్పణమును దక్షిణముఖముగా నుండియు (నదీ లేక తటాక) జలములో నిలుచుండి చేయవలెనని రెండవ శ్లోకమున కర్థము. ఇట్లు గాక గృహమందే తర్పణము చేసినను ఈదిశలకే మళ్లి చేయవలెననుట స్పష్టము.

## నూతనవస్త్రాది(కట్న)ప్రదానమ్

ఉపనయన,వివాహ,గర్భాధాన,సీమంతాదికర్మలలో మాతుల,కన్యాదాతృ, శ్వశురాదిబంధువులు వటు,వర,కన్యాదులకు నూతనవస్త్రాభరణాదు లీయవలసిన లౌకికాచారము వచ్చుచుండును. ఇట్లు వీని నిచ్చుటకే 'కట్నము నిచ్చుట' అని పేరు. ఈ కట్నము నిచ్చు పద్ధతి ఇచ్చట చెప్పబడుచున్నది. దీనిని ఆయాకర్మలకు తగు విధముగా అన్వయించుకొని చేసికొనవలెను.

**పద్ధతి:** కట్నము నిచ్చు వ్యక్తి కట్నమును (నూతనవస్త్రములు, ఆభరాణాదులను), పూవులు, పండ్లు, కుంకుమ, అక్షతలు,తాంబూలములతో నొక తట్టలో పెట్టుకొని వాధ్యారు క్రింద నిచ్చిన ‘ఆశాస్తేయం’ అను మంత్రమును చదువుచుండగా కట్నగ్రహీత కెదురుగా నిలుచుండి, అతనికి ముఖమున బొట్టును పెట్టి, ఆవస్త్రాభరణాదులను గ్రహీత చేతిలోనుంచి గ్రహీతపై అక్షతలు వేయవలెను. అట్లు వేసిన తర్వాత పురోహితుడు ప్రదాతయొక్క పేరును, బంధుత్వమును, సందర్భమును తెలుపు వాక్యమును, ఉదాహరణకు ‘*శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాన్త ప్రవర్తక శ్రీమదిత్యాది శ్రీమాన్ శేషాచార్యులవారు వివాహసందర్భమున తమ అల్లునికి సమర్పించు నూతనవస్త్రములు*’ అను విధముగా చెప్పవలయును. దంపతులు ఇతర స్త్రీపురుషద్వయమునకు కట్నము నిచ్చునప్పుడు పురుషనకిచ్చు కట్నమును పురుష డొక తట్టలోను, స్త్రీకిచ్చు కట్నమును స్త్రీ వేఱొక తట్టలోను పెట్టుకొని పురుషుడు పురుషునికిని, స్త్రీ స్త్రీకిని బొట్టు పెట్టి ఈయవలెను. ఒకవేళ గ్రహీతకంటె చిన్నవాడైనవ్యక్తి గ్రహీతకంటె పెద్దవాడైన వ్యక్తి పక్షమున కట్నము నిచ్చుచున్నచో పైవాక్యములో ఆ వృద్ధవ్యక్తినామసంబంధములనే చెప్పవలెను.

*మం॥ఆశాస్తేఽయం యజమానోఽసౌ / ఆయురాశాస్తే/ సుప్రజాస్త్వమాశాస్తే/ సజాత-వనస్యామాశాస్తే/ ఉత్తరాం దేవయజ్యామాశాస్తే/ భూయో హవిష్కరణమాశాస్తే/ దివ్యం ధామాశాస్తే/ విశ్వం ప్రియ మాశాస్తే/ యదనేన హవిషాఽఽశాస్తే/ తదశ్యాత్తదృధ్యాత్/ తదస్మై దేవా రాసన్తామ్॥ త్వష్టా జాయామజనయత్త్వష్టాస్యై త్వాం పతిమ్/ త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్/ సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత/ సౌభాగ్య మస్యై దత్వా యాథాస్తం విపరేతన/ ఇమాం త్వ మిన్ద్ర మీఢ్వస్సుపుత్రాగ్ం సుభగాం కృణు/ దశాస్యాం పుత్రా నాధేహి పతి మేకాదశం కృధి॥*

(గమనిక: పైమంత్రములో ‘ త్వష్టా జాయామజనయన్---పతిమేకాదశం కృధి’ అను వాక్యములను దంపతులకు కానుక లిచ్చు సమయములోనే చెప్పవలెను. ఒక్క పురుషుడే ఉన్నచో (ఉదా: ఉపనయనములో వటువు) ఈవాక్యములను విడిచిపెట్టవలెను.)

## కర్మారంభపద్ధతిః

[1]సర్వత్ర కర్మాదౌ కర్తా సుస్నాతః ప్రయతో ధృతోర్ధ్వపుండ్రః బద్ధశిఖః సోత్తరీయః సంధ్యావన్దనాది నిత్యకృత్యాని కృత్వా, కర్మోపయోగి సమస్తసంభారాన్ సమీకృత్య, రంగవల్ల్యాద్యలంకృతం వేదికాం సంసిద్ధీకృత్య,తత్ర దీపారాధనం కారయిత్వా, యథావసరం భార్యయా కుమారేణ సహ వేదికాం ప్రాప్య,ఆచమ్య, పవిత్రపాణిః, ఉద్దిష్ట కర్మార్థం పరిషదనుజ్ఞాం ప్రాప్నుయాత్.

## పరిషదనుజ్ఞా

[2]తాంబూల ఫల దక్షిణాసమేత హరిద్రాక్షతపాత్రం హస్తే గృహీత్వా, వేదికాయాః

---

చ[1]ఏకర్మ చేయుటకైనను ముందుగా కర్త స్నానము చేసి శుచియై (ప్రయతః=శుచియైనవాడై అని అర్థము), ఊర్ధ్వపుండ్రములను ధరించి, బద్ధశిఖుడై, ఉత్తరీయముతో సహ అధోవస్త్రమును (ధోవతిని) ధరించి, సంధ్యావందనాది నిత్యకృత్యములను ముగించుకొని, కాళ్లు కడిగికొని, ఆచమించి, పవిత్రమును ధరించి, కర్మ కవసరమైన సంభారములను, పాత్రలను, దర్భాదులను తీసికొని యథావసరముగా భార్యాకుమారాదులతో రంగవల్ల్యాదులచే నలంకరింపబడిన వేదికాస్థలమునకు వచ్చి, అచ్చట సుమంగళులచే దీపారాధన చేయించి, బృహస్పతిని (వాధ్యారును) వేదికి ఉత్తరమున కూర్చుండ బెట్టి ఉద్దిష్టకర్మార్థమై పరిషదనుజ్ఞను పొందవలెను.

2 *"సర్వకర్మారంభేషు సభాం ప్రార్థయేత్"* – అను వచనము ప్రకారము ఏదైన కర్మచేయుటకు మొట్టమొదట వేదవిదులు, తత్కర్మజ్ఞులగు బ్రాహ్మణోత్తములను (పరిషత్తును) కర్మనిర్విఘ్నతకై ప్రార్థించి వారి అనుమతిని పొంది కర్మ నారంభింపవలెను. ఇట్టి అనుమతికే ‘పరిషదనుజ్ఞ’ అని పేరు. దీనికై కర్త ఒక తట్టలో ఫలపుష్పాక్షతాదక్షిణలను పెట్టుకొని (యథావసరముగా భార్యాకుమారుతో సహ) వేదికకు పశ్చిమమున (తాను కూర్చుండు పీటలకు వెనుక) తూర్పు ముఖముగా లేచి నిలబడి, ‘ఓం నమస్సదసే’ నుండి మొదలిడి ‘మహాన్తోఽనుగృహ్ణన్తు’ వరకు చెప్పుచు సభను ప్రార్థించి, (అచట ఉన్నయెడల భార్యాకుమారులతో సహ) ప్రణమింపవలెను.

పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ,

*ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై/* (తై.సం.3-2-4-14)/ *సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యాస్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్/* (తై.బ్రా.1-2-1-26)

*'సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః/ స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే---కర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ లగ్నస్య సర్వే గ్రహాశ్శుభైకాదశస్థానఫలదాస్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు'* - ఇతి ప్రార్థ్య నమస్కుర్యాత్. "*ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు/*" - ఇతి పరిషద్వచనమ్.

**ప్రధానసంకల్పః** [3] కర్తా దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, ద్విరాచమ్య, త్రిః ప్రాణానాయమ్య,

---

ప్రార్థనలో '---కర్మారంభ' అనుదానిలో గీతలున్నచోట కర్మపేరును (ఉదా: వివాహకర్మారంభ, చౌలకర్మారంభముహూర్త) చెప్పవలెను. 'అనుగృహ్ణన్తు' అని వచ్చినప్పుడెల్ల పరిషత్తుపై అక్షతలు వేయుచుండవలెను. అట్లు ప్రార్థింపగా, "ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు!"- అని పరిషత్తు అనుగ్రహింపవలెను. అట్లు సభానుజ్ఞను పొంది కర్త వారికి ఫలదక్షిణాతాంబూలములనిచ్చి ప్రధానసంకల్పమును చెప్పవలెను.

[3] తర్వాత ఉద్దిష్టప్రధానకర్మార్థమై సంకల్పమును చేయవలెను. దీనికై తాను కూర్చొను పీటపై కర్త రెండు ఉత్తరాగ్రపు దర్భలను వేసి, రెండుదర్భలను కుడి వైపు మొలలో దోపికొని, యథావసరముగా భార్యాకుమారులతో సహ పీటలపై కూర్చొని రెండుసార్లు ఆచమించి, మూడుసార్లు ప్రాణాయామము చేసి, 'శుక్లామ్బరధరం విష్ణుం' నుండి మొదలిడి 'యస్య ద్విరదవక్త్రాద్యాః' వరకు గల శ్లోకములను చెప్పి, తన కుడితొడపై వెల్లకిల ఉంచిన ఎడమ అరచేతిలో బొటనవ్రేలు చూపుడువ్రేలు సందున యజ్ఞోపవీతమును పట్టుకొనియున్న కుడి అరచేతిని బోర్లించి యుంచి, 'హరిరోం తత్సత్' నుండి మొదలిడి 'కరిష్యే' వరకు సంకల్పమును చెప్పవలెను. ఏసంకల్పమును చెప్పుటకైనా ఇదే పద్ధతి పాటింపవలెను. చేయు కర్మఫలము తనకు ప్రాప్తించిన 'కరిష్య'

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే//*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్/*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే//*
*లక్ష్మీ నాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్/*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణ*

---

అనియు, అన్యులకు (ఉదా: ఉపనయనము, చౌలము ఇత్యాదులలో కుమారునకు) ప్రాప్తించు నప్పుడు 'కరిష్యే' అని చెప్పవలెను. 'అముకకర్మ' అన్న చోట 'అముక' కు బదులు ఉద్దిష్ట కర్మ పేరును చెప్పవలెను (ఉదా: వివాహకర్మ, ఉపనయన కర్మ, చౌలకర్మ ఈరీతిగా). అట్లే '----' అని గీతలుంచిన స్థలములలో కావలసిన అయన ఋతు తిథి వార నక్షత్రముల పేర్లు చెప్పుకొనవలెను. ఇట్లు సంకల్పమును చెప్పిన తరువాత 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి, 'భగవతో బలేన' అను బలమంత్రము ననుసంధానము చేసి, కర్మారంభము చేయవలెను. (సూచన: గృహ్యారత్నమను పూర్వప్రయోగశాస్త్రములో సంకల్పమునకు ముందు రెండుసార్లు ఆచమించి, మూడుసార్లు ప్రాణాయామము చేయుమని వ్రాసినారు. ఇదియే యిచ్చట ఈయబడినది. కొన్ని ప్రయోగములలో ఒకసారి ఆచమించి, ఒక ప్రాణాయామము చేయవలయునని కొందరు, రెండు ప్రాణాయామములు చేయవలెనని కొందరు వ్రాసినారు.)

*విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్ కైంకర్యరూపం అముకకర్మ కరిష్యే* - ఇతి సంకల్ప్య

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా,

'భగవతో బలేన భగవతో వీర్యేణ భగవతస్తేజసా భగవతః కర్మణా భగవతః కర్మ కరిష్యామి' ఇతి బలమంత్రం చానుసంధాయ కర్మారంభం కుర్యాత్.

## ఆనుషంగికకర్మలకు సంకల్పపద్ధతి

ప్రధానకర్మకు ఆనుషంగికమైన విష్వక్సేనారాధన, పుణ్యాహవాచన, ప్రతిసర బంధ, అంకురార్పణములవంటి కర్మలకు సంకల్పము చెప్పునప్పుడు వానిని ప్రధాన కర్మయొక్క అంగములుగా పేర్కొనవలెను. ఉదాహరణకు, ప్రధానకర్మ యైన ఉప నయనమునకు ఆనుషంగికముగా వెనువెంటనే చేయు విష్వక్సేనారాధనకు '----గోత్రస్య---నామధేయస్య కుమారస్య ఉద్వహనకర్మ కరిష్యే. తత్కర్మాంగ మాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే' అని సంకల్పింపవలెను. కాని కొంత వ్యవధి తర్వాత ఆరంభమగునట్టి ఆనుషంగికకర్మకు 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ -----కర్మాంగం ---- కర్మ కరిష్యే – అని మొదటి గీతలున్న స్థానములో ప్రధానకర్మపేరును, రెండవగీతలున్న స్థానములో ఆనుషంగికకర్మ పేరును సంకల్పములో చెప్పవలెను.



# విష్వక్సేనారాధనమ్

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥*
*దివ్యాకారం సరోజాక్షం శంఖచక్రగదాధరమ్।*
*ముకున్దద్వారనిలయం విష్వక్సేనముపాస్మహే॥*

*ఓం భూః। విష్వక్సేనమావాహయామి। ఓం భువః। విష్వక్సేనమావాహయామి। ఓగ్ం సువః।విష్వక్సేనమావాహయామి।ఓం భూర్భువస్సువః।విష్వక్సేనమావాహయామి।" శ్రీమతే విష్వక్సేనాయ నమః। ధ్యాయామి। ఆవాహయామి।*[4]*ఇత్యక్షతాదిభిరావాహ్య,*
[5]*ఆసనం సమర్పయామి। పాదయోః పాద్యం సమర్పయామి। హస్తయోరర్ఘ్యం సమర్పయామి। ఆచమనీయం సమర్పయామి। ఔపచారికస్నానం సమర్పయామి।*

---

4.విష్వక్సేనారాధనను ఉద్దిష్టకార్యనిర్విఘ్నపరిసమాప్తికై ప్రధానకర్మకు ఆనుషంగికముగా చేయుచున్నారు. అందుచే 31వ పుటలో నిచ్చినట్లుగా ఆనుషంగికసంకల్పమును చేసి దీని నారంభించవలెను. దీనికై (వెండి) పళ్లెరమందు బియ్యమును పోసి, అందులో 'శ్రీ' అని వ్రాసి, దానిపై పూర్వాగ్రముగా నొక తమలపాకు నుంచి, ఆ తమలపాకుపై రెండు దర్భలతో కట్టిన ఆయామతము నుంచి, "శుక్లాంబరధరం--" నుండి "ధ్యాయామి।ఆవాహయామి।" - వఱకు చెప్పి ఆ పవిత్రముపై అక్షతలను వేసి విష్వక్సేనుని ఆవాహనము చేసి,

5. "ఆసనం సమర్పయామి" - అని రెండు పూర్వాగ్రపు దర్భల నా ఆయామతముపై వేసి, "పాదయోః పాద్యం సమర్పయామి---ఆచమనీయం సమర్పయామి।" - అని చెప్పుచు అర్ఘ్య, పాద్య, ఆచమనీయములకై కూర్చతో ఉదకము నొసగి, "ఔపచారికస్నానం సమర్పయామి। ఆపో హిష్ఠా మయో భువః---స్నాపయామి।" వఱకు చెప్పుచు కూర్చతో స్నానార్థము జల మును ప్రోక్షించి, "స్నానానంతరమాచమనీయం సమర్పయామి" - అని చెప్పుచు స్నానము తర్వాత ఆచమనమునకై మఱల కూర్చతో ఉదకము నిచ్చి, "వస్త్రార్థమక్షతాన్ సమర్పయామి" - అని వస్త్రార్థం అక్షతలను వేసి, "ఉపవీతార్థమక్షతాన్ సమర్పయామి" - అని యజ్ఞోపవీతార్థం

*"ఓం ఆపో హిష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే। యో వ శ్శివతమో రసస్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః।"* - స్నాపయామి। స్నానానంతర *మాచమనీయం సమర్పయామి। వస్త్రార్థమక్షతాన్ సమర్పయామి। ఉపవీతార్థమక్ష-తాన్ సమర్పయామి। గన్ధం సమర్పయామి। పుష్పైః పూజయామి। ధూపం సమర్ప యామి। దీపం దర్శయామి। ఏతే గన్ధాక్షతపుష్పధూపదీపోత్తరీయాభరణాద్యలం* కారాస్సర్వోపచారాః - ఇత్యభ్యర్చ్య,

⁶నైవేద్యం - *"ఓం భూర్భువస్సువః।"* - ఇతి గుడం ప్రోక్ష్య, *"సత్యం త్వర్తేన పరిషిఞ్చామి (ఋతం త్వా సత్యేన పరిషిఞ్చామి - ఇతి రాత్రౌ)"* - ఇతి పరిషిచ్య, *"అమృతమస్తు,*

---

అక్షతలను వేసి, "గన్ధం సమర్పయామి" - అని గంధము నుంచి, "పుష్పైః పూజయామి" - అని పుష్పముల నుంచి, "ధూపం సమర్పయామి" - అని ధూపమును వెలిగించి సమర్పించి, "దీపం దర్శయామి" - అని దీపమును చూపెట్టి, "ఏతే గన్ధాక్షతపుష్ప ధూపదీపోత్తరీయాభరణాద్యలం కారాస్సర్వోపచారాః" - అని అక్షతలను వేసి,

6. నైవేద్యమునకై ఒక బెల్లము ముక్క నుంచి, దానిని "ఓం భూర్భువస్సువః। " - అని ప్రోక్షించి, "సత్యం త్వర్తేన పరిషిఞ్చామి" - అని పగటిపూట, లేదా "ఋతం త్వా సత్యేన పరిషిఞ్చామి" అని రాత్రిపూట పరిషేచనము చేసి, "ఓం ప్రాణాయ స్వాహా------ఓం బ్రహ్మణే స్వాహా।" అని ప్రాణాహుతులను పలికి ఆబెల్లమును నివేదన చేసి, "మధ్యేమధ్యే పానీయం సమర్పయామి।" - అనుచు కూర్చతో ఉదకమునొసగి, "అమృతాపిధానమసి" - అని కూర్చోదకముతో ఉత్తరా పోశనము నొసగి,"హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి।"- అనుచు హస్త, పాదోదకము లకై కూర్చతో జలము నొసగి, "తామ్బూలం సమర్పయామి। - అని తామ్బూలము నొసగి, "సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి।" - అని అక్షతలను వేసి, "అనయా పూజయా శ్రీవిష్వ క్సేనభగవాన్ సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవంతో మహాంతోஉను గృహ్ణన్తు।"- అని ప్రార్థించి, "ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు। " - అని పరిషత్తుచే చెప్పించుకొని, "విష్వక్సేనప్రసాదం శిరసా గృహ్ణామి।" - అని విష్వక్సేనునకు సమర్పించిన పూవులలో నొకటి తలలో పెట్టుకొని, "యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః-----యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః। - విష్వక్సేనం యథాస్థాన ముద్వాసయామి శోభనార్థే పునరాగమనాయ చ।" - అని చెప్పుచు

అమృతోపస్తరణమసి - ఇత్యాపోశనం దత్వా, "ఓంప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి/"- ఇతి నివేద్య,
"అమృతాపిధానమసి "- ఇత్యుత్తరాపోశనం దత్వా,

"హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ తామ్బూలం సమర్పయామి/ సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి/ అనయా పూజయా శ్రీ విష్వక్సేనభగవాన్ సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవంతో మహాంతోऽను గృహ్ణన్తు/ ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు/ విష్వక్సేనప్రసాదం శిరసా గృహ్ణామి/ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః/ తాని ధర్మాణి ప్రథమాన్యాసన్/ తే హ నాకం మహిమానస్సచన్తే/ యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః/ విష్వక్సేనం యథాస్థానముద్వాసయామి శోభనార్థే పునరాగమనాయ చ/"- ఇతి విష్వక్సేనం యథాస్థానం ప్రతిష్ఠాపయేత్.



ఆయామతమును కొంచెము కదలించి, అక్షతలు వేసి, నమస్కరించి, విష్వక్సేనుని ఉద్వాసన చేయవలెను.

# పుణ్యాహవాచనమ్

[7]పాణిపాదౌ ప్రక్షాళ్య, ద్విరాచమ్య, పవిత్రపాణిః, శుద్ధభూమౌ కదళ్యాదిదళే ప్రస్థ పరిమితం తణ్డులం నిక్షిప్య, తణ్డులోపరి ప్రాచీనాగ్రం దర్భద్వయం నిక్షిప్య, తేషు తన్తు వేష్టితం, ధూపితం జలకుమ్భం నిధాయ, తం ప్రణవవ్యాహృతీభిరద్భిః పూరయిత్వా, కూర్చామ్రపల్లవాదిభిరలంకృత్య, దర్భేష్వాసీనః ప్రాణానాయమ్య,

*[8] శ్రీమాన్వేంకటనాథార్యః కవితార్కికకేసరీ/*
*వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది//*
*గురుభ్యస్తద్గురుభ్యశ్చ నమోవాకమధీమహే/*
*వృణీమహే చ తత్రాద్యౌ దంపతీ జగతాం పతీ//*

---

[7] పుణ్యాహవాచనము చేయుటకై కర్త ముందుగా కాళ్లు, చేతులు కడిగికొని, రెండుసార్లు ఆచమించి, పవిత్రమును ధరించి, పరిశుద్ధమైన ప్రదేశమున ఒకపెద్ద విస్తరాకును పఱచి, దానిలో మానెడు బియ్యమును పోసి సమముగా నెఱపి, దానిపై పూర్వాగ్రములుగా రెండు దర్భలను పఱచి, వానిపై చుట్టును దారమును చుట్టబడినదియు, అగరువత్తులపొగచే ధూపితమైన లోపలి భాగము కలదియునైన కలశము నుంచి (సూచన:దారమును చుట్టని కలశమునే ఉంచుట కొందఱి దేశాచారము), "*ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం భూర్భువస్సువః*"-అని అందులో నీటిని నింపి, కూర్చను, మామిడికొమ్మను (ఆకుల కొనలు, కూర్చ కొనలు పైకుండునట్లుగా) ఆ కలశమునందుంచి, కలశమునందు హరిద్రాక్షతలు వేసి , ఒక టెంకాయను జుట్టు పైకిచేసి ఆ కలశముఖమున నుంచి, దానిని రెండు పూర్వాగ్రపుదర్భలతో కప్పి, కర్త తూర్పుముఖముగా కలశము తనకు ముందుండునట్లుగా దర్భలపై కూర్చుండి ప్రాణాయామము చేసి,

[8] "*శ్రీమాన్వేంకటనాథార్యః*" అను శ్లోకమునుండి "*యస్య ద్విరదవక్త్రాద్యాః*" అను శ్లోకము వఱకు చెప్పి, "*హరిరోం తత్సత్, శ్రీగోవింద ---శుద్ధి (కర్మణః)పుణ్యాహవాచనం కరిష్యే*"- అని సంకల్పించి '*స్వశేషభూతేన మయా---*' అని సాత్త్వికత్యాగము చేయవలెను. (గమనిక: సంకల్పములో శుద్ధిపుణ్యాహవాచనమునకు బదులు కర్మణః పుణ్యాహవాచనము చేయునప్పుడు 'కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే' అని చెప్పవలెను. 'అముక కర్మాంగం' అన్నచోట 'వివాహకర్మాంగం', 'ఉపనయనకర్మాంగం' ఇత్యాదిగా ప్రధానకర్మ పేరును చెప్పవలెను.)

*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే//*
*యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అముక కర్మాంగం శుద్ధి (కర్మణః) పుణ్యాహవాచనం కరిష్యే "* - ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః/*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్//*

- ఇతి సాత్త్వికత్యాగం కృత్వా,

[9]*"పుణ్యాహే చతురో బ్రాహ్మణాన్ తోషయిష్యే "* - ఇతి సాక్షతతీర్థం భూమౌ నిస్సావ్య, దక్షిణకరతలేన కుమ్భం సమాలభ్య, *"స్వామినః మనస్సమాధీయతామ్"*

---

[9]దర్భహస్తులైన బ్రాహ్మణులను కలశము చుట్టును నల్దిక్కులందు కలశసమీపమునందు కూర్చుండ బెట్టుకొని, *"పుణ్యాహే చతురో బ్రాహ్మణాన్ తోషయిష్యే "*- అని చెప్పుచు హిరణ్యమును, హరిద్రాక్షతలను, జలమును కుడిచేతిలోనికి తీసికొని, కలశముచుట్టును ప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి, వానిని వాయవ్యమునకు వదలి పెట్టి (ఆ హిరణ్యమును ఆచార్యున కీయవలెను), కుడి అఱచేతిని కలశముపై మూసియుంచి, కర్త *"స్వామినః మనస్సమాధీయతామ్ "*- అని ప్రార్థింపగా బ్రాహ్మణులు *"సమాహితమనసః స్మః"* - అని చెప్పవలెను. ఇట్లే కర్తయు, విప్రులును వరుసగా, *"ప్రసీదన్తు భవన్తః"* అనగా, *"ప్రసన్నాః స్మః"* అనియు, *"భవద్భిరనుజ్ఞాతః శుద్ధి(కర్మణః)పుణ్యాహం వాచయిష్యే "* అనగా, *"ఓం వాచ్యతామ్ "* అనియు,

- ఇతి కర్తా, *"సమాహితమనసః స్మః"* - ఇతి ప్రతివచనమ్. కర్తా *"ప్రసీదన్తు భవన్తః"* - *"ప్రసన్నాః స్మః"*- ఇతి ప్రతివచనమ్. కర్తా-*"భవద్భిరనుజ్ఞాతః శుద్ధి(కర్మణః) పుణ్యాహం వాచయిష్యే "* - *"ఓం వాచ్యతామ్ "*- ఇతి ప్రతివచనమ్.

[10]తతః కర్తా ఉదపాత్రం సవ్యహస్తే నిధాయ, దక్షిణపాణినా పిధాయ బ్రాహ్మణాన్ సంప్రార్థ్య తేషాం ప్రతివచనాని ప్రాప్నుయాత్. తత్ప్రకారః:

కర్తా - *"ఓం (---కర్మణః/శుద్ధి)పుణ్యాహం భవన్తో బ్రువన్తు"* - *"పుణ్యాహమస్తు"*- ఇతి ప్రతివచనమ్. *" ఓం (---కర్మణే) స్వస్తి భవన్తో బ్రువన్తు"* - *"స్వస్త్యస్తు"*- ఇతి ప్రతి వచనమ్. కర్తా - *" ఓం (---కర్మణః) ఋద్ధిం భవన్తో బ్రువన్తు"* - *"ఋధ్యతామ్"*- ఇతి ప్రతివచనమ్. ప్రార్థనాప్రతివచనే త్రిః త్రిః.

[11] అనంతరం *"ఓం ఋద్ధిః, ఓం సమృద్ధిః, పుణ్యాహ సమృద్ధిరస్తు, శివం కర్మాస్తు, ప్రజాపతిః ప్రీయతామితి భవన్తో బ్రువన్తు"*- ఇతి ప్రార్థయేత్. *"అస్తు. ప్రీయతాం భగవాన్ ప్రజాపతిః"*- ఇతి ప్రతివచనమ్.

[12]అథ *"శాన్తిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, ఋద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, ధనధాన్యసమృద్ధిరస్తు, గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు"*– ఇతి

---

[10]తరువాత కర్త ఉదకుంభమును ఎడమచేతిలో పట్టుకొని, కుడిచేతిని దానిపై మూసియుంచి, బ్రాహ్మణులను ప్రార్థించి, వారి ప్రత్యుత్తరములను పొందవలెను. అనగా, కర్త *"పుణ్యాహం భవన్తో బ్రువన్తు"* అని ప్రార్థింపగా, *"పుణ్యాహమస్తు"* అనియు, *"స్వస్తి భవన్తో బ్రువన్తు"* అనగా, *"స్వస్త్యస్తు"* అనియు, *"ఋద్ధిం భవన్తో బ్రువన్తు"* అనగా, *"ఋధ్యతామ్"* అనియు నీ ప్రార్థనా, ప్రత్యుక్తులు మూడు మూడేసిసార్లు పలుకవలెను. విశేషముగా కర్మణః పుణ్యాహవాచనములో బ్రాకెట్లలో నిచ్చిన కర్మణపదములకు ముందుగల గీతలస్థానములో ప్రధానకర్మపేరును చేర్చి ('వివాహ', 'ఉపనయన' ఇత్యాదిగా) చెప్పుచు పై వాక్యములను పలుకవలెను.

[11]తరువాత *"ఓం ఋద్ధిః, ఓం సమృద్ధిః, పుణ్యాహసమృద్ధిరస్తు, శివం కర్మాస్తు, ప్రజాపతిః ప్రీయతామితి భవన్తో బ్రువన్తు"*- అని బ్రాహ్మణులను ప్రార్థింపగా, వారు *"అస్తు ప్రీయతాం భగవాన్ప్రజాపతిః"*- అని చెప్పవలెను.

[12] తరువాత కలశమును బియ్యముపై నుంచి, కలశముఖమున నుంచిన టెంకాయను తీసి క్రిందికి

కించిత్ కించిజ్జలం కూర్చేన కస్మింశ్చిత్పాత్రే నినీయ సర్వేఽపి బ్రూయుః.

[13] *"ఈశాన్యాం బహిర్దేశే అరిష్టనిరసనమస్తు, ఆగ్నేయ్యాం యత్పాపం తత్ప్రతిహతమస్తు, యచ్ఛ్రేయస్తదస్తు, దక్షిణతః సర్వశోభనమస్తు, సర్వాస్సమ్పదస్సన్తు"*- *"ఓం శాన్తి శ్శాన్తిశ్శాన్తిః"* - ఇతి నీతం జలం కుమ్భే నినయేత్.

[14]తతః, *"ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే। తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః। (తై.సం.2.1.11)।*

---

పెట్టి, కర్త ఎడమచేతిలో నొక ఎండుకొబ్బెరిగిన్నెను పట్టుకొని, కొనలు క్రిందికుండునట్లుగ కలశములో నుంచిన కూర్చను, మామిడికొమ్మను కలిపి కుడిచేతిలో పట్టుకొని *"శాన్తిరస్తు---- గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు"*- అను వాక్యములను విప్రులతో గూడి చెప్పుచూ, ప్రతివాక్యము చివర కలశమునుండి కొంచెము నీటిని కూర్చామ్రపల్లవములతో ఆ గిన్నెలోనికి చేర్చుకొని,

[13] *"ఈశాన్యాం బహిర్దేశే అరిష్టనిరసనమస్తు"* అని చెప్పుచు ఈశాన్యమునకు, *"ఆగ్నేయ్యాం యత్పాపం తత్ప్రతిహతమస్తు"* అనుచు ఆగ్నేయమునకును, *"సర్వాస్సమ్పదస్సన్తు"* అనుచు పైకిని కూర్చ, మామిడియాకుల కొనలతో కలశములోని నీటిని చల్లి, *"ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః"* - అని కొబ్బెరిగిన్నెలో సేకరించిన జలమును మఱల కలశములో పోసి, కూర్చను, మామిడికొమ్మను కొనలు పైకుండునట్లుగ మఱల కలశములో నుంచి, క్రింద నుంచిన టెంకాయను మఱల కలశముఖమున నుంచవలెను.

[14] తరువాత ఆయామతమును, అక్షతలను కుడిచేతిలో తీసికొని *"ఇమం మే వరుణ ------ ప్రమోషీః"*- అను మంత్రమును చెప్పి, *"అస్మిన్ కుమ్భే వరుణాన్తర్యామిణం భగవన్తం పుణ్డరీకాక్షమావాహయామి"* - అని కలశమునందు అక్షతలను, ఆయామతము నుంచి వరుణుని ఆవాహన చేసి, *"ఆసనాది షోడశోపచారాన్ సమర్పయామి"*- అని షోడశోపచారార్థం హరిద్రాక్షతలను కలశముపై వేసి, *"తదంగం మన్త్రజపం కరిష్యే"*- అని చెప్పి, రెండు రెండేసి దర్భలను కలశము చుట్టు నలుదిక్కులా ఆసీనులైన నల్గురు స్వాముల కొసగి, వారితో సహ దర్భలచే కలశమును తాకుచు కర్త *"ఆపో హిష్ఠా మయో భువః"*, *"హిరణ్యవర్ణాశ్శుచయః"*, *"పవమానస్సువర్జనః"*, *"తచ్ఛం యోరావృణీమహే"*, *"నమో బ్రహ్మణే"*, *"ఓం శాన్తిశ్శాన్తి శ్శాన్తిః"*- అను

అస్మిన్ కుంభే వరుణాన్తర్యామిణం భగవన్తం పుణ్డరీకాక్షమావాహయామి"- ఇతి కుంభే వరుణమావాహ్య, "ఆసనాదిషోడశోపచారాన్ సమర్పయామి"-ఇత్యక్షతైస్సంపూజ్య "తదంగం మన్త్రజపం కరిష్యే"- ఇత్యుక్త్వా, చతుర్దిక్ష్వాసనేషు నిషణ్ణై శ్చతుర్భిః బ్రాహ్మణైః దర్భహస్తైః కుంభ మన్వారభ్య,

"ఓం దధిక్రావ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః/ సురభి నో ముఖా కరత్ ప్రణ ఆయూగ్ంషి తారిషత్/(తై.సం.1.5.11)/ ఆపో హి ష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/ మహే రణాయ చక్షసే/ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః/ ఉశతీరివ మాతరః/ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ ఆపో జనయథా చ నః/" (తై.ఆ.7.42)

ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం విమధ్యమగ్ శ్రథాయ/ అథా వయమాదిత్య వ్రతే తవానాగసో అదితయే స్యామ/ (తై.సం.1.5.11)/ అస్తభ్నాద్ద్యామృషభో అన్తరిక్ష మమిమీత వరిమాణం పృథివ్యా ఆసీదద్విశ్వా భువనాని సమ్రాడ్విశ్వేత్తాని వరుణస్య వ్రతాని/ (తై.సం.1.2.8)/ యచ్చిద్ధి తే విశో యథా ప్రదేవ వరుణ వ్రతమ్/ మినీమసి ద్యవిద్యవి/ యత్కిం చేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి/ అచిత్తీ యత్తవ ధర్మా యుయోపిమ మా నస్తస్మాదేనసో దేవ రీరిషః/ కితవాసో యద్రిరిపుర్న దీవి యద్వా ఘా సత్యముత యన్న విద్మ/ సర్వా తా విష్య శిథిరేవ దేవాథా తే స్యామ వరుణ ప్రియాసః/ (తై.సం.3.4.11)

అవ తే హేడో వరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహే హవిర్భిః/ క్షయన్నస్మభ్య మసుర ప్రచేతో రాజన్నేనాగ్ంసి శిశ్రథః కృతాని/ (తై.సం.1.5.11)/ తత్త్వాయామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః/ అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః/ (తై.మం.పా.1.4)/

---

మంత్రములను జపించవలెను. (గమనిక: చిట్టచివరి "నమో బ్రహ్మణే" నుండి "ఓం శాన్తిశ్శాన్తి శ్శాన్తిః"వఱకు గల మంత్రములను మూడేసి సారులు పలుకవలెను.)

హిరణ్యవర్ణాశ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యాస్విన్ద్రః/ అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు/ యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యఞ్జనానామ్/ మధుశ్చుతశ్శుచయో యాః పావకాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు/ యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం యా అన్తరిక్షే బహుధా భవన్తి/ యాః పృథివీం పయసోన్దన్తి శుక్రాస్తా న ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు/ శివేన మా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోపస్పృశత త్వచం మే/ సర్వాగ్ం అగ్నీగ్ం రప్సు-షదో హువే వో మయి వర్చో బలమోజో నిధత్త/ (తై.సం.5.6.1)

పవమానస్సువర్జనః/ పవిత్రేణ విచర్షణిః/ యః పోతా స పునాతు మా/ పునన్తు మా దేవజనాః/ పునన్తు మనవో ధియా/ పునన్తు విశ్వ ఆయవః/ జాతవేదః పవిత్రవత్/ పవిత్రేణ పునాహి మా/ శుక్రేణ దేవ దీద్యత్/ అగ్నే క్రత్వా క్రతూగ్ం రను/ యత్తే పవిత్రమర్చిషి/ అగ్నే వితతమన్తరా/ బ్రహ్మ తేన పునీమహే/ ఉభాభ్యాం దేవ సవితః/ పవిత్రేణ సవేన చ/ ఇదం బ్రహ్మ పునీమహే/ వైశ్వదేవీ పునతీ దేవ్యాగాత్/ యస్యై బహ్వీస్తనువో వీతపృష్ఠాః/ తయా మదన్తస్సధమాద్యేషు/ వయగ్గ్ స్యామ పతయో రయీణామ్/ వైశ్వానరో రశ్మిభిర్మా పునాతు/ వాతః ప్రాణేనేషిరో మయోభూః/ ద్యావాపృథివీ పయసా పయోభిః/ ఋతావరీ యజ్ఞియే మా పునీతామ్/ బృహద్భిస్సవితస్తృభిః/ వర్షిష్ఠైర్దేవ మన్మభిః/ అగ్నే దక్షైః పునాహి మా/ యేన దేవా అపునత/ యేనాపో దివ్యంకశః/ తేన దివ్యేన బ్రహ్మణా/ ఇదం బ్రహ్మ పునీమహే/ యః పావమానీ రధ్యేతి/ ఋషిభి స్సంభృతగ్ం రసమ్/ సర్వగ్ం స పూతమశ్నాతి/ స్వదితం మాతరిశ్వనా/ పావమానీర్యో అధ్యేతి/ ఋషిభి స్సంభృతగ్ం రసమ్/ తస్మై సరస్వతీ దుహే/ క్షీరగ్ం సర్పిర్మధూ-దకమ్/ పావమానీస్స్వస్త్యయనీః/ సుదుఘా హి పయస్వతీః/ ఋషిభి స్సంభృతో రసః/ బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్/ పావమానీ ర్దిశన్తు నః/ ఇమం లోక మథో అముమ్/ కామాన్థ్సమర్ధయన్తు నః/ దేవీర్దేవైస్సమాభృతాః/ పావమానీ స్స్వస్త్యయనీః/ సుదుఘా హి ఘృతశ్చుతః/ ఋషిభిస్సంభృతో రసః/ బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్/ యేన దేవాః పవిత్రేణ/ ఆత్మానం పునతే సదా/ తేన సహస్రధారేణ/ పావమాన్యః పునన్తు మా/

*ప్రాజాపత్యం పవిత్రమ్। శతోద్యామగ్ం హిరణ్మయమ్। తేన బ్రహ్మవిదో వయమ్। పూతం బ్రహ్మ పునీమహే। ఇన్ద్రస్సునీతీ సహ మా పునాతు। సోమస్స్వస్త్యా వరుణస్సమీచ్యా। యమో రాజా ప్రమృణాభిః పునాతు మా। జాతవేదా మోర్జయన్త్యా పునాతు। (తై.బ్రా.1.4.8)। తచ్ఛం యోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తు నః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్। శం నో అస్తు ద్విపదే। శం చతుష్పదే। ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః। (తై.ఆ.3.1)*

*నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః। నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి। ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః।* (తై.ఆ.2.1)। (ఏవం త్రిః)

[15]ఇతి జపిత్వా, ప్రణవేన కుమ్భముత్థాప్య, '*వరుణాన్తర్యామిణం భగవన్తం శ్రీపుణ్డరీకాక్షం యథాస్థానం ప్రతిష్ఠాపయామి*' ఇత్యక్షతాన్ వికీర్య వరుణ ముద్వాస్య,

1. *"ప్రాచ్యాం దిశి దేవా ఋత్విజో మార్జయన్తామ్।*
2. *దక్షిణాయాం దిశి మాసాః పితరో మార్జయన్తామ్।*
3. *ప్రతీచ్యాం దిశి గృహాః పశవో మార్జయన్తామ్।*

---

[15]పై మంత్రములను బ్రాహ్మణులతో సహ జపించి, షోడశోపచారార్థం కలశముపై అక్షతలు వేసి, ప్రణవముతో (అనగా, *"ఓం"* అనుచు) కలశమును రెండుచేతులా లేవనెత్తి, మరల క్రిందికి పెట్టి, '*వరుణాన్తర్యామిణం ---ప్రతిష్ఠాపయామి*' అని చెప్పుచు కలశముపై అక్షతలు వేసి, వరుణుని ఉద్వాసన చేసి, ఇదివరకు విప్రుల చేతి కొసగిన దర్భలను తిరిగి తీసికొని, వానికొనలను కలశములోని కూర్చామ్రపల్లవాగ్రములతో చేర్చి, వానితో కలశములోని నీటి నద్దుకొనుచు క్రింద నొసగిన 5 మార్జనమంత్రములతో ఆనీటిని వరుసగా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వదిశలందు ప్రోక్షించి, "*దేవస్య త్వా*" అను మంత్రములతో కర్తను, అతని కుటుంబమును ప్రోక్షించవలెను. పిదప *"వాస్తోష్పతే*" - అను మంత్రముతో ఇంటిని, ఇతరపదార్థాదులను, ఇంటి పరిసరములను ప్రోక్షించవలెను. తర్వాత కర్త 'ఆప ఇద్వా' ఇత్యాదిమంత్రములతో కలశములోని తీర్థప్రాశనము చేసి, సాత్త్వికత్యాగమును చేసి, బ్రాహ్మణ సత్కారమును చేసి ముగించవలెను.

4. *ఉదీచ్యాం దిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయన్తామ్।*

5. *ఊర్ధ్వాయాం దిశి యజ్ఞస్సంవత్సరో యజ్ఞపతిర్మార్జయన్తామ్॥"*

ఇతి పూర్వ,దక్షిణ,పశ్చిమ,ఉత్తర,ఊర్ధ్వదిశాం ప్రోక్ష్య, దేవస్యత్వాదినా సపత్నీకం యజమానం ప్రోక్షయేత్.

## ప్రోక్షణమంత్రాః

*"దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యామ్। పూష్ణో హస్తాభ్యామ్। అశ్వినోర్భైషజ్యేన। తేజసే బ్రహ్మవర్చసాయాభిషిఞ్చామి। దేవస్య త్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యామ్।పూష్ణో హస్తాభ్యామ్।సరస్వత్యై భైషజ్యేన।వీర్యాయాన్నాద్యాయాభిషిఞ్చామి।దేవస్య త్వా సవితుః ప్రసవే।అశ్వినోర్బాహుభ్యామ్।పూష్ణో హస్తా-భ్యామ్।ఇన్ద్రస్యేన్ద్రియేణ।శ్రియై యశసే బలాయాభిషిఞ్చామి। (తై.బ్రా.2.6.5)*

*చ వాజినమ్। సోమగ్ం రాజానం వరుణమగ్నిమన్వారభామహే। ఆదిత్యాన్ విష్ణుగ్ం సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిమ్। దేవస్య త్వా సవితుఃప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాగ్ం సరస్వత్యై వాచో యన్తుర్యన్త్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామీన్ద్రస్య త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామి బృహస్పతేస్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామి।* (తై.సం.1-7-10)

*దేవాస్త్వేన్ద్రజ్యేష్ఠా వరుణ రాజానోఽధస్తాచ్చోపరిష్టాచ్చ పాన్తు న వా ఏతేన పూతో న మేధ్యో న ప్రోక్షితో యదేనమతః ప్రాచీనం ప్రోక్షతి యథ్సంభృతమాజ్యేన ప్రోక్షతి తేన పూతస్తేనమేధ్యస్తేన ప్రోక్షితః।*(తై.సం.5-5-6)। *ఓం భూర్భువస్సువః॥"* - అమృతాభిషేకో *అస్తు।*

## గృహప్రోక్షణమంత్రాః

*"వాస్తోష్పతే ప్రతి జానీహ్యస్మాన్థ్స్వావేశో అనమీవో భవా నః। యత్త్వేమహే ప్రతి తన్నో జుషస్వ శం న ఏధి ద్విపదే శం చతుష్పదే॥ వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే సక్షీమహి రణ్వయా గాతుమత్యా। ఆవః క్షేమ ఉత యోగే వరం నో యూయం పాత*

*స్వస్తిభిస్సదా నః॥ వాస్తోష్పతే ప్రతరణో న ఏధి గోభిరశ్వేభిరిన్దో। అజరాసస్తే సఖ్యే స్యామ పితేవ పుత్రాన్ ప్రతి నో జుషస్వ॥ అమీవహా వాస్తోష్పతే విశ్వా రూపాణ్యా విశన్। సఖా సుశేవ ఏధి నః॥ శివగ్ం శివమ్॥ (తై.మం.పా.2.15)*

## తీర్థప్రాశనమంత్రాః

"*ఆప ఇద్వా ఉ భేషజీరాపో అమీవచాతనీః। ఆపస్సర్వస్య భేషజీస్తాస్తే కృణ్వన్తు భేషజమ్*। (ఋ.సం.8-7-25)।*ఆమయావీ చిన్వీత। ఆపోవై భేషజమ్। భేషజమేవాస్మై కరోతి। సర్వమాయురేతి*।(తై.ఆ.1-26)। "–ఇతి యజమానః తీర్థం ప్రాశ్య, 'స్వశేష భూతేన మయా...' ఇతి సాత్త్వికత్యాగం కృత్వా బ్రాహ్మణసత్కారం కుర్యాత్।

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*<br>*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్।*



# అగ్నిముఖమ్(షట్పాత్రప్రయోగః)

( మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా ప్రధానదర్వి(స్రుక్కు), ఆజ్యపాత్ర, ప్రోక్షణీ పాత్ర, ప్రణీతిపాత్ర, ఇధ్మము, ఇతరదర్వి (స్రువము) అను నీ ఆఱు పాత్రల నుపయోగించి చేయు అగ్నిముఖమునకు 'షట్పాత్రప్రయోగ' మని పేరు. దీని విధాన మిక్కడ వివ రింపబడినది.)

[16]**సంకల్పః:** కర్తా ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ---- కర్మాంగత్వేన షట్పాత్రప్రయోగవిధానేన అగ్నిముఖం కరిష్యే'* - ఇతి సంకల్ప్య,
[17] గోమయేనోపలిప్తే శుచౌ దేశే, శ్వేతతండులచూర్ణేన ప్రాదేశమాత్రం చతురస్రసమం స్థండిలం కల్పయిత్వా, [18]ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్. అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్.

---

[16]**సంకల్పః:** అగ్నిముఖము ప్రధానకర్మకు ఆనుషంగికమైనది. అందుచే ----కర్మాంగత్వేన అని ఉన్నచోట ప్రధానకర్మపేరును (ఉదా: చౌల, ఉపనయన - ఇత్యాదిగా) చెప్పి, దానికి అంగభూతముగా నీ అగ్నిముఖమును చేయుచున్నానని సంకల్పించి అగ్నిముఖము నధోలిఖితవిధముగా చేయవలెను.

[17]**స్థండిలకల్పనమ్:** అగ్నిప్రతిష్ఠాపనకై గోమయముతో నలుకబడి రంగవల్ల్యాద్యలంకృతమైన శుచియైన ప్రదేశమున కొంచెము బియ్యముపిండిని నెఱపి అరత్నిమాత్ర చతురస్రస్థలమును హోమార్థమై కల్పించవలెను. ఈ స్థలమునకే స్థండిలమని పేరు.

[18]**ఉల్లేఖనమ్**: పిదప రెండుదర్భలను సగమునకు మడచి చివరలు క్రిందికుండునట్లుగా అంగుష్ఠానామికలతో పట్టుకొని వానితో 'ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్' అనుచు పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు స్థండిలముయొక్క దక్షిణార్ధమందును, మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా ఒక్కొక్కరేఖను గీచి, ఆతర్వాత 'అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్' అని చెప్పుచు దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంత

[19]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య, [20]"*ఓం భూర్భువస్సువరోమ్*"– ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య, [21]ఉత్పృచ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్।
*[22]*అగ్నిమిధ్వా (యాజ్ఞియైరింధనైః ప్రజ్వాల్య),

---

మగునట్లు ఒక్కొక్కరేఖను స్థండిలముయొక్క పశ్చిమార్ధమున, మధ్యన, పూర్వార్ధమున వరుసగా గీచి, ఆ దర్భలను స్థండిలముపై నుంచవలెను (ఇట్లు రేఖలను గీయుటకే ఉల్లేఖన మని పేరు. 'శ్లో॥అంగుష్ఠానామికాభ్యాం తు సంగృహీతేన సూత్రవిత్। ఋజవస్సంతతం రేఖా విలిఖేత్తు యథావిధి॥ - అని ఉల్లేఖనవిషయములో కపర్దికారిక.)

[19] అభ్యుక్షణతోయపాత్రలో అక్షతలు వేసి కొంచము నీటిని పోసికొని, ఆనీటిలో కొంచెం కుడి అఱచేతిలో పోసికొని 'అవాక్కరోభ్యుక్ష్య' అని చెప్పుచు ఆనీటిచే అధోముఖహస్తముతో స్థండిలమును ప్రోక్షించి, 'తృణం నైఋత్యాం నిరస్య' అనుచు ఆదర్భలను వేదిపైనుండి తీసి నైఋతికి పడవేసి, 'అప ఉపస్పృశ్య' అనుచు అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని తాకవలెను.

[20] **అగ్నినిధానమ్**: స్థండిలముపై "*ఓం భూర్భువస్సువరోమ్*"అని అగ్నిని ఉంచి, (ఈ అగ్నిని ఇద్దరు ముత్తైదువలు ఒక ఇత్తడితట్టలో తెచ్చి స్థండిలముపై నుంచిన తర్వాత కర్త ఆ తట్టలో అక్షతోదకమును వేయుట, అట్లు వేసిన తర్వాత వారా తట్టను వెన్కకు తీసికొనిపోవుట శాస్త్ర రీత్యా ఆచారముగా నున్నది. (అప్పు డాస్త్రీలు కంఠమునకు గంధము రుద్దుకొని పోవుటగూడ కొన్నిచోట్ల పద్ధతిగా నున్నది.)

[21] **ఉదకపాత్రనినయనమ్**: అభ్యుక్షణతోయపాత్రలో మిగిలిన ఉదకమును చల్లివేసి, దానిలో అక్షతలువేసి, వెఱే జలమును నింపవలెను. ఒక పాత్రలో (దొప్పలో) అక్షతలు వేసి నీటిని పోసి, దానిని అగ్నికి తూర్పునగాని ఉత్తరమునగాని ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుండు నట్లుగా నుంచవలెను. (ఇచ్చట తూర్పున నుంచుటయే ఆచారముగా నున్నది.)

22 **అగ్నిప్రార్థనా**: 'అగ్నిమిధ్వా' అనుచు అభ్యుక్షణతోయపాత్రలోని నీటితో ప్రోక్షించిన యజ్ఞార్హములైన (మోదుగు) సమిధలను అగ్నిలో నుంచి, అగ్నిని ప్రజ్వలింపజేయవలెను. ఇచ్చట 'నాగ్నిం ముఖేనోపధమేత్, న చ వ్యజనాదినా వా, ధమనీం, తృణం కాష్ఠం వాన్తరే కృత్వా ముఖేనైవ ధమేత్" అను వాక్యముండుటచేత, అగ్నిని నేరుగా నూదుటచేగాని, విసనకఱ్ఱతో, చేతితో, వస్త్రాదులతో విసరుటచేగాని జ్వలింపజేయరాదు. ఒక సమిధనుగాని, దర్భనుగాని అడ్డముగా

*"ఓం చత్వారి శృంగాత్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య/త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ/(*తై.ఆ.6.10)*/అగ్నిం ధ్యాయామి"* - ఇతి ధ్యాత్వా,

*"ఓం ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః/ స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః/"- ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ/ సుముఖో భవ/ సుప్రసన్నో భవ/ వరదో భవ/ యథోక్తజిహ్వయా హవిర్గృహాణ/*

- ఇత్యగ్నిమావాహ్య, ప్రార్థ్య, అగ్నేః పురతోఽ క్షతోదకం నినీయ, [23]పరిసమూహ్య, [24] *1. ఓం అగ్నయే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతైరలంకృత్య,

[25]ప్రాగగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్।

---

పెట్టుకొని నోటితో నూది ప్రజ్వలింపజేయవలెను. ఆతర్వాత అంజలిని ఏటవాలుగా వంచి అగ్ని వైపు చూపించుచు ' *చత్వారి శృంగాత్రయో"*- అను మంత్రముతో అగ్నిని ధ్యానించి, *"ఏష హి దేవః --- విశ్వతోముఖః/ ప్రాఙ్ముఖాగ్నే --హవిర్గృహాణ"*– అని చెప్పుచు అంజలిని తన ఎదవైపు త్రిప్పుకొనుచు ప్రాఙ్ముఖుడైన అగ్నిని తన కభిముఖముగా కమ్మని ప్రార్థించి, కుడిఅరచేతిలో కొంచెము హరిద్రాక్షతలను, నీటిని తీసికొని వానిని అగ్నికి తూర్పున నుంచి,

[23]**పరిసమూహనమ్**:''పరిసమూహ్య' అనుచు కుడిఅఱచేతిలో నీటిని పోసికొని అగ్నిచుట్టును తూర్పునుండి మొదలిడి ప్రదక్షిణముగా నలికి (ఇట్లు చేయుటకే పరిసమూహన మని పేరు.)

[24] **అలంకరణమ్:**'*ఓం* అగ్నయే నమః' నుండి '*ఓం* విసర్పిణే నమః' వరకు గల వాక్యములను చెప్పుచు ప్రదక్షిణముగా తూర్పునుండి మొదలిడి 8 దిక్కులందును అగ్నిచుట్టును అక్షతల నుంచి,'శ్రీయజ్ఞపురుషాయ నమః' అనుచు అగ్నిమధ్య కొన్ని అక్షతలు వేసి, 'సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః' - అనుచు సదస్యులపై అక్షతలు వేయవలెను.

[25] **పరిస్తరణవిధిః**: పదహారేసి దర్భలతో కట్టిన నాల్గు పరిస్తరణలను అగ్నిచుట్టును ప్రదక్షిణ

[26]ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్ సగ్గ్స్తీర్య| ద్వంద్వం న్యఞ్చిపాత్రాణి ప్రయునక్తి| దర్వీ మాజ్యస్థాలీమ్| ప్రోక్షణీం ప్రణీతీమ్| ఇధ్మ మితరదర్వీం||
[27]సమౌ సాగ్రౌ ద్వౌ దర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రే కృత్వా| తృణం కాష్ఠం వా అంతర్ధాయ ఛినత్తి| న నఖేన| అప ఉపస్పృశ్య| అద్భిరనుమృజ్య||

---

ముగా వేయవలెను. ఇట్లు తూర్పు, పశ్చిమములందు వేయు పరిస్తరణలను ఉత్తరాగ్రములుగను, ఉత్తరదక్షిణములందు వేయు పరిస్తరణలను పూర్వాగ్రములుగాను, తూర్పునుండి ఆరంభించి ప్రదక్షిణముగా వేసి, దక్షిణదిశలో వేసిన పరిస్తరణలను ప్రాక్పశ్చిమముగా వేసిన పరిస్తరణల మొదళ్లపై నుండునట్లును, ఉత్తరమున వేసిన పరిస్తరణలను ప్రాక్పశ్చిమముగా వేసిన పరిస్తరణల కొనల క్రిందికుండునట్లును సవరించవలెను.

[26]**పాత్రాసాదనమ్**: అగ్నికి ఉత్తరమున 6-6 దర్భలను రెండుపాయలుగా పూర్వాగ్రముగా పఱచి, 3 దర్భలను ఉత్తరాగ్రముగా తనముందు పఱచుకొని, హోమపాత్రలను జంటగా తీసికొని అగ్నికి ఉత్తరమున రెండు పాయలుగా నుంచిన దర్భలపై బోర్లించి పెట్టవలెను. అనగా, కుడి, ఎడమచేతులలో దర్వీని, ఆజ్యస్థాలీని జంటగా తీసికొని కుడివైపుపాయ మొదట కుడిచేతిలో నున్నదానిని, ఎడమవైపుపాయ మొదట ఎడమచేతిలో నున్నదానిని బోర్లించి పెట్టవలెను. అట్లే ప్రోక్షణీపాత్రను, ప్రణీతిపాత్రను కుడి,ఎడమచేతులలో జంటగా తీసికొని క్రమముగా దర్వీ, ఆజ్యస్థాలీలకు పైవైపు బోర్లించి ఉంచవలెను. చివరికి 20 సమిధలు గల ఇధ్మముల కట్టను, ఇతర దర్వీని (స్రువమును) కుడి,ఎడమచేతులలో జంటగా తీసికొని వానిని క్రమముగా ప్రోక్షణీ,ప్రణీతులకు పైవైపు బోర్లించి ఉంచవలెను. ఇట్లు హోమపాత్రలుంచుటకే 'పాత్రాసాదన' మని పేరు (సగ్గ్స్తీర్య =పఱచి; ద్వంద్వం=రెండురెండు, న్యఞ్చి=బోర్లించిన). ఈ ఆఱు పాత్రలకు దేవపాత్రలని పేరు. ఇవిగాక ఉపనయనచౌలాదిప్రయోగములలో నుపయుక్తమగు కత్తి, మేఖలా దండాదులకు మనుష్యపాత్రలని పేరు. ఈ మనుష్యపాత్రల నన్నిటిని ఒక పెద్దతట్టలో నుంచి, దాని నొకేసారి దేవపాత్రల కుత్తరమున దర్భలపై నుంచవలెను.

[27] **పవిత్రకరణమ్:** సమమగు పొడవుగల రెండుదర్భలను సరిచేసి పట్టుకొని, కొనలకు క్రిందుగా రెంటిని కలిపి ముడివేసి, కొనలనుండి మొదటికి జుత్తెడు పొడవుండునట్లుగా ఆదర్భల మొదళ్లను గోళ్లతో త్రుంచక, ఒక సమిధ నడ్డముగా నుంచి త్రుంచి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని తాకి, ఆదర్భలను ముమ్మారు కడిగి, ఆయామతమును కట్టి,

[28] ప్రోక్షణ్యామవదాయ। తస్యామక్షతానప అనీయ। హస్తయో రఙ్గుష్ఠోపకనిష్ఠికాభ్యాం ఉత్తానాభ్యాం ఉదగగ్రే గృహీత్వా। ప్రాచీస్త్రిరుత్పూయ। అభిమన్త్ర్య। సపవిత్రేణ పాణినా పాత్రాణి సంమృశ్య। పాత్రాణ్యుత్తానాని కృత్వా। విస్రస్యేధ్మం। త్రిః ప్రోక్షతి। శేషముత్సిచ్య। పునః పూరయిత్వా। (ప్రోక్షణీం) కించిద్దక్షిణతో నిధాయ॥

[29]పూర్ణపాత్రమాదాయ।అపరేణాగ్నిం పవిత్రాంతర్హితే పాత్రే అప ఆనీయ। ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం త్రిరుత్పూయ। ముఖసమముద్ధృత్య। సమం ప్రాణైర్హృత్వోత్తరేణాగ్నిం దర్భేషు సాదయిత్వా। తత్పవిత్రమాజ్యస్థాల్యాం నిధాయ। దర్భైః ప్రచ్ఛాద్య॥

[30] *"అస్మిన్ ---- హోమకర్మణి బ్రహ్మాణం త్వాం వృణీమహే।బ్రహ్మణే నమః। ఇద*

---

[28]**ప్రోక్షణీసంస్కారః:** ప్రోక్షణి ఉన్న చోటనే దాని సంస్కారము నిట్లు చేయవలెను.
ప్రోక్షణిని త్రిప్పిపెట్టి దానిలో ఆయామతమును వేసి, ప్రోక్షణిలో అక్షతలు వేసి, ఉదకమును నింపి, రెండుచేతులయొక్క బొటమన ఉంగరపువ్రేళ్లచేత ఆయామతమును ఉత్తరమునకు కొనలుండు నట్లు పట్టుకొని, పడమటినుండి తూర్పున కంత మగునట్లు ఆడించుచు మూడుసార్లు ప్రోక్షణి లోని నీటిని గీచి, ప్రోక్షణిపై కుడిఅఱచేతిని బోర్లించి చూపి అభిమంత్రించి, ఆయామతముతో మిగితాపాత్రలను తాకి, వానిని త్రిప్పి పెట్టి, ఇధ్మకట్టకు కట్టిన దర్భత్రాటిముడిని విడిచి, ఆయా మతమును కుడిచేతిలో పూర్వాగ్రముగ పట్టుకొని, మూడుసార్లు ప్రోక్షణిలోని నీటిని ఇతరదేవ మనుష్యపాత్రలపై ప్రోక్షించి, ప్రోక్షణిలోని నీటిని చల్లి, వేరే నీటినందులో నింపి, దానిని అగ్నికి కొంచెము దక్షిణముగా (దాదాపుగానైఋతివైపు) పరిస్తరణల కవతల నుంచవలెను. ఈనీటితోనే మిగితా అగ్నిముఖమునంతయు పూర్తిచేయవలెను.

[29]**ప్రణీతిసంస్కారః:** ప్రోక్షణిలోని ఆయామతమును ఉత్తరాగ్రముగా ప్రణీతిపాత్రలో వేసి, దానిని ప్రదక్షిణముగా తీసికొని వచ్చి తనముందు (అగ్నికి పడమట) పరిస్తరణలకు వెలుపల నుంచు కొని, కొంచెము అక్షతలు వేసి నీరు నింపి, ప్రోక్షణికివలెనే ఉత్తరాగ్రాయామతంతో దానిని 3 సార్లు ఉత్పూరణము చేసి, దానిని ముక్కుసూటిగా నెత్తి పట్టుకొని, అగ్నికి ఉత్తరమున లోగడ వేసిన దర్భల కుత్తరమున 12 దర్భలను పూర్వాగ్రముగా వేసి, వానిపై నాపాత్ర నుంచి, దానిలోని పవిత్ర మును తీసి ఆజ్యస్థాలీలో ఉత్తరాగ్రముగ నుంచి, ఆ ప్రణీతిపాత్రను 8 పూర్వాగ్రపు దర్భలచే కప్పి,

[30] **బ్రహ్మావాహనమ్:** తరువాత కర్త అగ్నికి దక్షిణమున 3దర్భలు పూర్వాగ్రముగ వేసి *"అస్మిన్----హోమకర్మణి బ్రహ్మాణం త్వాం వృణీమహే, బ్రహ్మణే నమః, ఇదమాసనమ్"*- అని వానిపై

*మాసనమ్/ ఆవాహనాది షోడశోపచారాన్ సమర్పయామి/"*- ఇతి బ్రహ్మాణం దర్భేషు అగ్నేర్దక్షిణతో నిషాద్య, అక్షతైరభ్యర్చ్య,

**ఆజ్యపాత్రసంస్కారః:** [31]ఆజ్యం విలాప్య| అపరేణాగ్నిం పవిత్రాంతర్హితాయామాజ్య-స్థాల్యాం ఆజ్యం నిరూప్య| [32]ఉదీచోంఽగారాన్నిరూహ్య| తేష్వధిశ్రిత్య| [33]జ్వలతా తృణేనావద్యోత్య| అప ఉపస్పృశ్య| తం విసృజ్య|[34]ద్వే దర్భాగ్రే నఖాదన్యేన (అంగుష్ఠ

---

బ్రహ్మస్థానమం దొక శ్రీవైష్ణవుని ఉత్తరముఖముగా కూర్చుండబెట్టి, *"ఆవాహనాదిషోడశోప చారాన్ సమర్పయామి"* అని అతనిపై పసుపు అక్షతలు వేసి అర్చింపవలెను. గీతలున్నచోట ముఖ్యకర్మ పేరుచెప్పవలెను(ఉదా:చౌలహోమకర్మణి,ఉపనయనహోమకర్మణి - ఇత్యాదిగ)

[31] తెచ్చుకున్న నేతిని కరిగించి (విలాప్య=కరిగించి), ఆజ్యపాత్రను ప్రదక్షిణముగా తీసికొని వచ్చి అగ్నికి పడమట పరిస్తరణలకు వెలుపల తన ముందు వేసికొన్న దర్భలపై నుంచుకొని, అందులో ఆయామతమును వేసి, కరగించిన నేతిని పోసి (నిరూప్య= పోసి),

[32] ఉత్తరమువైపు అగ్నినుండి కొన్ని నిప్పులను వేఱుగా తీసికొని (నిరూహ్య=తీసికొని), వానిపై ఆ నేతిపాత్రనెక్కించవలెను (అధిశ్రిత్య=ఎక్కించి). వేఱుగా తీసికొన్న నిప్పుల నెచ్చట నుంచవలె నను విషయమున ఈ కారిక యున్నది: 'వివాహ, చౌల, సీమంత, స్వాధ్యాయవ్రతకర్మసు| స్నాన, గోదాన సంధానే ఆజ్యసంస్కార మన్తరే| వాస్తుహోమే చాగ్రయణే శాంతిహోమే వృషోత్సృజే|ఉపనయనాది సర్వేషు సపరిస్తరణాద్బహి|' – అనగా, వివాహ, చౌల, సీమంత, వేదవ్రత, స్నాతక,గోదానములందు పరిస్తరణలకు లోపలనే ఆజ్యసంస్కారము. అనగా వేఱుగా తీసికొన్న నిప్పులు పరిస్తరణలకు లోపలనే ఉండవలె ననుట. కాని, వాస్తుహోమ,ఆగ్రయణ,ఉపనయన, వృషోత్సర్జన, శాన్తిహోమాది అన్ని కర్మలయందు ఆజ్యసంస్కారము పరిస్తరణలకు వెలుపలనే ఉండవలెను. అనగా ఈకర్మలలో వేఱుగా తీసికొన్న నిప్పులు పరిస్తరణలకు వెలుపల నుండవలె ననుట.

[33] ఒక దర్భను నిప్పుతో నంటించి, ఆ జ్వాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), నీరు ముట్టి, ఆ దర్భను పడవేసి,

[34] అంగుష్ఠపర్వప్రమాణముగ రెండు దర్భాగ్రముల నొకేపరి గోటితో గాక అన్యవిధముగా త్రుంచి (ప్రచ్ఛిద్య=త్రుంచి), నీరు ముట్టి, వానిని ప్రోక్షణిలోని నీటితో కడిగి, ఆదర్భాగ్రములను నేతి పాత్రలో నుంచి, నేతిపాత్రను (ఉన్నచో హవిఃపాత్రతో సహ) జ్వలితదర్భచేత ప్రాగాదిగా ప్రదక్షి

పర్వమాత్రం) సకృత్ప్రచ్ఛిద్య।అపఉపస్పృశ్య। ప్రక్షాళ్య। ప్రత్యస్య (ఆజ్యే ప్రాశ్య)।
ప్రాగాది ప్రదక్షిణం త్రిః పర్యగ్నికృత్వా। ఉదగుద్వాస్య। అప ఉపస్పృశ్య।
[35]అంగారానగ్నౌ ప్రత్యూహ్య। ఆజ్యస్థాలీం స్వస్య పురస్తా న్నిధాయ। ఉదగగ్రాయామ
తేన పునరాహారమాజ్యం త్రిరుత్పూయ। [36]పవిత్రగ్రంథిం విస్రస్య। అప ఉపస్పృశ్య।
ప్రక్షాళ్య। ప్రాగగ్రమగ్నౌ ప్రహరతి॥ [37]దర్వీన్నిష్టప్య। త్రిభిః దర్భైః సంమృజ్య। పున
ర్నిష్టప్య। ప్రోక్ష్య। స్రువ ముత్తరతో నిధాయ। దర్భానద్భిః సంస్పృశ్య। అగ్నౌ ప్రహరతి॥
**పరిధి(శమ్యా) నిధానమ్:**[38](ఆజ్యభాగేషు) పరిధ్యర్థే శమ్యాః (అథవా అగ్ని ముఖేషు

---

ణముగా మూడుసార్లు చుట్టి, నీరు ముట్టి, ఆ దర్భను ఉత్తరమునకు పడవేయవలెను. ఇట్లు జ్వలితదర్భచేత చుట్టుటకే పర్యగ్నికరణమని పేరు. గృహ్యారత్నమను ధర్మశాస్త్రములో నిచ్చట 'నిరూఢాగ్నే రవద్యోతనపర్యగ్నికరణార్థాగ్నిగ్రహణే తస్మిన్నిరూఢాగ్నావేవ తం నిక్షిపేత్, న బహిస్త్యజేత్' అను నిర్దేశమున్నది. మూలాగ్నినుండి వేరుగా తీసికొన్న నిప్పులకు నిరూఢాగ్ని అని పేరు. అవద్యోతన,పర్యగ్నికరణార్థమై దర్భ నీ నిరూఢాగ్నిలో నంటించి కొన్నచో అట్టి జ్వలితదర్భల నా అగ్నిలోనే త్యజించవలెను గాని బయట పడవేయగూడదని ఈ నిర్దేశమున కర్థము. కాని దీని నందఱును పాటించుచున్నట్లు లేదు.

[35] అగ్నినుండి వేఱుగా తీసిన నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, నేతిపాత్రను ప్రదక్షిణముగా తీసి కొని వచ్చి తన ముందుంచుకొని, ఉత్తరాగ్రాయామతంతో మూడుసార్లు తూర్పునుండి పడమ రకు,పడమటినుండి తూర్పున కంతమగునట్లు నేతిపాత్రలోని నేతిని గీచి (ఇదే పునరాహారము),

[36] ఆజ్యపాత్రలోని ఆయామతమును వెలికి దీసి, దాని ముడిని విప్పి, నీరు ముట్టి, ఆ ఆయా మతదర్భలను కడిగి, కొనలు తూర్పుదిశగా నుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

[37]**స్రుక్స్రువసంస్కారః:** ప్రధానదర్వీని(స్రుక్కును) ఎడమచేత, ఇతరదర్వీని(స్రువమును) కుడి చేత ఒకేసారి తీసికొని, వాని నగ్నిపై కాచి (నిష్టప్య=కాచి, వేడిచేసి), ఆరెండింటిని ఎడమచేతిలో పట్టుకొని, మూడుదర్భలతో కుడిచేత ప్రాగంతముగా వానిని తుడిచి, మళ్లీ వానిని రెండు చేతు లలో పట్టుకొని కాచి, తుడిచిన దర్భలతో ప్రోక్షణిలోని జలమును వానిపై ప్రోక్షించి, ఆజ్యపాత్రకు ఎడమవైపు స్రుక్కును, కుడికి స్రువమును ఉంచి, తుడుచుటకై వాడిన దర్భలను ప్రోక్షణిలోని నీటిలో కడిగి, వాని నగ్నియందు ప్రాగగ్రముగా వేయవలెను.

[38] **పరిధినిధానమ్:** ఇప్పుడు శమ్యలు లేక పరిధులుగా పిలువబడు సమిధలను అగ్నికి చుట్టు

పరిధీన్) దధాతి| స్థవిష్ఠో మధ్యమః| అణీయాన్ ద్రాఘీయాన్ దక్షిణార్ధ్యః| అణిష్ఠో హ్రసిష్ఠ ఉత్తరార్ధ్యః| మధ్యమముదగగ్ర మితరౌ ప్రాగగ్రౌ|| మధ్యమపరిధిముపస్పృశ్య| ద్వే ఆఘారసమిధౌ పురస్తా దూర్ధ్వే దక్షిణోత్తర మాదధాతి||

**పూర్వపరిషేచనమ్:** [39]సవ్యహస్తేన పాత్ర స్పృశన్ దక్షిణేన పాణినా అగ్నిం పరిషించతి| *"ఓం అదితేఽను మన్యస్వ"* (ఇతి దక్షిణతః ప్రాచీనమ్), *"ఓం అనుమతేఽనుమన్యస్వ"* (ఇతి పశ్చా దుదీచీనమ్), *"ఓం సరస్వతేఽనుమన్యస్వ"* (ఇత్యుత్తరతః ప్రాచీనమ్), "*దేవసవితః ప్రసువ*" (ఇతి సమంతమ్) పరిషిచ్య|

---

నుంచవలెను. స్థాలీపాకేతరవివాహము, ఉపనయన, సమావర్తన, సీమంత, చౌల, గోదానవ్రత, ప్రాయశ్చిత్తములం దీసమిధలు శమ్యలుగను, ఇతరకర్మలలో పరిధులుగను పిలువబడును. శమ్యలుంచు హోమమునకు ఆజ్యభాగమనియు, పరిధులుంచు హోమమునకు అగ్నిముఖ మనియు పేర్లు. ఈవిషయము మొదటి అధ్యాయములో వివరింపబడినది. వీని నుంచు క్రమ మిట్లున్నది - అన్నిటికంటె లావుగనుండు పరిధిని మధ్యన (అనగా అగ్నికి పశ్చిమమున పరిస్త రణకు వెలుపల) వేసి, సన్నగా పొడవుగా నుండు పరిధిని దక్షిణమున మధ్యమసమిధకు తగులునట్లును, అన్నిటికంటె సన్నగను పొట్టిగను ఉండు పరిధిని అగ్ని కుత్తరమువైపున మధ్యమపరిధికి తగులునట్లుగాను ఉంచవలెను. మధ్యమపరిధి కొన ఉత్తరమునకును, దక్షిణో త్తరములయందుంచు పరిధుల కొనలు తూర్పునకును ఉండవలెను. తరువాత మిగిలిన రెండు పొట్టి పరిధులను (ఇవియే ఆఘారసమిధలు) రెండుచేతులలో తీసికొని వానిని మధ్యమపరిధికి ఒకసారి తాకించి, వానిని ప్రాగగ్రములుగా మునుపగ్నికి తూర్పునందుంచిన ఉదకపాత్ర కిరు వైపులా దక్షిణోత్తరములం దుంచవలెను.

[39] **పూర్వపరిషేచనమ్:** తరువాత *"అగ్నిం పరిషించతి"* అని చెప్పి, ఎడమచేతితో ప్రోక్షణిని తాకుచు, *"ఓంఅదితేఽనుమన్యస్వ"*- అనుచు దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, *"ఓం అనుమతేఽనుమన్యస్వ"* - అనుచు పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"ఓం సరస్వతేఽనుమన్యస్వ"*- అనుచు ఉత్తరమునందు పడమటినుండి తూర్పునకు, *"దేవ సవితః ప్రసువ"*- అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యము వఱకు, కుడిచేత ప్రోక్షణిలోని నీటితో అగ్ని చుట్టును పరిషేచనము చేయవలెను.

[40]ఇధ్మమాజ్యేనాభ్యజ్య| ఇధ్మమలంకృత్య| స్వయమలంకృత్య| బ్రహ్మాణమలంకృత్య| *"అస్మిన్---హోమ కర్మణి బ్రహ్మన్ ఇధ్మ మాధాస్యే "*- ఇతి ప్రార్థ్య| *"ఆధత్స్వ "*- ఇత్యనుజ్ఞాతః| ఇధ్మమాధాయ| అప ఉపస్పృశ్య|

## ఆఘారహోమః

[41]స్రువేణ ఆజ్యమాదాయ, వాయవ్యాదాగ్నేయాన్తం ప్రజాపతిం మనసా ధ్యాయన్ *"ప్రజాపతయ ఇదం న మమ "* – ఇతి సంతతధారయా హుత్వా,[42]తతః ప్రధానదర్వ్యా ఆజ్యమాదాయ, ఇన్ద్రం మనసా ధ్యాయన్ నైఋత్యా దీశానాన్తం *"ఇన్ద్రాయేదం న మమ "* –ఇతి సంతతధారయా హుత్వా,

---

[40]**ఇధ్మాధానమ్:** తరువాత స్రువముతో ఇధ్మమును నేతితో నభిఘరించి, (ఇధ్మమనగా మిగిలిన 15 సమిధల సమూహము), దానిపై అక్షతలు వేసి అలంకరించి, అట్లే ముందుగా బ్రహ్మను, తదుపరి తనను తలపై అక్షతలు వేసికొని అలంకరించుకొని, ఇధ్మమును రెండుచేతులా పట్టుకొని దానిని బ్రహ్మకు చూపించి, *"అస్మిన్---హోమకర్మణి ఇధ్మ మాధాస్యే "*- అని బ్రహ్మను అడిగి, *"ఆధత్స్వ "*– (ఇధ్మము నుంచుము) అని అతనిచే చెప్పించుకొని, దానిని పూర్వాగ్రముగా నగ్నిలో నుంచి ప్రోక్షణిలోని నీటిని తాకవలెను. గీతలున్నచోట ప్రధానకర్మ పేరును (చౌల, ఉపనయన - ఇత్యాదిగా) చెప్పవలెను.

[41] స్రువములో నేతిని తీసికొని, ప్రజాపతిని మనసులో ధ్యానించుచు *"ప్రజాపతయేదం న మమ"* - అని వాయవ్యమునుండి ఆగ్నేయమున కేకధారగా అగ్నియందుంచి (ఇది ప్రథమాఘారము),

[42]తరువాత స్రువముతో స్రుక్కులో నొకసారి నేతిని పోసికొని ఇంద్రుని మనసులో ధ్యానించుచు *"ఇన్ద్రాయేదం న మమ "*- అని నైఋతినుండి ఈశాన్యమున కేకధారగా అగ్నిలో హోమము చేయవలెను (ఇది ద్వితీయాఘారము). వీనికే ఆఘారహోమములని పేరు. తరువాతి నాల్గు మన్త్రములతో నాల్గేసిసార్లు (పంచార్షేయులు 5సార్లు) స్రుక్కులోనికి స్రువముతో నేతిని వేసికొని "*ఓం అగ్నయే స్వాహా| అగ్నయ ఇదం న మమ "* - అని అగ్నిలో ఈశాన్యభాగమందును, "*ఓం సోమాయ స్వాహా / సోమాయేదం న మమ|"* - అని అగ్నిలో ఆగ్నేయభాగమునందును, తరువాతి రెండుమంత్రములతో అగ్నికి మధ్యమందును హోమము చేయవలెను. ఈహోమములకు చక్షుర్హోమములని పేరు. ఇట్లు చక్షుర్హోమమువరకు చేయు కార్యములకు పూర్వతంత్రమని పేరు.

## చక్షుర్హోమాః

*1 ఓం అగ్నయే స్వాహా/ అగ్నయ ఇదం న మమ/* - ఇత్యుత్తరార్ధపూర్వార్ధే,

*2. ఓం సోమాయ స్వాహా/ సోమాయేదం న మమ/* - ఇతి దక్షిణార్ధపూర్వార్ధే,

*3. ఓం అగ్నయే స్వాహా/ అగ్నయ ఇదం న మమ/* - ఇత్యగ్నిమధ్యే (అగ్నిముఖే, నాఽఽజ్యభాగే),

*4. ఓం భూర్భువస్సువస్స్వాహా/ప్రజాపతయ ఇదం న మమ/"* - ఇత్యగ్నిమధ్యే??

ప్రధానదర్వ్యా చతుర్గృహీతేనాజ్యేన జుహోతి.

[43]సూ॥ యథోపదేశం ప్రధానాహుతీర్ హుత్వా। (స్రువేణ) జయాభ్యాతానాన్ రాష్ట్ర-భృతః ప్రాజాపత్యామ్ వ్యాహృతీ ర్వ్యహృతాః సౌవిష్టకృతీ మిత్యుపజుహోతి॥

---

గమనిక: 'అగ్నయే స్వాహా' అని అగ్నిమధ్యన మూడవహోమముచేయుట అగ్నిముఖము లోనే కాని ఆజ్యభాగములో లేదు. ఈ ఆహుతికి ముఖాహుతి అని పేరు.

[43] తర్వాత ఉద్దిష్టప్రధానకర్మకు ఏయే హోమములు నిర్ణీతమైనవో వానిని చేయవలెను. అవి మునుముందు ఆయా ప్రధానకర్మలనుగుఱించి వ్రాసినప్పుడు అక్కడ చెప్పబడును. ప్రధానా హుతులు చేసిన తర్వాత 'ఇధ్మసన్నహనప్రక్షేపము' చేయవలెను. అనగా ఇధ్మములకు కట్టిన దర్భత్రాటిని నీటిలో తడిపి, దులిపి, అగ్నిలో వేయవలెను. పిదప జయాదిహోమములను చేయ వలెను.ఇట్లు ప్రధానహోమానంతరము ఇధ్మసన్నహనప్రక్షేపముతో నారంభించి చేయు కార్య ములకు ఉత్తరతంత్రమని పేరు. ఈఉత్తరతంత్రమును చేసి హోమక్రియను ముగించవలెను. ఈ విషయములను స్పష్టపరచుటకై సూత్రార్థము క్రింద వ్రాయబడినది.

యథోపదేశం=ఏయే కర్మలయందు ఏయే హవిస్సులతో ఏయేరీతిగా చేయవలెనని చెప్ప బడెనో దాని నతిక్రమించకుండ, ప్రధానాహుతీః=ప్రధానహోమములను, హుత్వా=హోమము చేసి, స్రువేణ=స్రువముతో, జయ=(13)జయహోమములను, అభ్యాతాన్=(18) అభ్యాతానము లను, రాష్ట్రభృతః=(22) రాష్ట్రభృత్తులను, ప్రాజాపత్యామ్= (1) ప్రాజాపత్యహోమమును, వ్యాహృతీర్వ్యహృతాః=పృథక్కుగా (అనగా వ్యాహృతి కొక్కటి చొప్పున) (3) వ్యాహృతి హోమములను, సౌవిష్టకృతీం=(1) స్విష్టకృద్ధోమమును, ఇతి=ఇట్లు వెరసి 58, ఉపజుహోతి

## జయాదిహోమాః

[44]శ్లో॥ ప్రథమాఘారహోమశ్చ ప్రధానాహుత్యనంతరమ్।
యద్ధోతవ్యం తు తత్సర్వం స్రువేణోక్తం కపర్దినా॥

ప్రాణానాయమ్య, 'ఏతత్కర్మసమృద్ధ్యర్థం జయాదిహోమం కరిష్యే' -ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యం గృహీత్వా,

1. *ఓం చిత్తం చ స్వాహా॑। చిత్తాయేదం న మమ॥*
2. *ఓం చిత్తిశ్చ స్వాహా॑। చిత్త్యా ఇదం న మమ॥*
3. *ఓం ఆకూతం చ స్వాహా॑। ఆకూతాయేదం న మమ॥*
4. *ఓం ఆకూతిశ్చ స్వాహా॑। ఆకూత్యా ఇదం న మమ॥*
5. *ఓం విజ్ఞాతం చ స్వాహా॑। విజ్ఞాతాయేదం న మమ॥*
6. *ఓం విజ్ఞానం చ స్వాహా॑। విజ్ఞానాయేదం న మమ॥*
7. *ఓం మనశ్చ స్వాహా॑। మనస ఇదం న మమ॥*
8. *ఓం శక్వరీశ్చ స్వాహా॑। శక్వరీభ్య ఇదం న మమ॥*
9. *ఓం దర్శశ్చ స్వాహా॑। దర్శాయేదం నమమ॥*
10. *ఓం పూర్ణమాసశ్చ స్వాహా॑। పూర్ణమాసాయేదం న మమ॥*

---

=ఉపహోమములను చేయవలెను. ఇట్లు 'జయాదిహోమం కుర్యాత్' అని చెప్పినపుడెల్ల ఈ 58 హోమములు చేయవలెనని గ్రహించవలెను.

ఇట్లు చేసి, శమ్యలు చెప్పబడిన కర్మయందు వానిని విసర్జించియు, పరిధులు చెప్పబడిన కర్మలయందు వాని నగ్నిలో నుంచియు, 12 అనాజ్ఞాతాదిహోమములను చేసియు, ఉత్తరపరిషేచనమును, అగ్న్యుపస్థానమును చేసియు, చిట్టచివరకు సాత్త్వికత్యాగము చేసియు ముగించవలెను. అందుచేత ఈ ఉపహోమమంత్రము లన్నియు నిచ్చట నీయబడుచున్నవి.

[44] ఆఘారహోమములు, ప్రధానహోమములు చేసిన తర్వాత వచ్చు ఉపహోమము లన్నియు స్రువముతో చేయవలెనని కపర్ది వచించెను. జయాదిహోమములు ప్రధానహోమము తరువాతనే వచ్చును గావున వీనిని స్రువములో నొకసారి నేతిని గ్రహించి చేయవలెనని ఈకారిక కర్థము.

11. ఓం బృహచ్చ స్వాహా/ బృహత ఇదం న మమ//

12. ఓం రథన్తరం చ స్వాహా/ రథన్తరాయేదం న మమ//

13. ఓం ప్రజాపతిర్జయానిన్ద్రాయ వృష్ణే ప్రాయచ్ఛదుగ్రః పృతనాజ్యేషు తస్మై విశః సమనమన్త సర్వాః స ఉగ్రః స హి హవ్యో బభూవ స్వాహా/ప్రజాపతయ ఇదం న మమ//

## అభ్యాతానాః (అభ్యాతానాలు – 18)

14. అగ్నిర్భూతానామధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ అగ్నయే భూతానామధిపతయ ఇదం న మమ//

15. ఇంద్రో జ్యేష్ఠానామధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ ఇంద్రాయ జ్యేష్ఠానామధిపతయ ఇదం న మమ//

16. యమః పృథివ్యా అధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ యమాయ పృథివ్యాధిపతయ ఇదం న మమ//

17. వాయురన్తరిక్షస్యాధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ వాయవే అంతరిక్షస్యాధిపతయ ఇదం న మమ//

18. సూర్యో దివోఽధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ సూర్యాయ దివోఽధిపతయ ఇదం న మమ//

19. చన్ద్రమా నక్షత్రాణామధిపతిస్స మాఽవత్వస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా/ చన్ద్రమసే నక్షత్రాధిపతయ ఇదం న మమ//

20. బృహస్పతిర్బ్రహ్మణోఽధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
బృహస్పతయే బ్రహ్మణోఽధిపతయ ఇదం న మమ॥

21. మిత్రస్సత్యానామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
మిత్రాయ సత్యానామధిపతయ ఇదం న మమ॥

22. వరుణోఽపామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
వరుణాయాపామధిపతయ ఇదం న మమ॥

23. సముద్రస్స్రోత్యానామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
సముద్రాయ స్రోత్యానామధిపతయ ఇదం న మమ॥

24. అన్నగ్ం సామ్రాజ్యానామధిపతి తన్మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
అన్నాయ సామ్రాజ్యానామధిపతయ ఇదం న మమ॥

25. సోమ ఓషధీనామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
సోమాయౌషధీనామధిపతయ ఇదం న మమ॥

26. సవితా ప్రసవానామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా। సవిత్రే ప్రసవానామధిపతయ ఇదం న మమ॥

27. రుద్రః పశూనామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మన్న స్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్న స్యాం దేవహూత్యాగ్ స్వాహా।
రుద్రాయ పశూనామధిపతయ ఇదం న మమ॥

**అప ఉపస్పృశ్య (ప్రోక్షణిలోని నీటిని తాకవలెను)**

28. త్వష్టా రూపాణామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మ న్నస్మిన్ క్షత్రేఽస్యామా-
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ స్వాహా। త్వష్ట్రే
రూపాణామధిపతయ ఇదం న మమ॥

29. విష్ణుః పర్వతానామధిపతిస్స మాఽవత్వస్మి న్బ్రహ్మ న్నస్మిన్ క్షత్రేఽస్యామా
శిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ స్వాహా। విష్ణవే
పర్వతానామధిపతయ ఇదం న మమ॥

30. మరుతో గణానామధిపతయస్తే మాఽవన్త్వస్మి న్బ్రహ్మ న్నస్మిన్ క్షత్రేఽ
స్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ స్వాహా।
మరుద్భ్యః గణానామధిపతిభ్య ఇదం న మమ॥

**(మృతపితృకశ్చేత్ - తండ్రి మరణించియుండిన ఈక్రింది హోమమును చేయవలెను)**

31. పితరః పితామహాః పరేవరేతతాస్తతామహా ఇహమాఽవత। అస్మిన్బ్రహ్మ
న్నస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం
దేవహూత్యాగ్ స్వాహా। పిత్రాదిభ్యో దేవతాభ్య ఇదం న మమ॥

**(జీవపితృకశ్చేత్ - తండ్రి జీవించియుండిన ఈక్రింది హోమమును చేయవలెను)**

32. పితామహా అవరే తతాస్తతామహా ఇహమాఽవత। అస్మిన్బ్రహ్మన్నస్మిన్ క్షత్రేఽ
స్యామాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్
స్వాహా। మంత్రోక్తదేవతాభ్య ఇదం న మమ॥

**(జీవపితామహశ్చేత్ - తండ్రి మరణించి తాత జీవించియుండిన ఈక్రింది హోమము చేయవలెను. తండ్రి, తాత లిద్దరు జీవించియుండిన 32వ మంత్రమును జపించవలెను, కాని ఆజ్యహోమము చేయరాదు.)**

33. పితరః పరే తతాస్తతామహా ఇహమాఽవత। అస్మిన్బ్రహ్మ న్నస్మిన్ క్షత్రేఽస్యా
మాశిష్యస్యాం పురోధాయామస్మిన్కర్మన్నస్యాం దేవహూత్యాగ్ స్వాహా।

*మంత్రోక్తదేవతాభ్య ఇదం నమమ॥*

**అప ఉపస్పృశ్య (ప్రోక్షణిలోని నీటిని తాకవలెను)**

## రాష్ట్రభృత్తులు – 22

34. *ఋతాషాడృతధామాఽగ్నిర్గన్ధర్వస్తస్యౌషధయోఽప్సరస ఊర్జో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా॥ అగ్న యే గన్ధర్వాయేదం నమమ॥*

35. *తాభ్యస్స్వాహా॥ ఓషధీభ్యో ఽప్సరోభ్య ఇదం నమమ॥*

36. *సగ్ంహితో విశ్వసామా సూర్యో గన్ధర్వస్తస్య మరీచయోఽప్సరస ఆయువో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా॥ సూర్యాయ గన్ధర్వాయేదం నమమ॥*

37. *తాభ్యస్స్వాహా॥ మరీచిభ్యో ఽప్సరోభ్య ఆయుభ్య ఇదం నమమ॥*

38. *సుషుమ్న స్సూర్యరశ్మిశ్చన్ద్రమా గన్ధర్వస్తస్య నక్షత్రాణ్యప్సరసో బేకురయో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా॥ చంద్రమసే గన్ధర్వాయేదం న మమ॥*

39. *తాభ్యస్స్వాహా॥ నక్షత్రేభ్యో ఽప్సరోభ్య ఇదం న మమ॥*

40. *భుజ్యుస్సుపర్ణో యజ్ఞో గన్ధర్వస్తస్య దక్షిణా అప్సరసస్తవా నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా॥ యజ్ఞాయ గన్ధర్వాయేదం న మమ॥*

41. *తాభ్యస్స్వాహా॥ దక్షిణాభ్యో ఽప్సరోభ్య ఇదం న మమ॥*

42. *ప్రజాపతిర్విశ్వకర్మా మనో గన్ధర్వస్తస్యర్క్సామాన్యప్సరసో వహ్నయో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా॥ మనసే గన్ధర్వాయేదం న మమ॥*

43. *తాభ్యస్స్వాహా॥ ఋక్సామేభ్యో ఽప్సరోభ్య ఇదం న మమ॥*

44. ఇషిరో విశ్వవ్యచా వాతో గన్ధర్వ స్తస్యాపోఽప్సరసో ముదా నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా/ వాతాయగన్ధర్వాయేదం న మమ//

45. తాభ్యస్స్వాహా/ అద్భ్యో ఽప్సరోభ్య ఇదం న మమ//

46. భువనస్య పతే యస్య త ఉపరి గృహా ఇహ చ/ స నో రాస్వాజ్యానిగ్ం రాయ-స్పోషగ్ం సువీర్యగ్ం సంవత్సరీణాగ్ స్వస్తిగ్ం స్వాహా/ భువనస్యపతయ ఇదం న మమ//

47. పరమేష్ఠ్యధిపతిర్మృత్యుర్గన్ధర్వ స్తస్య విశ్వమప్సరసో భువో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా/ మృత్యవే గన్ధర్వాయేదం న మమ//

48. తాభ్యస్స్వాహా/ విశ్వస్మా ఽప్సరోభ్య ఇదం న మమ//

49. సుక్షితిస్సుభూతిర్భద్రకృత్సువర్వాన్పర్జన్యో గన్ధర్వ స్తస్య విద్యుతోఽప్సరసో రుచో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా/ పర్జన్యాయ గన్ధర్వాయేదం న మమ//

50. తాభ్యస్స్వాహా/ విద్యుద్భ్య ఽప్సరోభ్య ఇదం న మమ//

51. దూరేహేతిరమృడయో మృత్యుర్గన్ధర్వ స్తస్య ప్రజా అప్సరసో భీరువో నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా/ మృత్యవే గన్ధర్వాయేదం న మమ//

52. తాభ్యస్స్వాహా/ ప్రజాభ్యో ఽప్సరోభ్య ఇదం న మమ//

53. చారుః కృపణకాశీ కామో గన్ధర్వ స్తస్యాధయోఽప్సరసశ్శోచయన్తీర్నామ స ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తా ఇదం బ్రహ్మ క్షత్రం పాన్తు తస్మై స్వాహా/ కామాయ గన్ధర్వాయేదం న మమ//

54. తాభ్యస్స్వాహా/ ఆధిభ్యో ఽప్సరోభ్య ఇదం నమమ//

55. స నో భువనస్య పతే యస్య త ఉపరి గృహా ఇహ చ/ ఉరు బ్రహ్మణేఽస్మై క్షత్రాయ

*మహి శర్మ యచ్ఛ స్వాహా॥ భువనస్య పతయే బ్రహ్మణ ఇదం న మమ॥*

## ప్రజాపతిహోమః

56. *ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ। యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయగ్గ్ స్యామ పతయోరయీణాగ్ స్వాహా॥ ప్రజాపతయ ఇదం న మమ॥ (తై.సం.1-8-14)*

## వ్యాహృతిహోమః

57. *ఓం భూస్స్వాహా॥ అగ్నయ ఇదం న మమ॥*
58. *ఓం భువస్స్వాహా॥ వాయవ ఇదం న మమ॥*
59. *ఓగ్ం సువస్స్వాహా॥ సూర్యాయేదం న మమ॥*
60. *ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం న మమ॥"* **???**

## స్విష్టకృద్ధోమః

61. *యదస్య కర్మణోఽత్యరీరిచం యద్వా న్యూన మిహాకరమ్। అగ్నిష్టత్స్విష్టకృద్విద్వాన్థ్సర్వగ్ స్విష్టగ్ం సుహుతం కరోతు స్వాహా॥ అగ్నయే స్విష్టకృత ఇదం న మమ॥*

## పరిధి ప్రహరణమ్

[45]ఇతి హుత్వా, (అగ్నిముఖేషు ) పరిధి ప్రహరః। మధ్యమపరిధిం ప్రహృత్య। ఇతరౌ యుగపత్ ప్రహరన్। ఉత్తరార్ధస్యాగ్ర మంగారేషూపగూహతి॥(ఆజ్యభాగేషు ) శమ్యా అపోహ్య। ఆఘారసమిధౌ ప్రహరతి॥

---

[45]పై హోమముల నన్నిటిని చేసి, అగ్నిముఖప్రయోగమునందు పరిధులను అగ్నిలో నుంచవలెను. దీని విధమిట్లున్నది. మధ్యమపరిధిని తీసి అగ్నిలో ప్రాగగ్రముగా నుంచి, అగ్నికి ఉత్తర దక్షిణములందుంచిన పరిధుల నొకేసారి ఎడమ, కుడిచేతులతో తీసికొని అగ్నిలో నుంచవలెను. తరువాత అగ్నికి తూర్పున దక్షిణోత్తరములందుంచిన రెండు ఆఘారసమిధల నేకకాలమున కుడి, ఎడమచేతులలో గ్రహించి వానిని సగమువరకు అగ్నిలో గ్రుచ్చవలెను. ఆజ్యభాగమందు

## సంస్రావహోమః

[46]దర్వ్యామితరదర్వ్యగ్రమవదాయ,

*"స్వాహా᳚ విశ్వేభ్యో᳚ దేవేభ్యః సగ్గ్స్రావభాగేభ్య ఇదం న మమ"*

- ఇతి సగ్గ్ంస్రావేణాఽభిజుహోతి. తతః అప ఉపస్పృశ్య, ప్రాయశ్చిత్తహోమం, ప్రాణాయామం, పరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం, అగ్న్యుపస్థానాదికం కుర్యాత్.

## అనాజ్ఞాతాదిహోమః

ప్రాణానాయమ్య, *"అస్మిన్---హోమకర్మణి సంభావిత జ్ఞాతాజ్ఞాతాది సకలదోష నిర్హరణార్థం అనాజ్ఞాతాదిహోమం కరిష్యే"*-ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యేన జుహుయాత్.

1. *అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు᳚ అగ్నే తదస్య కల్పయ త్వగ్ంహి వేత్థ యథాతథగ్గ్ స్వాహా᳚ అగ్న య ఇదం న మమ᳚ (తై.బ్రా. 3.7.11)*
2. *పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః᳚ అగ్నే తదస్య కల్పయ త్వగ్ంహి వేత్థ యథాతథగ్గ్ స్వాహా᳚ అగ్న య ఇదం న మమ᳚ (తై.బ్రా. 3.7.11)*
3. *యత్పాకత్రా మనసా దీనదక్షాన యజ్ఞస్య మన్వతే మర్తాసః᳚ అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి స్వాహా᳚ అగ్న య ఇదం న మమ᳚*

---

క్రమముగా అగ్నికి పశ్చిమ,దక్షిణోత్తరదిశలందున్న శమ్యలను తీసి అగ్నికి ఉత్తరమున పరిస్తరణల కవతల నుంచి, ఆఘారసమిధలను రెండుచేతులలో నేకకాలమున గ్రహించి వానిని సైతమట్లే పరిహరించవలెను. ఆఘారసమిధలను అగ్నిలో వేయవలెనని కొందరి మతము.

[46]దర్విలో నితరదర్విచేత ఒకసారి ఆజ్యము గ్రహించి, ఇతరదర్విలో కూడ నేతిని వేసికొని, దాని యొక్క అగ్రమును దర్వి యందు బోరగిలించి, ఏకధారగా అగ్నిలో *"స్వాహా᳚ విశ్వేభ్యో᳚ దేవేభ్యః --- ఇదం నమమ"* - అని హోమమును చేసి, ప్రోక్షణిలోని నీటిని తాకి, ప్రాణాయామము చేసి, *'అస్మిన్-----హోమకర్మణి సంభావిత జ్ఞాతాజ్ఞాతాది సకలదోషనిర్హరణార్థం అనాజ్ఞాతాది హోమం కరిష్యే'* అని గీత లుంచిన చోట ప్రధానకర్మపేరును చెప్పుచు సంకల్పించి, స్రువముతో నేతిని తీసికొనుచు క్రింద నిచ్చిన 14 మంత్రములతో అనాజ్ఞాతాదిహోమమును చేయవలెను.

4. త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽవ యాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం న మమ। (తై.మం.పా 1-4)

5. స త్వన్నో అగ్నే ఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవ యక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా। అగ్నీ వరుణాభ్యా మిదం న మమ। (తై.మం.పా 1-4)

6. యత ఇన్ద్ర భయామహే। తతో నో అభయం కృధి। మఘవఞ్ఛగ్ధి తవ తన్న ఊతయే। విద్విషో విమృధో జహి స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥ (తై.బ్రా. 3.7.11)

7. స్వస్తిదా విశస్పతిః। వృత్రహా విమృధో వశీ। వృషేన్ద్రః పుర ఏతు నః। స్వస్తిదా అభయఙ్కరస్స్వాహా। ఇన్ద్రాయాభయంకరాయేదం న మమ॥ (తై.బ్రా. 3.7.11)

8. ఆభిర్గీర్భిర్యదతో న ఊనమ్। ఆప్యాయయ హరివో వర్ధమానః। యదా స్తో-తృభ్యో మహి గోత్రారుజాసి। భూయిష్ఠభాజో అధ తే స్యామ స్వాహా। ఇంద్రాయ హరివత ఇదం న మమ। (తై.బ్రా. 3.7.11)

9. త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్। ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్స్వాహా। త్ర్యంబకాయేదం న మమ। (తై.ఆ. 6.56)

**అప ఉపస్పృశ్య (ప్రోక్షణిలోని నీటిని తాకవలెను)**

10. ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే స్వాహా। విష్ణవ ఇదం న మమ। (తై.సం.1.2.13)

11. ఓం భూస్స్వాహా। అగ్నయ ఇదం న మమ॥

12. ఓం భువస్స్వాహా। వాయవ ఇదం న మమ॥

13. ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం న మమ॥

14. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ॥

## సర్వప్రాయశ్చిత్తహోమః

[47]ప్రాణానాయమ్య, *"అస్మిన్-----హోమకర్మణి మధ్యే సంభావిత మన్త్ర-తంత్ర-స్వర-వర్ణ-విధివిపర్యాస-న్యూనాతిరిక్త-దోష-ప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం హోష్యామి"*- ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యమాదాయ జుహుయాత్

*15. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ॥*

*16. శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం న మమ॥*

## పూర్ణాహుతిహోమః

(చౌల,వివాహోపనయన, వేదవ్రత,ప్రతిసరబంధములందు పూర్ణాహుతిహోమమును చేయుట లేదు. దీనిని శాన్త్యాదికర్మలయందు చేయుచున్నారు. అందుచేత ప్రధానకర్మయొక్క అవసరమునుబట్టి దీనిని చేయుటయో, లేక మానుటయో నిర్ణయించుకొనవలెను.)

[48] *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం, మమాయుష్యాభివృద్ధ్యర్థం, అముక హోమసంపూర్ణతాసిద్ధ్యర్థం పూర్ణాహుతిం కరిష్యే'* ఇతి సంకల్ప్య,

---

[47] మరల ప్రాణాయామము చేసి, '*అస్మిన్-----హోమకర్మణి మధ్యే సంభావిత మన్త్రతంత్ర-స్వరవర్ణవిధివిపర్యాసన్యూనాతిరిక్తదోషప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం కరిష్యే*' అని గీతలుంచినచోట ప్రధానకర్మపేరును చెప్పుచు సంకల్పించి, స్రువముతో నేతిని తీసికొనుచు క్రింద నిచ్చిన 15,16 మంత్రములతో సర్వప్రాయశ్చిత్తహోమమును చేయవలెను. క్రియ నాచరించుటలోను, మంత్రాదులు చెప్పుటలోను కల్గిన న్యూనాతిరిక్తాదిదోషపరిహారార్థమై ఈ సర్వప్రాయశ్చిత్తహోమమును చేయుచున్నారు.

[48] కర్త 'శ్రీభగవదాజ్ఞయా...పూర్ణాహుతిహోమం కరిష్యే' అని చెప్పి, పూర్ణాహుతిచేయుటకై ఒక టెంకాయను క్రొత్త రైకబట్టలో కట్టి ఒక తట్టలో పెట్టి, చిల్లరను, రెండు అరటిపండ్లను, ఇతర హోమద్రవ్యములను కూడ ఆ తట్టలోనే ఉంచి, సదస్యులచేత దాని నభిమంత్రింపజేసి, దానికి షోడశోపచారపూజను చేసి, స్రుక్కులోనికి స్రువముతో ఏకం, ద్వే—ద్వాదశ' అని చెప్పుచు 12 సార్లు నేతిని వేసికొని, నిలబడి, 'సప్త తే అగ్నే' అను మంత్రముతో హోమము చేసి, కూర్చొని,

హోమద్రవ్యాణి పాత్రే నిధాయ, పూజాదికం కృత్వా, ఏకం-ద్వే-త్రీణి-చత్వారి-పంచ-షట్-సప్త-అష్టౌ-నవ-దశ-ఏకాదశ-ద్వాదశ - ఇతి ద్వాదశ గృహీతేనాజ్యేన స్రుచం పూరయిత్వా,

*17. ఓం సప్త తే అగ్నే సమిధ స్సప్త జిహ్వా స్సప్తర్షయ స్సప్త ధామ ప్రియాణి। సప్త హోత్రా స్సప్తధా త్వా యజన్తి సప్త యోనీ రాపృణస్వా ఘృతేన స్వాహా। అగ్న యే సప్తహోత్ర ఇదం న మమ।" (తై.సం.1.5.3)*

ఇతి హుత్వా, ఉత్థాయ, ఆజ్యపాత్రే పరిశిష్టాజ్యం ప్రధానదర్వ్యా సంతత ధారయా జుహుయాత్.

*18. పూర్ణాహుతి ముత్తమాం జుహోతి। సర్వం వై పూర్ణాహుతిః। సర్వమేవాప్నోతి। అథో ఇయం వై పూర్ణాహుతిః। అస్యామేవ ప్రతితిష్ఠతి॥*

*19. అగ్నా విష్ణూ సజోషసేమా వర్ధన్తు వాంగిరః। ద్యుమ్నై ర్వాజేభిరాగతమ్॥*(తై.సం.4.7.1)

*20. ఓం వసోర్ధారాం జుహోతి వసోర్మే ధారాఽసదితి వా ఏషా హూయతే ఘృతస్య వా ఏనమేషా ధారాఽముష్మిన్లోకే పిన్వమానోప తిష్ఠత ఆజ్యేన జుహోతి తేజో వా ఆజ్యం తేజో వసోర్ధారా తేజసైవాస్మై తేజోఽవరున్ధేఽథో కామా వై వసోర్ధారా కామానేవావరున్ధే యం కామయేత ప్రాణానస్యాన్నా ద్యమ్॥*(తై.సం.5.4.8)

ఇతి హుత్వా కర్తా ఉపవిశేత్. తతః '*పూర్ణాహుతి ముహూర్తస్సుముహూర్తోఽస్తు*' - ఇత్యక్షతాన్ బ్రాహ్మణాః కర్తౄణాం శిరసి క్షిపేయుః॥

ఉత్తరపరిషేచనమ్:[49] పునః ప్రాణానాయమ్య, "*అదితేఽన్వమగ్గ్ స్థాః*"- ఇతి

---

'*అగ్న యే సప్తవత ఇదం న మమ*' అని త్యాగమును చెప్పి, మరల లేచి నిలబడి 18వ మంత్రమును చెప్పుచు తట్టలో నుంచిన హోమద్రవ్యములను అగ్నిలో వేయవలెను. తర్వాత 19-20 మంత్రములను చెప్పుచు ఆజ్యపాత్రలో మిగిలిన నేతిని స్రుక్కునుండి అగ్నిలో సంతతధారగా పోసి కూర్చొనవలెను. అప్పుడు బ్రాహ్మణులు 'పూర్ణాహుతి ముహూర్త స్సుముహూర్తోఽస్తు' అని కర్తపై అక్షతలు వేయవలెను. అముక అని ఉన్నచోట ప్రధానకర్మ పేరును చెప్పవలెను.

[49] మరల ప్రాణాయామమును చేసి, మునుపటివలెనే ఎడమచేతితో ప్రోక్షణిని తాకుచు, కుడిచేత

దక్షిణతః ప్రాచీనమ్, *"అనుమతేఽన్వమగ్గ్ స్థాః"* - ఇతి పశ్చాదుదీచీనమ్, *"సరస్వతేఽన్వమగ్గ్ స్థాః"*- ఇత్యుత్తరతః ప్రాచీనమ్, *"దేవ సవితః ప్రాసావీః"* - ఇతి సమంతమగ్నిం పరిషిచ్య।

## ప్రణీతామోక్షణమ్

[50]ప్రణీతిపాత్రమానీయ। 'సదసీ' తి పునః పూరయిత్వా।

*మం॥ ఓం సదసి సన్మే భూయాస్సర్వమసి సర్వం మే భూయాః పూర్ణమసి పూర్ణం మే భూయా అక్షితమసి మామేక్షేష్ఠాః॥*

పాత్రప్రయుక్త దర్భా నాదాయ। తేన 'యేన దేవాః' ఇత్యాదిభిః ప్రణీతిజలం మార్జయేత్।

## మార్జనమ్

మం॥ *యేన దేవాః పవిత్రేణ। ఆత్మానం పునతే సదా। తేన సహస్రధారేణ। పావమాన్యః*

---

ప్రోక్షణిలోని నీటిని తీసికొని *"అదితేఽన్వమగ్గ్ంస్థాః"* - అని దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, *"అనుమతేఽన్వమగ్గ్ంస్థాః"*- అని పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽన్వమగ్గ్ంస్థాః"*- అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవ సవితః ప్రాసావీః"* - అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని పరిషేచనము చేయవలెను. దీనికే ఉత్తరపరిషేచనమని పేరు.

[50] ప్రణీతిపాత్రను తీసికొని వచ్చి తన ముందుంచుకొని, దానిలో నితరపాత్రలలో (అనగా, ప్రోక్షణిలోను, అగ్నికి తూర్పున నుంచిన పాత్రలోను) ఉన్న జలమును 'సదసి సన్మే' అను మంత్రముతో పోసి, అగ్నికి ఉత్తరమున ఆ ప్రణీతిక్రింద వేసిన దర్భలను, దానిపై కప్పిన 8 దర్భలను చేర్చి కొనలు జోడించి పట్టుకొని, ఆదర్భలకొనలచే ప్రణీతిలోని జలము నద్దికొనుచు 'యేన దేవాః పవిత్రేణ' ఇత్యాదిమంత్రములతో మార్జనము చేసికొని, తరువాత 1-5 మంత్రములతో వరుసగా పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వదిశలందు అదేదర్భలతో ప్రోక్షించి, ఆ తర్వాత '*సముద్రం వః ప్రహిణోమి*' అను మంత్రముతో కర్త ప్రణీతిలోని జలమును భార్య దోసిటిలో పోయగా నామె జలములోనున్న అక్షతలు చేతిలో నుంచుకొని, మిగితా జలమును క్రిందికి విడువవలెను. ఆ అక్షతలను తీసికొని కర్త తనతలపై, భార్యతలపై (చౌలాదులలో పుత్రునితలపై) వేసికొనవలెను.

*పునన్తు మా। ప్రాజాపత్యం పవిత్రమ్। శతోద్యామగ్ం హిరణ్మయమ్। తేన బ్రహ్మ విదో వయమ్। పూతం బ్రహ్మ పునీమహే। ఇన్ద్ర స్సునీతీ సహ మా పునాతు। సోమస్స్వస్త్యా వరుణ స్సమీచ్యా। యమో రాజా ప్రమృణాభిః పునాతు మా। జాతవేదా మోర్జయన్త్యా పునాతు।*

## దిఙ్మార్జనమ్

1. *"ప్రాచ్యాం దిశి దేవా ఋత్విజో మార్జయన్తామ్।*
2. *దక్షిణాయాం దిశి మాసాః పితరో మార్జయన్తామ్।*
3. *ప్రతీచ్యాం దిశి గృహాః పశవో మార్జయన్తామ్।*
4. *ఉదీచ్యాం దిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయన్తామ్।*
5. *ఊర్ధ్వాయాం దిశి యజ్ఞస్సంవత్సరో యజ్ఞపతిర్మార్జయన్తామ్।"*

ఇతి పూర్వ,దక్షిణ,పశ్చిమ,ఉత్తర,ఊర్ధ్వదిశాం ప్రోక్ష్య,

*"సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమపి గచ్ఛత। అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మా పరాసేచి మత్పయః"* (తై.మం.పా.2.9)- ఇత్యాత్మానం, పత్నీం (కుమారంచ) ప్రోక్ష్య,

## బ్రహ్మోద్వాసనమ్

[51] *'బ్రహ్మణే నమః' । సదక్షిణాకం తాంబూలం సమర్పయామి। యథాస్థానముద్వాసయామి॥* – ఇతి బ్రహ్మణే తాంబూలదక్షిణాంచ దత్వా బ్రహ్మోద్వాసనం కుర్యాత్. ప్రాగాది పరిస్తరణ ముత్తరే విసృజ్య అగ్న్యుపస్థానం కుర్యాత్.

## [52]అగ్న్యుపస్థానమ్

---

[51] తదుపరి *'బ్రహ్మణే నమః---ఉద్వాసయామి'* అని చెప్పుచు బ్రహ్మస్థానమున కూర్చున్న విప్రునికి తాంబూలదక్షిణ లిచ్చి అతనిని ఉద్వాసన చేసి, తూర్పునుండి మొదలిడి ప్రదక్షిణముగా అగ్ని చుట్టు వేసిన పరిస్తరణలను తీసి అగ్నికి ఉత్తరమువైపు పడవేయవలెను.

[52] తర్వాత కర్త భార్యాపుత్రులతో లేచి నిలబడి సాంజలియై, 'అగ్నే నయ సుపథా రాయే' అను

"ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్/ విశ్వాని దేవ వయునాని విద్వాన్/ యుయోధ్యస్మజ్జుహురాణమేనః/ భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ/ ప్రతిశ్యుక్రాయ భానవే భరధ్వమ్/ హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్/ యో దైవ్యాని మానుషా జనూగ్ంషి/ అన్తర్విశ్వాని విద్మనా జిగాతి/ అచ్ఛా గిరో మతయో దేవయన్తీః/ అగ్నిం యన్తి ద్రవిణం భిక్షమాణాః/ సుసందృశగ్ం సుప్రతీకగ్గ్ స్వంచమ్/ హవ్యవాహ మరతిం మాను-షాణామ్/ అగ్నే త్వమస్మద్యుయోధ్యమీవాః/ అనగ్నిత్రా అభ్యమన్త కృష్టీః/ పునరస్మభ్యగ్ం సువితాయ దేవ/ క్షాం విశ్వేభిరజరేభిర్యజత్ర/ అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్/ స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా/ పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ/ భవా తోకాయ తనయాయ శంయోః/ ప్రకారవో మననా వచ్యమానాః/ దేవద్రీచీ న్నయథ దేవయన్తః/ దక్షిణావాడ్వాజినీ ప్రాచ్యేతి/ హవిర్భరన్త్యగ్నయే ఘృతాచీ/" (తై.బ్రా.2.8.2)

> మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన/
> యద్ధుతం తు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే//
> ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మికాని వై/
> యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్//

"అభివాదయే ---" ఇతి గోత్రర్షినామయుతప్రవర ముక్త్వా అభివాద్య ఉపవిశేత్.

([53]యత్రక్వచేత్యాజ్యభాగాన్తం పురస్తాత్తంత్రమ్, జయాదిపరిషేచనాంత ముపరిష్టాత్ తంత్రమ్। తయోర్మధ్యే హూయమానాః ప్రధానహోమాః।)



---

మంత్రమును, తర్వాత నిచ్చిన శ్లోకములను చెప్పి, గోత్రర్షినామయుతమైన ప్రవరను చెప్పి అగ్నికి నమస్కరించి 'శ్రీకృష్ణాయనమః' అని పదిసార్లు జపించి కూర్చొనవలెను.

[53] (అనేకకర్మలను సమిష్టిగా చేసినపుడు, చక్షుర్హోమాంతపూర్వతంత్రమును, జయాదిపరిషేచనాంతము గల ఉత్తరతంత్రమును ప్రతికర్మకు వేర్వేరుగా గాక ఒకేసారి చేయవలెను. పూర్వోత్తర తంత్రములకు మధ్యన ఆయాకర్మలకు చెందిన ప్రధానహోమములను చేయవలెను.)

# చతుష్పాత్రప్రయోగః

( మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా ప్రధానదర్వి(స్రుక్కు), ఇతరదర్వి (స్రువము), ఆజ్యపాత్ర, ప్రోక్షణీపాత్ర అను నీ నాల్గు పాత్రల నుపయోగించి చేయు క్రియకు ‘ చతుష్పాత్ర ప్రయోగ’ మని పేరు. దీని విధాన మిక్కడ వివరింపబడినది.

‘ శ్లో॥ నాఘారౌ నాజ్యభాగౌ చ న చేధ్మం న జయాదయః।

చతుష్పాత్రప్రయోగే తు నిశ్చిత్యోక్తం కపర్దినా॥’

అను కపర్దికారికప్రకారము, చతుష్పాత్రప్రయోగములో ఆఘారహోమములు, ఆజ్యభాగము, ఇధ్మము, జయాదిహోమము లుండవు. )

[54]**సంకల్పః:** కర్తా ప్రాణానాయమ్య, *‘పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం---- కర్మాంగం చతుష్పాత్రప్రయోగవిధానేన అగ్నిస్థాపనం కరిష్య(కరిష్యే)’*

-ఇతి సంకల్ప్య,

[55] గోమయేనోపలిప్తే శుచౌ దేశే, శ్వేతతండులచూర్ణేన సమం చతురస్రం స్థండిలం కల్పయిత్వా, [56]ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్।

---

[54]**సంకల్పః:** అగ్నిముఖము ప్రధానకర్మకు అనుషంగికమైనది. అందుచే ----కర్మాంగం అని ఉన్నచోట ప్రధానకర్మ పేరును చెప్పి, దానికి అంగభూతముగా నీ అగ్నిముఖమును చేయు చున్నానని సంకల్పించి దానిని చేయవలెను. సంకల్పములో ‘కరిష్య’ అని హోమఫలము కర్తకు చెందునప్పుడును, ‘కరిష్యే’ అని అన్యులకు చెందు నప్పుడును చెప్పవలెను.

[55]**స్థండిలకల్పనమ్:** అగ్నిప్రతిష్ఠాపనకై గోమయముతో నలుకబడి రంగవల్ల్యాద్యలంకృతమైన శుచియైన ప్రదేశమున కొంచెము బియ్యముపిండిని నెరిపి చతురస్రస్థలమును హోమార్థమై కల్పించవలెను. ఈ స్థలమునకే స్థండిలమని పేరు.

[56] **ఉల్లేఖనమ్**: పిదప రెండుదర్భలను సగమునకు మడచి చివరలు క్రిందికుండునట్లుగా పట్టుకొని వానితో ‘ప్రాచీః పూర్వ ముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్’ అని చెప్పుచు పడమటినుండి

[57]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య,[58]"*ఓం భూర్భువస్సువరోమ్*"– ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య| [59]ఉత్సృచ్యతేఽభ్యుక్షణతోయశేషమ్| ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్ఛ పరిస్తరాణామ్|[60]అగ్నిం ప్రజ్వాల్య|
[61]"*ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య| త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ|(తై.ఆ.6.10)|అగ్నిం ధ్యాయామి*"
-ఇతి ధ్యాత్వా,

---

మొదలిడి తూర్పున కంతమగునట్లు స్థండిలముయొక్క దక్షిణార్ధమునందును, మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా ఒక్కొక్కరేఖను గీచి, ఆతర్వాత 'అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్' అని చెప్పుచు దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు ఒక్కొక్క రేఖను స్థండిలముయొక్క పశ్చిమార్ధమున, మధ్యన, పూర్వార్ధమందున వరుసగా గీచి, ఆ దర్భలను స్థండిలముపై నుంచవలెను (ఇట్లు రేఖలను గీయుటకే ఉల్లేఖన మని పేరు).

[57] అభ్యుక్షణతోయపాత్రలో అక్షతలు వేసి కొంచము నీటిని పోసికొని, ఆనీటిలో కొంచెం కుడి అఱచేతిలో పోసికొని 'అవాక్కరోభ్యుక్ష్య' అని చెప్పుచు ఆనీటిచే అధోముఖహస్తముతో స్థండిలమును ప్రోక్షించి, 'తృణం నైఋత్యాం నిరస్య' అనుచు ఆదర్భలను వేదిపైనుండి తీసి నైఋతికి పడవేసి, 'అప ఉపస్పృశ్య' అనుచు అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని తాకవలెను.

[58] **అగ్నినిధానమ్**: స్థండిలముపై "*ఓం భూర్భువస్సువరోమ్*"అని అగ్నిని ఉంచి, (ఈ అగ్నిని ఇద్దరు ముత్తైదువలు ఒక ఇత్తడి లేక కంచుతట్టలో తెచ్చి స్థండిలముపై నుంచిన తర్వాత కర్త ఆ తట్టలో అక్షతోదకమును వేయుట, అట్లు వేసిన తర్వాత వారా తట్టను వెన్కకు తీసికొనిపోవుట ఆచారము. (అప్పు డాస్త్రీలు కంఠమునకు గంధము రుద్దుకొని పోవుటగూడ పద్ధతిగా నున్నది. )

[59] **ఉదకపాత్రనినయనమ్**: అభ్యుక్షణతోయపాత్రలో మిగిలిన ఉదకమును చల్లివేసి, దానిలో అక్షతలువేసి, వెఱే జలమును నింపి, వేరొక పాత్రలో అక్షితలు వేసి, నీటిని నింపి, దానిని అగ్నికి తూర్పునగాని ఉత్తరమునగాని ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుండునట్లుగా నుంచవలెను. (ఇచ్చట తూర్పున నుంచుటయే ఆచారముగా నున్నది.)

60 సమిధల నీటితో ప్రోక్షించి 'అగ్నిమిధ్వా' అనుచు వాని నగ్నిలో వేసి అగ్నిని ప్రజ్వలింపజేసి,

61 **అగ్నిప్రార్థనా**: అంజలిని ఏటవాలుగా వంచి అగ్నివైపు చూపించుచు "*చత్వారి శృంగా త్రయో*"- అను మంత్రముతో అగ్నిని ధ్యానించి, ఆవాహన చేసి,

[62] *"ఓం ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః। స విజాయ మానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః।"- ప్రాఙ్ముఖాగ్నే మమాభి ముఖో భవ। సుముఖో భవ। సుప్రసన్నో భవ। వరదో భవ। యథోక్తజిహ్వయా హవి ర్గృహాణ।*

- ఇత్యగ్నిమావాహ్య। ప్రార్థ్య। అగ్నేః పురతోఽక్షతోదకం నినీయ।

[63]పరిసమూహ్య, *1. ఓం అగ్న యే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతై రలంకృత్య।

[64]ప్రాగగ్రైర్దర్భై రగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్।

---

62 **అగ్నిప్రార్థనా**: *"ఏష హి దేవః --- విశ్వతో ముఖః। ప్రాఙ్ముఖాగ్నే --హవిర్గృహాణ"* - అని చెప్పుచు అంజలిని తన హృదయము వైపు త్రిప్పుకొనుచు అగ్నిని తన కభిముఖముగా కమ్మని ప్రార్థించి, కుడిచేతిలో హరిద్రాక్షతోదకమును తీసికొని దానిని అగ్నికి తూర్పున విడువవలెను.

[63]**పరిసమూహనమ్**: 'పరిసమూహ్య' అనుచు తడిచేసికొన్న తన కుడిఅఱచేతితో అగ్ని చుట్టును తూర్పునుండి ప్రదక్షిణముగా నలికి, (**అలంకరణమ్:**) '*ఓం అగ్న యే నమః*' నుండి మొదలిడి '*ఓం విసర్పిణే నమః*' వరకు గల వాక్యములను చెప్పుచు ప్రదక్షిణముగా తూర్పు నుండి మొదలిడి 8 దిక్కులందును అగ్నిచుట్టును అక్షతల నుంచి,'*శ్రీయజ్ఞపురుషాయ నమః*' అనుచు అగ్నిమధ్య కొన్ని అక్షతలు వేసి, '*సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః*' - అనుచు సదస్యుల పై అక్షతలు వేయవలెను.

[64] **పరిస్తరణవిధిః**:పదహారేసి దర్భలతో కట్టిన నాల్గు పరిస్తరణలను అగ్నిచుట్టును ప్రదక్షిణ ముగా వేయవలెను. ఇట్లు తూర్పు, పశ్చిమములందు వేయు పరిస్తరణలను ఉత్తరాగ్రములు గను, దక్షిణోత్తరములందు వేయు పరిస్తరణలను పూర్వాగ్రములుగాను, తూర్పునుండి ఆరంభించి ప్రదక్షిణముగా వేసి, దక్షిణదిశలో వేసిన పరిస్తరణలను ప్రాక్పశ్చిమముగా వేసిన దర్భల మొదళ్లపై నుండునట్లును, ఉత్తరమున వేసిన పరిస్తరణలను ప్రాక్పశ్చిమముగా వేసిన దర్భల కొనల క్రిందికుండునట్లును సవరించవలెను.

[65]ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్దర్భాన్ సగ్గంస్తీర్య, ద్వంద్వం న్యఞ్చిపాత్రాణి ప్రయునక్తి। దర్వీమాజ్యస్థాలీమ్। ప్రోక్షణీమితరదర్వీం॥
[66]సమౌ సాగ్రౌ ద్వౌ దర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రే కృత్వా। తృణం కాష్ఠం వాంతర్ధాయ ఛినత్తి। న నఖేన। అప ఉపస్పృశ్య॥
[67]అద్భిరనుమృజ్య। ప్రోక్షణ్యామవధాయ। తస్యామప ఆనీయ। హస్తయోరఙ్గుష్ఠోప కనిష్ఠికాభ్యాం ఉత్తానాభ్యాం ఉదగగ్రే గృహీత్వా। ప్రాచీస్త్రిరుత్పూయ। అభిమన్త్ర్య। సపవిత్రేణ పాణినా పాత్రాణి సంమృశ్య। పాత్రాణ్యుత్తానాని కృత్వా। త్రిః ప్రోక్షతి। శేష ముత్సిచ్య। పునః పూరయిత్వా। (ప్రోక్షణీం) కించిద్దక్షిణతో నిధాయ॥

---

[65]**పాత్రాసాదనమ్**: అగ్నికి ఉత్తరమున 6-6 దర్భలను రెండువరుసలుగా పూర్వాగ్రముగా పఱచి, కుడి, ఎడమచేతులలో దర్వీని, ఆజ్యస్థాలీని జంటగా తీసికొని కుడివైపువరుస మొదట దర్వీని, ఎడమవైపువరుస మొదట ఆజ్యస్థాలీని బోర్లించి పెట్టవలెను. తర్వాత ప్రోక్షణీపాత్రను, ఇతరదర్వీని(స్రువమును) కుడి,ఎడమచేతులలో జంటగా తీసికొని క్రమముగా దర్వీ, ఆజ్యస్థాలీ లకు పైవైపు బోర్లించి యుంచవలెను. ఇట్లు హోమపాత్ర లుంచుటకే 'పాత్రాసాదన' మని పేరు.
[66] **పవిత్రకరణమ్:** కొనలతోగూడిన సమమగు పొడవుగల రెండుదర్భలను కలిపి ముడివేసి, ఆ దర్భల చివరనుండి మొదటికి జుత్తెడు పొడవుండునట్లుగా ఆదర్భల మొదళ్ళను గోళ్లతో త్రుంచక, ఒక సమిధ నడ్డముగా నుంచి త్రుంచి ఆయామతమును కట్టి, నీటిని తాకవలెను.
[67] **ప్రోక్షణీసంస్కారః:** ఆయామతమును జలముతో ముమ్మారు తుడిచి, ప్రోక్షణిని త్రిప్పిపెట్టి దానిలో నా ఆయామతమును వేసి, ప్రోక్షణిలో అక్షతలు వేసి ఉదకమును నింపి, రెండుచేతుల యొక్క బొటమనఉంగరపువ్రేళ్లచేత ఆయామతమును ఉత్తరమునకు కొనలుండునట్లు పట్టు కొని, పడమటినుండి తూర్పున కంతమగునట్లు ఆడించుచు మూడుసార్లు ప్రోక్షణిలోని నీటిని గీచి, ప్రోక్షణిపై కుడి అఱచేతిని బోర్లించి చూపి అభిమంత్రించి, ఆయామతముతో మిగితా పాత్ర లను తాకి, వానిని త్రిప్పి పెట్టి, మూడుసార్లు ఆయామతంతో ప్రోక్షణిలోని నీటిని ఆపాత్రలపై ప్రోక్షించి, ప్రోక్షణిలోని నీటిని చల్లి, అక్షతలు వేసి వేరే నీటినందులో నింపి, దానిని అగ్నికి కొంచెము దక్షిణముగా (దాదాపుగా నైఋతివైపు) పరిస్తరణలకు వెలుపల నుంచవలెను. ఈనీటితోనే మిగితా అగ్నిముఖము నంతయు పూర్తిచేయవలెను.

[68]ఆజ్యం విలాప్య।అపరేణాగ్నిం పవిత్రాంతర్హితాయామాజ్యస్థాల్యాం ఆజ్యం నిరూప్య। [69]ఉదీచోంఽగారాన్నిరూహ్య। తేష్వధిశ్రిత్య।[70]జ్వలతా తృణేనావద్యోత్య। తం విసృజ్య। అప ఉపస్పృశ్య। [71]ద్వే దర్భాగ్రే నఖాద్యనేన (అంగుష్ఠపర్వమాత్రం) సకృత్ప్రచ్ఛిద్య। అప ఉపస్పృశ్య। ప్రక్షాళ్య। యుగపదాజ్యపాత్రే ప్రత్యస్య (ఆజ్యే ప్రాశ్య)। ప్రాగాది ప్రదక్షిణం త్రిః పర్యగ్నిః కృత్వా। అప ఉపస్పృశ్య। ఉదగుద్వాస్య। [72]అంగారానగ్నౌ ప్రత్యూహ్య। ఆజ్యస్థాలీం స్వస్య పురస్తాన్నిధాయ।
[73]ఉదగగ్రాయామతేన పునరాహారమాజ్యం త్రిరుత్పూయ। [74]పవిత్రగ్రంథిం విస్రస్య। ప్రక్షాళ్య। ప్రాగగ్ర మగ్నౌ ప్రహరతి॥

---

[68] తెచ్చుకున్న నేతిని కరిగించి (విలాప్య=కరిగించి), ఆజ్యపాత్రలో ఆయామతమును వేసి, ప్రదక్షిణముగా తీసికొని వచ్చి అగ్నికి పడమట పరిస్తరణలకు వెలుపల తన ముందుంచుకొని, అందులో కరగించిన నేతిని పోసి (నిరూప్య= పోసి),

[69] ఉత్తరమువైపు అగ్నినుండి కొన్ని నిప్పులను వేఱుగా తీసికొని (నిరూహ్య=తీసికొని), వానిపై ఆ నేతిపాత్ర నెక్కించి (అధిశ్రిత్య=ఎక్కించి)

[70] ఒక దర్భను నిప్పుతో నంటించి, ఆ జ్వాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), తర్వాత ఆ దర్భను పారవేసి, నీరు ముట్టి,

[71] అంగుష్ఠపర్వప్రమాణముగ రెండు దర్భాగ్రముల నొకేపరి గోటితో గాక అన్యవిధముగా త్రుంచి (ప్రచ్ఛిద్య=త్రుంచి), నీరు ముట్టి, వానిని ప్రోక్షణిలోని నీటితో కడిగి ఏకకాలమున నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను జ్వలితదర్భచేత ప్రాగాదిగా ప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి, నీరు ముట్టి, ఆ దర్భను ఉత్తరమునకు పడవేసి (ఇట్లు జ్వలితదర్భచేత చుట్టుటకే పర్యగ్నికరణమని పేరు.)

[72] అగ్నినుండి వేఱుగా తీసిన నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, నేతిపాత్రను ప్రదక్షిణముగా తీసికొని వచ్చి తన ముందుంచుకొని,

[73] ఉత్తరాగ్రాయామతంతో మూడుసార్లు తూర్పునుండి మొదలిడి తూర్పునకే అంతమగు నట్లు నేతిపాత్రలోని నేతిని గీచి (ఇదియే ఉత్పూరణము),

[74] ఆజ్యపాత్రలోని ఆయామతమును వెలికి దీసి, దాని ముడిని విప్పి, ఆదర్భలను ప్రోక్షణీజలముతో కడిగి, కొనలు తూర్పుదిశగా నుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

[75]దర్వ్యౌ నిష్టప్య। త్రిభిః దర్భైః సంమృజ్య। పునర్నిష్టప్య। ప్రోక్ష్య। నిధాయ। దర్భానద్భిః సంస్పృశ్య। అగ్నౌ ప్రహరతి॥

[76] "*ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।*"- ఇతి సోదకేన ప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య। "*అదితేఽనుమన్యస్వ*" (ఇతి దక్షిణతః ప్రాచీనమ్), "*అనుమతేఽనుమన్యస్వ*"(ఇతి పశ్చాదుదీచీనమ్), "*సరస్వతేఽనుమన్యస్వ*" (ఇత్యుత్తరతః ప్రాచీనమ్), "*దేవసవితః ప్రసువ*" (ఇతి సమంతతః) పరిషిచ్య॥ [77]తతః ప్రధానదర్వ్యా చతుర్గృహీతేనాజ్యేన

---

[75] **స్రుక్స్రువసంస్కారః:** ప్రధానదర్వీని(స్రుక్కును) ఎడమచేత, ఇతరదర్వీని (స్రువమును) కుడిచేత ఒకేసారి తీసికొని, వాని నగ్నిపై కాచి (నిష్టప్య=కాచి, వేడిచేసి), ఆరెండింటిని ఎడమచేతిలో పట్టుకొని, మూడుదర్భలతో కుడిచేత ప్రాగంతముగా వానిని తుడిచి, మళ్లీ వానిని రెండు చేతులలో పట్టుకొని కాచి, తుడిచిన దర్భలతో ప్రోక్షణిలోని జలమును వానిపై ప్రోక్షించి, ఆజ్యపాత్రకు ఎడమవైపు స్రుక్కును కుడికి స్రువమును ఉంచి, సమ్మార్జనము చేసిన దర్భలను ప్రోక్షణిలోని నీటితో తాకి, వాని నగ్నియందు ప్రాగగ్రముగా వేయవలెను.

[76] **పూర్వపరిషేచనమ్:** గాయత్రీమంత్రముతో అగ్నిచుట్టును తడిచేతితో ప్రదక్షిణముగా నలికి, "*అగ్నిం పరిషించతి*" అని చెప్పి, ఎడమచేత ప్రోక్షణిని తాకుచు, కుడిచేత ప్రోక్షణిలోని నీటితో "*అదితేఽనుమన్యస్వ*"- అనుచు దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, "*అనుమతేఽనుమన్యస్వ*"- అనుచు పశ్చిమమందు దక్షిణమునుండి ఉత్తరమునకు, "*సరస్వతేఽనుమన్యస్వ*" -అనుచు ఉత్తరమునందు పడమటినుండి తూర్పునకు, "*దేవసవితః ప్రసువ*"- అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని పరిషేచనము చేయవలెను.

[77]తరువాత నాల్గేసిసార్లు నేతిని ఇతరదర్వితో ప్రధానదర్విలోనికి తీసికొనుచు "*ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।*"- అని హోమము చేయవలెను. ఇంతవరకు చేయు కార్యములకు పూర్వతంత్రమని పేరు. ఇది ముగిసిన పిమ్మట ఉద్దిష్టప్రధానకర్మకు ఏయే హోమములు నిర్ణీతమైనవో వానిని చేయవలెను. అవి మునుముందు ఆయా ప్రధానకర్మలనుగుఱించి వ్రాసినప్పుడు అక్కడ చెప్పబడును. ప్రధానహోమానంతరము అనాజ్ఞాతాది, సర్వప్రాయశ్చిత్త హోమములను చేసి, ఉత్తరపరిషేచనమును చేసి, చిట్టచివరకు అగ్న్యుపస్థానమును చేసి హోమక్రియను ముగించవలెను.

*ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ।"*

ఇతి హుత్వా। యథోపదేశం ప్రధానాహుతీర్ హుత్వా। అనాజ్ఞాతాదిహోమం, సర్వ ప్రాయశ్చిత్తహోమం, ఉత్తరపరిషేచనం,అగ్న్యుపస్థానం చ కుర్యాత్॥

## అనాజ్ఞాతాదిహోమః

ప్రాణానాయమ్య, *"అస్మిన్-----హోమకర్మణి సంభావిత జ్ఞాతాజ్ఞాతాది సకలదోష నిర్హరణార్థం అనాజ్ఞాతాదిహోమం కరిష్యే"*- ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యమాదాయ జుహుయాత్।

1. *అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ త్వగ్ం హి వేత్థ యథాతథగ్గ్ స్వాహా। అగ్నయ ఇదం న మమ। (తై.బ్రా. 3.7.11)*
2. *పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః। అగ్నే తదస్య కల్పయ త్వగ్ం హి వేత్థ యథాతథగ్గ్ స్వాహా। అగ్నయ ఇదం న మమ। (తై.బ్రా. 3.7.11)*
3. *యత్పాకత్రా మనసా దీనదక్షాన యజ్ఞస్య మన్వతే మర్తాసః। అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి స్వాహా। అగ్నయ ఇదం న మమ।*
4. *త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽవ యాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా। అగ్నీవరుణాభ్యామిదం న మమ। (తై.మం.పా 1-4)*
5. *స త్వన్నో అగ్నే ఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవ యక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా। అగ్నీవరుణాభ్యామిదం న మమ। (తై.మం.పా 1-4)*
6. *యత ఇన్ద్ర భయామహే। తతో నో అభయం కృధి। మఘవఞ్ఛగ్ధి తవ తన్న ఊతయే। విద్విషో విమృధో జహి స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥ (తై.బ్రా. 3.7.11)*
7. *స్వస్తిదా విశస్పతిః। వృత్రహా విమృధో వశీ। వృషేన్ద్రః పుర ఏతు నః। స్వస్తిదా అభయఙ్కర స్స్వాహా। ఇన్ద్రాయాభయంకరాయేదం న మమ॥ (తై.బ్రా. 3.7.11)*

*8. ఆభిర్గీర్భిర్యదతోన ఊనమ్। ఆప్యాయయ హరివో వర్ధమానః। యదాస్తోతృభ్యో మహి గోత్రారుజాసి। భూయిష్ఠభాజో అధ తే స్యామ స్వాహా। ఇంద్రాయ హరివత ఇదం న మమ। (తై.బ్రా. 3.7.11)*

*9.త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్। ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్స్వాహా। త్ర్యంబకాయేదం న మమ। (తై.ఆ. 6.56)*

**అప ఉపస్పృశ్య (ప్రోక్షణిలోని నీటిని తాకవలెను)**

*10. ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే స్వాహా। విష్ణవ ఇదం న మమ। (తై.సం.1.2.13)*

*11. ఓం భూస్స్వాహా। అగ్నయ ఇదం న మమ॥*

*12. ఓం భువస్స్వాహా। వాయవ ఇదం న మమ॥*

*13. ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం న మమ॥*

*14. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ॥*

## సర్వప్రాయశ్చిత్తహోమః

[78]ప్రాణానాయమ్య, "*అస్మిన్----హోమకర్మణి మధ్యే సంభావిత మన్త్ర-తంత్ర-స్వర-వర్ణ-విధివిపర్యాస-న్యూనాతిరిక్త-దోష-ప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం హోష్యామి*"- ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యమాదాయ జుహుయాత్

*15. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ॥*

*16. శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం న మమ॥*

---

[78] మరల ప్రాణాయామము చేసి, ‘ *అస్మిన్-----హోమకర్మణి మధ్యే సంభావిత మన్త్రతంత్ర-స్వరవర్ణవిధివిపర్యాసన్యూనాతిరిక్తదోషప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం కరిష్యే*’ అని గీతలుంచినచోట ప్రధానకర్మపేరును చెప్పుచు సంకల్పించి, స్రువముతో నేతిని తీసికొనుచు క్రింద నిచ్చిన 15,16 మంత్రములతో సర్వప్రాయశ్చిత్తహోమమును చేయవలెను.

## ఉత్తరపరిషేచనమ్

[79]పునః ప్రాణానాయమ్య,

*"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- ఇతి దక్షిణతః ప్రాచీనమ్,

*"అనుమతేఽన్వమగ్గ్ స్థాః"* - ఇతి పశ్చాదుదీచీనమ్,

*"సరస్వతేఽన్వమగ్గ్ స్థాః"*- ఇత్యుత్తరతః ప్రాచీనమ్,

*"దేవ సవితః ప్రాసావీః"* - ఇతి సమంతమగ్నిం పరిషిచ్య|

## అగ్న్యుపస్థానమ్

[80] *"ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్/ విశ్వాని దేవ వయునాని విద్వాన్/ యుయోధ్యస్మజ్జుహురాణమేనః/ భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ/ ప్రవశ్శుక్రాయ భానవే భరధ్వమ్/ హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్/ యో దైవ్యాని మానుషా జనూగ్ంషి/ అన్తర్విశ్వాని విద్మనా జిగాతి/ అచ్ఛా గిరో మతయో దేవయన్తీః/ అగ్నిం యన్తి ద్రవిణం భిక్షమాణాః/ సుసందృశగ్ం సుప్రతీకగ్ం స్వంచమ్/ హవ్యవాహ మరతిం మానుషాణామ్/ అగ్నే త్వమస్మద్యుయోధ్యమీవాః/ అనగ్నిత్రా అభ్యమన్త కృష్టీః/ పునరస్మభ్యగ్ం సువితాయ దేవ/ క్షాం విశ్వేభిరజరేభిర్యజత్ర/ అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్/ స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా/ పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ/ భవా*

---

[79] మరల ప్రాణాయామమును చేసి, ప్రోక్షణిని ఎడమచేతితో తాకుచు, కుడిచేతిలో ప్రోక్షణిలోని నీటిని పోసికొని *"అదితేఽన్వమగ్గ్స్థాః"*- అని దక్షిణమునందు పడమటి నుండి తూర్పునకు, *"అనుమతేఽన్వమగ్గ్స్థాః"* - అని పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽన్వమగ్గ్స్థాః"*- అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవ సవితః ప్రాసావీః"*- అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని పరి షేచనము చేయవలెను. దీనికే ఉత్తరపరిషేచన మని పేరు.

[80] తర్వాత కర్త లేచి నిలబడి సాంజలియై, 'అగ్నే నయ సుపథా రాయే' ఇత్యాది మంత్రములను చెప్పి, 'మంత్రహీనం క్రియాహీనం', 'ప్రాయశ్చిత్తాన్యశేషాణి' అను శ్లోకములను చెప్పి, తన ప్రవరను చెప్పి అగ్నికి మ్రొక్కి , 'శ్రీకృష్ణాయ నమః' అని పదిసార్లు జపించి కూర్చొనవలెను.

*తోకాయ తనయాయ శంయోః। ప్రకారవో మననా వచ్యమానాః। దేవద్రీచీం నయథ దేవయన్తః। దక్షిణావాడ్వాజినీ ప్రాచ్యేతి। హవిర్భరన్త్యగ్నయే ఘృతాచీ।"* (తై.బ్రా.2.8.2)

> *మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన।*
> *యద్ధుతంతు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥*
> *ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మికాని వై।*
> *యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్॥*

"అభివాదయే ---" ఇతి గోత్రర్షినామయుతప్రవరముక్త్వా అభివాద్య ఉపవిశేత్.



# విచ్ఛిన్నౌపాసనాగ్నిసంధానమ్

(వివాహానంతరము గృహస్థుడు ఆవివాహాగ్నిని తనగృహమునకు గొనిపోయి, అది చల్లారకుండ పరిరక్షించుకొని, అందులో సాయంప్రాతఃకాలములు పత్నీసమేత ముగా ఔపాసనమును చేయవలెనని గృహ్యసూత్రములు తెల్పుచున్నవి. ఆ అగ్ని నష్ట మైనచో ఉపవాసాది ప్రాయశ్చిత్తములు చేసికొని, అగ్నిని పునఃపరికల్పించి అందులో ఔపాసనమును చేయవలెనని శాస్త్రము. ఇట్లు విచ్ఛిన్నమైన అగ్నియొక్క పునఃపరి కల్పనవిధాన మీ అధ్యాయములో వివరింపబడినది. ఈవిధానమునకే పునస్సంధాన మని ఇంకొకపేరు.

శ్లో॥ ఆత్మార్థం చైవ దారార్థ ముభయార్థం చ సర్వథా।
కుర్యాదౌపాసనే వహ్నౌ, పరార్థం లౌకికానలే॥

అనగా గృహస్థుడు తనకుగాని, దంపతుల కిర్వురికి గాని ఫలము చెందునట్టి పుంస వన, గర్భాధాన, సీమంతాది స్మార్తకర్మలను ఔపాసనాగ్నిలో చేసికొనవలెను. అన్యు లకు ఫలముచెందునట్లుగా తానాచరించు చౌలోపనయనములవంటి కర్మలను లౌకి కాగ్నిలో చేయవలెనని పైశ్లోకము తెల్పుచున్నది. అందుచేత తనకుగాని, దంపతుల కిద్దరికిగాని చేసికొనవలసిన స్మార్తకర్మలకై ఈ పునస్సంధాన మవసరమగుచున్నది. అంతేకాక ఆబ్దికాదిపితృకర్మలను, గృహప్రవేశాదులను కూడ ఔపాసనాగ్నిలోనే చేయవలెను.)

ప్రయోగః:[81]అథ కర్తా పాణిపాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, భార్యయా సహ గోమయేనోప లిప్తం రంగవల్ల్యాద్యలంకృతం శుచిప్రదేశం ప్రాప్య, హరిద్రాక్షతాదక్షిణాతాంబూల సహితం పాత్రం గృహీత్వా, పూర్వాభిముఖో భూత్వా,

---

[81] కర్త కాలుసేతులను కడిగికొని, ఆచమించి, భార్యతో సహ గోమయముతో నలుకబడి, ముగ్గులచే నలంకృతమైన శుచియైన ప్రదేశమును ప్రవేశించి, పసుపు అక్షతలు, తాంబూలదక్షి

*"ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై/ (తై.సం.3.2.4.14)/సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యాస్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్/ (తై.బ్రా.1.2.1.26)/ సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః/"* - ఇతి ప్రణమ్య,

*"అశేషే హే పరిషత్/ భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ఆవయోః విచ్ఛిన్నౌపాసనాగ్నిసన్ధానం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు", "యోగ్యతాసిద్ధిరస్తు"* - ఇత్యనుజ్ఞాప్య, దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః, ప్రాణానా-యమ్య ,

**సంకల్పః:** *"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయాప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవంగుణవిశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం విచ్ఛిన్నౌపాసనాగ్నిం పునస్సన్ధాస్యే/ తద్ నిర్విఘ్నపరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్య /"*- ఇతి సంకల్ప్య, విష్వక్సేనారాధనం కృత్వా,

---

ణలు గల పాత్రను పట్టుకొని తూర్పుముఖముగా నిలుచుండి, "*ఓం నమస్సదసే----శ్రీవైష్ణవేభ్యో నమః/*" వఱకు చెప్పి పరిషత్తుకు ప్రణమించి, *"అశేషే హే పరిషత్ -----అనుగ్రహాణ"* - పర్యంతము చెప్పి, "*తథాస్తు/ యోగ్యతాసిద్ధిరస్తు*" - అని పరిషదనుజ్ఞను పొంది, దర్భలపై కూర్చొని, రెండు దర్భలతో కట్టిన పవిత్రమును ధరించి, భార్యతో సహ పీటలపై పూర్వముఖముగ కూర్చొని, *"హరిరోం తత్సత్-----విష్వక్సేనారాధనం కరిష్య "*- అని సంకల్పించి మొదట 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధనము చేయవలెను.

## ప్రాజాపత్యకృచ్ఛ్రమ్

[82]కర్తా ప్రాణానాయమ్య, *"పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అనేకకాలసాయంప్రాతరాహుతీనాం అకరణప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రప్రతి నిధి యత్కించిద్ధిరణ్యదానం కరిష్యే "*
- ఇతి సంకల్ప్య, హిరణ్యమక్షతైస్సహ గృహీత్వా

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*ఇదమనేకకాలసాయంప్రాతరాహుతీనాం అకరణప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్యకృచ్ఛ్ర ప్రతినిధి యత్కించిద్ధిరణ్యం నానాగోత్రేభ్యః శ్రీవైష్ణవేభ్యః తేభ్యః సంప్రదదే నమమ "*-
ఇత్యక్షతోదకేన భూమౌ తర్పయిత్వా శ్రీవైష్ణవేభ్యో దద్యాత్.

## స్థాలీపాకాకరణప్రాయశ్చిత్తమ్

[83] పునః ప్రాణానాయమ్య, *"పూర్వోక్తఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అనేకదర్శపూర్ణమాసస్థాలీపాకాకరణప్రాయశ్చిత్తార్థం ఆజ్యసహితహోమద్రవ్య తణ్డులదానం కరిష్యే "* - ఇతి సంకల్ప్య

*తండులావైశ్వదేవత్యాః పాకేనాన్నం పచంతి యే।*
*తస్మాత్తండులదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

---

[82] తదుపరి కర్త చాలా కాలమునుండి ఔపాసన చేయనందుకు ప్రాయశ్చిత్తరూపకముగా ప్రాజాపత్యకృచ్ఛ్రమును హిరణ్యదానరూపకముగా చేయవలెను. దీనికై కర్త ప్రాణాయామము చేసి, *"పూర్వోక్త .... కరిష్యే "* - అని సంకల్పించి, *"హిరణ్యగర్భగర్భస్థం... "* అను శ్లోకమును చెప్పి దక్షిణను అక్షతోదకముతో సహ భూమిపై విడిచి దానిని శ్రీవైష్ణవులకు దానమీయవలెను.

[83]తరువాత కర్త చాలా కాలమునుండి దర్శపూర్ణమాసలయందు స్థాలీపాకము చేయనందుకు ప్రాయశ్చిత్తముగా ఆజ్యసహిత తణ్డులములను దానమీయవలెను. దీనికై కర్త ప్రాణాయామము చేసి, *"పూర్వోక్త.....కరిష్యే "*- అని సంకల్పము చెప్పి, ఒక ఆకులో బియ్యమును, నేతిని, దక్షిణ నుంచి, *"తణ్డులావైశ్వదేవత్యాః.....నమమ "* - అని చెప్పి దానమీయవలెను.

*కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషు సంస్థితమ్।*
*దేవానామాజ్యమాహార మతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*
*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*ఇదమనేకకాలదర్శపూర్ణమాసస్థాలీపాకాకరణప్రాయశ్చిత్తార్థం ఆజ్యసహితహోమ ద్రవ్యతణ్డులం ----గోత్రాయ ----శ్రీవైష్ణవాయ తుభ్యమహం సంప్రదదే న మమ"* - ఇతి ఆజ్యసహితతణ్డులదానం కుర్యాత్.

## అయాశ్చహోమః

[84]ద్విః ప్రాణానాయమ్య, *"పూర్వోక్త ఏవం గుణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అనయా మమ ధర్మపత్న్యాసహ విచ్ఛిన్నౌపాసనాగ్నిం పునస్సన్ధాస్యే। తదంగమగ్నిప్రతిష్ఠాపనం కరిష్య ।"*- ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

- ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, పూర్వపరిషేచనాంతం చతుష్పాత్రప్రయోగం కృత్వా, *"ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।"*- ఇతి స్రువేణ హుత్వా,

[85]పునః ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ఉపవాసా*

---

[84]రెండుసార్లు (ఒకటి తనకొఱకు, ఇంకొకటి భార్యకొఱకు) ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం---విచ్ఛిన్నౌపాసనాగ్నిం పునస్సన్ధాస్యే। తదంగమగ్ని ప్రతిష్ఠాపనం కరిష్య।"*- అని సంకల్పించి, *స్వశేష భూతేన మయా---ప్రక్రమతే స్వయమ్'* అని సాత్త్వికత్యాగమును చేసి, స్థండిలమును కల్పించి, 'చతుష్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా పూర్వపరిషేచనాంతము చేసి, స్రువములోని కొకసారి నేతిని తీసికొని భార్య తనను తాకుచుండగా, '*ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ'* అని హోమము చేయవలెను.

[85]మఱల ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా----ప్రాయశ్చిత్తార్థం అయాశ్చహోమం హోష్యామి"*- అని సంకల్పించి, చతుర్గృహీతాజ్యముతో 1-6 మంత్రములతో అయాశ్చహోమ

*కరణప్రాయశ్చిత్తార్థం అయాశ్చహోమం హోష్యామి"- ఇతి సంకల్ప్య, చతుర్గృహీతే* నాజ్యేన జుహుయాత్.

1. *ఓం అయాశ్చాగ్నే౽స్యనభిశస్తీశ్చ సత్యమిత్త్వమయా అసి। అయసా మనసా ధృతో౽యసా హవ్యమూహిషే౽యా నో ధేహి భేషజగ్గ్ స్వాహా। అగ్నయ యే అయస ఇదం న మమ। (తై.మం.పా.1.5)*
2. *ఓం పునస్త్వా౽దిత్యారుద్రావసవస్సమింధతాం పునర్బ్రహ్మాణో వసునీథ యజ్ఞైః। ఘృతేన త్వం తనువో వర్ధయస్వ సత్యాస్సంతు యజమానస్య కామాస్స్వాహా। అగ్నయ యే వసునీథాయేదం న మమ। (తై.సం.4.2.3)*
3. *ఓం మనో జ్యోతిర్జుషతామాజ్యం విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమం దధాతు। యా ఇష్టా ఉషసో నిమ్రుచశ్చ తాస్సందధామి హవిషా ఘృతేన స్వాహా। మనసే జ్యోతిష ఇదం న మమ। (తై.సం.1.5.3)*
4. *ఓం యస్మిన్ ఆత్మనో మిన్దా౽భూదగ్నిస్తత్పునరాహార్జాతవేదా విచర్షణి స్స్వాహా। అగ్నయ యే జాతవేదస ఇదం న మమ। (తై.సం.3.2.5)*
5. *ఓం పునరగ్ని శ్చక్షురదాత్ పునరిన్ద్రో బృహస్పతిః। పునర్మే అశ్వినా యువం చక్షు రాధత్తమక్ష్యోస్స్వాహా। అగ్నీన్ద్రబృహస్పత్యశ్విభ్య ఇదం న మమ। (తై.సం.3.2.5)*
6. *ఓం తన్తుం తన్వన్ రజసో భానుమన్విహి జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్। అనుల్బణం వయత జోగువామపో మనుర్భవ జనయా దైవ్యం జనగ్గ్ స్వాహా। అగ్నయ యే తంతుమత ఇదం న మమ। (తై.సం.3.4.2)*

## సాయంప్రాతరాహుతీనామకరణప్రాయశ్చిత్తహోమః

పునః ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అస్మిన్విచ్ఛిన్నాగ్ని కర్మణి అనేకకాలసాయంప్రాతరాహుతీనామకరణ ప్రాయశ్చిత్తార్థం సర్వ*

---

మును చేయవలెను (వివరణ: ఔపాసనాగ్నినష్టమైనందున కర్త విహితోపవాసములను, ప్రాయశ్చిత్తములను చేసికొని, పునస్సంధానము చేసి, ఔపాసనము చేయవలెను. ఇట్లుపవాసములను చేయనందున, దానికి ప్రాయశ్చిత్తరూపముగ అయాశ్చహోమము చేయుచున్నాడు.)

*ప్రాయశ్చిత్తహోమం హోష్యామి"*- ఇతి సంకల్ప్య,

*ఓం భూర్భువస్సువస్స్వాహా/ ప్రజాపతయ ఇదం న మమ/*

[86]-ఇతి స్రువేణాజ్యమాదాయ హుత్వా,

## దర్శపూర్ణమాసస్థాలీపాకాకరణప్రాయశ్చిత్తహోమః

[87]పునః ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అస్మిన్విచ్ఛిన్నాగ్నికర్మణి అనేకకాలదర్శపూర్ణమాసస్థాలీపాకాకరణ ప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం హోష్యామి"*- ఇతి సంకల్ప్య,

*ఓం భూర్భువస్సువస్స్వాహా/ ప్రజాపతయ ఇదం న మమ/*

- ఇతి స్రువేణాజ్యమాదాయ హుత్వా, పుర్వోక్తప్రకారేణ (పుటసంఖ్యా 75-78) అనాజ్ఞాతహోమం, సర్వ ప్రాయశ్చిత్తహోమం, ఉత్తరపరిషేచనం, అగ్న్యుపస్థానం చ కుర్యాత్.



[86]మఱల ప్రాణాయామము చేసి, చాలాకాలమునుండి సాయంప్రాతస్సమయములందు అగ్నికాహుతు లియ్యనందున ఈహోమమును '*ఓం భూర్భువస్సువస్స్వాహా/*' అను మంత్రముతో స్రువముతో నొకసారి నేతిని తీసికొని చేయుచున్నాడు.

[87] కర్త మఱల ప్రాణాయామమును చేసి, అనేకదర్శపూర్ణమాసలందు స్థాలీపాకము చేయనందువలన 'దర్శపూర్ణమాసస్థాలీపాకాకరణప్రాయశ్చిత్తహోమము'ను చేయవలెను. ఇట్లు చేసి, చతుష్పాత్రప్రయోగములో (పుటలు 75-76) చెప్పినట్లుగా అనాజ్ఞాతాది, సర్వప్రాయశ్చిత్త హోమములను చేసి, అగ్న్యుపస్థానమును చేసి ముగించవలెను. ఈహోమములు చేయునప్పుడు సంకల్పములో *"అస్మిన్ విచ్ఛిన్నాగ్నిసంధానహోమ కర్మణి"* అని చెప్పవలెను.

# ఔపాసనవిధిః

(వివాహహోములో ఆగ్నేయస్థాలీపాకానంతరము ఆఅగ్నిని సంరక్షించుకొని గృహస్థుడు నిత్యమును ప్రొద్దున, సాయంతన మాయగ్నిలో ఔపాసనచేయుచుండవలెను. ఇట్టి అగ్ని నష్టమైన యెడల 'విచ్ఛిన్నౌపాసనాగ్ని సంధానము' అను ఆధ్యాయములో చెప్పి నట్లుగా అగ్నిని పునస్సంధానము చేసి, అవసరమైన ప్రాయశ్చిత్తాదులను చేసి, అదే అగ్నితో ఔపాసనమును చేయవలెను. గమనిక: విచ్ఛిన్నాగ్ని సంధానమును, ఔపాస నమును రెంటిని వెనువెంటనే చేయుచున్నచో, విచ్ఛిన్నాగ్ని సంధానమును ఉత్తరపరి షేచనాంతము చేసి, ఆతర్వాత ఇక్కడ చెప్పబడిన 'అగ్నిప్రతిష్ఠా' అను భాగమును విడిచి పెట్టి, సంకల్పానంతరము నేరుగా 'ఔపాసనమ్' అను భాగమును పూర్తిచేసి, ఆతర్వాత అగ్న్యుపస్థానమును, అభివాదనము చేసి ముగించవలెను. ఒకవేళ కర్త సమిత్సమారోపణమును గాని, ఆత్మసమారోపణమును గాని చేసికొనియుండినచో, సంకల్పానంతరము ఇచ్చట చెప్పి నట్లుగా అగ్నిప్రతిష్ఠ చేసి, 'ఆరోపితాగ్ని నివేశనమ్' అను భాగములో చెప్పబడిన సమిత్సమారోపణ లేదా ఆత్మసమారోపణకై చెప్పబడిన మంత్రముచే ఆరోపితాగ్నిని ప్రస్తుతము ప్రతిష్ఠించినట్టి అగ్నిలో నావేశింపజేసి, పూర్వ పరిషేచనమును, ఔపాసనహోమమును,అగ్న్యుపస్థానములను చేసి ముగించవలెను.)

## ఔపాసనసంకల్పః

[88]ప్రాణానాయమ్య, *"అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం పూర్వేద్యుస్సాయమౌపాసనం, అద్య ప్రాతరౌపాసనం చ మమ ధర్మపత్నీ సమేతో ఽహం తణ్డులైర్హోష్యామి"*- ఇతి సంకల్ప్య, పత్న్యర్థం పునః ప్రాణాయామం కృత్వా,

---

88 కర్త భార్యాసమేతముగా అగ్నికి పశ్చిమమున పీటలపై కూర్చుండి, ప్రాణాయామమును చేసి, *" అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం పూర్వేద్యుస్సాయమౌపాసనం, అద్య ప్రాతరౌపాసనం చ మమ ధర్మపత్నీ సమేతోఽహం తణ్డులైర్హోష్యామి"*- అని సంకల్పించి , *"చత్వారి శృంగా త్రయో ---ఆవివేశ॥"*- అను మంత్రముతో క్రిందికి ఏటవాలుగా వంచిన అంజలిని అగ్నివైపు చూపి అగ్ని నావాహన చేసి,

## అగ్నిప్రతిష్ఠా

[89] గోమయేనోపలిప్తే శుచౌ దేశే, శ్వేతతండులచూర్ణేన సమం చతురస్రం స్థండిలం కల్పయిత్వా, [90]ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్।

[91]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య,[92]"*ఓం భూర్భువస్సువరోమ్*"- ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య। ఉత్సృచ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్।

---

[89]**స్థండిలకల్పనమ్:** అగ్నిప్రతిష్ఠాపనకై గోమయముతో నలుకబడి రంగవల్ల్యాద్యలంకృతమైన శుచియైన ప్రదేశమున కొంచెము బియ్యముపిండిని నెరిపి చతురశ్రస్థలమును హోమార్థమై కల్పించవలెను. ఈ స్థలమునకే స్థండిలమని పేరు.

[90] **ఉల్లేఖనమ్**: పిదప రెండుదర్భలను సగమునకు మడచి చివరలు క్రిందికుండునట్లుగా పట్టుకొని వానితో 'ప్రాచీః పూర్వ ముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్' అని చెప్పుచు పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు స్థండిలముయొక్క దక్షిణార్ధమునందును, మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా ఒక్కొక్కరేఖను గీచి, ఆతర్వాత 'అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్' అని చెప్పుచు దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు ఒక్కొక్క రేఖను స్థండిలముయొక్క పశ్చిమార్ధమున, మధ్యన, పూర్వార్ధమందున వరుసగా గీచి, ఆ దర్భలను స్థండిలముపై నుంచవలెను (ఇట్లు రేఖలను గీయుటకే ఉల్లేఖన మని పేరు).

[91] అభ్యుక్షణతోయపాత్రలో అక్షతలు వేసి కొంచము నీటిని పోసికొని, ఆనీటిలో కొంచెం కుడి అఱచేతిలో పోసికొని 'అవాక్కరోభ్యుక్ష్య' అని చెప్పుచు ఆనీటిచే అధోముఖహస్తముతో స్థండిలమును ప్రోక్షించి, 'తృణం నైఋత్యాం నిరస్య' అనుచు ఆదర్భలను వేదిపైనుండి తీసి నైఋతికి పడవేసి, 'అప ఉపస్పృశ్య' అనుచు అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని తాకవలెను.

[92]స్థండిలముపై "*ఓం భూర్భువస్సువరోమ్*" అని అగ్నిని ఉంచి, అభ్యుక్షణతోయపాత్రలో మిగిలిన ఉదకమును చల్లివేసి, దానిలో అక్షతలువేసి, వెఱే జలమును నింపి, వేరొకదొప్పలో అక్షతలు వేసి దానిలో ఉదకమును నింపి దానిని అగ్నికి తూర్పున గాని ఉత్తరమునగాని ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుండునట్లుగా నుంచవలెను. (ఇచ్చట తూర్పున నుంచుటయే ఆచారముగా నున్నది.)

[93]అగ్నిం ప్రజ్వాల్య|

*ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య| త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ|(తై.ఆ.6.10)|అగ్నిం ధ్యాయామి|* - ఇత్యగ్నిం ధ్యాత్వా,

*" ఓం ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః| స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః|"- ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ| సుముఖో భవ| సుప్రసన్నో భవ| వరదో భవ|"*

[94] -ఇతి ప్రార్థ్య, అగ్నేః పురతోఽక్షతోదకం నినీయ,

[95]*" ఓం భూర్భువస్సువః| తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి| ధియో యో నః ప్రచోదయాత్|"*- ఇతి సోదకేన ప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య,

[96]*" ఓం అగ్న యే నమః| ఓం జాతవేదసే నమః| ఓం సహోజసే నమః| ఓం అజిరా ప్రభవే నమః| ఓం వైశ్వానరాయ నమః| ఓం నర్యాపసే నమః| ఓం పఙ్క్తి రాధసే నమః| ఓం విసర్పిణే నమః|* - ఇత్యేతైః నమోన్తైః ప్రదక్షిణం ప్రాగాద్యష్టదిక్షు స్థణ్డిలాదేకాదశాఙ్గులే దేశే పుష్పాక్షతైరగ్నిం పరితోఽలంకృత్య, *"శ్రీయజ్ఞపురుషాయ నమః|"*– ఇత్యక్షతై

---

93 తర్వాత 'అగ్నిమిధ్వా' అనుచు నీటితో ప్రోక్షించిన సమిధలను వేసి అగ్నిని ప్రజ్వలింపజేసి,

94 *"ఏషహి దేవః --విశ్వతోముఖః| ప్రాఙ్ముఖాగ్నే ---హవిర్గృహాణ|"* - అని చెప్పుచు అంజలిని తన హృదయమువైపు త్రిప్పికొనుచు అగ్నిని తన కభిముఖముగా కమ్మని ప్రార్థించి, కుడి అఱ చేతిలో అక్షతలను ఉదకమును తీసికొని నైఋతిమూల నుండి మొదలిడి మఱల నైఋతివఱకు అగ్ని చుట్టును ఆ చేతిని ప్రదక్షిణముగా త్రిప్పి, ఆ అక్షతోదకము నక్కడ భూమిపై వదలివేసి,

95 *"ఓం భూర్భువస్సువః--"* అను మంత్రముతో ప్రదక్షిణముగా అగ్ని చుట్టును తడిచేతితో నలికి,

96 *"ఓం అగ్న యే నమః| జాతవేదసే నమః| సహోజసే నమః| అజిరాప్రభవే నమః| వైశ్వానరాయ నమః| నర్యాపసే నమః| పఙ్క్తి రాధసే నమః| విసర్పిణే నమః|"*- అని చెప్పుచు, క్రమముగా అగ్ని చుట్టును తూర్పునుండి మొదలిడి 8 దిక్కులందును అక్షతలు, పూవుల నుంచి వేదిక నలంక రించి, *"శ్రీయజ్ఞపురుషాయ నమః|"* - అని అగ్నిమధ్య అక్షతలు వేసి,

రగ్నిమధ్యే సంపూజ్య,[97]ప్రాగగ్రైర్దర్భై రగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణా నుత్తరాన్। ఉత్తరానధరాన్।

## ఆరోపితాగ్ని నివేశనమ్

[98]ఆత్మసమారోపణే: యది కర్తా ఆత్మసమారోపణం కృతవాన్,

*ఉపావరోహ జాతవేదః పునస్త్వమ్।దేవేభ్యో హవ్యం వహ నః ప్రజానన్న్।*

*ఆయుః ప్రజాగ్ం రయి మస్మాసు ధేహి।అజస్రో దీదిహి నో దురోణే।* (తై.బ్రా.2.5.8)

ఇతి కర్తృహృదయస్థాగ్ని మేకం సమిధేనావాహ్య, తం లౌకికాగ్నౌ ప్రహరేత్.

[99]సమిత్సమారోపణే: యది కర్తా సమిత్సమారోపణం కృతవాన్,

*ఆజుహ్వానస్సుప్రతీకః పురస్తాదగ్నే స్వాం యోని మాసీదసాధ్యా।*

*అస్మిన్త్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వేదేవా యజమానశ్చసీదత।* (తై.సం.4.7.13)

*ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యేనమిష్టాపూర్తే సగ్ంసృజేథామయం చ।*

*పునః కృణ్వగ్గ్ స్త్వాపితరం యువానమన్వాతాగ్ం సీత్త్వయి తన్తు మేతమ్।*

(తై.సం.4.7.13) - ఇత్యగ్న్యారోపితసమిధం లౌకికాగ్నౌ ప్రహరేత్.

---

[97] పదహారేసి దర్భలతో కట్టిన నాల్గు పరిస్తరణలను అగ్ని చుట్టును ప్రదక్షిణముగా వేయవలెను. ఇట్లు తూర్పు, పశ్చిమములందు వేయు పరిస్తరణలను ఉత్తరాగ్రములుగను, దక్షిణోత్తరము లందు వేయు పరిస్తరణలను పూర్వాగ్రములుగాను, తూర్పునుండి ఆరంభించి ప్రదక్షిణముగా వేసి, దక్షిణమున వేసిన పరిస్తరణలు ప్రాక్పశ్చిమముగ వేసిన దర్భల మొదళ్లపైకిని, ఉత్తరమున వేసిన పరిస్తరణలు ప్రాక్పశ్చిమముగ వేసిన దర్భలకొనల క్రిందికిని ఉండునట్లు సవరించవలెను.

[98] ఒకవేళ కర్త ఆత్మసమారోపణము చేసికొనియుండిన, ఒక సమిధను తీసికొని దానిపై మూడు సార్లు ఊది, ఆ సమిధలో ఆత్మారూఢాగ్ని నావాహన చేసి, "ఉపావరోహ" అను మంత్రముతో ఆ సమిధను అగ్నిలో చేర్చి, లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని పరికల్పించవలెను.

[99] అట్లుకాక కర్త సమిత్సమారోపణము చేసియుండిన యెడల, అట్లు ఆరోపణము చేసిన సమిధను "అజుహ్వాన", "ఉద్బుధ్యస్వాగ్నే" - అను మంత్రములతో లౌకికాగ్నిలో చేర్చి లౌకికాగ్ని నుండి ఔపాసనాగ్నిని పరికల్పించవలెను.

100 *"ఓం అదితేఽనుమన్యస్వ"* - ఇతి దక్షిణతః ప్రాచీనమ్, *"ఓం అనుమతేఽనుమన్యస్వ"* - ఇతి పశ్చాదుదీచీనమ్, *"ఓం సరస్వతేఽనుమన్యస్వ"* - ఇత్యుత్తరతః ప్రాచీనమ్, "*ఓం దేవ సవితః ప్రసువ*" - ఇతి సమంతమగ్నిం పరిషిచ్య,

## ఔపాసనహోమః

[101]పత్న్యంజలిం ప్రోక్ష్య, తణ్డులాన్ ప్రదాయ, పునః ప్రోక్ష్య, *"హోష్యామి?"* - ఇతి పత్నీం పృష్ట్వా, *"జుహుధి"* - ఇతి ప్రత్యుక్తే, తూష్ణీం సమిధగ్ం హుత్వా, తణ్డులాద ర్ధాంశ మాదాయ, ద్వేధా విభజ్య, తత్తణ్డులేన

*1. ఓం అగ్నయే స్వాహా/ అగ్నయ ఇదం న మమ/* - ఇత్యగ్నిమధ్యే దేవతీర్థేన,

---

[100] **పూర్వపరిషేచనమ్:** ఎడమచేత ప్రోక్షణిని తాకుచు, కుడిచేత ప్రోక్షణిలోని నీటితో *"అదితేఽనుమన్యస్వ"*- అనుచు దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, *"అనుమతేఽను మన్యస్వ"*- అనుచు పశ్చిమమందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽనుమన్యస్వ"* -అనుచు ఉత్తరమునందు పడమటినుండి తూర్పునకు, *"దేవసవితః ప్రసువ"*- అని ఈశాన్యము నుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని పరిషేచనము చేయవలెను.

[101]భార్య దోసిలిని కూర్చజలముతో ప్రోక్షించి, ఆ దోసిటిలో బియ్యమును పోసి, మఱల ప్రోక్షించి, *"హోష్యామి?* (హోమము చేస్తాను?)"- అని ఆమె నడిగి, *"జుహుధి* (చేయండి)"- అని ఆమెచే చెప్పించుకొని, అమంత్రకముగా అగ్నిలో నొకసమిధను వేసి, ఆ బియ్యములో నర్ధము తీసికొని, ఆ అర్ధమును మఱల రెండు భాగములు చేసి, అందలి ఒక్కొక్క భాగముతో 1,2 మంత్రములతో వరుసగా అగ్నిమధ్యలోను, ఈశాన్యభాగమందును దేవతీర్థమువలె బియ్యముతో హోమము చేసి, మఱల అమంత్రకముగా అగ్నిలో నొక సమిధను వేయవలెను. ఇంతవరకు చేసినది ముందటి రోజుచేసియుండవలసిన సాయమౌపాసనము. ఈనాటి ప్రాతరౌపాసనమునకై మరల ప్రాణా యామము చేసి, *"అద్య ప్రాతరౌపాసనం తణ్డులైర్హోష్యామి"*- అని సంకల్పించి, మిగిలిన బియ్య మును మఱల రెండుభాగములు చేసి, ఆ భాగములతో 3,4 మంత్రములతో వరుసగా అగ్ని మధ్య లోను,ఈశాన్యభాగమందును దేవతీర్థమువలె బియ్యముతో హోమము చేసి, మఱల అగ్నిలో అమంత్రకముగా నొక సమిధను వేయవలెను. ఇట్లు సాయంప్రాతరౌపాసనములు సంసర్గ మగు టచే, ఆదోషనివృత్తికై తరువాత నిచ్చిన వనస్పతిహోమము చేయవలెను.

*2. ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా/ అగ్నయే స్విష్టకృత ఇదం న మమ/*

- ఇత్యగ్నౌ ప్రాగుత్తరభాగే దేవతీర్థేన హుత్వా, పునస్తూష్ణీగ్ం సమిధగ్ం హుత్వా, ప్రాణానాయమ్య, *"అద్య ప్రాతరౌపాసనం తణ్డులైర్హోష్యామి"*- ఇతి సంకల్ప్య, శేషార్ధభాగం ద్వేధా విభజ్య,

*3. ఓం సూర్యాయ స్వాహా/ సూర్యాయేదం న మమ/*- ఇత్యగ్నిమధ్యే దేవతీర్థేన,

*4. ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా/ అగ్నయేస్విష్టకృత ఇదం న మమ/*

[102] ఇత్యగ్నౌ ప్రాగుత్తరభాగే దేవతీర్థేన హుత్వా, పునస్తూష్ణీగ్ం సమిధగ్ం హుత్వా, ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ఆహుతిసంసర్గ ప్రాయశ్చిత్తార్థం వనస్పతిహోమం హోష్యామి"*- ఇతి సంకల్ప్య,

*5. ఓం యత్ర వేత్థ వనస్పతే దేవానాం గుహ్యా నామాని/ తత్ర హవ్యాని గామయ స్వాహా/ వనస్పతయ ఇదం న మమ/*

*6. ఓం భూస్స్వాహా/ అగ్నయ ఇదం న మమ/*

*7. ఓం భువస్స్వాహా/ వాయవ ఇదం న మమ/*

*8. ఓగ్ం సువస్స్వాహా/ సూర్యాయేదం న మమ/*

*9. ఓం భూర్భువస్సువస్స్వాహా/ ప్రజాపతయ ఇదం న మమ/*

[103]ఇతి హుత్వా, ప్రాణానాయమ్య,

---

[102]తరువాత ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా --- వనస్పతిహోమం కరిష్యే"* - అని సంకల్పించి, 5-9 మంత్రములతో స్వాహా అన్నప్పుడెల్ల ఒక్కొక్కసమిధను నేతిలో ముంచి అగ్నిలో వేయుచు వనస్పతిహోమం చేయవలెను.

[103] *"అదితేఽనుమన్యస్వ"*- అని దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, *"అనుమతేఽనుమన్యస్వ"* - అని పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽనుమన్యస్వ"*- అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవసవితః ప్రసావీః"* - అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యము వఱకు, అగ్నిని నీటితో పరిషేచనము చేసి,

"ఓం అదితేஉన్వమగ్గ్‌స్థాః"- ఇతి దక్షిణతః ప్రాచీనమ్, "ఓం అనుమతేஉన్వమగ్గ్‌స్థాః"- ఇతి పశ్చాదుదీచీనమ్, "ఓం సరస్వతేஉన్వమగ్గ్‌స్థాః"-ఇత్యుత్తరతః ప్రాచీనమ్, "ఓం దేవ సవితః ప్రాసావీః"- ఇతి సమంతతమగ్నిం పరిషిచ్య, "శ్రీవిష్ణవే స్వాహా/ విష్ణవే పరమాత్మన ఇదం న మమ/"- ఇతి ద్వౌ దర్భౌ అగ్నౌ నినీయ, ఉత్థాయ, అంజలిం బధ్వా, అగ్న్యుపస్థానం కుర్యాత్.

## అగ్న్యుపస్థానమ్

[104] "ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్/ విశ్వాని దేవ వయునాని విద్వాన్/ యుయోధ్యస్మజ్జుహురాణమేనః/ భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ/ ప్రవశ్శుక్రాయ భానవే భరధ్వమ్/ హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్/ యో దైవ్యాని మానుషా జనూగ్‌ంషి/ అన్తర్విశ్వాని విద్మనా జిగాతి/ అచ్ఛా గిరో మతయో దేవయన్తీః/ అగ్నిం యన్తి ద్రవిణం భిక్షమాణాః/ సుసందృశగ్‌ం సుప్రతీకగ్గ్ స్వంచమ్/ హవ్యవాహ మరతిం మానుషాణామ్/ అగ్నే త్వమస్మద్యుయోధ్యమీవాః/ అనగ్నిత్రా అభ్యమన్త కృష్టీః/ పునరస్మభ్యగ్‌ం సువితాయ దేవ/ క్షాం విశ్వేభిరజరేభిర్యజత్ర/ అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్/ స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా/ పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ/ భవా తోకాయ తనయాయ శంయోః/ ప్రకారవో మననా వచ్యమానాః/ దేవద్రీచీ న్నయథ దేవయన్తీః/ దక్షిణావాడ్వాజినీ ప్రాచ్యేతి/ హవిర్భరన్త్యగ్నయే ఘృతాచీ/" (తై.బ్రా.2.8.2)
అగ్నయే నమః/

మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన/
యద్ధుతంతు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే//

---

"శ్రీవిష్ణవే స్వాహా/ విష్ణవే పరమాత్మన ఇదం నమమ/"- అని రెండుదర్భల నగ్నిలో నుంచి, ఆపైని దంపతులు లేచి నిలబడి అంజలిబద్ధులై అగ్న్యుపస్థానమును చేయవలెను.

[104] దంపతులు లేచి నిలబడి, "అగ్నే నయ సుపథా రాయే--- అగ్నయే నమః/ మన్త్రహీనం --- కృష్ణానుస్మరణం పరమ్//" అని చెప్పి అగ్నికి ప్రణమించి, అభివాదము చేసి, "శ్రీకృష్ణాయ నమః"అని పదిసార్లు జపించి కూర్చొని,సాత్త్వికత్యాగాచమనములను చేసి ముగించవలెను .

*ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకాని వై/*
*యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్//*

-ఇతి ప్రణమ్య, అభివాద్య, *"శ్రీకృష్ణాయ నమః"*- ఇతి దశవారం జపిత్వా, ఉపవిశ్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః/*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్//*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, ఆచమేత్.

## ఆత్మసమారోపణమ్

[105] శ్లో॥ ధార్యమాణ శ్చతూరాత్ర మహూయమానోగ్ని ర్లౌకిక స్సమ్పద్యతే।
ఆపద్యధ్వని వా వహ్నేస్సమారోపణ మాచరేత్॥ (ఇత్యాపస్తమ్బః)

ప్రయోగః: [106]కర్తా ఆచమ్య, ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం ఔపాసనాగ్నిం మాత్మని సమారోపయిష్య"*- ఇతి సంకల్ప్య, పవిత్రం విసృజ్య దక్షిణకరతలే ఆజ్యలేపనం కృత్వా, అగ్ని జ్వాలాం దర్శయన్

[105] ఔపాసనాగ్నిని కర్త తన హృదయములో నావేశించుకొనుటకు ఆత్మసమారోపణమని పేరు. ఇట్లు ఆత్మలో నావేశించుకొన్న అగ్నికి ధార్యాగ్ని అని పేరు. ఇట్టి ధార్యాగ్నిప్రభావము నాల్గు రోజులుండును. ఆపదవల్లగాని, ప్రయాణము చేయుచుండిగాని, ఔపాసనము చేయలేకున్న ఔపాసనాగ్నిని కర్త తన ఆత్మయందావేశించుకొనవలెను - అని ఈశ్లోకమున కర్థము.

[106]అందుచేత ఔపాసనానంతరము అగ్ని నాత్మలో నావేశించుకొన్నచో ఆతర్వాత అననుకూలములవల్ల నాల్గురోజులు నిత్యోపాసనకు భంగము వాటిల్లినను, మఱల లౌకికాగ్నితో అగ్ని సంధానము చేసి, అందులో 'ఉపావరోహ' అను మంత్రముతో ఒక సమిధయందు ఈ ధార్యాగ్నిని ఆవాహనచేసి, ఆసమిధను అగ్నియందుంచిన అది ఔపాసనాగ్నియై, మఱల నిత్యోపాసన మారంభింపవచ్చును. ఇట్లు ఔపాసనాగ్నిలో చేయవలసిన పుంసవన, సీమంతాది కర్మలను చేసికొనుటకును వీలగును. ఈ ఆత్మసమారోపణవిధాన మిట్లున్నది: కర్త ఆచమించి, ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా – ఆత్మని సమారోపయిష్య"* - అని సంకల్పించి, తాను ధరించిన పవిత్రమును తీసి ప్రక్కకుపెట్టి, కుడి అఱచేతికి నేతిని రాచుకొని, ఆ చేతిని అగ్ని జ్వాలలకు చూపించుచు *"యా తే అగ్నే యజ్ఞియా.."*- అను మంత్రమును మూడుసార్లు పఠించి,

*"యా తే అగ్నే యజ్ఞియా తనూస్తయేహ్యారోహాత్మాఽఽత్మానమ్। అచ్ఛావసూని కృణ్వన్నస్మే నర్యా పురూణి। యజ్ఞో భూత్వా యజ్ఞమాసీద స్వాం యోనిమ్। జాతవేదో భువ ఆజాయమాన స్సక్షయ ఏహి।"* (తై.బ్రా.2.5.8)

- ఇతి త్రివారం జపిత్వా, హస్తేనాగ్నౌ ప్రతప్య చ, క్రమశః ముఖే, హృదయే, నాభౌ చ త్రివారం తం హస్తం స్పృశేత్. తతః పునః పవిత్రం ధృత్వా సాత్త్వికత్యాగం కృత్వాచమేత్.

## సాత్త్వికత్యాగః

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

## సమిత్సమారోపణమ్

ప్రయోగః: [107]కర్తా ఆచమ్య, ప్రాణానాయమ్య, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం ఔపాసనాగ్నిం సమిధి సమారోపయిష్యే"*- ఇతి సంకల్ప్య, ఆజ్యాభ్యక్త సమిధం దక్షిణకరతలే గృహీత్వా, తదగ్నిజ్వాలాం దర్శయన్

---

కుడి అఱచేతిని అగ్నిచుట్టును ప్రదక్షిణముగా త్రిప్పుచు 3సార్లు తన నోటిని, మఱల ప్రదక్షిణముగా త్రిప్పుచు 3 సార్లు తన వక్షస్థలమును, మఱల ప్రదక్షిణముగా త్రిప్పుచు 3 సార్లు తన నాభిని స్పృశించి, మఱల పవిత్రమును ధరించి 'స్వశేషభూతేనమయా—ప్రక్రమతే స్వయమ్' అని సాత్వికత్యాగమును చేసి, ఆచమించి, ముగించవలెను.

[107]ఔపాసనాగ్నిని ఆత్మలో నావేశించుకొనుటకు బదులు 'అయం తే యోనిర్' అను మంత్రముతో సమిధలో నావేశించుకొని, లౌకికాగ్నిని ప్రతిష్ఠ చేసి, 88వ పుటలో నిచ్చిన 'ఆజుహ్వాన', 'ఉద్బుధ్యస్వాగ్నే' అను రెండుమంత్రములతో ఆ సమిధను లౌకికాగ్నిలో చేర్చి లౌకికాగ్ని నుండి ఔపాసనాగ్నిని సృజించవచ్చును. ఈ సమిత్సమారోపణవిధి ఇట్లున్నది: కర్త ఆచమించి, ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా –సమితి సమారోపయిష్యే"* - అని సంకల్పించి, నేతిలో నద్దబడిన ఒక సమిధను కుడిచేతిలోనికి తీసికొని బొటనవ్రేలిచే నొక్కి పట్టుకొని, దాని నగ్నికి చూపించుచు 'అయం తే యోనిర్' అను మంత్రమును 3సార్లు పలికి, ఆ సమిధను భద్రపఱచుకొని 'స్వశేషభూతేనమయా—ప్రక్రమతే స్వయమ్' అని సాత్వికత్యాగమును

*మం॥" అయం తే యోనిర్ ఋత్వియో యతో జాతో అరోచథాః। తం జానన్నగ్న ఆరోహా ఽథానో వర్ధయా రయిమ్।"* (తై.సం.4.7.13)

ఇతి త్రివారం జపిత్వా, తత్సమిధం రక్షాం కృత్వా, సాత్త్వికత్యాగం కృత్వాఽచమేత్।



చేసి, ఆచమించి, ముగించవలెను. (గమనిక: వివాహోపనయములందును దీక్షాగ్ని నష్టమైనచో నష్టమైన అగ్నియొక్క బూడిదలో 'అయం తే యోనిర్' అను మంత్రముచేతనే ఒక సమిధను చేర్చి, దీక్షాగ్ని నా సమిధలోని కావేశించుకొని, 'ఆజుహ్వాన', 'ఉద్బుధ్యస్వాగ్నే' అను మంత్రములతో ఆసమిధను లౌకికాగ్నిలో చేర్చి, అగ్నినష్టప్రాయశ్చిత్తమును చేసి దీక్షాగ్నిని పునః సృష్టించుచున్నారు.)

# జాతకర్మాదీనాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తః

(శిశువు జన్మించిన పిదప జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన,చౌలాది సంస్కారము లను స్వగృహ్యోక్త ప్రకారముగ సకాలమునకు చేయవలెను. ఇవి చేయనిదే ఉపనయ నము చేయరాదు. ఉపనయనము చేయనిదే వివాహము చేయరాదు. ఇట్లు సకాలము నందు సంస్కారములను చేయనందులకు ఈ అధ్యాయములో చెప్పిన ప్రాయశ్చిత్త హోమమును చేసి, ఆతర్వాత చేయని సంస్కారములను పూర్తిచేసి, అటుపైని ప్రస్తుత (ఉపనయన, వివాహాది) కర్మలను చేయవలెను.ఈ ప్రాయశ్చిత్తహోమము నిచ్చట నిచ్చిన 26 మంత్రములన్నిటితో చేయుట ఒక పద్ధతి. అట్లుగాక, నక్షత్రపుగుర్తులచే సూచింపబడిన 18మంత్రములతో మాత్రమే చేయుట మఱొకపద్ధతి. ఎవరిపద్ధతి ప్రకా రము వారు చేసికొనవచ్చును. మిగితా విషయమంతయు రెంటికి సమానమే.)

## పరిషదనుజ్ఞా, విష్వక్సేనారాధనం చ

[108]కర్తా పూర్వోక్తవిధానేన పరిషన్నమస్కారాదికం కృత్వా, *'----గోత్రే ----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, (ఉపనయన)*

---

[108] కర్త మొదటి అధ్యాయములో చెప్పినట్లుగ కుమారునితో సహ శుభవేదికను ప్రవేశించి, తాను చేయు ప్రాయశ్చిత్తకర్మకై పరిషదనుజ్ఞను పొందవలెను. పరిషదనుజ్ఞ నర్థించు నప్పుడు, *'---- గోత్రే ----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, (ఉపనయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తం కర్తుం యోగ్యతాసిద్ధి మనుగ్రహాణ'* – అని చెప్ప వలెను. గీతలున్న స్థలములలో కుమారుని గోత్ర,నక్షత్రనామముల చెప్పవలెను. వివాహసంద ర్భములో పరిషదనుజ్ఞను కోరునప్పుడు బ్రాకెట్లలో నిచ్చిన (ఉపనయన) పదమును కలిపియు, ఉపనయనసందర్భమున ఈపదమును విడిచియు చెప్పవలెను. అట్లు కోరగా, *'తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు'* – అని పరిషత్తు అనుగ్రహించవలెను. తరువాత కర్త ప్రాణాయామము చేసి, *'ప్రారీప్సిత కర్మణః నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ విష్వక్సేనారాధనం కరిష్యే'* – అని

*కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తం కర్తుం యోగ్యతాసిద్ధి మనుగ్రహాణ'* – ఇతి ప్రార్థ్య, '*తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు'* – ఇత్యనుజ్ఞాం ప్రాప్య, ప్రాణానాయమ్య, *'ప్రారీప్సితకర్మణః నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ విష్వక్సేనారాధనం కరిష్యే'* – ఇతి సంకల్ప్య, పూర్వోక్తవిధానేన విష్వక్సేనారాధనం కుర్యాత్.

## ప్రాజాపత్యకృచ్ఛ్రవిధిః

[109]ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ---గోత్రే----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, (ఉపనయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రం యత్కించిద్ధిరణ్యరూపేణ కరిష్యే"*– ఇతి సంకల్ప్య, యథాశక్తి యథాయోగ్యం తత్తత్కాలానుగుణం హిరణ్యం గృహీత్వా,

> *హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
> *అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*ఇదం----గోత్రే----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల (ఉపనయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్య*

---

సంకల్పించి, 'విష్వక్సేనారాధన' అను అధ్యాయములో చెప్పినట్లుగ విష్వక్సేనారాధనను పూర్తి చేసి, తదుపరి ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేయవలెను.

[109] కర్త ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ---యత్కించిద్ధిరణ్యరూపేణ కరిష్యే"*– అని సంకల్పించి, యథాశక్తి యథాయోగ్యముగ శక్తి గల్గినంత హిరణ్యమును (నాణెములను) చేతిలోనికి తీసికొని, *"హిరణ్యగర్భగర్భస్థం --- అతశ్శాంతిం ప్రయచ్ఛ మే"*అను శ్లోకమును చెప్పి, '*ఇదం----గోత్రే----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల (ఉపనయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణ ప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రప్రతినిధి యత్కించిద్ధిరణ్యదానం నానాగోత్రేభ్యః శ్రీవైష్ణవేభ్య స్తేభ్యస్తేభ్య స్సంప్రదదే న మమ।"* - అనుచు ఆహిరణ్యమును అక్షతలు, తులసీ దళముతో కూడిన జలముతో సహ భూమిపై విడిచి బ్రాహ్మణులకు దానము చేయవలెను.

*కృచ్ఛ్రప్రతినిధి యత్కించిద్ధిరణ్యదానం నానాగోత్రేభ్యః శ్రీవైష్ణవేభ్య స్తేభ్యస్తేభ్య స్సంప్ర దదేన మమ॥"* - ఇతి సాక్షతంసజలం హిరణ్యం భూమౌ త్యక్త్వా, బ్రాహ్మణేభ్యో దద్యాత్.

## ప్రాయశ్చిత్తహోమః

ప్రయోగః:[110]ప్రాణానాయమ్య, ' *పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ----గోత్రే----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్న ప్రాశన, చౌల (ఉపనయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తార్థం ప్రాయ శ్చిత్త హోమం కరిష్యే। తదంగమగ్ని స్థాపనం కరిష్యే।'* - ఇతి సంకల్ప్య, స్థండిలోల్లేఖ నాది చతుష్పాత్రప్రయోగం పూర్వపరిషేచనాంతం కృత్వా, కుమారేణాన్వారబ్ధః, ప్రతి నిమిత్తం ప్రాయశ్చిత్తాహుతీర్జుహుయాత్:

1. **ఓం భూస్స్వాహా। అగ్న యె ఇదం న మమ॥*
2. **ఓం భువస్స్వాహా। వాయవ ఇదం న మమ॥*
3. **ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం న మమ॥*
4. **ఓం భూర్భువస్సువ స్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।*
5. *అగ్నే ఽభ్యావర్తిన్న భి న ఆవర్తస్వాయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా ధనేన స్వాహా। అగ్న యే అభ్యావర్తిన ఇదం న మమ। (తై.సం.4.2.1)*
6. *అగ్నే అఙ్గిరశ్శతం తే సన్త్వా వృతస్సహస్రం త ఉపావృతః। తాసాం పోషస్య పోషేణ పునర్నో నష్టమా కృధి పునర్నో రయిమా కృధి స్వాహా। అగ్న యే అభ్యావర్తిన ఇదం న మమ। (తై.సం.4.2.1)*

---

[110] కర్త ప్రాణాయామము చేసి, ' *పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ-----గోత్రే----నక్షత్రే జాతస్య మమ కుమారస్య జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన,చౌల (ఉప నయన) కర్మణాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తార్థం ప్రాయశ్చిత్తహోమం కరిష్యే। తదంగ మగ్ని స్థాపనం కరిష్యే।'* – అని సంకల్పించి, 'చతుష్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లు స్థండిలకల్పనాజ్యపాత్రసంస్కారాదులను పూర్వపరిషేచనాంతముగ చేసి, కుమా రుడు తనను తాకుచుండగ 1-26 మంత్రములతో ప్రాయశ్చిత్తహోమమును చేయవలెను.

*కామాన్త్సమర్ధయన్తు నః/ దేవీర్దేవైస్సమాభృతాః/ పావమానీ స్స్వస్త్యయనీః/ సుదుఘాహి ఘృతశ్చుతః/ ఋషిభిస్సంభృతో రసః/ బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్/ యేన దేవాః పవిత్రేణ/ ఆత్మానం పునతే సదా/ తేన సహస్రధారేణ/ పావమాన్యః పునన్తు మా/ ప్రాజాపత్యం పవిత్రమ్/ శతోద్యామగ్ం హిరణ్మయమ్/ తేన బ్రహ్మవిదో వయమ్/ పూతం బ్రహ్మ పునీమహే/ ఇన్ద్రస్సునీతీ సహ మా పునాతు/ సోమస్స్వస్త్యా వరుణస్సమీచ్యా/ యమో రాజా ప్రమృణాభిః పునాతు మా/ జాతవేదా మోర్జయన్త్యా పునాతు/*
(తై.బ్రా.1.4.8)

ఇత్యనుమంత్ర్య, కూర్చేన జలంగృహీత్వా,

*1. ‘బ్రహ్మాదిభ్యో నమః/ ఇదం స్నానమ్/’, 2. ‘ఇన్ద్రాదిభ్యో నమః/ ఇదం స్నానమ్/’,*
*3. ‘యమాదిభ్యో నమః/ ఇదం స్నానమ్/’, 4. ‘వరుణాదిభ్యో నమః/ ఇదం స్నానమ్/’,*
*5. ‘సోమాదిభ్యో నమః/ ఇదం స్నానమ్/’* – ఇతి క్రమేణ బ్రహ్మాదీనాం స్నాపయేత్.

## [150]వస్త్రోపవీతగంధపుష్పధూపదీపాద్యలంకారాః

1. *బ్రహ్మాదిభ్యో నమః/ ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిద ముపవీత మిదమాచమనీయమ్/*
2. *ఇన్ద్రాదిభ్యో నమః/ ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిద ముపవీత మిదమాచమనీయమ్//*

---

150 తర్వాత ‘*బ్రహ్మాదిభ్యో నమః/ ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిదముపవీత మిదమాచమనీయమ్/*’ – అని చెప్పుచు ‘ఇదమాచమనీయమ్’ అన్నప్పుడు కూర్చముతో నీటిని, ‘ఇదంవస్త్రం, ఇదముపవీతమ్’ అన్నపుడు హరిద్రాక్షతలను బ్రహ్మస్థానమునందలి పాలికలో నున్న కూర్చపై నుంచవలెను. ఇట్లే 2,3,4,5 వాక్యములను చెప్పుచు వరుసగ ఇంద్ర,యమ, వరుణ,చంద్రస్థానములలో నున్న కూర్చలకు చేయవలెను. ఆ తర్వాత 6నుండి 10 వరకు గల వాక్యములను చెప్పుచు వరుసగా బ్రహ్మ, ఇంద్ర,యమ,వరుణ, చంద్ర స్థానములలో నున్న కూర్చలపై క్రమముగా గంధము, హరిద్రాక్షతలు, పుష్పములు వేసి, అగరువత్తులను వెలిగించి ధూపమును సమర్పించి, ఆభరణార్థము మఱల అక్షతలను వేయవలెను.

3. *యమాదిభ్యో నమః। ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిద ముప వీత మిదమాచమనీయమ్।*
4. *వరుణాదిభ్యో నమః। ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిద ముప వీత మిదమాచమనీయమ్।*
5. *సోమాదిభ్యో నమః। ఇదమాచమనీయ మిదం వస్త్ర మిదమాచమనీయ మిద ముప వీత మిదమాచమనీయమ్।*
6. *బ్రహ్మాదిభ్యో నమః। ఏతే గంధాక్షత పుష్ప ధూప దీపోత్తరీయాద్యాభరణాలం కారా స్సర్వోపచారాః।*
7. *ఇన్ద్రాదిభ్యో నమః। ఏతే గంధాక్షత పుష్ప ధూప దీపోత్తరీయాద్యాభరణాలం కారా స్సర్వోపచారాః।*
8. *యమాదిభ్యో నమః। ఏతే గంధాక్షత పుష్ప ధూప దీపోత్తరీయాద్యాభరణాలం కారా స్సర్వోపచారాః।*
9. *వరుణాదిభ్యో నమః। ఏతే గంధాక్షత పుష్ప ధూప దీపోత్తరీయాద్యాభరణాలం కారా స్సర్వోపచారాః।*
10. *సోమాదిభ్యో నమః। ఏతే గంధాక్షత పుష్ప ధూప దీపోత్తరీయాద్యాభరణాలం కారా స్సర్వోపచారాః।*

## నైవేద్యతాంబూలాదిసమర్పణమ్

[151]*బ్రహ్మేన్ద్రయమవరుణసోమాదిభ్యో నమః। యథా భాగశః ఇదం గుడ (కదళీ ఫల) నైవేద్యం సమర్పయామి। "ఓం భూర్భువస్సువః॥"*- ఇతి గుడం ప్రోక్ష్య, *"సత్యం*

---

151 '*బ్రహ్మేన్ద్రయమవరుణసోమాదిభ్యో నమః* - అని చెప్పి, నైవేద్యమునకై బెల్లమును (లేక అరటి పండ్లను) ఉంచి, దానిని "ఓం భూర్భువస్సువః। "- అని ప్రోక్షించి, "సత్యం త్వర్తేన పరిషిఞ్చామి" - అని పగటిపూట, లేదా "ఋతం త్వాసత్యేన పరిషిఞ్చామి" అని రాత్రిపూట పరిషేచనము చేసి, "ఓం ప్రాణాయ స్వాహా------ఓం బ్రహ్మణే స్వాహా।" ఆని ప్రాణాహుతులను పలికి నివేదనము చేసి, "మధ్యేమధ్యే పానీయం సమర్పయామి।" - అనుచు కూర్చతో ఉదకమునొసగి, "అమృతాపిధానమసి" - అని కూర్చోదకముతో ఉత్తరాపోశనము నొసగి,

*త్వర్తేన పరిషిఞ్చామి (ఋతం త్వా సత్యేన పరిషిఞ్చామి - ఇతి రాత్రౌ)"*- ఇతి పరిషిచ్య, *"అమృతమస్తు, అమృతోపస్తరణమసి* - ఇత్యాపోశనం దత్వా, *"ఓం ప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి/"* - ఇతి నివేద్య, "*అమృతాపిధానమసి"*- ఇత్యుత్తరాపోశనం దత్వా, *"హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ సర్వేభ్యః ఇదమాచమనీయం సమర్పయామి/ తామ్బూలమిదం సమర్పయామి/ సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి/ సర్వోపచారాన్ సమర్పయామి/"* - ఇత్యర్చయేత్.

## ఉపస్థానమ్

[152] ఓషధిపాత్ర మాదాయ ఉత్థాయ,

శ్లో॥ దిశాంపతీ న్నమస్యామి సర్వకామఫలప్రదాన్।
కుర్వన్తు సఫలం కర్మ కుర్వన్తు సతతం శుభమ్॥

## ఓషధిపాత్రాభిమంత్రణమ్

---

"హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి।"- అనుచు హస్త, పాదోదకములకై అన్ని స్థానములందును కూర్చతో జలము నొసగి, "తామ్బూలం సమర్పయామి। సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి।" - అని దక్షిణతో గూడిన తాంబూలమును అన్ని పాలికాస్థానములందుంచి, 'సర్వోపచారాన్ సమర్పయామి' అని అన్ని స్థానములందును అక్షతలు వేసి పూజింపవలెను.

152 తరువాత (మంగళవాద్యములు మ్రోగుచుండగా) కర్త తన ఎడమచేతిలో పూర్వాగ్రముగ నొక కూర్చను పెట్టుకొని, నవధాన్యములను నానవేసినట్టి ఓషధిపాత్రను ఆ కూర్చముపై పెట్టుకొని, ఆపాత్రపై పూర్వాగ్రముగా ఇంకొక కూర్చము నుంచుకొని, తన కుడి అరచేతిని దానిపై బోర్లించి యుంచి, లేచి నిలబడి "దిశాంపతీన్నమస్యామి---సంతతం శుభమ్' ।- అను శ్లోకము చెప్పి బ్రహ్మాదిదేవతలకు నమస్కరించి, కూర్చొని ఓషధిపాత్రాభిమంత్రణము చేయవలెను.

[153]ఇతి బ్రహ్మాదీనుపస్థాయ, ఉపవిశ్య, ఓషధిపాత్రస్థ బీజాని మిశ్రీకృత్య, క్షీరేణ ప్రక్షాళ్య, ‘యా జాతా ఓషధయః’ ఇత్యనువాకేన ఓషధీరభిమృశ్య జపతి.

(అత్ర కారికాః

శ్లో॥ వ్రీహి మాషాఢక తిల ముద్గ నిష్పావ సర్షపాన్।
కుళుత్థ చణకో రాజమాషం చౌషధయో దశ।
క్షీరసిక్తాంకురా న్యేతా న్వాపయే దంకురార్పణే॥, అథవా,
వ్రీహి యవ తిల ముద్గ సర్షపాన్ పయసూక్షితాన్ (వాపయేదంకురార్పణే)
)

## ‘యా జాతా ఓషధయః’

*యా జాతా ఓషధయో దేవేభ్య స్త్రియుగం పురా। మన్దామి బభ్రూణా మహగ్ం శతం ధామాని సప్త చ। శతం వో అమ్బ ధామాని సహస్రముత వో రుహః। అథా శతక్రత్వో యూయ మిమం మే అగదం కృత। పుష్పావతీః ప్రసూవతీః ఫలినీరఫలా ఉత। అశ్వా ఇవ సజిత్వరీ ర్వీరుధః పారయిష్ణవః। ఓషధీరితి మాతరస్తద్వో దేవీరుప బ్రువే। రపాగ్ంసి విఘ్నతీ రిత రపశ్చాతయమానాః। అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతిః*

---

153పైరీతిగా ఉపస్థానము చేసి, కూర్చొని, కర్త ఓషధిపాత్రలో నానవేసిన ధాన్యమును కూర్చముతో నొకసారి కలియబెట్టవలెను. ఓషధిపాత్రలో నుంచవలసిన ధాన్యములను బ్రాకెట్లలో నిచ్చిన కారికలు తెల్పుచున్నవి. వ్రీహి=వడ్లు, మాష=మినుములు, ఆఢక=కందులు, తిల=నువ్వులు, నిష్పావ=పెద్దబొబ్బరలు, ముద్గ=పెసలు, సర్షపాన్=ఆవాలు, కుళుత్థ=ఉలవలు, చణక=సెనగలు,రాజమాషః=అలసందెలు, ఈపదింటినిగాని, వ్రీహి=వడ్లు, యవ=యవలు, తిల=నువ్వులు, ముద్గ= పెసలు, సర్షపాన్=ఆవాలు, ఈ ఆరింటినిగాని పాలలో తడిపి పాలికలలో నాటవలెనని ఈకారికల కర్థము. ప్రత్యామ్నాయముగా చెప్పిన ఆఱు ధాన్యములను గాక, మొదటి 10 ధాన్యములనే చాలామంది వేయుచున్నారు. కొందఱు తిలలను శుభకార్యములలో వాడుట తగదను శంకతో తొమ్మిది ధాన్యములనే వేయుచున్నారు. ఈధాన్యములు గల పాత్రకు ఓషధిపాత్ర అని పేరు. ఈపాత్రలోని ధాన్యపుగింజలను కలియబెట్టి, పాలతో దడిపి, పాత్రను తాకుచు, క్రింద నిచ్చిన ‘యా జాతా ఓషధయః’ అను మంత్రముతో వాని నభిమంత్రించవలెను.

కృతా/ గోభాజ ఇత్కిలాసథ యత్సనవథ పూరుషమ్/ యదహం వాజయన్నిమా ఓష
ధీర్ హస్త ఆదధే/ ఆత్మా యక్ష్మస్య నశ్యతి పురాజీవగృభో యథా/ యదోషధయ
స్సంగచ్ఛన్తే రాజానస్సమితావివ/ విప్రస్స ఉచ్యతే భిషగ్రక్షోహాఽమీవ చాతనః/
నిష్కృతిర్నామ వో మాతాఽథా యూయగ్ంస్థ సంకృతీః/ సరాః పతత్రిణీః/ స్థనయదా
మయతి నిష్కృత/ అన్యా వో అన్యామవత్వన్యాఽన్యస్యా ఉపావత/ తా స్సర్వా ఓష
ధయస్సంవిదానా ఇదం మే ప్రావతా వచః/ ఉచ్ఛుష్మా ఓషధీనాం గావో గోష్ఠాదివేరతే/
ధనగ్ం సనిష్యన్తీనా మాత్మానం తవ పూరుష/ అతివిశ్వాః పరిష్ఠాః స్తేన ఇవ
వ్రజ మక్రముః/ ఓషధయః ప్రాచుచ్యవుర్యత్కిం చ తనువాగ్ం రపః/ యాస్త ఆతస్థు
రాత్మానం యా ఆవివిశుః పరుః పరుః/ తాస్తే యక్ష్మం విబాధన్తాముగ్రో మధ్యమశీరివ/
సాకంయక్ష్మ ప్రపత శ్యేనేన కికిదీవినా/ సాకం వాతస్య ధ్రాజ్యా సాకం నశ్య నిహాకయా/
అశ్వావతీగ్ం సోమవతీమూర్జయన్తీముదోజసమ్/ ఆవిత్సి సర్వా ఓషధీరస్మా అరిష్ట-
తాతయే/ యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః/ బృహస్పతి ప్రసూతా
స్తానో ముఞ్చన్త్వగ్ం హసః/ యా ఓషధయ స్సోమరాజ్ఞీః ప్రవిష్టాః పృథివీ మను/
తాసాం త్వమస్యుత్తమా ప్రణో జీవాతవే సువ/ అవపతన్తీ రవదన్దివ ఓషధయః పరి/
యం జీవ మశ్నవామహై నసరిష్యాతి పూరుషః/ యాశ్చేద ముపశృణ్వన్తి యాశ్చ
దూరం పరాగతాః/ ఇహ సఙ్గత్య తాస్సర్వా అస్మై సన్దత్త భేషజమ్/ మావో రిషత్ఖనితా
యస్మై చాహం ఖనామి వః/ ద్విపచ్చతుష్పదస్మాకగ్ం సర్వమస్త్వనాతురమ్/ ఓష-
ధయస్సంవదన్తే సోమేన సహరాజ్ఞా/ యస్మై కరోతి బ్రాహ్మణస్తగ్ం రాజన్పారయా
మసి// (తై.సం.4-2-6)

[154] ఇత్యోషధీరభిమృశ్య, బీజావాపనం సకృత్ మన్త్రేణ ద్విస్తూష్ణీమ్ కుర్యాత్.

---

154 ఇట్లు ఓషధిపాత్రను తాకుచు ‘ యా జాతా ఓషధయః’ అని అభిమంత్రించిన పిదప ఆ పాత్రలో నున్న విత్తనములను పాలికలలో నాటవలెను. దీనికే బీజావాపనమని పేరు. దీనిని క్రమముగా బ్రహ్మ, ఇంద్ర, యమ వరుణ, చంద్రస్థానములలో నున్న పాలికలలో ప్రతిస్థానమునకును క్రింద

## బీజావాపనమ్

మధ్యే: బ్రహ్మజజ్ఞానం, పితావిరాజేతి ద్వాభ్యాం మధ్యే।

1. *బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాత్। విసీమతస్సురుచో వేన ఆవః। సబుధ్నియా ఉపమా అస్య విష్ఠాః। సతశ్చ యోనిమసతశ్చ వివః।* (తై.సం.4.2.8)
2. *పితా విరాజామృషభో రయీణామ్। అన్తరిక్షం విశ్వరూప ఆ వివేశ। తమర్కైరభ్యర్చన్తి వత్సమ్। బ్రహ్మ సన్తం బ్రహ్మణా వర్ధయన్తః। బ్రహ్మాదిభ్యో నమః।* (తై.బ్రా.2.8.8)

ప్రాచ్యాం: యత ఇంద్ర భయామహే, స్వస్తిదా విశస్పతిరితి ద్వాభ్యాం ప్రాచ్యామ్।

1. *యత ఇన్ద్ర భయామహే తతో నో అభయం కృధి। మఘవఞ్ఛగ్ధి తవ తన్న ఊతయే విద్విషో విమృధో జహి।*(తై.బ్రా.3.7.11)
2. *స్వస్తిదా విశస్పతిర్వృత్రహా విమృధో వశీ। వృషేన్ద్రః పుర ఏతు నస్స్వస్తిదా అభయఙ్కరః।* (తై.బ్రా. 3.7.11)

దక్షిణస్యాం: యోఽస్య కౌష్ఠ్య, యమం గాయేతి ద్వాభ్యాం దక్షిణస్యామ్।

1. *యోఽస్య కౌష్ఠ్య జగతః పార్థివస్యైక ఇద్వశీ। యమం భఙ్గ్యశ్రవో గాయ యో రాజాఽనపరోధ్యః।*(తై.ఆ.4.5)
2. *యమం గాయ భఙ్గ్యశ్రవో యో రాజాఽనపరోధ్యః। యేనాపో నద్యో ధన్వాని యేన ద్యౌః పృథివీ దృఢా। యమాదిభ్యో నమః।*(తై.ఆ.4.5)

ప్రతీచ్యాం: ఇమం మే వరుణ, తత్వాయామీతి ద్వాభ్యాం ప్రతీచ్యామ్।

1. *ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే।*(తై.సం.2.1.11)।
2. *తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదా శాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో*

---

నిచ్చిన రెండుమంత్రములను పఠించి ఒకసారి, అమంత్రకముగా రెండుసార్లు చేయవలెను. బీజావాపనము నెప్పుడును ప్రదక్షిణముగా, అనగా కుడినుండి ఎడమవైపునకు చేయవలెను.

*వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః।వరుణాదిభ్యో నమః॥*
(తై.సం.2.1.11)

**ఉత్తరస్యాం:** సోమో ధేను మాప్యాయస్వేతి ద్వాభ్యా ముత్తరస్యామ్।

1. *సోమో ధేనుగ్ం సోమో అర్వన్తమాశుమ్/ సోమో వీరం కర్మణ్యం దదాతు/ సాదన్యం విదథ్యగ్ం సభేయమ్/పితుశ్శ్రవణం యో దదాశదస్మై*/(తై.బ్రా.2.8.3)
2. *ఆప్యాయస్వ సమేతు తే విశ్వతస్సోమ వృష్ణియమ్/ భవా వాజస్య సంగథే/ సోమాదిభ్యో నమః॥* (తై.సం.1.4.32)

[155]ఇతి క్రమేణ పంచపాలికాసు బీజావాపనం కృత్వా, శుద్ధాభిస్సికతాభిః ప్రచ్ఛాద్య , ప్రణవేన పిధాయ, సంతానవతీభిః పుణ్యస్త్రీభిః క్షీరోదకేన ప్రక్షాళయిత్వా, శుచౌ దేశే

---

155 ఇట్లు క్రమముగా బీజావాపనము చేసి, ఆవిత్తనములపై శుద్ధమైన ఇసుకను కప్పి, 'ఓం' అనుచు పాలికలపై కుడి అరచేతిని కప్పి ఆ అరచేతిని వెన్కకు దీసి, సంతానవతియైన సుమంగళిచేత పాలికలను పాలచే దడిపించి, పూజాగృహములో గాని, వేరొక సురక్షితమైన చోట గాని శుద్ధిచేసి, ముగ్గులను వేసి, ముందుగా పాలికలను స్థాపించిన దిశాక్రమములో వాని నచటనుంచి, మంగళకార్యానంతరము వానిని చెరువులోనో, బావిలోనో కలుపవలెను నాటిన బీజములుమొలకెత్తి అంకురములు ఎండిపోకుండ నుండునట్లు వానిని జలముచే దడుపుచుండవలెను. ఇచ్చట, 'అమంగళా చ కన్యా చ గర్భిణీ రోగిణీ తథా। వంధ్యాసు వార్ధకీ శోకీ వర్జయే దంకురార్పణమ్' – అనగా, 'విధవ, అవివాహిత, గర్భవతి, రోగగ్రస్తురాలు, గొడ్రాలు, ముదుసలి, శోకించునది యగు స్త్రీ అంకురార్పణకు పనికిరాదు' - అను కారిక యుండుటవల్ల, పైన సంతానవతియైన ముత్తైదువచే సేచనము చేయింపవలెనని చెప్పబడినది. ఇట్లు శుభకార్యము ముగిసిన తర్వాత ఐదవనాడు లేక ఏడవనాడు లేక తొమ్మిదవనాడు పాలికలను పూజించి, 'ఓం భూర్భువస్సువః। బ్రహ్మాదీనుద్వాసయామి' అని బ్రహ్మకును, ఇట్లే యథా వసరముగా మిగితా దేవతలకును చెప్పి పాలికలపై అక్షతలు వేసి వానిలోని అంకురములను నది లేక బావి లేక చెరువు నీటిలో కలిపివేయవలెను. సామాన్యముగా నిది ఇంటిలోని ముత్తైదువలు చేయుట ఆచారముగానున్నది.

కర్మసమాప్తిపర్యంతం సురక్షితం కుర్యాత్. సమాప్తే కర్మణి పంచమాహే సప్తమాహే నవమాహే వా పాలికా స్సంపూజ్య, *ఓం భూర్భువస్సువః/ బ్రహ్మాదీనుద్వాసయామి/* ఇతి బ్రహ్మాణం, ఏవమేవ అన్యదేవతాంశ్చ యథాక్రమ ముద్వాస్య, అంకురాణి నద్యాం వా తటాకే వా విసృజేత్.

# నాందీప్రయోగః

(ఈప్రయోగము నాందీముఖమనియు, అభ్యుదయ మనియు, వృద్ధిశ్రాద్ధ మనియు నాందీశ్రాద్ధ మనియు వివిధనామములతో పేర్కొనబడుచున్నది. ముందుగా పితరులను పూజించి, తరువాత దైవకర్మను చేయవలెనను నియమము ప్రకారము గర్భాధానము,పుంసవనము,సీమంతము,జాతకర్మ,నామకరణము,అన్నప్రాశనము,చౌలము, ఉపనయనము, స్నాతకము, వివాహము మున్నగు కర్మలలో అభ్యుదయమును చేయుచున్నారు. కర్తయొక్క పైమూడుతరముల పితృ, మాతృవర్గములను, సపత్నికముగా మాతామహవర్గములను ఆహ్వానించి మంగళకరముగ పూజించి వారిస్థానములలో నిమంత్రితులైన బ్రాహ్మణులను భోజనముచే తృప్తి పరచి, వారి యాశీర్వాదమును పొంది, ఉద్దిష్టశుభకార్యము నారంభించుట నాందీముఖముయొక్క ఉద్దేశ్యము. ఈ మూడు వర్గములలో జీవితులున్నయెడల వారిని విడిచి, వారి పైతరముల వారికి నాందీశ్రాద్ధమును పెట్టవలెను. ఇట్లు అన్నరూపకముగా, అనేకవిప్రులను వరణము చేసి పెట్టుట అధికవ్యయప్రయాసలతో కూడినది. అందుచే పై పితృదేవతలను ఇడావాచన మంత్రపూర్వకముగ నాహ్వానించి, వారికి షోడశోపచారపూజను చేసి ఉద్దిష్టకార్యముయొక్కయు,కర్మభోక్తలయొక్కయు అభ్యుదయమునకై వారిని వేడుకొని ఈకర్మను ముగించుచున్నారు. ఈప్రయోగమే ఇచ్చట నీయబడినది. గమనిక: నాందీశ్రాద్ధము శుభకరమైన ఆచరణము. అందుచే దీనిని ఉపవీతితోనే చేయవలెను. ఇందులో తిలలు, దర్భలు, అపసవ్యము, స్వధాకారములు, 'అస్మత్', 'రూపము' అను శబ్దములు లేవు. అంతేకాక జాతకర్మాంగముగ చేయు నాందీముఖమును అన్నరూపముగ గాక హిరణ్యరూపకముగానే చేయవలెనని శాస్త్రములు విధించుచున్నవి.

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేదన్తే వావయే దాశిషస్తథా
బ్రాహ్మణాన్భోజయిత్వేతి యత్ర యత్ర విశిష్యతే।
తత్ర తత్రాభ్యుదయశ్రాద్ధ మిత్యేవ మవగమ్యతే
ఆశిషోవాచయిత్వేతి పుణ్యాహం కర్మణస్మృతమ్॥

వివిధప్రధానకర్మలకు ఆనుషంగికముగా అభ్యుదయకము, కర్మణః పుణ్యాహవాచన ములు వచ్చుచుండుననియు, ప్రయోగములో 'బ్రాహ్మణాన్భోజయిత్వా' అని వచ్చి నప్పుడు అభ్యుదయక మనియు, 'ఆశిషోవాచయిత్వా' అని వచ్చినపుడు కర్మణః పుణ్యాహవాచనమనియు తెలియవలెననియు పైశ్లోకముల కర్థము.

కొన్ని నియమములు:

1. నాందీముఖమును ఉదయమునందే చేయవలెను. అపరాహ్ణమందు చేయరాదు. వివాహమునకు ముందుగను, అంతమునను అభ్యుదయము విధింపబడినది. వివాహమునకు ముందు చేయవలసిన దానిని కన్యావరుల తండ్రులు చేయవలెను. వివాహాంతమున వచ్చు అభ్యుదయమును వరుడే చేసికొనవలెను. సీమంతము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనకర్మలకు మొదటను, గర్భాధాన, జాత కర్మ, పుంసువన, నామకరణ, ఉపాకర్మ, వేదవ్రత, సమావర్తన, గృహప్రవేశ కర్మలకు అంతమునను అభ్యుదయము విధింపబడినది. ముందుగా విధింపబడి నది ప్రధానకర్మకంటె తొలినాటి ఉదయమందో, అది అసాధ్యమైన అదేనాటి ఉదయమందో చేయవలెను. చివరకు చేయవలసినది ప్రధానకర్మకంటె మఱునాటి ఉదయమందో, లేక ఉదయమందే ప్రధానకర్మ ముగిసిన, దానికి వెనువెంటనే చేయవలెనని శాస్త్రములు విధించుచున్నవి.
2. నాందీముఖములో 1.మాతృవర్గము, 2. పితృవర్గము, 3.మాతామహవర్గము – అని మూడువర్గములు గలవు. ఇందులో మాతృపితామహీప్రపితామహీగణ మును ముందుచ్చరింపవలెను. అటుపైని పితృపితామహప్రపితామహుల నుచ్చ రింపవలెను. చివరకు సపత్నీకులైన మాతామహాదిగణము నుచ్చరింపవలెను. ఇట్లు ఉచ్చరించుటలో మొట్టమొదట మూడవతరము, తర్వాత రెండవతరము, చివరికి మొదటితరమువారలను పేర్కొనవలెను గాని దీనికి విపరీతముగా చేయ కూడదు.
3. ధర్మసింధువు ప్రకారము ఈగణములలో తల్లి జీవించియున్నయెడల మాతృవర్గ మును విడువవలెను. మాతామహుడు జీవించియున్నయెడల మాతామహవర్గ

మును విడువవలెను. తండ్రి జీవించియున్న యెడల తండ్రితండ్రి మొదలు పై వారికి పెట్టవలెను కాని ఇతరవర్గములకువలె తండ్రివర్గమునంతయు విడువ గూడదు. అనగా తండ్రి జీవించియున్న యెడల తండ్రి తన పైమూడుతరముల యే పితరులకు నాందీముఖమును చేయుచున్నాడో తానును వారికే చేయవలెనని అర్థము.

4. వటువునకు తండ్రిలేక యితరుడు సగోత్రుడు గాని, అసగోత్రుడు గాని తండ్రి స్థానమందుండి ఉపనయనము చేయునప్పుడు నాందీశ్రాద్ధమును వటువుయొక్క పిత్రాదులకే పెట్టవలెను కాని, తండ్రిస్థానమందుండి కర్మ జరిపించుచున్న వ్యక్తియొక్క పితరులకు పెట్టగూడదు. కన్యావివాహమందును ఇదియే పాటింపవలెను.

5. సమావర్తనమునకు బ్రహ్మచారి యధికారి యైనను, దాని కంగమైన నాందీశ్రాద్ధమందు మాత్రము తండ్రికే అధికారము. అందుచేత తండ్రి పుత్రుని సమావర్తనములో తన పిత్రాదులకు నాందీశ్రాద్ధమును చేయవలెను.

## స్థిరనాంద్యాహ్వానమ్

ప్రయోగః: [156]కర్తా ధర్మపత్నీ, కుమార (అథవా కుమారీ)సమేతః మంగళవేదికాం ప్రాప్య, పరిషదనుజ్ఞాం గృహీత్వా, ప్రాణానాయమ్య, ప్రధానకర్మసంకల్పముక్త్వా,

---

156ఉపనయనాదికర్మలకు ముందుగా చేయు నాందీదేవతాహ్వానము నాందీదేవతల నా కర్మ ముగియువఱ కింటిలో నివసించియుండుమని కోరి చేయునది. దీనికి 'స్థిరనాంది' అని పేరు.ఇట్టి దేవతలను కర్మాంతమున విసర్జన చేయవలెను. ఆవిధాన మిక్కడ చెప్పబడుచున్నది. దీనికై కర్త భార్యాకుమారులతో (లేక కుమారీలతో) మంగళవేదికను ప్రవేశించి, పరిషదనుజ్ఞను పొంది, ప్రాణాయామము చేసి, ప్రధానసంకల్పమును చెప్పి (వీనికై మొదటి అధ్యాయమును చూడుడు), మఱల ప్రాణాయామమును చేసి '*ఏవంగుణ---స్వస్తిపుణ్యాహం వాచయిష్యే*' - అని సంకల్పించి పుణ్యాహవాచనము చేయించి, ఆపుణ్యాహజలముచే పుత్రుని (లేక పుత్రికను) ప్రోక్షించి, ఆతర్వాత నాంద్యావాహనమును చేయవలెను. సంకల్పములో గీతలుంచినచోట పుత్రుని లేక పుత్రికయొక్క గోత్రమును, పేరును చెప్పవలెను. ----కర్మాంగం అని ఉన్నచోట గీతలలో ప్రధానకర్మపేరును (ఉదా: వివాహకర్మాంగం, చౌలకర్మాంగం – ఇత్యాదిగా) చెప్పవలెను. పుత్రికవిషయంలో బ్రాకెట్లలో నిచ్చిన పదములను వాడవలెను.

పునః ప్రాణానాయమ్య, *'ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ ---గోత్రస్య (గోత్రాయాః) ----శర్మణః (నామ్న్యాః) కుమారస్య (కుమార్యాః) ----కర్మాంగం శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం అభ్యుదయార్థం చ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహంవాచయిష్యే'* – ఇతి సంకల్ప్య, పుణ్యాహం వాచయిత్వా, పుణ్యాహజలేన కుమారం(కుమారీం) ప్రోక్ష్య, తదనంతరం నాందీదేవతాహ్వానం కుర్యాత్. తత్ప్రకారః:

ప్రాణానాయమ్య, *'ఏవంగుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ అస్య కుమారస్య (కుమార్యాః) ఆయుష్యాభివృద్ధ్యర్థం ----కర్మాంగం నాందీదేవతాహ్వానం కరిష్యే'*

**– [157]ఇతి సంకల్ప్య, నూతనవైణవపాత్రే తండులతాంబూలహిరణ్యకంచుకవస్త్రాదీని నినీయ, తండులోపరి 'శ్రీః' ఇతి లిఖిత్వా, తత్ర దేవతాః,**

1. *వృద్ధప్రపితామహీ వృద్ధపితామహీ వృద్ధమాతరః, ---గోత్రాః, సత్యవసుసంజ్ఞిక విశ్వేదేవాః నాందీముఖాః నాందీ।*
2. *వృద్ధప్రపితామహ వృద్ధపితామహ వృద్ధపితరః, ---గోత్రాః, సత్యవసుసంజ్ఞిక విశ్వేదేవాః నాందీముఖాః నాందీ।*
3. *వృద్ధమాతుఃప్రపితామహ వృద్ధమాతుఃపితామహ వృద్ధమాతామహాస్సపత్నీకాః ---గోత్రాః, సత్యవసుసంజ్ఞికవిశ్వేదేవాః నాందీముఖాః నాందీ॥*

[158]ఇతి నాందీదేవతాహ్వానం కృత్వా, *'ఉభాభ్యా ముభాభ్యాం సత్యవసుసంజ్ఞికవిశ్వే*

---

157మఱల ప్రాణాయామమును చేసి *'ఏవంగుణ--- నాందీదేవతావాహనం కరిష్యే'* - అని సంకల్పించి, క్రొత్త బెత్తపుతట్టలో బియ్యమును తాంబూలమును,ఖర్జూరఫలములను,దక్షిణను, రెండు రైకబట్టలను పెట్టుకొని, బియ్యముపై 'శ్రీః' అని వ్రాసి, 1-3 వాక్యములతో మూడువర్గ ముల పితరులను ఆహ్వానింపవలెను. ----కర్మాంగం అని ఉన్నచోట గీతలలో ప్రధానకర్మ పేరును చెప్పవలెను. ---గోత్రాః అని ఉన్నచోట వారివారి గోత్రనామమును చెప్పవలెను. సర్వత్ర పుత్రికవిషయంలో బ్రాకెట్లలో నిచ్చిన పదములను వాడవలెను.

158 అట్లు నాందీదేవతలను ఆహ్వానించి, *''ఉభాభ్యాముభాభ్యాం సత్యవసుసంజ్ఞికవిశ్వే దేవాంశ్చ ----తోషయిష్యే। అత్ర దేవతానుమోదనార్థమిడావాచనం కరిష్యే।''* – అని సంకల్పించి ఆ

*దేవాంశ్చ గృహస్థాన్నేన హిరణ్యద్రవ్యేణ వాఽద్య తోషయిష్యే। అత్ర దేవతానుమోద నార్థ మిడావాచనం కరిష్యే।'* - ఇత్యుక్త్వా,

1. *ఇడా దేవహూర్మనుర్యజ్ఞనీర్బృహస్పతిరుక్థామదాని శగ్ంసిషద్విశ్వే దేవాః సూక్తవాచః పృథివి మాతర్మా మా హిగ్ంసీర్మధు మనిష్యే మధు జనిష్యే మధు వక్ష్యామి మధు వదిష్యామి మధుమతీం దేవేభ్యో వాచముద్యాసగ్ం శుశ్రూషేణ్యాం మనుష్యేభ్యస్తం మా దేవా అవన్తు శోభాయై పితరోఽను మదన్తు॥ఇడ ఏహి॥* (తై.సం.3.3.2)। (ఘంటానాదం కుర్యాత్)
2. *ఇడామగ్న పురుదగ్ంసగ్ంసనిం గోశ్శశ్వత్తమగ్ం హవమానాయ సాధ। స్యాన్నస్సూను స్తనయో విజావాఽగ్నే సా తే సుమతిర్భూత్వస్మే॥ అదిత ఏహి॥* (తై.సం.4.2.16)। (ఘంటానాదం కుర్యాత్)
3. *ఈడామహై దేవాగ్ం ఈడేన్యాన్న మస్యామ నమస్యాన్। యజామ యజ్ఞియా నిత్యాహ మనుష్యా వా ఈడేన్యాః పితరో నమస్యా దేవా యజ్ఞియా దేవతా ఏవ తద్యథాభాగం యజతి॥ సరస్వత్యేహి॥* (ఘంటానాదం కుర్యాత్)
4. *ఇడ ఏహి। అదిత ఏహి। సరస్వత్యేహి॥* (ఘంటానాదత్రయం కుర్యాత్)

*[159] శోభనగ్ం శోభనమ్॥ దేవాశ్చ పితరశ్చ యుగ్మా స్సంతాః అస్యాం శ్రీశోభనవేది కాయా మాగత్య మయా కృతాం పూజాం స్వీకృత్య -----కర్మాది కర్మ సమాప్తి*

---

దేవతలయొక్క అనుమోదార్థమై క్రిందనిచ్చిన మూడు ఇడావాచనమంత్రములను పఠించుచు, ప్రతిమంత్రము చివరను ఘంటానాదము చేయవలెను. చివరికి "*ఇడ ఏహి। అదిత ఏహి। సరస్వత్యేహి॥*" అని చెప్పుచు, 'ఏహి' అన్నప్పుడెల్ల ఘంటానాదము చేయవలెను.

159 తరువాత, "*శోభనగ్ం శోభనమ్॥ దేవాశ్చ పితరశ్చ యుగ్మా స్సంతాః అస్యాం శ్రీశోభన వేదికాయా మాగత్య మయాకృతాం పూజాం స్వీకృత్య ----కర్మాది కర్మ సమాప్తి పర్యంతం మమగృహే వసన్తు, మాం రక్షన్తు, మమ కుమారం (కుమారీం) రక్షన్తు॥*" – అని నాందీదేవత లను ప్రార్థించి, "*అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధ్యర్థం --- ధ్యానా వాహనాదిషోడశోపచారపూజాం సమర్పయామి॥*" – అని సంకల్పించి నాందీదేవతలకు

పర్యంతం మమగృహే వసన్తు, మాం రక్షన్తు, మమ కుమారం (కుమారీం) రక్షన్తు॥
అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధ్యర్థం నాందీశోభనదేవతా ముద్దిశ్య నాందీశోభనదేవతాప్రీత్యర్థం ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం సమర్పయామి॥
- ఇత్యుక్త్వా, నాందీదేవతాభ్యః షోడశపచారపూజాం కుర్యాత్. తత్ప్రకారః -

## షోడశోపచారపూజా

[160] నాందీశోభనదేవతాభ్యో నమః/ధ్యాయామి/ధ్యానం సమర్పయామి/ఆవాహయామి/ ఆసనం సమర్పయామి/హస్తయోరర్ఘ్యం సమర్పయామి/పాదయోః పాద్యం సమర్పయామి/ ఆచమనీయం సమర్పయామి/ ఔపచారికస్నానం సమర్పయామి/ "ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/మహే రణాయ చక్షసే/యో వః శివతమో రస స్తస్య భాజయతేహ నః/ఉశతీరివ మాతరః/తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ఆపో జనయథా చ నః - స్నపయామి/స్నానానంతర మాచమనీయం సమర్పయామి/ అభివస్త్రార్థమక్షతాన్ సమర్పయామి/ ఉపవీతార్థమక్షతాన్ సమర్పయామి/ గన్ధం సమర్పయామి/ పుష్పైః పూజయామి/ ధూపమాఘ్రాపయామి/ దీపం దర్శయామి/ఏతే గన్ధాక్షతపుష్పధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాస్సర్వోపచారాః/

---

షోడశోపచారపూజ చేయవలెను.'---కర్మాది' అని ఉన్నచోట గీతలస్థానములో ప్రధానకర్మ పేరును (ఉదా: ఉపనయనకర్మాది, చౌలకర్మాది -ఇత్యాదిగా) చెప్పవలెను.

160 "నాందీదేవతాభ్యో నమః"- అని ఆరంభించి షోడశోపచారపూజను చేసి, తర్వాత నిచ్చిన రెండుశ్లోకములను పరించి, కర్త 'నాందీశోభనదేవతా స్సుప్రీతో వరదో భూత్వా, అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు॥'' - అని సదస్యులను ప్రార్థింపగా, వారు 'ఆయుష్యాభివృద్ధిరస్తు'– అని చెప్పవలెను. సూచన: పైప్రయోగములో నాందీదేవతల నాహ్వానించి, వారి నిడాదేవాదివాక్యములతో, షోడశోపచారపూజతో సంతుష్టుల గావించి వారిని కర్మాంతము గృహములో వసించి శుభము లిమ్మని కోరి, ఇడావాచనాంగముగా నొక బ్రాహ్మణునికి హిరణ్యదానమును చేయుట చెప్పబడినది. ప్రధానకర్మాంతమున 'నాందీశోభనదేవతాః యథాస్థానం ప్రతిష్ఠాపయామి' - అని చెప్పి ఆదేవతల నుద్వాసన చేయవలెను.

నైవేద్యం - *"ఓం భూర్భువస్సువః/ "*- ఇతి గుడం ప్రోక్ష్య, *"సత్యం త్వర్తేన పరిషిఞ్చామి"* - ఇతి పరిషిచ్య, *"అమృతమస్తు, అమృతోపస్తరణమసి* - ఇత్యాపోశనం దత్వా, *"ఓం ప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/* మధ్యే మధ్యే పానీయం *సమర్పయామి/*"- ఇతి నివేద్య, "*అమృతాపిధానమసి"*- ఇత్యుత్తరాపోశనం దత్వా,
*"హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ తామ్బూలం సమర్పయామి/ సువర్ణ మన్త్రపుష్పం సమర్పయామి/ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి/"*

శ్లో॥ *మాతా పితామహీ చైవ తథైవ ప్రపితామహీ/*
*పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః॥*

శ్లో॥ *మాతామహస్సపత్నీకాః విశ్వేదేవాస్తథనంతరం/*
*ఏతే రక్షన్తు నః ప్రీతాః ప్రయచ్ఛన్త్విహ మంగళమ్/*

*నాందీశోభనదేవతాస్సుప్రీతో వరదో భూత్వా, అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు/'* - ఇతిప్రార్థయేత్।

'*ఆయుష్యాభివృద్ధిరస్తు*'–ఇతి సదస్యాః వదేయుః.

-ఇతి సంప్రార్థ్య విసర్జనపర్యంతం సురక్షితం గోపాయేత్। విసర్జనకాలే '*నాందీశోభన దేవతాః యథాస్థానం ప్రతిష్ఠాపయామి*' – ఇతి విసర్జయేత్।

## హిరణ్యదానమ్

[161]ప్రాణానాయమ్య, '*ఇడావాచనకర్మాంగత్వేన అభ్యుదయక బ్రాహ్మణభోజన ఆసనాచ్ఛాదన ప్రత్యామ్నాయం యథాశక్తి హిరణ్యం---గోత్రాయ ---శర్మణే శ్రీవైష్ణవాయ తుభ్యమహం సంప్రదదే న మమ/*' - ఇత్యుక్త్వా,

---

161 ఆ తర్వాత ప్రాణాయామము చేసి, '*ఇడావాచనకర్మాంగం ---సంప్రదదే న మమ*' అని సంకల్పించి, '*హిరణ్యగర్భగర్భస్థం*' అను శ్లోకమును చెప్పి హిరణ్యమును (చిల్లర రూపాయలను) ఒక శ్రోత్రియునకు దానమీయవలెను. సంకల్పములో గీతలుంచిన చోట వరుసగా దాన గ్రహీతయొక్క గోత్రమును, పేరును చెప్పవలెను.

*"హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*

ఇతి నాందీచతుర్వింశతిబ్రాహ్మణభోజనప్రత్యామ్నాయం యత్కించిత్ హిరణ్యం బ్రాహ్మణాయ దద్యాత్।

## హిరణ్యరూపేణాభ్యుదయకమ్

సంకల్పః:[162]ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ అస్య కుమారస్య (కుమార్యాః) ఆయుష్యాభివృద్ధ్యర్థం----కర్మాంగం అభ్యుదయకం కరిష్యే।అభ్యుదయక బ్రాహ్మణభోజన ఆసనాచ్ఛాదన ప్రత్యామ్నాయమిదం యథాశక్తి హిరణ్యం ----గోత్రాయ ----శర్మణేవైష్ణవాయ తుభ్యమహం సంప్రదదే న మమ*।' - ఇత్యుక్త్వా, బ్రాహ్మణస్య పురతోఽన్నశ్రాద్ధాత్ చతుర్గుణం హిరణ్యం

---

162 గర్భాధానాదులవంటి కర్మల చివర విధింపబడిన అభ్యుదయమందు నాందీదేవతలను కర్మాంతమువఱకు గృహములో నుండుమని కోరు నవసరముండదు. అందుచే దీనిని లఘువుగా, హిరణ్యదానరూపకముగా చేయుట యుక్తముగా నుండును. వీరరాఘవసూరిగారి 'ప్రయోగచంద్రిక'లో నిచ్చినట్లుగా ఈవిధానము వ్రాయబడుచున్నది. దీనికై కర్త ప్రాణాయామము చేసి '*పూర్వోక్త ఏవంగుణ--- సంప్రదదే నమమ*' - అని సంకల్పించి అన్నశ్రాద్ధమునకు నాల్గురెట్లు విలువగల హిరణ్యమును (చిల్లర రూపాయలను) ఒక బ్రాహ్మణుని ముందుంచి, '*ఏకో విష్ణుర్మహద్భూతం*', '*హిరణ్యగర్భగర్భస్థం*' అను రెండు శ్లోకములను చెప్పి, '*అనేన హిరణ్యరూపేణాభ్యుదయశ్రాద్ధేన --- భగవాన్ శ్రీజనార్దనః ప్రీయతామ్*।' పర్యంతము చెప్పి, హిరణ్యముపై అక్షతోదకమును విడిచి తాంబూలదక్షిణలతో ఒక శ్రోత్రియునకు దానమీయవలెను. సంకల్పములో గీతలుంచిన చోట వరుసగా ప్రధానకర్మపేరును, దానగ్రహీతయొక్క గోత్రమును, పేరును చెప్పవలెను. పుత్రికవిషయంలో బ్రాకెట్లలో నిచ్చిన కుమార్యాః అని చెప్పవలెను. పితృ,మాతృ,మాతామహులలో ఎవరైన జీవితులున్నచో '*నాందీముఖమాతృపితామహీప్రపితామహీరూపీ, నాందీముఖపితృపితామహప్రపితామహరూపీ, నాందీముఖమాతామహమాతుఃపితామహమాతుఃప్రపితామహరూపీ*' అను వాక్యములను తగునట్లు మార్చి చెప్పవలెను.

నిధాయ,

*"హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*
*యజ్ఞేశ్వరో హవ్యసమస్తకవ్యభోక్తావ్యయాత్మా హరిరీశ్వరోఽత్ర।*
*తత్సన్నిధానా దపయాన్తు సద్యః రక్షాంస్యశేషాణ్యసురాశ్చ సర్వే॥*
*ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః।*
*త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుజ్క్తే విశ్వభుగవ్యయః॥"*

ఇత్యుచ్చార్య,

*'అనేన హిరణ్యరూపేణాభ్యుదయశ్రాద్ధేన వసుసత్యాఖ్యవిశ్వేదేవరూపీ, నాందీముఖ మాతృపితామహీప్రపితామహీరూపీ, నాందీముఖపితృపితామహప్రపితామహరూపీ, నాందీముఖమాతామహమాతుః పితామహమాతుఃప్రపితామహ పత్నీ సహితరూపీ, అభ్యుదయశ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణురూపీ, సర్వాకారో భగవాన్ స ఏవ శ్రీజనార్దనః ప్రీయతామ్।'*

ఇతి హిరణ్యోపరి సాక్షతోదక ముత్సృజ్య తాంబూలదక్షిణాదీని విప్రాయ దద్యాత్.

## మతాంకవిధానము

'పూర్వప్రయోగానుక్రమణిక' అను గ్రంథములో శ్రీమాన్ కందాళై శ్రీనివాసాచార్యుల వారు చెప్పిన హిరణ్యరూపకాభ్యదయకము పైదానికంటె భిన్నముగా, ఈరీతిగా నున్నది. పైవిధముగా సంకల్పించిన పిమ్మట, ఒక పళ్లెములోగాని, మోదుగవిస్తరాకు లో గాని బియ్యమును పోసి, సమముగా నేర్చి, ఆబియ్యముపై నొక నీటితో నింపిన కలశమును పెట్టి, ఆ కలశములోపైకి కొనలుండునట్లుగా నొక కూర్చమును, మామిడి కొమ్మను పెట్టి, ఆకలశము చుట్టును 8 దిక్కులా నీటిలో తడిపిన పసుపు అక్షతలనుంచి అలంకరించి, కుడి అఱచేతిలో పసుపు అక్షతలను, దక్షిణను ఉంచుకొని, అందులో కొంచెము నీటిని పోసికొని, 'అభ్యుదయార్థ మష్టౌ బ్రాహ్మణాన్ భోజయిష్యే' అని చెప్పుచు, ఆకుడిచేతిని ప్రదక్షిణముగా కలశము చుట్టును త్రిప్పి, ఆకులో వాయవ్యము

నకు  వదలిపెట్టవలెను. ఇదియే హిరణ్యరూపకాభ్యుదయమని వారు వ్రాసినారు. కాని ఇట్లు చేయుట అధమపక్షముగా దోచుచున్నది.

# జాతకర్మప్రయోగః

(‘*జాతే కుమారే దివానక్తం వా పితా సచేలః సుస్నాతః తత్క్షణాత్తిథివారాదిక మవిచార్య జాతకర్మ కుర్యాత్*’ – అనగా భార్య కుమారుని కనినదని తెలియగానే రాత్రిగాని పగలు గాని, భర్త సచేలస్నానమును చేసి తత్క్షణమే తిథివారముల బాగోగులను విచారింపక జాతకర్మ చేయవలెను’ అని ఈసూత్రవాక్యమున కర్థము. ఇట్లు పూర్వకాలమున ఎవరు చేయుచుండిరో కాని, ఈకాలమున నిట్లు చేయుటకు వీలుపడుటలేదు. పదిరోజుల వరకు జాతాశౌచముండును గనుక పదిరోజులు గడచిన పిదప 11వ రోజున ఉదయము శుద్ధిస్నానమును చేసి, జాతకర్మను చేయుచున్నారు. నామకరణమును గూడ అనాడే చేయవలెనని ఆపస్తంబాదిగృహ్యసూత్రములు తెల్పుచున్నవి. ‘*దశమ్యాముత్థానం దశమ్యాం ద్వాదశ్యాం వా నామకరణమ్*’ - అని బోధాయనసూత్రముండుటచే, నామ కరణమును 11వ నాడు చేయజాలనిచో 12వ నాడును చేయవచ్చును. అదియు సాధ్యము గానిచో , ఆతర్వాత ఒక మంచి దినమును చూచుకొని చేయవచ్చును. కాని జాతకర్మను 11వ నాడు చేయుటయే సామాన్యముగా జరుగుచున్నది. దీని ప్రయోగ మధోలిఖితవిధముగా నున్నది.)

*సంకల్పః:* [163]కర్తా ఆచమ్య, ద్విః ప్రాణానాయమ్య, ప్రధానసంకల్పే(పుట:30) “*అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ---నక్షత్రే మద్ధర్మ-పత్న్యాం జాతమిమం కుమారం జాతకర్మణా సగ్గ్స్కరిష్యామి/*” - ఇత్యుక్త్వా,

---

*163* 11వనాడు భార్యాకుమారులు శుద్ధిస్నానమును చేసిన తర్వాత కర్త తానును శుద్ధిస్నానమును చేసి, సంధ్యావందనాదులను ముగించుకొని, వారితోబాటు మంగళవేదికకు వచ్చి, ఆ వేదికకు పశ్చిమమున పీటలకు వెనుక పత్నీసుతులు తనయొక్క కుడికి ఉండునట్లు తూర్పు ముఖముగా నిలుచుండి, మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా పరిషదనుజ్ఞను పొంది, పీటలపై కూర్చొని, రెండుసార్లు ప్రాణాయామమును చేసి, ప్రధానసంకల్పమును చెప్పవలెను. పరిషత్ప్రార్థనమందును, ప్రధానసంకల్పమునందును ‘*అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం మద్ధర్మపత్న్యాం జాతమిమం కుమారం జాతకర్మణా సగ్గ్స్కరిష్యామి*’ – అని చెప్పవలెను. అట్లు చెప్పి, ‘తత్కర్మాంగమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే’ అని చెప్పి

*‘తత్కర్మాంగమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే’* - ఇత్యుక్త్వా విష్వక్సేనారాధనం చ కృత్వా, ‘దివస్పరి’ ఇత్యనువాకేన సపవిత్రదక్షిణపాణినా కుమార మభిమృశేత్.

## ‘దివస్పరి’ - ఇత్యనువాకః

*దివస్పరి ప్రథమం జజ్ఞే అగ్నిరస్మ ద్ద్వితీయం పరి జాతవేదాః/ తృతీయమప్సు నృమణా అజస్రమిన్ధాన ఏనం జరతే స్వాధీః/ విద్మా తే అగ్నే త్రేధా త్రయాణి విద్మా తే సద్మ విభృతం పురుత్రా/ విద్మా తే నామ పరమం గుహా యద్విద్మా తముత్సం యత ఆజగన్థ/ సముద్రే త్వా నృమణా అప్స్వన్తర్నృచక్షా ఈధే దివో అగ్న ఊధన్న్/ తృతీయే త్వా రజసి తస్థివాగ్ం సమృతస్య యోనౌ మహిషా అహిన్వన్న్/ అక్రన్ద-దగ్నిస్స్తనయన్నివ ద్యౌః క్షామా రేరిహద్వీరుధస్సమఞ్జన్న్/ సద్యో జజ్ఞానో విహీ-మిద్ధో అఖ్యదా రోదసీ భానునా భాత్యన్తః/ ఉశిక్పావకో అరతిస్సుమేధా మర్తేష్వగ్ని రమృతో నిధాయి/ ఇయర్తి ధూమమరుషం భరిభ్రదుచ్ఛుక్రేణ శోచిషా ద్యామినక్షత్/ విశ్వస్య కేతుర్భువనస్య గర్భ ఆ రోదసీ అపృణాజ్జాయమానః/ వీడుం చిదద్రిమభి-నత్పరాయఞ్జనా యదగ్నిమయజన్త పఞ్చ/ శ్రీణాముదారో ధరుణో రయీణాం మనీషాణాం ప్రార్పణస్సోమగోపాః/ వసోస్సూనుస్సహసో అప్సు రాజా విభాత్యగ్ర ఉషసామిధానః/ యస్తే అద్య కృణవద్భద్రశోచేఽపూపం దేవ ఘృతవన్తమగ్నే/ ప్ర తం నయ ప్రతరాం వస్యో అచ్ఛాభి ద్యుమ్నం దేవభక్తం యవిష్ఠ/ ఆ తం భజ సౌశ్రవ-సేష్వగ్న ఉక్థఉక్థ ఆ భజ శస్యమానే/ ప్రియస్సూర్యే ప్రియో అగ్నా భవాత్యుజ్జాతేన భినదదుజ్జనిత్వైః/ త్వామగ్నే యజమానా అను ద్యూన్ విశ్వా వసూని దధిరే వార్యాణి/ త్వయా సహ ద్రవిణమిచ్ఛమానా వ్రజం గోమన్తముశిజో వివవ్రుః/ దృశానో రుక్మ ఉర్వ్యా వ్యద్యౌద్దుర్మర్షమాయుశ్శ్రియే రుచానః/ అగ్నిరమృతో అభవద్వయో-భిర్యదేనం ద్యౌరజనయథ్సురేతాః/* (తై.సం.4-2-2)

---

రెండవ అధ్యాయములో చెప్పినట్లుగా అదియు చేసి, ‘దివస్పరి’ అను మంత్రమును పఠించి పవిత్రసహితమైన కుడిచేతితో శిశువు నొకసారి తాకవలెను.

(అన్తే సకృదభిమృశతి = ఈమంత్రాంతమున నొకసారి తండ్రి శిశువును తాకును)

[164]వా॥‘ అస్మిన్నహమ్’ ఇతి యజుషా కర్తా స్వాఙ్కే కుమారం నిధాయ,

*మం॥ అస్మిన్న హగ్ం సహస్రం పుష్యామ్యేధమానాస్స్వే వశే॥*(తై.మం.పా.2.11)

[165]వా॥ ‘ అంగాదంగాత్’ ఇతి ద్వాభ్యాం కుమారమభిమన్త్ర్య, పునశ్చ తాభ్యాం శిశో ర్మూర్ధన్యవఘ్రాయ,పునశ్చ తావేవ మన్త్రౌ తస్య దక్షిణకర్ణే జపేత్। అత్రాభిమంత్రణావ ఘ్రాణజపేషు త్రిష్వప్యసౌశబ్దే కుమారస్య జాతనక్షత్రం సంబుద్ధ్యా రహస్యం నిర్దిశేత్।

*మం॥ అంగాదంగాత్సం భవసి హృదయాదధి జాయసే।ఆత్మా వై పుత్రనామాఽసి స జీవ శరదశ్శతమ్॥ అశ్మా భవ పరశుర్భవ హిరణ్యమస్తృతం భవ।పశూనాం త్వా హింకారేణాభిజిఘ్రామి (అసౌ)* ॥(తై.మం.పా.2.11,12)

[166]శ్లో॥ రో,రే,మ,మృ,జ్యే,చి,షు వృద్ధిరాదౌ। ష్ఠాత్పేచవాన్త్య శ్శ్రవణాఽఽశ్వయుక్షు।
శేషేషు నామ్నోః క,ప,రస్స్వరోఽన్త్యః। స్వాపోర్వదీర్ఘస్సవిసర్గ ఇష్టః॥

---

*164* తర్వాత ‘ అస్మిన్నహగ్ం’ ఇతి యజుషా=‘ అస్మిన్నహగ్ం’ అనుమంత్రముతో, కర్తా= తండ్రి, స్వాఙ్కే= తన ఒడిలోన, కుమారం=శిశువును, నిధాయ=ఉంచుకొని,

165‘ అంగాదంగాత్’ ఇతి ద్వాభ్యాం=‘ అంగాదంగాత్’, ‘ అశ్మాభవ’ అను రెండుమంత్రములతో, కుమారం=శిశువును,అభిమన్త్ర్య=హృదయమందభిమంత్రించి,పునశ్చ=మఱల,తాభ్యాం= ఆ రెండుమంత్రములతోనే, శిశోః=శిశువుయొక్క, మూర్ధని=తలను,అవఘ్రాయ=వాసన చూచి, పునశ్చ=మఱల, తే ఏవ మన్త్రౌ=ఆరెండు మంత్రములనే, తస్య=శిశువుయొక్క, దక్షిణకర్ణే= కుడిచెవిలో, జపేత్=జపించవలెను.అత్ర=ఇచ్చట, అభిమంత్రణావఘ్రాణజపేషు త్రిష్వపి= అభి మంత్రణము, అవఘ్రాణము, మంత్రజపము, మూడింటియందు కూడ, అసౌశబ్దే=(రెండవ మంత్ర ములో) అసౌ అను శబ్దమున్నచోట, కుమారస్య జాతనక్షత్రం=శిశువుయొక్క నక్షత్రనామ మును, సంబుద్ధ్యా=సంబోధనప్రథమావిభక్తిలో, రహస్యం=రహస్యముగా, అనగా ఇతరులకు వినపడకుండ (క్రింది ‘ రోరేమృజ్యేచిషు’ అనుశ్లోకములో నిచ్చినట్లుగా), నిర్దిశేత్=చెప్పవలెను.

166 ఈశ్లోకనిర్దేశప్రకారము సిద్ధించు 27 సంబోధనరూపనక్షత్రనామములు ‘ తత్ప్రకారస్తు’ అను వాక్యములో నీయబడినవి. కుమారునియొక్క జన్మనక్షత్రమునుబట్టి ఈ 27 పేర్లలో నొకపేరు నెన్నుకొని ‘ అసౌ’ అను పదమునకు బదులుగా ఆపేరును రహస్యముగా చెప్పవలెను.

తత్ప్రకారస్తు : ఆశ్వయుజ(అశ్వయుక్), ఆపభరణ, కృత్తిక, రౌహిణ, మార్గశీర్ష, ఆర్ద్రక, పునర్వసో, పుష్య(తిష్య), ఆశ్లేష, మాఘ, పూర్వఫల్గున, ఉత్తరఫల్గున, హస్త, చైత్ర, స్వాతే, విశాఖ, అనూరాధ, జ్యైష్ఠ, మూలక, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణ (శ్రావణ), శ్రవిష్ఠ(ధనిష్ఠ), శతభిషక్(శాతభిషజ), పూర్వప్రోష్ఠపాద, ఉత్తరప్రోష్ఠపాద, రైవత -ఇతి॥

(అత్ర నక్షత్రనామశ్లోకాః:

శ్లో॥ కృత్తికా రౌహిణోఽశ్వయుక్తిష్యశ్చైత్రః పునర్వసుః।
మాఘోఽపభరణశ్చైవ తథా శతభిషక్పునః॥
విశాఖో రైవతో హస్తస్స్వాతి రాశ్వయుజోఽపి వా।
అనూరాధ శ్శ్రవిష్ఠశ్చ శ్రవణ శ్శ్రావణోఽపి వా॥
ఆషాఢః ప్రోష్ఠపాదశ్చ ఫల్గునశ్చ తథా పునః।
జ్యైష్ఠశ్చ శాతభిషజస్తథాశ్లేషశ్చ మూలకః॥
ఆర్ద్రకో మార్గశీర్షశ్చ సూక్తవాక ఇమాని వై।
)

[167]సూ॥ (సౌవర్ణాదిపాత్రే) మధుఘృతమితి సగ్ంసృజ్య, తస్మిన్ దర్భేణ హిరణ్యం నిష్టర్క్యం గ్రన్థిం బధ్వాఽవదాయ, 'మేధాం తే' తి చతుర్భిః కుమారం ప్రాశయిత్వా,

167 తరువాత, మధు=తేనె, ఘృతమ్=నేయి, ఇతి=ఈరెంటిని, సగ్ంసృజ్య=ఒకబంగారు (లేక వెండి) పాత్రలో కలిపి, దర్భేణ=ఒకదర్భతో, నిష్టర్క్యం గ్రన్థిం =జట్టుముడివలెవేసి, హిరణ్యం =ఒకబంగరుటుంగరమును, బధ్వా=కట్టి, అవదాయ=ఆబంగరుటుంగరముతో ఆ తేనెనేతి మిశ్రమమును తీసికొని, ఉత్తరైర్మన్త్రైః =చెప్పబోవు 'మేధాం తే సవితా', 'త్వయి మేధాం' అను నాల్గుమంత్రములను చదివి, కుమారం =శిశువును, ప్రాశయిత్వా = నాకించి, (అనగా 'మేధాం తే' ఇత్యాది నాల్గుమంత్రములను చదివి ఒకవెండిపాత్రలో కలిపియుంచిన తేనె,నేతి మిశ్రమమును ఒక దర్భ ముడివేసి కట్టిన బంగారుటుంగరముతో నద్దుకొని, ఆఉంగరముతోనే ఒకసారి శిశువు యొక్క నాలుకకు రాచవలెనని తాత్పర్యము.)

మం॥ *మేధాం తే దేవస్సవితా మేధాం దేవీ సరస్వతీ/మేధాం తే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజా/ త్వయి మేధాం త్వయి ప్రజాం త్వయ్యగ్నిస్తేజో దధాతు/ త్వయి మేధాం త్వయి ప్రజాం త్వయీంద్ర ఇన్ద్రియం దధాతు/ త్వయి మేధాం త్వయి ప్రజాం త్వయి సూర్యో భ్రాజో దధాతు//* (తై.మం.పా.2.12)

[168]సూ॥ ప్రాశనం చతుర్ణామన్తే సకృదేవ। 'క్షేత్రియైత్వే' తి పంచభిః స్నాపయిత్వా।

*1. క్షేత్రియై త్వా నిర్ఋత్యై త్వా ద్రుహో ముంచామి వరుణస్య పాశాత్/అనాగసం బ్రహ్మణే త్వా కరోమి/ శివే తే ద్యావాపృథివీ ఉభే ఇమే//*
*2. శం తే అగ్నిస్సహాద్భిరస్తు శం ద్యావాపృథివీ సహౌషధీభిః/ శమన్తరిక్షగ్ం సహ వాతేన తే శం తే చతస్రః ప్రదిశో భవన్తు//*
*3. యా దైవీశ్చతస్రః ప్రదిశో వాతపత్నీరభి సూర్యో విచష్టే/ తాసాం త్వాఽఽజరస ఆ దధామి ప్ర యక్ష్మ ఏతు నిర్ఋతిం పరాచైః//*
*4.అమోచి యక్ష్మాద్దురితాదవర్త్యై ద్రుహః పాశాన్నిర్ఋత్యై చోదమోచి/ అహా అవర్తిమవిదథ్స్యోనమప్యభూద్భద్రే సుకృతస్య లోకే//*
*5. సూర్యమృతం తమసో గ్రాహ్యా యద్దేవా అముఞ్చన్నసృజన్వ్యేనసః/ ఏవమహమిమం క్షేత్రియాజ్జామిశగ్ంసాద్ద్రుహో ముంచామి వరుణస్య పాశాత్//*

[169]సూ॥ స్నానం పంచానామన్తే సకృదేవ। దధిఘృతమితి సగ్ంసృజ్య కాంస్యేన పృష

---

168 చతుర్ణామన్తే =పైనాల్గు మంత్రముల చివర, ప్రాశనం=మధుఘృతమిశ్రమమును నాకించుట, సకృదేవ=ఒకసారిమాత్రమే (చేయవలెను). (తరువాత) క్షేత్రియైత్వేతి పంచభిః= (ముందొసగిన) 'క్షేత్రియైత్వా' ఇత్యాది ఐదుమంత్రములతో, స్నాపయిత్వా=కుమారుని స్నానము చేయించి, (అనగా ముందొసగిన ఐదుమంత్రములను చదివి కుమారుని స్నానము చేయించవలెను, అది అసాధ్యమైన ఒకసారి కూర్చతో ప్రోక్షింపవలెను– అని తాత్పర్యము)
169పంచానామన్తే= పై ఐదుమంత్రముల చివర, స్నానం= స్నానము (కూర్చతో ప్రోక్షించుట), సకృదేవ=ఒకసారిమాత్రమే (చేయవలెను). (తరువాత)దధిఘృతమితి=పెరుగు,నేయి- వీటిని,

దాజ్యం వ్యాహృతీభి రోఙ్కారచతుర్థాభిః తత్తేనైవ పాత్రేణ కుమారం ప్రాశయిత్వా|
అద్భిశ్శేషగ్ంసగ్ంసృజ్య గోష్ఠే నినయేదన్యో వా నినయేత్|

మం|| *భూస్స్వాహా/ భువస్స్వాహా/ సువస్స్వాహా/ ఓగ్ం స్వాహా/*

[170]వా|| 'మా తే కుమార' మితి మాతురుపస్థే కుమారమాధాయ|

మం|| *మాతే కుమారగ్ం రక్షో వధీన్మా ధేనురత్యాసారిణీ/ ప్రియా ధనస్య భూయా ఏధమానా స్వే గృహే/*(తై.మం.పా.2.13)

[171]వా|| 'అయం కుమారః' ఇతి మాత్రాదక్షిణస్తనం శిశుం పాయయిత్వా|

మం|| *అయం కుమారో జరాన్ధయతు దీర్ఘమాయుః/యస్మై త్వగ్గ్ స్తన ప్రప్యాయాయుర్వర్చో యశో బలమ్//*(తై.మం.పా.2.13)

[172]సూ|| యద్భూమేరితి ద్వాభ్యాం దక్షిణహస్తేన పృథివీమభిమంత్ర్య|

---

కాంస్యేన=కంచుపాత్రలో (లేక వెండిపాత్రలో), సగ్ంసృజ్య= కలిపి, పృషదాజ్యం=పెరుగుతో కలిపిన నేతిని, వ్యాహృతీభిః=(మూడు) వ్యాహృతులు, ఓఙ్కారచతుర్థాభిః=(ఒక) ఓంకారము –ఈనాల్గింటితో, కుమారం=శిశువును, తత్తేనైవపాత్రేణ= ఆపాత్రతోడనే, ప్రాశయిత్వా= నాకించి, శేషగ్ం=నాకగా మిగిలిన మిశ్రమును, అద్భిః=నీటితో, సగ్ంసృజ్య=కలిపి, గోష్ఠే= (ఆవుల)కొట్టములో, నినయేత్=ఉంచవలెను, అన్యో వా=లేదా వేరొకచోట, నినయేత్=ఉంచ వలెను (అనగా ఒకకంచు (లేక వెండి)పాత్రలోపెరుగు,నేయి మిశ్రణము చేసి, క్రింద నిచ్చిన నాల్గు స్వాహాకారములు పల్కి, ఆపాత్రలోని మిశ్రణమును ఆ పాత్రచేతనే శిశువుచే నాకించి, నాకగా మిగిలిన మిశ్రణమునకు నీటిని కలిపి ఆవుల కొట్టములోనో, లేదా వేఱొక ఎవరు త్రొక్కని చోటనో ఉంచవలెనని తాత్పర్యము.)

170 తదుపరి, 'మాతే కుమారగ్ం' అను మంత్రముతో, కుమారం=తన ఒడిలోనికుమారుని, మాతుః=తల్లియొక్క, ఉపస్థే=ఒడిలో, ఆధాయ= ఉంచి,

171'అయం కుమారో' అను మంత్రముతో శిశువునకు,మాత్రా=తల్లి చేత, దక్షిణస్తనం=కుడిచంటి పాలను, పాయయిత్వా= త్రాగించి,

172 తరువాతి 'యద్భూమేర్హృదయం', 'యత్తే సుసీమే' అను మంత్రములతో కర్త భూమిని కుడి చేతితో అభిమంత్రించవలెను.

మం॥ *యదూభ్యామ్బృదయం దివి చంద్రమసి శ్రితమ్/ తదుర్వీ పశ్యం మాఽహం పౌత్ర మఘగ్ం రుదమ్// యత్తే సుసీమే హృదయం వేదాహం తత్ప్రజాపతౌ/ వేదామ తస్య తే వయం మాఽహం పౌత్ర మఘగ్ం రుదమ్//*(తై.మం.పా.2.13)

[173]సూ॥ తత్ర ప్రాక్ఛిరసం కుమారం తూష్ణీం శాయయిత్వా, నామయతీతి యజుషా కుమారమభిమృశతి।

మం॥ *నామయతి న రుదతి యత్ర వయం వదామసి యత్ర చాభిమృశామసి/* (తై.మం.పా.2.13)

[174]సూ॥ 'అపస్సుప్తే' ష్వితి యజుషా కుమారస్య శిరస్సమీపే ఉదకుంభం నిధాయ।

మం॥ *ఆపస్సుప్తేషు జాగ్రత రక్షాగ్ంసి నిరితోనుదధ్వమ్/* (తై.మం.పా.2.13)

## ఫలీకరణహోమః

[175]ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణ విశిష్టాయా మస్యాం శుభతిథౌ అస్య కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం, చండాలాదిపిశాచేభ్యో రక్షణార్థం ఫలీకరణహోమం*

173 అట్లు అభిమంత్రించిన భూమిపై తల్లి కుమారుని అమంత్రకముగా తూర్పునకు తలచేసి పండబెట్టవలెను. అట్టి కుమారుని తండ్రి 'నామయతి' అను మంత్రముతో తాకవలెను.

174 పిదప 'ఆపస్సుప్తేషు' అను మంత్రముతో కుమారుని తలవైపు ఉదకుంభము నుంచవలెను.

175 తరువాత ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవం గుణవిశిష్టాయా మస్యాం శుభ తిథౌ--- ఫలీకరణహోమం కరిష్యే,* ' – అని సంకల్పించి, శ్రోత్రియాగారమునుండి అగ్నిని తీసికొని వచ్చి, అగ్నిప్రతిష్ఠాపనము ఉల్లేఖనాది పరిస్తరణాంతము చేసి, దర్వీసంస్కారమువలెనే కర్త యొక్క దోసిలిని సంస్కారము చేసికొని, అమంత్రకముగా అగ్ని చుట్టును పరిషేచనము చేసి , తెల్ల ఆవాలు, తవుడు (ఫలీకరణము=తవుడు) కలిపిన మిశ్రణమును దోసిటిలోనికి తీసికొనుచు, క్రింద నిచ్చిన 8 మంత్రములను చెప్పుచు, మంత్రయుతస్వాహాకారముతో నొకసారి, తరువాత కేవలస్వాహాకారముతో రెండు సార్లు, ఇట్లు 8*3=24 సార్లు ఆమిశ్రణము నగ్నిలో వేయుచు ఫలీకరణహోమము చేయవలెను.(సూచన:ఇచ్చట అగ్నిముఖవిధానము తెనుగువివరణ లేకుండ వ్రాయబడినది. వివరణకై చతుష్పాత్రప్రయోగమును చూచునది.)

*కరిష్యే'* – ఇతి సంకల్ప్య। స్థండిలం కల్పయిత్వా। ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్। అవాక్కరోభ్యుక్ష్య। తృణం నైఋత్యాం నిరస్య। అప ఉపస్పృశ్య। "*ఓం భూర్భువస్సువరోమ్"*– ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య। నిధాయ వహ్నిం। ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్। అగ్ని మిధ్వా (ప్రజ్వాల్య)। పరిసమూహ్య।

*1. ఓం అగ్నయే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10. సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః)–* ఇత్యక్షతైరలంకృత్య। ప్రాగగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్। దర్వీవదఞ్జలిం సంస్కృత్య। తూష్ణీమగ్నిం పరిషిచ్య।గౌరసర్షపాన్ ఫలీకరణమిశ్రాన్ ' అయంకలి' మిత్యష్టభిర్మంత్రైరంజలినా ప్రతిమంత్రం త్రిః ప్రతిస్వాహాకారాంతం జుహోతి। (తై.మం.పా.2.13)

1. *ఓం అయం కలిం పతయన్తగ్గ్ శ్వానమివోద్వృద్ధమ్। అజాం వాశితామివ మరుతః పర్యాధ్వగ్గ్ స్వాహా। మరుద్భ్య ఇదం న మమ। స్వాహా। మరుద్భ్య ఇదం న మమ। స్వాహా। మరుద్భ్య ఇదం న మమ॥*
2. *శండేరథశ్శండికేర ఉలూఖలః। చ్యవనో నశ్యతాదితస్స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా। అగ్నయ ఇదం న మమ॥*
3. *అయశ్శండో మర్క ఉపవీర ఉలూఖలః।చ్యవనో నశ్యతాదితస్స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా। అగ్నయ ఇదం నమమ। స్వాహా। అగ్నయ ఇదం న మమ॥*
4. *కేశినీశ్వలోమినీః ఖజాపోఽజోపకాశినీః। అపేత నశ్యతాదితస్స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా। అగ్నయ ఇదం న మమ॥*
5. *మిశ్రవాససః కౌబేరకా రక్షోరాజేన ప్రేషితాః। గ్రామగ్ం సజానయో గచ్ఛన్తీచ్ఛన్తోఽపరిదాకృతాన్త్స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా।అగ్నయ ఇదం న మమ।*

*స్వాహా॥ అగ్నయ ఇదం న మమ॥*

6. *ఏతాన్ ఘ్నతైతాన్ గృహ్ణీతేత్యయం బ్రహ్మణస్పుత్రః। తానగ్నిః పర్యసరత్తానింద్రస్తాన్బృహస్పతిః। తానహం వేద బ్రాహ్మణః ప్రమృశతః కూటదన్తాన్వికేశాన్ లంబనస్తనాన్స్వాహా॥ అగ్నీంద్రాబృహస్పతిభ్య ఇదం న మమ। స్వాహా॥ అగ్నీంద్రాబృహస్పతిభ్య ఇదం న మమ। స్వాహా॥ అగ్నీంద్రాబృహస్పతిభ్య ఇదం న మమ॥*

7. *నక్తంచారిణ ఉరస్పేశాఞ్ఛూలహస్తాన్కపాలపాన్। పూర్వ ఏషాం పితేత్యుచ్చైశ్శ్రావ్యకర్ణకః। మాతా జఘన్యా సర్పతి గ్రామే విధురమిచ్ఛన్తీ స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా॥ అగ్నయ ఇదం న మమ। స్వాహా॥ అగ్నయ ఇదం న మమ॥*

8. *నిశీథచారిణీ స్వసా సంధినా ప్రేక్షతే కులమ్। యా స్వపన్తం బోధయతి యస్యై విజాతాయాం మనః। తాసాం త్వం కృష్ణవర్త్మనే క్లోమానగ్ం హృదయం యకృత్। అగ్నే అక్షీణి నిర్దహ స్వాహా। అగ్నయ ఇదం న మమ। స్వాహా॥ అగ్నయ ఇదం న మమ। స్వాహా॥ అగ్నయ ఇదం న మమ॥*

[176]సూ॥ ప్రవిష్టే ప్రవిష్టే ఏవ తూష్ణీ మగ్నా వాపతతేతి। ఏవమహర మానిర్దశతాయాః। స్త్రీణాం హోమం వినా సర్వం తూష్ణీం కుర్యాత్।
[177]తూష్ణీమగ్నిం పరిషిచ్య। అగ్ని ముపస్థాయ। '*అనేన ఫలీకరణహోమేన భగవాన్*

---

176 ప్రవిష్టే ప్రవిష్టే =(సూతికాగృహములోనికి) ప్రవేశించునపుడెల్ల, ఏవ=ఇట్లే, తూష్ణీమ్=అమంత్రకముగా, అగ్నౌ=అగ్నియందు, ఆవపత=(ఫలీకరణమిశ్రణమును) వేయుడు, ఏవమ్=ఇట్లే, అహరహం=ప్రతిదినము, ఆనిర్దశతాయాః=పదిరోజులవరకు, ఇతి=అని (యజమానుడు సూతికాగృహపాలకుల నాదేశించుచున్నాడు). ఇది పూర్వకాలమున పుట్టిన వెంటనే జాతకర్మ చేసినప్పటి పద్ధతి. 11వరోజున జాతకర్మను చేయుచున్న ఈ కాలములో దీనితో పని లేదు. స్త్రీ శిశువునకు హోమము తక్క మిగితా కర్మనంతయు అమంత్రకముగా చేయవలెను.

177 తరువాత అమంత్రకముగా అగ్నిని పరిషేచనము చేసి, అగ్న్యుపస్థానమును చేసి, కర్త 'అనేన –బ్రువన్తు' అని ప్రార్థించి, సదస్యులచేత ' అస్య కుమారస్య—వృద్ధిరస్తు' అని చెప్పించుకొనవలెను. స్త్రీజాతకర్మలో ఈప్రార్థనాప్రత్యుక్తులందు బ్రాకెట్లలో నిచ్చిన రూపములను వాడవలెను.

*సర్వాత్మకస్సుప్రీణాతు।అస్య కుమారస్య (కుమార్యాః) ఆయుష్యాభివృద్ధిరస్త్వితి భవంతోబ్రువన్తు।'* – ఇతి ప్రార్థ్య. *'అస్య కుమారస్యాయుష్యాభివృద్ధిరస్తు (అస్య కుమార్యాః ఆయుష్యాభివృద్ధిరస్తు)'* –ఇతి ప్రత్యుత్తరం ప్రాప్య। జాతకర్మాంగ మభ్యుదయం పుణ్యాహం చ కుర్యాత్।

## అభ్యుదయమ్, పుణ్యాహవాచనం చ

ప్రాణానాయమ్య, *'---నక్షత్రే జాతస్య (జాతాయాః) అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) జాతకర్మాంగ మభ్యుదయం హిరణ్యరూపేణ కరిష్యే, పుణ్యాహం చ వాచయిష్యే'* - [178]ఇతి సంకల్ప్య, హిరణ్యేనాభ్యుదయం కృత్వా, శుద్ధిపుణ్యాహ వాచనం కుర్యాత్. పుణ్యాహజలేన కర్తా స్వయం, పత్నీం, కుమారం (కుమారీం), గృహం చ సమ్యక్ ప్రోక్షయేత్.

('అతః పక్వాన్నశ్రాద్ధం జాతకర్మణి నిషిద్ధమ్, కాలాంతరే న దోషః' – ఇతి పరాశరః)

---

178 తర్వాత అభ్యుదయమును, పుణ్యాహవాచనమును చేసి ముగించవలెను. దీనికై కర్త ప్రాణాయామమును చేసి, *'---నక్షత్రే జాతస్య అస్య కుమారస్య జాతకర్మాంగమభ్యుదయం హిరణ్యరూపేణ కరిష్యే, పుణ్యాహం చ వాచయిష్యే'* - అని గీతలుంచినచోట కుమారుని (లేక కుమార్తె) నక్షత్రమును చెప్పుచు సంకల్పించవలెను. కుమార్తెకు బ్రాకెట్లలో నిచ్చిన పదములను వాడవలెను. ఇట్లు సంకల్పించి, 'నాందీముఖము' అను అధ్యాయములో చెప్పినట్లుగా హిరణ్యరూపకముగ అభ్యుదయమును చేసి, 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో నిచ్చినట్లుగ పుణ్యాహ వాచనము చేసి, పుణ్యాహజలముచే కర్త తనను, భార్యను, కుమారుని(కుమార్తెను), ఇంటిని సమస్తమును ప్రోక్షించుకొనవలెను. ఇచ్చట 'అతః పక్వాన్నశ్రాద్ధం జాతకర్మణి నిషిద్ధమ్, కాలాంతరే న దోషః' – అని పరాశరుని వాక్యమున్నది. అనగా 'జాతకర్మలో చేయు నాందీశ్రాద్ధము అన్నరూపకముగా చేయరాదు. వేరే సమయములలో చేయవచ్చును.' – అని ఈవాక్యమున కర్థము. అందుచేత నాందీశ్రాద్ధమును (అభ్యుదయమును) హిరణ్యరూపకముగా చేయవలెనని ఇచ్చట చెప్పబడినది.

# జననకాలదోషశాన్తిః

శిశువుయొక్క జన్మసమయమందలి తిథి, వార, నక్షత్ర, యోగములలో కొన్ని శిశువు నకు, తల్లిదండ్రులకును, మేనమామవంటి ఇతరులకును దుష్టఫలితముల నిచ్చునని జ్యోతిశ్శాస్త్రము తెల్పుచున్నది. నిర్ణయసింధువు, ధర్మసింధువువంటి ధర్మశాస్త్రగ్రంథ ములలో దీని విచారము అధికముగా నున్నది. కావలసినవారు వివరముల్కై ఈగ్రంథ ములను చూడవలెను. ఈదోషముల పరిహారార్థమై వివిధములైన శాంతులు చేయ వలసియుండును. వీనికి చేయవలసిన శాంతు లనేకవిధములుగా ధర్మసింధువు ప్రతి పాదించుచున్నది. కాని ఈకాలములో నింత దీర్ఘముగా వీనిని చేయుట లేదు. సామా న్యముగా, దుష్టసమయమున పుట్టిన శిశువుముఖమును ప్రత్యక్షముగా గాక పరోక్షము గా నేతిపాత్రలో ప్రతిబింబింపగా జూచుట (దీనికే అజ్యావేక్షణ మని పేరు), నవగ్రహ పూజను చేయుట, నవగ్రహశాంతికై నవధాన్యముల బ్రాహ్మణులకు దానము చేయుట, నవగ్రహహోమమును, నక్షత్రహోమమును చేయుట, తత్కర్మాంగములుగా గ్రహ, నక్షత్రజపములు చేయుట– ఇట్లు వీటిని చేయుచున్నారు.

వర్జ్యమునందు, చెడు తిథివారముహూర్తములందుజన్మించుట, జన్మించిన నక్షత్రము యొక్క పాదము నిర్దుష్టమైనను నక్షత్రము చెడుదై యుండుట – ఇటువంటివి స్వల్ప దోషములు. వీనికి ఆజ్యావేక్షణమును మాత్రము చేయుచున్నారు. శిశువు జన్మించినట్టి నక్షత్రముయొక్క పాదములో దోషముండిన అది ఇంకను అధికదోషము. అందువలన దానికి ఆజ్యావేక్షణముతో పాటు నవగ్రహశాంతికై నవధాన్యదానములను, నక్షత్రమంత్ర జపమును చేయుచున్నారు. రోహిణి, మఖ, ఆశ్లేష, చిత్ర, జ్యేష్ఠ, మూల – ఇత్యాది నక్ష త్రములందు జన్మించిన అత్యధికదోషము. అందుచే దానికి ఆజ్యావేక్షణ, హోమశాంతు లను చేసి, చివరకు నవగ్రహదానములనుచేయుచున్నారు. ముందుగా జ్యోతిశ్శాస్త్రజ్ఞు లను, ధర్మసింధువువంటి గ్రంథములను సంప్రదించి, దోషతీవ్రతను గుర్తించి, దానికి తగి నట్లుగా శాంతిని చేసికొనవలెను.

'ముఖ్యకాలం ప్రవక్ష్యామి శాంతిహోమస్య యత్నతః, జాతస్య ద్వాదశాహేతు జన్మర్షే వా శుభేదినే' -అనగా జన్మాది 12వదినమందో, జన్మనక్షత్రమునందో, వేరొక శుభదిన

మందో శాంతిని చేయవలెనని దీని కర్థము. కాని 11వదినమున శుద్ధిస్నానానంతరము జననశాంతిని చేసి, జాతకర్మను, నామకరణమును చేయు అచారము కూడ ఉన్నది. జననశాంతి జన్మాది 21వ, 31వ దినములందును, 3వ, 5వ మాసములందును చేయుటయు జరుగుచున్నది. కాని శాంతి చేయవలసిన జననము జరిగినప్పుడు 11వ రోజు ఆశౌచనివృత్తి యైన పిమ్మట ఆజ్యావేక్షణ చేసి జననశాంతిని జేయుట యుక్తముగా దోచుచున్నది. ఇచ్చట 1. ఆజ్యావేక్షణము, 2. నవగ్రహదానశాంతి, 3.హోమవిధాన జననశాంతి – అను మూడు భాగములు గల ప్రయోగము చెప్పబడినది. దోషతీవ్రతను బట్టి ఇందులోని మొదటిభాగమును మాత్రమే కాని, మొదటి రెండు భాగములను మాత్రమే కాని, అన్ని భాగములనుగాని ఆచరింపవచ్చును. అన్నిభాగములను చేసినప్పుడు మొదట ఆజ్యావేక్షణము,తదుపరి హోమశాంతి, చివరకు నవగ్రహదానములు చేయుట ఆచారముగా నున్నది.

## ఆజ్యావేక్షణమ్

**పరిషదనుజ్ఞా:**[179]పుణ్యాహే దంపత్యోశ్చంద్రతారాబలాన్వితే పూర్వాహ్ణే యజమానః పత్నీ శిశుశ్చ మంగళస్నానం కృత్వా, యజమానః ధృతవస్త్రోర్ధ్వపుండ్రస్సన్, సంధ్యా వందనాది నిత్యకృత్యాని నిర్వర్త్య,రంగవల్లికాద్యలంకృతశుభవేదికా మధ్యే యవనికా

---

179 దంపతులకు చంద్రతారాబలములు సరిపోవు దినమున పూర్వాహ్ణమందే యజమానుడు తానును, భార్యయు, శిశువును మంగళస్నానములు చేసి, మడిబట్టలు, ఊర్ధ్వపుండ్రములు ధరించి, సంధ్యావందనాదులు ముగించుకొని, ముగ్గులతో నలంకృతమైన శుభవేదికకు దక్షిణ భాగమున నొక తెరను కట్టించి, ఆతెరవెనుక భార్యాశిశువులను తనకు కనపడకుండునట్లు పీటలపై కూర్చొనబెట్టి, వేదిక కుత్తరమున దక్షిణాభిముఖముగా బృహస్పతిని కూర్చుండ బెట్టి, ఒక తట్టలో ఫలపుష్పాక్షత దక్షిణలను పెట్టుకొని వేదికకు పశ్చిమమున (తాను కూర్చొను పీటలకు వెనుక) తూర్పుముఖముగా నిలుచుండి, 'ఓం నమస్సదసే ...' నుండి మొదలిడి 'మహాన్తో ఽను గృహ్ణన్తు' వరకు చెప్పుచు సభను ప్రార్థించి నమస్కరింపవలెను. అట్లు ప్రార్థింపగా, "ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు!"- అనిపరిషత్తు అనుగ్రహింపవలెను. అట్లు సభానుజ్ఞను పొంది కర్త వారికి ఫలదక్షిణాతాంబూలముల నిచ్చి ప్రధానసంకల్పమును చెప్పవలెను.

మంతరాం కారయిత్వా, యవనికాంతరే మాతృశిశూనుపవేశ్య, సమస్తసంభారాన్ సమీకృత్య, వేదికాయాః ఉత్తరభాగే బృహస్పతిం దక్షిణాభిముఖ ఉపవేశ్య, తాంబూలఫల పరిషద్దక్షిణాన్వితహరిద్రాక్షతపాత్రం హస్తేగృహీత్వా,వేదికాయాః పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ,

*"ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై। (తై.సం.3.2.4.14)।సప్రథ సభాం మే గోపాయ। యే చ సభ్యాస్సభాసదః। తానిన్ద్రియావతః కురు। సర్వమాయురుపాసతామ్। (తై.బ్రా.1.2.1.26)। సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః।"*

*స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే మమ పుత్రస్య (పుత్రికాయాః) జననశాన్తికర్మారంభస్సుముహూర్తోఽస్త్వితి మహాన్తోఽనుగృహ్ణన్తు। లగ్నస్య సర్వే గ్రహాశ్శుభైకాదశస్థానఫలదా స్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు। ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు।'* - ఇతి ప్రార్థ్య నమస్కుర్యాత్.' *తథాస్తు, ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు।'* - ఇతి పరిషద్వచనం ప్రాప్య,

*సంకల్పః:* [180]కర్తా దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, ఆచమ్య, ద్విః ప్రాణానాయమ్య,

---

[180] తర్వాత ఉద్దిష్టప్రధానకర్మార్థమై సంకల్పమును చేయవలెను. దీన్నికై తాను కూరుచుండు పీటపై కర్త రెండు ఉత్తరాగ్రపు దర్భలను వేసి, రెండుదర్భలను కుడివైపు మొలలో దోపికొని, పీటలపై కూర్చొని ఆచమించి, రెండుసార్లు ప్రాణాయామము చేసి, 'హరిరోం తత్సత్' నుండి మొదలిడి 'కరిష్యే' వరకు గల సంకల్పమును చెప్పవలెను. గీతలుంచిన చోట్లలో కావలసిన సంవత్సర అయన ఋతు తిథి వార నక్షత్రముల పేర్లు చెప్పుకొనవలెను.---నక్షత్రే--- చరణే అని ఉన్నచోట గీతలకు బదులు శిశువుయొక్క జన్మనక్షత్రముపేరును, ఆ నక్షత్రచరణసంఖ్యను (ప్రథమ,ద్వితీయ,తృతీయ,చతుర్థ - ఇత్యాదిగా) చేర్చి చెప్పవలెను. కుమార్తెకు బ్రాకెట్లలో నిచ్చిన పదములను వాడవలెను. అట్లు సంకల్పించి, 'స్వశేషభూతేమయా' అను శ్లోకమును

*‘‘హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ----నక్షత్రే ----చరణే జాతస్య (జాతాయాః) మమ పుత్రస్య (పుత్రికాయాః) జననకాలే తిథివారనక్షత్రచరణలగ్నేషు యో దోషస్సమజని తద్దోషపరిహారార్థం ఆవయోః శిశోశ్చ మాతులాదిబంధూనాం చ సకలగండనివృత్త్యర్థం ఆజ్యఘటే శిశోర్ముఖావలోకనం కరిష్యే, తత్కార్మాంగమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే* - ఇతి సంకల్ప్య

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, పూర్వోక్తవిధానేన విష్వక్సేనారాధనం కృత్వా,

## ఆజ్య(తైల)ఘటే ముఖావలోకనమ్

[181]సదస్యానామక్షతాం దత్వా, యవనికాంతికే తండులేషునిక్షిప్తాజ్యపాత్రే ‘రూపగ్ం రూప’ మితి మంత్రేణ శిశోర్ముఖప్రతిబింబం పశ్యేత్.

---

చెప్పి సాత్త్వికత్యాగమును చేసి, ఆతర్వాత ‘విష్వక్సేనారాధనవిధిః’ అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధనను చేయవలెను.

[181] తర్వాత సదస్యులకు పసుపు అక్షతల నిచ్చి, ఒక వెడల్పగు కంచుపాత్రలో బాగుగా నూనెను పోసి, అందులో నొక రాగినాణెమును వేసి, ఆ పాత్రను బియ్యముపై మాతాశిశువుల కడ్డముగా నుంచిన తెర దగ్గర నుంచవలెను. అప్పుడు తెర వెనుక నున్న తల్లి శిశువు ప్రతిబింబ మా నూనెలో కన్పడునట్లు శిశువును పట్టుకొనవలెను. ఆ ప్రతిబింబమును ‘రూపం రూప’ మను మంత్రమును పఠించి తండ్రి చూడవలెను. ఆ తర్వాత తెరను తీసివేయవలెను. సదస్యు లపుడు ‘కల్యాణ

మం|| *రూపం రూపం ప్రతిరూపో బభూవ తదస్య రూపం ప్రతిచక్షణాయ| ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే| యుక్తాహ్యస్య హరయశ్శతాదశ||*

తత స్సదస్యాః

శ్లో|| *కల్యాణజనకం పుణ్యం తథా కల్మషనాశనమ్|*
*ఆయుర్వృద్ధికరం యస్మాత్కుర్యాదాజ్యావలోకనమ్||*

'*అయం ఆజ్యావేక్షణ ముహూర్త స్సుముహూర్తోఽస్తు*'-ఇత్యక్షతై రాశీర్వచనం కుర్యుః|[182]తత్ర నారికేళం ప్రహార్య, కూర్చజలేన స్వీయ నేత్రే ప్రక్షాళ్య, భార్యాయాః శిశోః నేత్రాణి చ ప్రక్షాళనం కారయేత్|

[183]తతః పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, '*నిరీక్షితాజ్యదానం కరిష్యే*' -ఇతి సంకల్ప్య, ప్రతిగృహీతారం బ్రాహ్మణ మభ్యర్చ్య,

---

జనకం' అని శ్లోకమును చెప్పి, '*అయం ఆజ్యావేక్షణముహూర్త స్సుముహూర్తోఽస్తు*' అనుచు లోగడ తమ కిచ్చిన అక్షతలను దంపతులపై వేసి దీవించవలెను. (ఈకర్మకు 'ఆజ్యావేక్షణము =నేతిలో (శిశువును) చూచుట' – అని పేరున్నను, నేయికి బదులు నూనెనే వాడుచున్నారు. 'తామ్ర ఖండయుతం తైలం ఆజ్యమిత్యభిధీయతే =రాగి శకలముతో కూడిన నూనె నేతిగా తలంపబడును' అని ఉన్నందున నూనెలో నొక రాగినాణెమును వేసి ఆ నూనెను నేయిగా భావించి అందులో శిశురూపమును చూచుచున్నారు.)

[182] వెంటనే అచ్చట నొక టెంకాయను కొట్టి, కర్త కూర్చజలముతో తనకండ్లు తుడుచుకొని, కూర్చతో భార్యయొక్క కుడి అరచేతిలో నీటిని ఉంచి, ఆనీటితో అమెయొక్కయు, శిశువు యొక్కయు కండ్లను తుడుచుకొమ్మనవలెను.

[183]తర్వాత కర్త కాళ్లు కడుగుకొని, ఆచమనము చేసి, '*నిరీక్షితాజ్యదానం కరిష్యే*' అని సంకల్పించి, ఒక బ్రాహ్మణుని అర్చించి, క్రింద నిచ్చిన 'యాఽలక్ష్మీర్యచ్చ' అను శ్లోకమును చెప్పి, దక్షిణాతాంబూలములతో సహ ఆ ముఖావలోకనతైలమును బ్రాహ్మణునికి దానము చేసి, క్రింద నిచ్చినట్లుగా సంకల్పించి పుణ్యాహవాచనము చేయవలెను. సూచన: ఒకవేళ ఆజ్యావేక్షణానంతరము హోమశాన్తిని, నవగ్రహదానములను కూడ చేయుచున్నచో, అవన్నియు చేసిన పిమ్మట నీ పుణ్యాహవాచనమును చేయవలెను.

Commented [KD1]:

# నామకరణప్రయోగః

[206] సూ॥దశమ్యా ముత్థితాయాగ్ం స్నాతాయాం పుత్రస్య నామ దధాతి పితామా తేతి।
[207]శ్లో॥ నామాది నాందీకరణం పుణ్యాహం ద్విజభోజనమ్।
రక్షాబంధన మన్నాది, చౌలాద్యంకుర మేవ చ॥ 1

---

206 దశమ్యామ్=10వ దినాంతమున, అనగ 11వనాటి ప్రొద్దున, ఉత్థితాయాం స్నాతాయాం పుత్రస్య = సూతికాగృహమును విడిచి సుస్నాతుడైన పుత్రునికి, పితామాతా= తల్లిదండ్రులు, ఇతి=శాస్త్రోక్తవిధానముగా, నామ దధాతి = పేరును పెట్టుచున్నారు – అని ఈ సూత్రమునకు అర్థము. అనగా 11వనాటి ఉదయమున సుస్నాతుడైన పుత్రునకు ముందుగా జాతకర్మను చేసి, ఆ తర్వాత నామకరణమును చేయవలె ననుట. కాని ‘ద్వాదశే, షోడశే, అష్టాదశే, ద్వాత్రింశే వా’ – అను వాక్యముండుటచే, నామకరణమును 11వనాడు చేయనిచో, 12, లేక 16, లేక 18, 32వ దినమున చేయుటయు సశాస్త్రీయమే. ఆంధ్రదేశములో 21వనాడు నామకరణము చేసి శిశువును తొట్లెలో పరుండబెట్టుట ఆచారముగా నున్నది.

207 ఈనామకర్మకు అనుషంగికముగా అభ్యుదయము, పుణ్యాహవాచనము లున్నవి. వీని విషయమై పైనిచ్చిన నాల్గు కారికలున్నవి. ఇందులో మొదటి కారిక నామకరణాత్పూర్వము అభ్యుదయపుణ్యాహములను, అన్నప్రాశనమునకు ముందుగా రక్షాబంధనమును, చౌలమునకు ముందుగా అంకురారోపణము చేయవలెనని తెల్పుచున్నది. రెండవది నామకర్మయందు చేయు పుణ్యాహములో శిశువు పేరును చెప్పవలెనని తెల్పుచున్నది. మూడవకారిక జాతకర్మ నామకర్మలలో చివరికి పుణ్యాహమును చేయమనుచున్నది. ఇట్లిది మొదటికారికకు వ్యతిరేకముగా నున్నది. కాని రెండవకారిక నామకర్మలో వచ్చు పుణ్యాహములో శిశువు పేరును చెప్పవలె ననుట చేత, నామకర్మ ముగియనిదే శిశువు పేరు తెలియనందున, ఆపేరు తెలిసిన తర్వాత కర్మాంతమున పుణ్యాహము చేయుమనుటయే సతార్కికముగా నున్నది. ఐనను, కొందఱు మొదటికారికప్రకారమే ముందుగ అభ్యుదయమును, ‘శ్రీనివాసశర్మ’ అను కల్పితనామముతో పుణ్యాహమును చేసి, ఆతర్వాత నామకరణమును చేయుచున్నారు. మఱికొందఱు 3వ కారిక ప్రకారము నామకర్మను ముందుగ చేసి, రెండవకారికప్రకారము శిశువుయొక్క యథార్థనామమును చెప్పుచు నామకర్మాంతమున పుణ్యాహమును చేయుచున్నారు. ఇచ్చట నామకర్మాంతమున పుణ్యాహమును చేయు విధానమే చెప్పబడినది.

పుణ్యాహవాచనే నామ్ని మధ్యమే స్వస్తివాచనే।
ఉక్త్వా బాలకనామాస్మై స్వస్తీత్యన్యత్సమం భవేత్॥ 2
పుణ్యాహకాలం వక్ష్యామి పుంసి సంకల్పనాత్పరమ్।
జాతకర్మ సమాప్తౌతు సమాప్తే నామకర్మణి॥ 3
[208] కార్యేషు క్రియమాణేషు బహునా మథవా ద్వయోః।
రక్షాంకురౌ సకృత్కుర్యా న్నాందీహోమం పృథక్పృథక్॥ 4

## సంకల్పః

[209] ఆచమ్య, ప్రాణానాయమ్య, *శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణ ప్రీత్యర్థం మమ ధర్మపత్న్యాం ---- నక్షత్రజాతస్య (జాతాయాః) అస్య (అస్యాః) కుమారస్య (కుమార్యాః) సకల సత్పురుషమధ్యే సద్వ్యవహారార్థం నామ ధాస్యావహే।*

---

208 ఇట్లు 11వనాడు మొదట జాతకర్మ, తదుపరి నామకర్మ చేసినపుడు, ఈరెండు కర్మలలోను అభ్యుదయ, పుణ్యాహవాచనము లుండుటచే, వీటిని రెండు కర్మలకు ప్రత్యేకముగా చేయ వలెనా, లేక జాతకర్మలో చేసిన అభ్యుదయ, పుణ్యాహములే చాలునా అను సంశయము కల్గు చున్నది. దీనిని నాల్గవకారిక తీర్చుచున్నది. ఒకేసారి రెండుగాని, అంతకంటె ఎక్కువగా గాని కర్మలను చేయునప్పుడు రక్షాబంధనము, అంకురార్పణము ఒక్కసారి చేసిన చాలును; నాందీని, హోమములను ప్రతికర్మకు వేర్వేరుగా చేయవలెను – అని ఈకారిక కర్థము. నామ కర్మయందలి పుణ్యాహములో శిశునామమును చెప్పవలెననుటచే, ఈ అవసరములేని జాత కర్మయందలి పుణ్యాహమునకన్న, నామకర్మయందలి పుణ్యాహము వేరనుట స్పష్టము. అందుచే జాతకర్మకును, నామకర్మకును వేర్వేరుగా నాందీముఖమును (అభ్యుదయమును), పుణ్యాహమును చేయవలెను.

209 కర్త తన భార్యాశిశువులతో కర్మాచరణమున కనుకూలమైన శుభస్థలమును ప్రవేశించి, తన కుడికి భార్యాశిశువులుండునట్లు పీటలపై కూర్చొని, ఆచమించి, ప్రాణాయామము చేసి, 'శ్రీ భగవదాజ్ఞయా---భోజయిష్యే' పర్యంతము సంకల్పించి, 'నాందీముఖ'మనుఅధ్యాయము నందు చెప్పినట్లుగా హిరణ్యరూపకముగా అభ్యుదయమును చేసి నామకర్మ నారంభింప వలెను. సంకల్పములో గీతలున్నచోట శిశువుయొక్క జన్మనక్షత్రము పేరును చెప్పవలెను. బ్రాకెట్లలో నిచ్చిన పదములను ఆడశిశువునకు నామకరణము చేయునప్పుడు చెప్పవలెను.

*తత్కర్మాంగమభ్యుదయం కరిష్యే / అభ్యుదయార్థ మష్టౌబ్రాహ్మణాన్ భోజయిష్యే* – ఇతి సంకల్ప్య, హిరణ్యేనాభ్యుదయం కృత్వా,

## నామలేఖనమ్

[210] తండుల పూర్ణపాత్ర మేక మాదాయ। తస్మిన్ కూర్చేన (సువర్ణేన వా) ఉదగపవర్గం రేఖాద్వయం లిఖిత్వా। కూర్చేన (సువర్ణేన వా) ఆద్యంత శ్రీకారసంయుతాని శిశోః జన్మసంబంధ మాస, నక్షత్ర, వ్యావహారికనామాని లిఖిత్వా।

## మాసనామాని

[211]1. శ్లో॥ కుమారస్య మాసనామ మార్గశీర్షాది గణ్యతే।
కృష్ణోఽనన్తోఽచ్యుతశ్చక్రీవైకుంఠోఽథ జనార్దనః॥
2. శ్లో॥ ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవ స్తథా హరిః।
గోవిన్దః పుణ్డరీకాక్షో మాసనామాన్యనుక్రమాత్॥

---

210 విశాలమైన ఒకతట్టలో బియ్యమును పోసి, దానిని సమముగా నెరపి, అందులో కొన్ని పసుపు అక్షతలను, ఖర్జూరఫలములను చల్లి, ఆతట్టను తన కుడితొడపైపెట్టుకొని పైన, మధ్యన, క్రింద మూడుగడు లేర్పడునట్లు కూర్చ మొదలుతో (లేక బంగారుకడ్డీతో) కుడినుండి ఎడమ కంత మగునట్లు రెండు గీతలను గీయవలెను. ఇట్లేర్పడినపైగడిలో శిశువుయొక్క మాసనామమును, మధ్యగడిలో నక్షత్రనామమును, క్రిందిగడిలో తానుంచదలచిన వ్యవహారనామమును 'శ్రీ'కార మును ఆద్యంతములం దుంచుచు కూర్చమొదలుతో (లేక బంగరుకడ్డీతో) వ్రాయవలెను.

211 మగశిశువునకు ఉంచవలసిన మాసనామములను మొదటి రెండు శ్లోకములు తెల్పు చున్న వి. మార్గశిరమాసమున పుట్టిన బాలునికి కృష్ణుడనియు, తరువాత వచ్చు మాసము లందు పుట్టిన బాలునకు క్రమముగా అనన్త, అచ్యుత, చక్రి, వైకుంఠ, జనార్దన, ఉపేంద్ర, యజ్ఞ పురుష, వాసుదేవ, హరి, గోవింద, పుండరీకాక్ష నామములను ఉంచవలెనని ఈశ్లోకములు తెల్పుచున్న వి. అట్లే బాలికకు మార్గశిరముతో ఆరంభించి వరుసగా వాగ్దేవి, పద్మావతి, శ్రీదేవి, సావిత్రి, భూదేవి, కల్యాణి, సత్యభామ, పుణ్యవతి, రూపవతి, ఇందుమతి, చంద్రావతి, లక్ష్మి – అను నామముల నుంచవలెనని చివరి రెండు శ్లోకములు తెల్పుచున్న వి. మార్గశిరముతో గాక, చైత్రముతో ఆరంభించి క్రమముగా నివే నామముల నుంచుటకూడ ఆచారములో నున్నది.

3.శ్లో॥ మార్గశీర్షే చ వాగ్దేవీ పుష్యే పద్మవతీ తథా।
శ్రీదేవీచాపి సావిత్రీ భూమిః కల్యాణికా తథా॥
4.శ్లో॥ సత్యభామా పుణ్యవతీ రూపవతీన్దుమత్యపి।
చంద్రావతీ చ లక్ష్మీశ్చ స్త్రీనామకరణే విదుః॥

## [212] నక్షత్రనామాని

| జన్మనక్షత్రమ్ | పురుషనామ | స్త్రీనామ |
|---|---|---|
| అశ్వని | ఆశ్వయుజః | ఆశ్వయుజా |
| భరణి | ఆపభరణః | ఆపభరణీ |
| కృత్తిక | కృత్తికః | కృత్తికా |
| రోహిణి | రౌహిణః | రౌహిణీ |
| మృగశిరా | మార్గశీర్షః | మార్గశీర్షా |
| ఆర్ద్ర | ఆర్ద్రకః | ఆర్ద్రకా |
| పునర్వసు | పునర్వసుః | పునర్వసూ |
| పుష్యమి | తిష్యః | తిష్యా |
| ఆశ్రేష | ఆశ్రేషః | ఆశ్రేషా |
| మఖ | మాఘః | మాఘా |
| పుబ్బ | పూర్వఫల్గునః | పూర్వఫల్గునీ |
| ఉత్తర | ఉత్తరఫల్గునః | ఉత్తరఫల్గునీ |
| హస్త | హస్తః | హస్తా |
| చిత్ర | చైత్రః | చైత్రా |
| స్వాతి | స్వాతిః | స్వాతీ |
| విశాఖ | విశాఖః | విశాఖా |

212 ఆడ,మగశిశువులకు ఉంచవలసిన నక్షత్రనామములు పైపట్టికలో నీయబడినవి. శిశివు జన్మించిన నక్షత్రమునుబట్టి పైపట్టికలో నేదోయొక పేరును ఎన్నుకొనవలెను.

| జన్మనక్షత్రమ్ | పురుషనామ | స్త్రీనామ |
|---|---|---|
| అనురాధ | అనూరాధః | అనూరాధా |
| జ్యేష్ఠ | జ్యైష్ఠః | జ్యైష్ఠా |
| మూల | మూలకః | మూలకా |
| పూర్వాషాఢ | పూర్వాషాఢః | పూర్వాషాఢా |
| ఉత్తరాషాఢ | ఉత్తరాషాఢః | ఉత్తరాషాఢా |
| శ్రవణం | శ్రావణః | శ్రావణీ |
| ధనిష్ఠ | శ్రవిష్ఠః | శ్రవిష్ఠా |
| శతభిషం | శాతభిషజః | శాతభిషజా |
| పూర్వాభాద్ర | పూర్వప్రోష్ఠపదః | పూర్వప్రోష్ఠపదా |
| ఉత్తరాభాద్ర | ఉత్తరప్రోష్ఠపదః | ఉత్తరప్రోష్ఠపదా |
| రేవతి | రైవతః | రైవతీ |

## వ్యవహారనామాని

[213] సూ॥అయుజాక్షరం కుమార్యాః, అవిషమాక్షరం కుమారస్య।

శ్లో॥ అమంత్రికాతు కార్యేయం స్త్రీణా మావృదశేషతః।
సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమమ్॥ (ఇతి మనుః)

[214] తతః నామత్రయాధిష్ఠదేవతాభ్యాం షోడశోపచారపుజాం కుర్యాత్.

---

213 బాలికకు బేసిసంఖ్య అక్షరములు గల పేరును, బాలునకు సరిసంఖ్య అక్షరములు గల పేరును పెట్టవలెనని పైసూత్రమున కర్థము. స్త్రీశిశువునకు జన్మకర్మమొదలు చౌలమువరకు దేహసంస్కారార్థములైన క్రియలు పురుషశిశువునకువలెనే అదేకాలములో, అదే క్రమములో చేయవలెను గాని, ఆక్రియలను మంత్రరహితముగా చేయవలెనని పై మనుస్మృతిలోని శ్లోకము చెప్పుచున్నది. అనగా నాందీముఖమును, పుణ్యాహవాచనమును సమంత్రకముగా చేయ వలెను, కాని ముందుచెప్పబోవు అభిమంత్రణము, మూర్ధావఘ్రాణమును కొడుకునకు మంత్ర సహితముగాను, కూతురునకు మంత్రరహితముగాను చేయవలెనని దీని కర్థము.

214 తరువాత ఆతట్టలో వ్రాసిన నామత్రయదేవతలకై *"నామత్రయాధిష్ఠానదేవతాభ్యో నమః"*–

## షోడశోపచారపూజా

*నామత్రయాధిష్ఠానదేవతాభ్యో నమః/ ధ్యాయామి/ ధ్యానం సమర్పయామి/ ఆవాహయామి/ ఆసనం సమర్పయామి/ హస్తయోరర్ఘ్యం సమర్పయామి/ పాదయోః పాద్యం సమర్పయామి/ ఆచమనీయం సమర్పయామి/ ఔపచారికస్నానం సమర్పయామి/ "ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/ మహే రణాయ చక్షసే/ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః/ ఉశతీరివ మాతరః/ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ ఆపో జనయథా చ నః/" - స్నాపయామి/ స్నానానంతరమాచమనీయం సమర్పయామి/ అభివస్త్రార్థమక్షతాన్ సమర్పయామి/ ఉపవీతం సమర్పయామి/ గన్ధం సమర్పయామి/ పుష్పం సమర్పయామి/ ధూపమాఘ్రాపయామి/ దీపం దర్శయామి/ ఏతే గన్ధాక్షతపుష్పధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాస్సర్వోపచారాః*-ఇత్యభ్యర్చ్య,

నైవేద్యం - "*ఓం భూర్భువస్సువః/*"- ఇతి కదళీఫలం వా క్షీరం వా ప్రోక్ష్య, "*సత్యం త్వర్తేన పరిషిఞ్చామి*" - ఇతి పరిషిచ్య, "*అమృతమస్తు, అమృతోపస్తరణమసి* – ఇత్యాపోశనం దత్వా, "*ఓంప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి/*"- ఇతి నివేద్య, "*అమృతాపిధానమసి*"– ఇత్యుత్తరాపోశనం దత్వా,

"*హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ తామ్బూలం సమర్పయామి/ సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి/ ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి/*"

---

అని ఆరంభించి "*ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి*" వరకుగల షోడశోపచారపూజను చేసి కర్త "*నామత్రయాధిష్ఠానదేవతాస్సుప్రీతో వరదో భూత్వా, అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు*/"- అని సదస్యులను ప్రార్థించవలెను. అప్పుడు సదస్యులు '*ఆయుష్యాభివృద్ధిరస్తు*' – అని చెప్పవలెను. ఇచ్చట నైవేద్యమునకై అరటి పండ్లను గాని, పాలనుగాని ఉంచవలెను.

*"నామత్రయాధిష్ఠానదేవతాస్సుప్రీతో వరదో భూత్వా, అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) ఆయుష్యాభివృద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు|" - "ఆయుష్యాభివృద్ధిరస్తు"-* ఇతి ప్రతివచనమ్.

## [215]అభిమంత్రణమ్

సూ||అంగాదంగాదితి ద్వాభ్యా మభిమంత్ర్య|

*మం|| అంగాదంగాత్సం భవసి హృదయాదధి జాయసే| ఆత్మా వై పుత్ర నామాసి స జీవ శరదశ్శతమ్|| అశ్మా భవ పరశుర్భవ హిరణ్యమస్తృతం భవ| పశూనాం త్వా హింకారేణాభిజిఘ్రామి ----శర్మన్||* (తై.మం.పా.2.11,12)

## మూర్ధన్యవఘ్రాణమ్

[216]సూ|| తాభ్యామేవ ముర్ధన్యవఘ్రాణమ్|

*మం|| అంగాదంగాత్సం భవసి హృదయాదధి జాయసే| ఆత్మా వై పుత్ర నామాసి స జీవ శరదశ్శతమ్|| అశ్మా భవ పరశుర్భవ హిరణ్యమస్తృతం భవ| పశూనాం త్వా హింకారేణాభిజిఘ్రామి ----శర్మన్||* (తై.మం.పా.2.11,12)

[217]*'మాసనామ్నా (శ్రీకృష్ణ) నామ ధృత్వా దీర్ఘాయుష్మాన్ భవ| నక్షత్రనామ్నా (రౌహిణ) నామ ధృత్వా దీర్ఘాయుష్మాన్ భవ| వ్యావహారికనామ్నా (శ్రీనివాస) నామ*

---

215 'అంగాదంగాత్', 'అశ్మాభవ' అను రెండుమంత్రములను చదివి గీతలుంచినచోట బాలకుని వ్యవహారనామము చెప్పుచు అభిమంత్రించవలెను.(కూతురు నామకరణములో ఈ మంత్రములు లేవు. కూతురును అమంత్రకముగా అభిమంత్రించవలెను.)

216 మరల ఆ రెండుమంత్రములనే చదివి గీతలుంచిన చోట బాలకుని వ్యవహారనామము చెప్పుచు అతని తలను వాసనచూడవలెను. (కూతురు నామకరణములో అమంత్రకముగనే మూర్ధన్యవఘ్రాణము చేయవలెను.)

217 తరువాత 'మాసనామ్నా—దీర్ఘాయుష్మాన్ భవ' వరకు చెప్పుచు తల్లిదండ్రులు శిశువు యొక్క శిరముపై అక్షతలు వేసి దీవించవలెను. ఈవాక్యములలో బ్రాకెట్లో నిచ్చిన మాస, నక్షత్ర, వ్యవహారనామములకు బదులుగా ప్రస్తుతము కుమారుని కొసగిన మాస, నక్షత్ర, వ్యావ

*ధృత్వా దీర్ఘాయుష్మాన్ భవ/ శతాయుష్మాన్ భవ//* - ఇత్యుక్త్వా మాతాపితరౌ శిశోశ్శిరసి అక్షతాన్ నిక్షిప్య, ‘ *అగ్నిరాయుష్మా* ’ నితి పంచభిః (తై.సం.2.3.10) కుమారస్య దక్షిణకర్ణే జపేత్॥

1. *అగ్నిరాయుస్మాన్థ్స వనస్పతిభిరాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి//*
2. *సోమ ఆయుష్మాన్థ్స ఓషధీభిరాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి//*
3. *యజ్ఞ ఆయుష్మాన్థ్స దక్షిణాభిరాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి//*
4. *బ్రహ్మాయుష్మత్తద్బ్రాహ్మణైరాయుష్మత్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి//*
5. *దేవా ఆయుష్మన్తస్తేఽమృతేనాయుష్మన్తస్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి//*

[218] (పుత్రికాయాః నామకరణే

‘ *మాసనామ్నా (కల్యాణీ)నామ ధృత్వా దీర్ఘాయుష్మతీ భవ/ నక్షత్రనామ్నా (రోహిణీ) నామ ధృత్వా దీర్ఘాయుష్మతీ భవ / వ్యావహారికనామ్నా (భారతీ) నామ ధృత్వా దీర్ఘాయుష్మతీ భవ / శతాయుష్మతీ భవ/* ’ - ఇతి మాతాపితరౌ పుత్రికాయాశ్శిరసి అక్షతాన్ నిక్షిప్య,

---

హారికనామములను చెప్పవలెను. పిదప ‘అగ్నిరాయుష్మాన్’ అను 5 మంత్రములను శిశువు కుడిచెవిలో జపించవలెను. (స్త్రీనామకరణములో ఈ మంత్రములు లేవు.)

[218] కూతురు నామకరణములో తల్లిదండ్రులు బ్రాకెట్లో నిచ్చిన మాస, నక్షత్ర, వ్యవహారనామములకు బదులుగా ప్రస్తుతము కూతరు కొసగిన మాస, నక్షత్ర, వ్యావహారికనామములను చెప్పుచు ‘మాసనామ్నా— *దీర్ఘాయుష్మతీ భవ*’ వరకు చెప్పి శిశువుయొక్క శిరముపై అక్షతలు వేసి దీవించి, ‘సర్వస్మాదాత్మనః’ అను మంత్రముతో నభిమంత్రించవలెను.

6. మం॥ *సర్వస్మాదాత్మనస్సంభూతాసి సాజీవ శరదశ్శతమ్*॥ (తై.మం.పా.2.14) - ఇత్యభిమంత్రయతే।)

## పుణ్యాహవాచనమ్

[219]ప్రాణానాయమ్య। *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అస్య కుమారస్య (అస్యాః కుమార్యాః) నామకర్మాంగం కర్మణఃపుణ్యాహం వాచయిష్యే'* – ఇతి సంకల్ప్య, పుణ్యాహం కుర్యాత్. పుణ్యాహే *'(శ్రీనివాస) శర్మణే స్వస్తి భవన్తో బ్రువన్తు'*, అథవా *'(భారతీ) కుమార్యై స్వస్తి భవన్తో బ్రువన్తు'* - ఇతి బ్రాహ్మణాన్ సంప్రార్థ్య, *'(శ్రీనివాస) శర్మణే స్వస్త్యస్తు'*, అథవా *'(భారతీ) నామ్న్యై స్వస్త్యస్తు'* – ఇతి ప్రతివచనం ప్రాప్నుయాత్. శేషం సమానమేవ. పుణ్యాహజలేన ఆత్మానం, భార్యాం, శిశుం చ ప్రోక్షయేత్.

## ఆశీర్వచనాది

[220]అనంతరం సదస్యేభ్యః హరిద్రాక్షతాన్ దత్వా, తైరాశీర్వచనం అనుగ్రహం చ కార

---

[219]తరువాత ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణ---నామకర్మాంగం కర్మణః పుణ్యాహం వాచయిష్యే' అని సంకల్పించి 'పుణ్యాహవాచనము' అను అధ్యాయములో చెప్పి నట్లుగా పుణ్యాహవాచనము చేసి, ఆ జలముచే కర్త తనను, భార్యను, శిశువును ప్రోక్షించవలెను. కాని ఆ అధ్యాయములో నిచ్చిన 'స్వస్తి భవన్తో బ్రువన్తు', 'స్వస్త్యస్తు' అను వాక్యములలో శిశువు పేరును చేర్చి '(శ్రీనివాస) శర్మణే స్వస్తి భవన్తో బ్రువన్తు', '(శ్రీనివాస) శర్మణే స్వస్త్యస్తు' అను విధముగా చెప్పవలెను. '(శ్రీనివాస)' అని ఉన్న చోట కుమారునికి పెట్టిన వ్యవహారనామమును చెప్పవలెను. పుత్రికకు సంకల్పములో 'అస్యాః కుమార్యాః' అనియు, పుణ్యాహములో '(భారతీ) నామ్న్యై స్వస్తి భవన్తో బ్రువన్తు', '(భారతీ) నామ్న్యై స్వస్త్యస్తు' అని చెప్పవలెను. '(భారతీ)' అని ఉన్న చోట పుత్రికకు పెట్టిన వ్యవహారనామమును చెప్పవలెను.

[220]తరువాత నామకరణమునకు వచ్చిన పెద్దలు వారి ఆశీర్వచనానుగ్రహములను శిశువున కొసగవలెను. వారికి ఫలపుష్పదక్షిణలతో కూడిన తాంబూలము నీయవలెను. సుమంగళులు శిశువునకు శుభహారతి నీయవలెను. అతిథులు శిశువునకు తల్లిదండ్రులకు కానుకలీయవలెను.

యిత్వా, సదస్యేభ్యః ఫలపుష్పదక్షిణాసమేతతాంబూలం దత్వా, సుమంగళీభిః శుభా
రాత్రికపూర్వకం మంగళగానం కారయేత్.



# అన్నప్రాశనమ్

[221] జన్మనోఽధి షష్ఠే మాస్యష్టమే దశమే వా సంవత్సరే వా పుంసః, స్త్రీణామయుగ్మే మాస్యన్నప్రాశనం కుర్యాత్. ఏతత్కర్మాంగత్వేన ప్రతిసరబంధనం అభ్యుదయం పుణ్యాహవాచనం చ క్రమేణ కుర్యాత్.

## ప్రతిసరబంధనమ్

[222] ప్రాణానాయమ్య| '*అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం అస్య ---గోత్రస్య ---శర్మణః కుమారస్యాన్నప్రాశన కర్మాంగం ప్రతిసరబంధనకర్మ కరిష్యే*' – ఇతి సంకల్ప్య, రక్షాబంధనం కుర్యాత్.

---

[221]జన్మనః=జన్మదినమునుండి, అధి=పైనవచ్చు, షష్ఠేమాసి=ఆఱవనెలలో గాని, అష్టమే దశమే వా సంవత్సరే వా=ఎనిమిది, లేక పదవనెలలో గాని, సంవత్సరమునకు గాని, అన్న ప్రాశనం=అన్నప్రాశనమును, కుర్యాత్=చేయవలెను. స్త్రీణామ్=స్త్రీశిశువునకు, అయుగ్మే మాసి =బేసిసంఖ్యగల నెలలో (అనగా, 7,9,11 నెలలలో) అన్నప్రాశనం కుర్యాత్=అన్నప్రాశనమును చేయవలెను.ఏతత్కర్మాంగత్వేన=ఈ అన్నప్రాశనకర్మాంగములుగా (ముందుగా), ప్రతిసర బంధనమ్=రక్షాబంధనమును, అభ్యుదయం=నాందీముఖమును, పుణ్యాహవాచనం చ= పుణ్యాహవాచనమును, క్రమేణ=క్రమముగా, కుర్యాత్=చేయవలెను. ఇచ్చట 'మాసప్రోక్తేషు కార్యేషు మూఢత్వం జీవశుక్రయోః, అధిమాసాదిదోషాశ్చ న స్యుః కాలవిధేర్బలాత్' అను కారిక యుండుటవల్ల, పై మాసములలో చేయుమని నిర్దేశముండుటచే, ఆసమయములో గురు శుక్రమౌఢ్యము లుండినను, అధికమాసముండినను వాని దోషములను పరిగణింపక అన్నప్రాశ నమును చేయవచ్చును.

[222]కర్త భార్యాశిశువులతో కర్మాచరణ కనువైన శుచియైన ప్రదేశమును ప్రవేశించి, మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా, అన్నప్రాశనకర్మకై పరిషదనుజ్ఞను పొంది, ప్రధానసంకల్ప మును చెప్పవలెను. తర్వాత ప్రాణాయామము చేసి, 'అస్యాం శుభతిథౌ శ్రీభగవ దాజ్ఞయా--- అన్నప్రాశనకర్మాంగం ప్రతిసరబంధకర్మ కరిష్యే' అని సంకల్పించి 'ప్రతిసరబంధప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా కుమారునకు రక్షాబంధనము చేయవలెను. సంకల్పములో

## అభ్యుదయకమ్, పుణ్యాహవాచనం చ

[223]ప్రాణానాయమ్య| *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం అస్య---గోత్రస్య -----శర్మణః కుమారస్య అన్నప్రాశనకర్మాంగం అభ్యుదయం కరిష్యే కర్మణః పుణ్యాహం చ వాచయిష్యే'* – ఇతి సంకల్ప్య, అభ్యుదయకం, కర్మణఃపుణ్యాహ వాచనం చ కృత్వా, కర్తా ఆత్మానం, పత్నీం, శిశుం, దధిమధుఘృతోదనమిశ్రణం చ పుణ్యాహజలేన సంప్రోక్ష్య,

[224]సూ|| దధిమధుఘృతమోదనమితి సంసృజ్యావదాయ **'భూరపాం త్వా'** ఇతి చతుర్భిరన్తే కుమారం సకృదేవ ప్రాశయేత్||

---

గీతలున్నచోట వరుసగా కుమారుని గోత్రమును, పేరును చేర్చి చెప్పవలెను. ఆ అధ్యాయములో చెప్పినట్లు విస్తరముగా గాక, కొందఱు లఘువుగా కంకణమునకు షోడశోపచారపూజను చేసి, 'బృహత్సామ' మంత్రముతో శిశువు చేతికి కట్టుచున్నారు. కొన్ని ప్రయోగములలో ఈసందర్భములో అంకురార్పణ కూడ చేయవలెనని యున్నది గాని దీనిని సామాన్యముగా పాటించుచున్నట్లు లేదు.

[223] మఱల ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణ విశేషణ----- అన్నప్రాశనకర్మాంగం అభ్యుదయకం కరిష్యే కర్మణఃపుణ్యాహం చ వాచయిష్యే' అని సంకల్పించి లఘువిధానముగా అభ్యుదయమును, 'పుణ్యాహవాచనము' అను అధ్యాయములో చెప్పినట్లుగా కర్మణః పుణ్యాహవాచనమును చేసి, ఆ జలముచే కర్త తనను, భార్యాకుమారులను, ప్రాశనమున్నకై ఒక కంచు (లేక వెండి, బంగారు) పాత్రలో కలిపియుంచిన పెరుగు, నేయి, తేనె, అన్నముల మిశ్రణమును ప్రోక్షించవలెను.

[224]దధిమధుఘృతమోదనమ్=పెరుగు,తేనె,నేయి,అన్నము, ఇతి=అనువానిని, సంసృజ్య= కలిపి, అవదాయ=జాతకర్మయందువలెనే, **'భూరపాం త్వా'** ఇతి చతుర్భిః అన్తే=ముందుగల 'భూరపాం' అను నాల్గుమంత్రములు చదివిన పిమ్మట, కుమారం=కుమారుని, సకృదేవ=ఒక సారి మాత్రమే, ప్రాశయేత్=తినిపించవలసినది. గమనిక:మంత్రములందలి (శ్రీనివాస) అను

## ప్రాశనమంత్రాః(తై.మం.పా.2.14)

1. *ఓం భూరపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త ఆప ఓషధయ స్సన్త్వనమీవాస్త ఆప ఓషధయస్సన్తు (శ్రీనివాస)శర్మన్।*
2. *భువో౽పాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త ఆప ఓషధయ స్సన్త్వనమీవాస్త ఆప ఓషధయస్సన్తు (శ్రీనివాస)శర్మన్।*
3. *సువరపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త ఆప ఓషధయ స్సన్త్వనమీవాస్త ఆప ఓషధయస్సన్తు (శ్రీనివాస)శర్మన్।*
4. *భూర్భువస్సువరపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివాస్త ఆప ఓషధయ స్సన్త్వనమీవాస్త ఆప ఓషధయస్సన్తు (శ్రీనివాస)శర్మన్।*

[225] తతః సదస్యాః '*అన్నప్రాశనమూహూర్త స్సుముహూర్తో౽స్తు॥*' – ఇత్యక్షతై రాశీర్వచనం కుర్యుః.

## కొన్ని లౌకిక మర్యాదలు

(ఈసందర్భములో బంధువులు శిశువునకు కానుక లిచ్చుట, అన్నప్రాశనోత్సవము నకు వచ్చిన వారిని యజమానుడు ఫలపుష్పతాంబూలములతో సత్కరించుట సాధా రణముగా జరుగుచున్నది. ముఖ్యముగా శిశువుయొక్క మేనమామ నూత్నవస్త్రము లచే శిశువు నలంకరించుట, శిశువుయొక్క తండ్రి ఆ మేనమామకు నూతనవస్త్రముల నిచ్చుట పరిపాటి. అట్లు మేనమామ ఇచ్చిన నూతనవస్త్రములను ధరించిన శిశువుపై సదస్యులు '*అన్నప్రాశనమూహూర్త స్సుముహూర్తో౽స్తు॥*' అని హరిద్రాక్షతలు వేసి దీవించుట, చివరికి సుమంగళులు మంగళగీతములు పాడి శిశువునకు మంగళహారతి నిచ్చుట లౌకికముగా జరుగుచున్నది.)

---

దానికి బదులు కుమారుని పేరును చెప్పుచు మంత్రములను చదువవలెను. (స్త్రీశిశువునకు మంత్ర రహితముగనే తినిపించవలెను.)

[225] అట్లు తినిపించి, '*అన్నప్రాశనముహూర్త స్సుముహూర్తో౽స్తు*' అని శిశువుపై అక్షతలు వేసి దీవించవలెను.

# చౌలమ్

[226]సూ॥ జన్మనోఽధి తృతీయే వర్షే చౌలం పునర్వస్వాదినా।

ప్రతిసరబన్ధనాఙ్కురారోపణాది

[227]తృతీయాదౌ వర్షే  ఉదగయనే శుక్లపక్షే ప్రశస్తతిథివారనక్షత్రయుతే శుభే కాలే కుమారస్య చౌలకర్మ కరిష్యన్ కర్తా పుర్వేద్యూరాత్రౌ యథా సౌకర్యం ఉదకశాం

---

[226]జన్మనః=జన్మదినముమొదలుగ, అధి=పైనవచ్చు, తృతీయే వర్షే=మూడవసంవత్సరము నందు, పునర్వస్వోః=పునర్వసూనక్షత్రమందు, చౌలం=చౌలకర్మను (చేయవలెను.) చౌల మనగా పుట్టిన తర్వాత తొలిసారిగా శిశువునకు కేశఖండనము జేయుట. దీనికి చూడాకర్మ అనియు పేరు. ఈచౌలకర్మను 5వసంవత్సరమునగూడ జేయవచ్చుననియు, ఒకవేళ ఈ రెండు సందర్భములలో తల్లి గర్భిణిగా నున్నచో ఆమెకు ఐదవనెల రాకముందే చౌలమును చేయవలెననియు, కాని చౌలము జన్మాది 5 సంవత్సరముల తర్వాత జరిగినచో తల్లి గర్భవతిగా నున్నను ఈనెలల నియమమును పాటింపక ఎప్పుడైనా  చేయవచ్చుననియు వివిధధర్మశాస్త్ర ములు తెల్పుచున్నవి.

[227] జన్మాది తృతీయవత్సరమున కుమారునికి చౌలకర్మను చేయ సంకల్పించి, ఉత్తరాయణ శుక్లపక్షమునందొక శుభముహూర్తమును నిర్ణయించి, కర్త అందుకు ముందురోజు రాత్రి ఉదక శాంతిని,  అంకురార్పణమును, ప్రతిసరబంధమును ఆయా అధ్యాయములలో చెప్పినట్లుగా పూర్తి చేయవలెను. (కొందఱు ముందురోజుగాక ఆనాడే అంకురార్పణము చేయుచున్నారు). మఱునాడు తానును, భార్యాకుమారులును మంగళస్నానములు చేసి, కర్మస్థలమునకు వారితో వచ్చి, పరిషదనుజ్ఞను పొంది, దేశకాలముల కీర్తించి, ----నక్షత్రే ----రాశౌ జాతం ---- శర్మాణం కుమారం  చౌలకర్మణా సంస్కరిష్యామి' అని ప్రధానసంకల్పము చెప్పి, ఆ చౌల కర్మకు అంగములుగా అభ్యుదయమును, పుణ్యాహవాచనమును చేయవలెను. సంకల్పము నందు గీతలుంచిన చోట వరుసగా కుమారుని జన్మనక్షత్రమును, జన్మరాశిని, పేరును చెప్ప వలెను. (ముందురోజు ఉదకశాన్తిని చేసియుండిన, ఆజలముతో మఱునాడు కుమారునికి మంగళస్నానము చేయించవచ్చును.)

త్యజ్కురార్పణ ప్రతిసరబంధకర్మాణి పూర్వోక్తవత్కృత్వా, పరేద్యుః మంగళస్నాతం కుమారమలంకృత్య, పత్నీకుమారయుతః శుభవేదికాం ప్రాప్య, పరిషదనుజ్ఞాం గృహీత్వా, దేశకాలౌ సంకీర్త్య, -----నక్షత్రే ----రాశౌ జాతం ----శర్మాణం కుమారం చౌలకర్మణా సంస్కరిష్యామి' ఇతి ప్రధానసంకల్పముక్త్వా, తత్కర్మాంగత్వేనాభ్యు దయం, పుణ్యాహవాచనం చ కుర్యాత్.

## అభ్యుదయకమ్, పుణ్యాహవాచనం చ

[228]ప్రాణానాయమ్య। '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ---గోత్రస్య ---శర్మణః కుమారస్య చౌల కర్మాంగత్వేన అభ్యుదయకం కరిష్యే పుణ్యాహం చ వాచయిష్యే*' – ఇతి సంకల్ప్య, పూర్వోక్తవిధానేన అభ్యుదయకం, పుణ్యాహవాచనం చ కృత్వా, కర్తా ఆత్మానం, పత్నీం, కుమారం చ తత్పుణ్యాహజలేన ప్రోక్షయిత్వా, క్షారలవణవర్జం కుమారం భోజయిత్వా, షట్పాత్రప్రయోగేనాజ్యభాగం కుర్యాత్.

---

[228] ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం ---గోత్రస్య---శర్మణః కుమారస్య చౌలకర్మాంగ మభ్యుదయకం కరిష్యే పుణ్యాహం చ వాచయిష్యే' అని సంకల్పించి లఘువిధానముగా అభ్యు దయమును, 'పుణ్యాహవాచనము' అను అధ్యాయములో చెప్పినట్లుగా పుణ్యాహవాచన మును చేసి, కర్త తనను, భార్యాపుత్రులను, ఆ జలముచే ప్రోక్షించుకొని, కుమారునికి కారము, లవణము లేని భోజనము పెట్టవలెను. అనగా శర్కరవేసిన పాలను త్రాగించవలెను. ఇచ్చట 'శ్లో॥ భుక్తిద్వయేతు సంప్రాప్తే కథం భుక్తిర్విధీయతే। శర్కరాజ్యపయః పీత్వా పశ్చాద్భుక్తిం సమాచ రేత్॥' అను శ్లోకమున్నది. చౌలమునకు ముందును, తర్వాతను (రెండుసార్లు) భోజనము చెప్ప బడుటచే, వీని నెట్లు చేయవలెనని ప్రశ్నించుకొని, మొదటి బోజనార్థము శర్కరా నేయి పాలు తీసికొనవలెననియు, కర్మాంతమున చేయు భోజనమును శాకపాకాన్నాదులతో సమగ్రముగా చేయవలెననియు ఈశ్లోకము వివరించుచున్నది. అందుచే కుమారునకు శర్కరాయుతక్షీరము దాపవలెనని 'క్షారలవణవర్జం కుమారం భోజయిత్వా' అను వాక్యమున కిక్కడ చెప్పబడినది.

## అజ్యభాగః

[229]సూ॥ బ్రాహ్మణానాం భోజన ముపాయనవ త్సీమంతవదగ్నే రుపసమాధానాది।
వా॥షట్పాత్రప్రయోగక్రమేణ , పరిధ్యర్థే శమ్యాః ప్రయుజ్యాజ్యభాగాంతం కుర్యాత్।
అత్ర పాత్రప్రయోగకాలే
శ్లో॥ జలద్వయం కుశాన్యవాన్ఛలాలుదర్భపుంజిలాన్।
శకృచ్ఛలల్యసీన్ క్షిపే త్సహైవ చౌలకర్మణి॥
ఏవం పాత్రోత్తరతః సకృన్నిధాయ,
[230]సూ॥ యథోపదేశం ప్రధానాహుతీర్హుత్వా। అన్వారబ్ధే ఉత్తరా ఆహుతీర్జుహోతి॥

---

[229]బ్రాహ్మణానాం భోజనమ్=అభ్యుదయమున్ను, పుణ్యాహవాచనమున్ను, ఉపాయనవత్ =ఉపనయనములోవలెను, అగ్నేః=అగ్నియొక్క, ఉపసమాధానాది= ప్రజ్వలింపజేయుట మొదలు పరిషేచనమువరకు గల యావత్తు తంత్రము, సీమంతవత్=సీమంతమునకువలె చేయవలెను. అనగా 'షట్పాత్రప్రయోగము' అను అధ్యాయములో నిచ్చినట్లుగా స్థండిలపరికల్పనము, ఉల్లేఖనము, అగ్నిప్రతిష్ఠాప్రజ్వలనములు, ఉపస్తరణములు, పరిషేచనము, పాత్రాసాదనాదులనుచేయవలెను. ఈప్రయోగములో శమ్యల నుపయోగించవలెను. ఇట్లు చక్షుర్హోమాంతముగ (పేజీలు 45-54) చేయవలెను. పాత్రాసాదన చేయునప్పుడు దర్వ్యాది ఆఱు దేవపాత్రల నగ్నికి ఉత్తరమున దర్భలపై నుంచిన తర్వాత, ఆపాత్రలకు ప్రక్కగా ( అనగా నుత్తరమునకు) పూర్వాగ్రముగా మఱొక నాల్గుదర్భలను పరచి, వానిపై నొక తట్టలో, జలద్వయం= (వపనమునకై) వేడినీటి, చన్నీటి నుంచిన పాత్రలను,కుశాన్ = (కొనలతో గూడిన జిట్టెడు పొడవు గల 12 దర్భలను, యవాన్=యవలను (లేక గోధుమలను), శలాలుః =మేడిపుల్లను, దర్భపుంజిలాన్ = 3 దర్భకట్టలను, శకృత్=ఎద్దుపేడను, శలలీ= మూడుచోట్ల తెల్లగా నున్న ఏదుపంది ముల్లును, అసీన్= (కేశవపనమునకై) కత్తిని, సహైవ=అన్నిటిని (ఒకేతట్టలో), చౌలకర్మణి= చౌలకర్మలో, క్షిపేత్ = ఉంచవలెను (ఇవి చౌలములో నుంచవలసిన విశేషపాత్రలు. ఈమేడిపుల్లను, ఏదుపందిముల్లును కలిపి పట్టుకొని, బాలుని వెంట్రుకలను వేఱుచేయుచున్నారు. ఇవి దొరకనిచో ఒకసమిధకు మామిడికొమ్మను దర్భలతో చుట్టి కట్టి, దానిని వాడుచున్నారు.)

[230]ఇట్లు ఆజ్యభాగములో చక్షుర్హోమాంతము పూర్వతంత్రమును చేసిన తర్వాత, అన్వారబ్ధే= కుమారుడు తండ్రిని తాకుచుండగా, ఉత్తరా ఆహుతీః =తర్వాత చెప్పబడు 'ధాతా దధాతు నో'

## ప్రధానహోమః (తై.మం.పా.2.11)

1. ధాతా దదాతు నో రయి మీశానో జగతస్పతిః। స నః పూర్ణేన వావనత్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥
2. ధాతా ప్రజాయా ఉత రాయ ఈశే ధాతేదం విశ్వం భువనం జజాన। ధాతా పుత్రం యజమానాయ దాతా తస్మా ఉ హవ్యం ఘృతవద్విధేమ స్వాహా। ధాత్ర ఇదం న మమ॥
3. ధాతా దదాతు నో రయిం ప్రాచీం జీవాతుమక్షితామ్। వయం దేవస్య ధీమహి సుమతిగ్ం సత్యరాధసస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥
4. ధాతా దదాతు దాశుషే వసూని ప్రజాకామాయ మీఢుషే దురోణే। తస్మై దేవా అమృతాస్సంవ్యయన్తాం విశ్వే దేవాసో అదితిస్సజోషాస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥
5. యస్త్వా హృదా కీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యో జోహవీమి। జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యాగ్గ్ స్వాహా। అగ్న యే జాతవేదస ఇదం న మమ॥
6. యస్మై త్వగ్ం సుకృతే జాతవేద ఉ లోకమగ్నే కృణవస్స్యోనమ్। అశ్వినగ్ం స పుత్రిణం వీరవన్తం గోమన్తగ్ం రయిం నశతే స్వస్తి స్వాహా। అగ్న యే జాతవేదస ఇదం న మమ॥
7. త్వే సుపుత్ర శవసోఽవృత్రన్కామకాతయః। న త్వామింద్రాతిరిచ్యతే స్వాహా। ఇంద్రాయ పుత్రిణ ఇదం న మమ॥
8. ఉక్థఉక్థే సోమ ఇంద్రం మమాద నీథేనీథే మఘవానగ్ం సుతాసః। యదీగ్ం సబాధః పితరం న పుత్రాస్సమానదక్షా అవసే హవన్తే స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥ (తై.సం.1.4.46.52 &53)

---

అనెడి 8 ఆహుతులను, జుహోతి=హోమము చేయుచున్నాడు. అనగా కుమారుడు చేతిని తండ్రి తొడమీద నుంచి తండ్రిని తాకుచుండగా తండ్రి ఈ ఆహుతులతో హోమము చేయవలెననుట.

[231]ఇతి చతుర్గృహీతేన హుత్వా, '*జయాద్యగ్న్యుపస్థానాంతం*' మిత్యుక్త్వా, పూర్వోక్త ప్రకారేణ (పుటసంఖ్యా: 56-68) జయాద్యగ్న్యుపస్థానాంతం కుర్యాత్.

## దిగ్వపనమ్

[232]సూ॥అపరేణాగ్నిం కుమారం ప్రాంచ ముపవేశ్య। త్రేణ్యా శలల్యా త్రిభి ర్దర్భపుంజీలై

---

[231]పై ఎనిమిది మంత్రములతో చతుర్గృహీతాజ్యముతో హోమము చేసి, 'జయాద్యగ్న్యుప స్థానాంతం' అని చెప్పి షట్పాత్రప్రయోగములో 56-68 పేజీలలో నిచ్చినట్లుగా జయాదుల నుండి అభివాదాంతము చేయవలెను. ఇట్లు చేయుటలో చౌలములో నుపయోగించునవి శమ్యలు గనుక 'శమ్యాః అపోహ్య' అని చెప్పి వానిని తీసి అగ్నికి ఉత్తరమునకు పడవేయవలెను.

[232]అగ్నిం=అగ్నికి, అపరేణ=పశ్చాద్భాగమునందు, కుమారం=కుమారుని, ప్రాంచమ్= తూర్పుముఖముగా, ఉపవేశ్య=కూర్చుండబెట్టి, త్రేణ్యా=మూడుచోట్ల తెల్లనిమచ్చలు గలట్టి, శలల్యా=ఏదుపందిముల్లుచేత, త్రిభిః=మూడు, దర్భ పుంజీలైః=మూడుదర్భాగ్రములు కలిపి ఒకటిగా ముడివేయబడిన మూడు దర్భపుంజీలములచేతను, శలాలు=మేడిచెట్టుయొక్క, గ్లప్సేన=లేతకాయల గుత్తిచేత,ఇతి=(ఒకటిగా చేర్చి పట్టుకొన్న) వీటితో, తూష్ణీం =అమంత్రక ముగా, కేశాన్=వెంట్రుకలను, వినీయ= విడదీసి, యథర్షి =తనగోత్రములో నెందరు ఋషులు గలరో అన్ని, శిఖాః=శిఖలను, నిదధాతి=ఉంచుచున్నాడు; లేదా, యథా=ఎట్లు, ఏషాం వై = వీరలయొక్క, కులధర్మః=కులధర్మము, స్యాత్=ఉన్నదో అన్ని శిఖల నుంచుచున్నాడు; అనగా కుమారుని అగ్నికి పడమట తూర్పుముఖముగా కూర్చుండబెట్టి, తండ్రి (లేక ఆచా ర్యుడు) అతని కెదురుగా వంగి, ఏదుపందిముల్లును, మూడు దర్భపుంజీలములను, మేడి కాయలగుత్తిగల ఒక చిన్న కొమ్మను అన్నిటిని కలిపి ఒకటిగా పట్టుకొని వెంట్రుకలను విడదీసి, గోత్రమున కెందరు ఋషులు గలరో అన్నిటిని గాని, లేదా కులధర్మము ప్రకారముగాని జుట్టుల నుంచుచున్నాడు. (గమనిక: వైష్ణవులకు ఒకేశిఖ నుంచుకొను ఆచారము గలదు. ఈసందర్భ ములో ఒక క్రొత్త తువ్వాలుపై అడ్డెడు బియ్యమును పోసి, దానిపై మఱియొక క్రొత్త తువ్వాలును వేసి, ఆతువ్వాలుపై కుమారుని తూర్పుముఖముగా కూర్చుండబెట్టి వపనము చేయించుట, వపనాంతమున ఆ బియ్యమును, తువ్వాలును క్షురకుని కిచ్చుట లౌకికాచారము.)

అపాగ్ంసగ్ంసర్జనాది = శీతోష్ణోదకములను కలుపుట మొదలు, ఆకేశ నిధానాత్= ఖండిం చిన కేశములను శకృత్పిండములో నుంచుటవరకు గల కార్యములు, సమానమ్=స్నాతకోపనయ

శ్శలాలుగ్లప్సేనేతి తూష్ణీం కేశా న్వినీయ యథర్షి శిఖా నిదధాతి। యథావైషాం కుల ధర్మ స్స్యాత్। అపాగ్ం సగ్ంసర్జనాద్యాకేశ నిధానాత్సమానమ్। అనువాకస్య ప్రథ మేన యజుషా౽౽పస్సగ్ంసృజ్యోష్ణా శ్శీతా స్స్వానీయ।

*మం॥ఉష్ణేన వాయవుదకే నేహ్యదితిః కేశాన్ వపతు।*

[233]సూ॥ఉత్తరేణ కుమారస్య శిర ఉనత్తి।

*మం॥ఆప ఉన్దన్తు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే।జ్యోక్చ సూర్యం దృశే।*

[234]సూ॥త్రీన్ స్త్రీన్దర్భా నన్తర్ధాయ ఉత్తరాభి శ్చతసృర్భిః ప్రతిమంత్రం ప్రతిదిశం ప్రవపతి।

---

నములకు సమానము; అనువాకస్య ప్రథమేన=ఏకాగ్ని కాండ ద్వితీయప్రపాఠకములోని 'ఉష్ణేన వాయువుదకేన' అను అనువాకములోని మొదటి వాక్యముతోడ (అనగా , '*ఉష్ణేన వాయవుదకే నేహ్యదితిః కేశాన్ వపతు*।' అను మంత్రముతో), అపః ఉష్ణాశ్శీతాసు సగ్ంసృజ్య= (అగ్ని కుత్తరమున నుంచిన) ఉష్ణజలమును శీతలజలములో కలిపి, ఆనీయ=తీసికొని వచ్చి;

[233]ఉత్తరేణ= తరువాతి 'ఆప ఉన్దన్తు జీవసే' అను మంత్రముచేత, కుమారస్య శిరః=కుమారుని శిరమును, ఉనత్తి=తడుపుచున్నాడు. అనగా 'ఆప ఉన్దన్తు జీవసే' అను మంత్రమును చెప్పి శీతో దకములో ఉష్ణోదకములను కలిపి కుమారుని తలను తూర్పునుండి మొదలిడి చుట్టును ప్రదక్షి ణముగా తడుపవలెను.

[234]త్రీన్ స్త్రీన్దర్భాన్ =(దిగ్వపనార్థమై అగ్నికి ఉత్తరమున నుంచుకొన్న 12 దర్భలలో) మూడు మూడు దర్భలను, అన్తర్ధాయ =( కొనలు పైకుండునట్లుగా) వెంట్రుకలకు కత్తికి మధ్యన వెంట్రు కలతో కలిపి పట్టుకొని; ఉత్తరాభి శ్చతసృర్భిః = ముందు చెప్పబడు నాల్గు మంత్రములతో; ప్రతి మంత్రం=ఒక్కొక్క మంత్రముతో; ప్రతిదిశం=ఒక్కొక్క దిశయందు (వెంట్రుకలను); ప్రవపతి = ఖండించుచున్నాడు; అనగా, 'యేనావపత్సవితా'ది నాల్గుమంత్రములను చెప్పుచు, ఆచార్యుడు వరుసగా తూర్పుదక్షిణ పశ్చిమోత్తరదిశలందున్న కుమారుని వెంట్రుకలను ఆదర్భలతో సహ ఖండించవలెను. ఈమంత్రములలో నున్న 'నారాయణ' శబ్దమునకు బదులు పిల్లవాని పేరును చెప్పవలెను. మంత్రమును చదువుట, ఖండించుట ఏకకాలములో జరుగవలెను. ఇట్లు మొదట 'యేనావపదితి ప్రాచ్యాం' అని చెప్పి 'యేనావపత్సవితా' అను మంత్రమును చదువుచు తూర్పు వైపు (అనగా లలాటముపైని) వెంట్రుకలను ఖండించవలెను.

('యేనావప'దితి ప్రాచ్యాం)

*మం॥యేనావప త్సవితా క్షురేణ సోమస్య రాజ్ఞో వరుణస్య విద్వాన్। తేన బ్రహ్మాణో వపతేదమస్యాయుష్మాన్ జరదష్టిర్యథాఽసదయం 'నారాయణ' శర్మా॥ 1॥*

-(ఇతి పూర్వతో వపతి.)

[235]వా॥ వపన్తమాచార్యం యః కశ్చిద్బ్రహ్మచారీ కుమారస్య మాతా వా దక్షిణత ఉప విశ్య ఉత్తరయానుమంత్రయతే। అథాచార్య స్సదర్భాన్ కేశాం శ్ఛిత్వా, తద్ధస్తే ప్రదాయ అప ఉపస్పృశతి। బ్రహ్మచారీ కుమారస్య మాతా వా అనడుహే శకృత్పిండే యవా న్నిధాయ తాన్ కేశాన్నిదధాతి। ఏవం సర్వత్ర।

*మం॥యత్క్షురేణ మర్చ్ఛయతా సుపేశసా వప్త్వా వపసి కేశాన్। శున్ధి శిరో మాస్యాఽఽయుః ప్రమోషీః॥*

[236] ('యేన పూషా' ఇతి దక్షిణస్యాం)

---

[235] యః కశ్చిద్బ్రహ్మచారీ కుమారస్య మాతా వా = ఒకానొక బ్రహ్మచారి లేక పిల్లవాని తల్లి; దక్షిణతః ఉపవిశ్య=దక్షిణమువైపున కూర్చొని; ఉత్తరయా='యత్క్షురేణ' అను మంత్రమును పఠించుచు, వపన్త మాచార్యం= వెంట్రుకలను కత్తిరించు ఆచార్యుని; అనుమంత్రయతే= అనుస రించుచున్నారు; అథాచార్య స్సదర్భాన్ కేశాం శ్ఛిత్వా = అట్లాచార్యుడు దర్భలతో సహ వెంట్రుకలను ఖండించి; తద్ధస్తే =ఆ తల్లి లేక బ్రహ్మచారి చేతికి; ప్రదాయ= ఇచ్చి; అప ఉప స్పృశతి= (వపనోదకపాత్రలోని) జలమును తాకుచున్నాడు; బ్రహ్మచారీ కుమారస్య మాతా వా = బ్రహ్మచారి లేక కుమారుని తల్లి; అనడుహే శకృత్పిండే = ఎద్దుపేడలో; యవా న్నిధాయ= యవల నుంచి, అందులో; తాన్ కేశాన్= ఆ వెంట్రుకలను; నిదధాతి= ఉంచుచున్నారు; ఏవం సర్వత్ర = ఇట్లే అంతటను; అనగా, తల్లి గాని ఒక బ్రహ్మచారిగాని కుమారునికి దక్షిణమున కూర్చుండి యత్క్షురేణ అను మంత్రముతో ఆచార్యుని అనుమంత్రించుచున్నారు. ఆచార్యుడు ఖండించిన కేశములను వారికిచ్చి వపనజలపాత్రలోని నీటిని తాకుచున్నాడు. వారు ఎద్దుపేడతో ప్రమిదవలె చేసి, అందులో యవలనుంచి, ఆ కేశముల నందులో నుంచుచున్నారు –అన్ని దిశ లందలి కేశఖండనమునకును ఇదియే పద్ధతి.

[236]' యేన పూషా ఇతి దక్షిణస్యాం' అని చెప్పి, 'యేన పూషా బృహస్పతే' అను రెండవమంత్ర మును చదువుచు మూడుదర్భలను కేశములతో చేర్చి పట్టుకొని దక్షిణము వైపు (అనగా కుడి

*మం॥ యేన పూషా బృహస్పతేరగ్నే రింద్రస్య చాయుషేఽవపత్। తేనాస్యాయుషే వప సౌశ్లోక్యాయ స్వస్తయే॥ 2॥*

(ఇతి దక్షిణతో వపతి। తాన్కేశాన్ శకృత్పిండే నిధాయ। అప ఉపస్పృశ్య।
[237] ('యేనభూయే' తి ప్రతీచ్యాం)

*మం॥ యేన భూయశ్చరాత్యయం జ్యోక్చ పశ్యాతి సూర్యమ్। తేనాస్యాయుషే వప సౌశ్లోక్యాయ స్వస్తయే ॥ 3॥*

(ఇతి పశ్చిమతో వపతి। తాన్ కేశాన్ శకృత్పిండే నిధాయ, అప ఉపస్పృశ్య,
[238] ('యేన పూషా బృహస్పతే' రితి ఉదీచ్యాం)

*మం॥ యేన పూషా బృహస్పతేరగ్నే రింద్రస్య చాయుషేఽవపత్। తేన తే వపామి 'నారాయణ' శర్మ న్నాయుషా వర్చసా యథా జ్యోక్సుమనా అసాః ॥ 4॥*

[239] సూ॥ అథ నాపితః। ('వపన్తం నాపితమాచార్యః 'యత్క్షురేణే' త్యనుమంత్రయతే' - ఇతి హరదత్తః)

---

చెవి పైని) ఉన్న కుమారుని వెంట్రుకలను కత్తిరించి శకృత్పిండములో నుంచి నీటిని తాకవలెను.

[237] 'యేన భూయేతి ప్రతీచ్యాం' అని చెప్పి, 'యేన భూయశ్చరాత్యయం' అను మూడవ మంత్రమును చదువుచు, మూడుదర్భలను కేశములతో చేర్చి పట్టుకొని పశ్చిమము (అనగా తలకు వెనుక) వైపున్న కుమారుని వెంట్రుకలను కత్తిరించి శకృత్పిండములో నుంచి నీటిని తాకవలెను.

[238] 'యేన పూషా బృహస్పతేరితి ఉదీచ్యాం' అని చెప్పి, 'యేన పూషా బృహస్పతే' అను నాల్గవమంత్రమును చదువుచు, మూడుదర్భలను కేశములతో చేర్చి పట్టుకొని ఉత్తరము వైపు (అనగా ఎడమచెవి పైని) ఉన్న పుత్రుని వెంట్రుకలను కత్తిరించి శకృత్పిండములో నుంచి నీటిని తాకవలెను.

[239] ' అథ నాపితేన = అట్లు లాంఛనముగా ఆచార్యుడు కేశముల ఖండించిన తర్వాత మంగలి వానిచే శిఖలు వినా మిగితా తలను క్షౌరము చేయించవలెను. ఇచ్చట 'యత్క్షురేణ మర్చయతా' అను మంత్రముతో మంగలివానిని ఆచార్యుడనుమంత్రింపవలెనని హరదత్తునియొక్క ఏకాగ్ని కాండ వ్యాఖ్యానములోనున్నది. (లౌకికం: క్షౌరము ముగిసిన పిమ్మట ముందుగా తల్లియు, ఆ

*మం॥యత్క్షురేణ మర్చయతా సుపేశసా వప్తా వపసి కేశాన్। శున్ధి శిరో మాస్యా ఽఽయుః ప్రమోషీః॥*

[240] సూ॥ ఉత్తరయోదుంబరమూలే దర్భస్తంబే వా నిదధాతి।

*మం॥ఉప్త్వాయ కేశాన్ వరుణస్య రాజ్ఞో బృహస్పతి స్సవితా సోమో అగ్నిః। తేభ్యో నిధానం బహుధాన్వవిందన్నంతరా ద్యావాపృథివీ అపస్సువః॥*

[241] సూ॥ క్షురం ప్రక్షాళ్య నిదధాతి। తేన త్ర్యహం కర్మనివృత్తిః। బ్రహ్మణేవరం దదాతి। కుమారస్య వపనానంతరం కుమారేణ సహ మాతాపితరౌ ఉష్ణోదకస్నానం కృత్వా ధౌతవస్త్రోర్ధ్వపుండ్రాన్ ధారయేయుః। అథ ఫల (పూజాది) దానం, నవవస్త్రధారణ మాశీర్వచనం చ కారయేత్। అథ భూరిదక్షిణా దత్వా, బ్రాహ్మణాన్ భోజయిత్వా ఆశిషో వాచయేత్।



---

తర్వాత ఇతరస్త్రీలును హరిద్రాక్షతలను, చిల్లెరను చేతిలో నుంచుకొని, కుమారుని తలచుట్టును త్రిప్పి, ఎదురుగా నుంచిన ఒక నీటిపాత్రలో వేయుట ఆచారముగా నున్నది. ఇది పూర్తియైన తర్వాత మంగలివానికి కుమారుడు కూర్చున్న టవళ్లను, వానిమధ్య పోసిన ధాన్యమును, మిగిలిన యవలను, పారితోషికమును ఈయవలెను.)

[240] ఉత్తరయోదుంబరమూలే దర్భస్తంబే వా నిదధాతి = అట్లు ఖండించిన కేశములనన్నిటిని ఎద్దుపేడ, దానిలో నుంచిన యవలతో సహ 'ఉప్త్వాయ కేశాన్' అను మంత్రమును చదివి మేడి చెట్టు మొదటగాని, దర్భలదుబ్బులో గాని, ఎవరు త్రొక్కని ప్రదేశములో గాని పడవేయవలెను.

[241] క్షౌరమునకై వాడిన కత్తిని కడిగి మూడురోజులవరకు మఱల దేనికి వాడకుండ భద్రము చేయ వలెను. ఆ తర్వాత కుమారుడును, మాతాపితరులును వేడినీటిలో తలస్నానము చేసి, ధౌతవస్త్ర ములను ఊర్ధ్వపుండ్రములను ధరింపవలెను. ఆచార్యునికి గోవును (వరమనగా గోవు) గాని, తత్తుల్యమైన దక్షిణగాని ఈయవలెను. ఈ సందర్భములో సదస్యులకు ఫలతాంబూలము లిచ్చి వారి ఆశీస్సులు గైకొనుట, బ్రాహ్మణులకు సంతర్పణము చేసి, భూరిదక్షిణ లిచ్చి, వారిచే కుమారుని ఆశీర్వదింపజేయుట మున్నగునవి లౌకికాచారములు.

# అక్షరాభ్యాసః

[242]పంచమే వయసి ఉత్తరాయణే సుముహూర్తే శిశుం స్నాపయిత్వా, అలంకృత్య, అక్షరాభ్యాసం కారయేత్।

[243]అక్షరాభ్యాసదివసే యజమానః స్నాత్వా, ధృతవస్త్రోర్ధ్వపుండ్రస్సన్, సంధ్యావంద నాది నిత్యకృత్యాని నిర్వర్త్య, నాపితేన కుమారకేశఖండనం కారయిత్వా, కుమార మభ్యంగనం కారయిత్వా, నూతనవస్త్రేణాలంకృత్య, ఊర్ధ్వపుండ్రం ధారయిత్వా, తేన సహ రంగవల్ల్యాద్యలంకృతం శుచిప్రదేశం ప్రాప్య, సమస్తవస్తుసంభారాన్ సమీకృత్య, తత్ర సుమంగళ్యా దీపారాధనం కారయిత్వా, దేశకాలౌ సంకీర్త్య, '*---నక్షత్రే---గోత్రే జాతస్య ----శర్మణః మమ కుమారస్య అక్షరాభ్యాసం కరిష్యామి*' – ఇతి ప్రధాన

---

[242]ఐదవసంవత్సరమున, ఉత్తరాయణమందు, మంచిముహూర్తమున శిశువునకు అక్షరాభ్యాసము చేయవలెను. దీనికి దగిన శుభకాలమునుగుఱించి ధర్మసింధు విట్లు నుడువుచున్నది. ఉత్తరాయణమున సూర్యుడు కుంభమందున్నచో అది తగదు. శుక్లపక్షమును, కృష్ణపక్షములో ద్వాదశిపర్యంతమును తగును. విదియ, తదియ, పంచమి, దశమి, ఏకాదశి, త్రయోదశీ తిథులును, అశ్విని, మృగశీర్ష, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ధనిష్ఠ, శ్రవణము, శతభిషక్, రేవతీనక్షత్రములును, ఆది,సోమ, బుధ, గురు, శుక్రవారములును మంచివి.

[243]అక్షరాభ్యాసదివసమందు తండ్రి స్నానము చేసి, మడిబట్టలు, ఊర్ధ్వపుండ్రములు ధరించి, సంధ్యావందనాదులు ముగించుకొని, మంగలిచే కుమారునికి వపనము చేయించి, అభ్యంగన స్నానము చేయించి, క్రొత్తబట్టలు కట్టి, ఊర్ధ్వపుండ్రము పెట్టి అలంకరించి, ఆ పిల్లవానితో బాటు ముగ్గులతో అలంకృతమైన శుచిప్రదేశమునకు వచ్చి, అవసరమైన సంభారములన్నిటిని కూర్చుకొని, సుమంగళులచేత దీపమును పెట్టించి, యథాప్రకారము దేశకాలముల స్తుతించి ప్రధాన సంకల్పమును చెప్పవలెను. సంకల్పములో '---నక్షత్రే----గోత్రే జాతస్య ----శర్మణః మమ కుమారస్య అక్షరాభ్యాసం కరిష్యామి, తదంగ మాదౌ విష్వక్సేనారాధనం కరిష్యామి' – అని చెప్పి ముందుగా విష్వక్సేనారాధనము చేయవలెను. గీతలున్నచోట వరుసగా కుమారుని జన్మ నక్షత్రమును, గోత్రమును, పేరును చెప్పవలెను.

సంకల్పం కృత్వా, '*తదంగ మాదౌ విష్వక్సేనారాధనం కరిష్యామి*' ఇత్యుక్త్వా పూర్వోక్తప్రకారేణ విష్వక్సేనారాధనం కుర్యాత్.

## పుణ్యాహవాచనమ్

[244] ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ---నక్షత్రే---గోత్రే జాతస్య ---శర్మణః మమ కుమారస్య అక్షరాభ్యాసకర్మాంగం కర్మణఃపుణ్యాహం వాచయిష్యే*' – ఇతి సంకల్ప్య, పూర్వోక్తవిధానేన కర్మణఃపుణ్యాహం వాచయిత్వా, తత్పుణ్యాహజలేన ఆత్మానం కుమారం చ ప్రోక్షయేత్. (అనంతరం కేచిత్సరస్వతీ పూజాం కుర్వన్తి. తత్ప్రకారః 'సరస్వతీపూజావిధిః' ఇత్యాధ్యాయే ద్రష్టవ్యమ్.)

## అక్షరలేఖనమ్

[245]తతః తండులపూర్ణపాత్ర మేక మాదాయ, తస్మిన్ కూర్చేన దక్షిణాదుత్తరాంతం రేఖాద్వయం లిఖిత్వా, తస్మి న్నూర్ధ్వభాగాదారభ్య క్రమశః 'శ్రీః', 'ఓం నమో

---

[244]తరువాత ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---కర్మణః పుణ్యాహం వాచయిష్యే' అని సంకల్పించి 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా పుణ్యాహమును చేసి, ఆపుణ్యాహజలముతో కర్త తనను ప్రోక్షించుకొని కుమారుని ప్రోక్షించవలెను. సంకల్పములో గీతలున్నచోట వరుసగా కుమారుని నక్షత్రమును, గోత్రమును, పేరును చెప్పవలెను. అనంతరము కొందరు సరస్వతీపూజను చేయుచున్నారు. ఈ పూజావిధానము 'సరస్వతీపూజా' అను ఆధ్యాయములో చెప్పబడినది. ఇది చేయుటయే శ్రేష్ఠము.

[245]తరువాత ఒక కంచు లేక వెండితట్టలో బియ్యమును పోసి సమముగా నెరిపి, కూర్చతో బియ్యములో మూడు గడు లేర్పడునట్లుగా కుడినుండి ఎడమకు రెండు గీతలను గీయవలెను. ఇట్లు గీచి, పైగడిలో 'శ్రీః' అనియు, మధ్యగడిలో 'ఓం నమో నారాయణాయ' అనియు, క్రిందిగడిలో 'అ ఆ ఇ ఈ' అనియు కూర్చతో వ్రాసి, సదస్యులకు హరిద్రాక్షతల నిచ్చి, క్రింద నిచ్చిన ధ్యానశ్లోకములను కుమారుని కుపదేశించి, తట్టలో వ్రాసిన అక్షరములను అతనిచేత చదివించవలెను.

నారాయణాయ', 'అ ఆ ఇ ఈ' ఇతి లిఖిత్వా, సదస్యేభ్యః హరిద్రాక్షతాన్ దత్వా, కుమారాయ ధ్యానశ్లోకానుపదేశం కృత్వా, లిఖితాక్షరాణి కుమారేణ వాచయేత్.

## ధ్యానశ్లోకాః

*శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాన్తయే॥*

*శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*

*శ్లో॥ సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి।*
*విద్యారంభం కరిష్యామి సిద్ధి ర్భవతు మే సదా॥*

*శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।*
*గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః॥*

## అక్షరపఠనమ్

[246]శ్రీః। ఓం నమో నారాయణాయ। అ ఆ ఇ ఈ। - ఇత్యక్షరాన్ కుమారేణ వాచయిత్వా, తండులపూర్ణపాత్రే క్రమశః తానక్షరాన్ లేఖయిత్వా, తేన సదస్యాన్ ప్రతి నమస్కారం కారయేత్. తతః సదస్యాః '*అయం అక్షరాభ్యాసమూహూర్తస్సుముహూర్తోఽస్తు*' – ఇతి బ్రువన్ హరిద్రాక్షతాన్ కుమారస్య శిరసి క్షిపేయుః. తతో యజమానః అక్షరాన్ ప్రతి షోడశోపచారపూజాం కుర్యాత్. తత్ప్రకారః -

## షోడశోపచారపూజా

*అక్షరాధిష్ఠానదేవతాభ్యో నమః। ధ్యాయామి। ధ్యానం సమర్పయామి। ఆవాహ-*

---

[246]పై నిచ్చిన నాల్గు శ్లోకములు, మఱియు 'శ్రీః। ఓం నమో నారాయణాయ। అ ఆ ఇ ఈ।' అను లిఖితాక్షరములను కుమారునిచేత పలికించి, ఆ లిఖితాక్షరములను చూపుడువ్రేలిచే అతనితో దిద్దింపవలెను. అది జరిగిన తర్వాత 'అయం అక్షరాభ్యాసమూహూర్త స్సుముహూర్తోఽస్తు' – అనుచు సదస్యులు లోగడ తమకిచ్చిన అక్షతలను కుమారునిపై వేయవలెను. ఆతర్వాత తండ్రి అక్షరములకు క్రింద నిచ్చిన షోడశోపచారపూజను విష్వక్సేనపూజవలె చేయవలెను.

*యామి/ ఆసనం సమర్పయామి/ హస్తయోరర్ఘ్యం సమర్పయామి/ పాదయోః పాద్యం సమర్పయామి/ ఆచమనీయం సమర్పయామి/ ఔపచారికస్నానం సమర్పయామి/" ఆపోహిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/ మహే రణాయ చక్షసే/ యో వశ్శివతమో రసస్తస్య భాజయతేహ నః/ ఉశతీరివ మాతరః/ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ ఆపో జనయథా చ నః/ "– స్నాపయామి/ స్నానానంతర మాచమనీయం సమర్పయామి/ అభివస్త్రార్థ మక్షతాన్ సమర్పయామి/ ఉపవీతం సమర్పయామి/ గన్ధం సమర్పయామి/ పుష్పం సమర్పయామి/ ధూపమాఘ్రాపయామి/ దీపం దర్శయామి/ ఏతే గన్ధాక్షతపుష్పధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాస్సర్వోపచారాః* - ఇత్యభ్యర్చ్య,

నైవేద్యం - *"ఓం భూర్భువస్సువః/"*- ఇతి కదళీఫలం ప్రోక్ష్య, *"సత్యం త్వర్తేన పరిషిఞ్చామి"*- ఇతి పరిషిచ్య, *"అమృతమస్తు, అమృతోపస్తరణమసి* - ఇత్యాపోశనం దత్వా, *"ఓంప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి/"*- ఇతి నివేద్య, *"అమృతాపిధానమసి"*- ఇత్యుత్తరాపోశనం దత్వా,

*"హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ తామ్బూలం సమర్పయామి/ సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి/ ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి/ సర్వోపచారాన్ సమర్పయామి/"*

## గురుసన్నిధిః

[247]అనంతరం గురుం (ఉపాధ్యాయం) ప్రాఙ్ముఖ ఉపవేశ్య, కుమారం తస్యాంకే నివిశ్య, గురుణా కుమారేణ ఫలకే *'శ్రీః/ ఓం నమో నారాయణాయ/ అ ఆ ఇ ఈ/'* – ఇత్యక్షరాన్ లేఖయిత్వా, తాన్ కుమారేణ వాచయేత్.

---

[241]తరువాత గురుస్థానములో చక్కని భాషాసంస్కారము గల ఒకవ్యక్తిని తూర్పుముఖముగా కూర్చుండబెట్టి, కుమారుని అతని తొడపై కూర్చుండబెట్టవలెను. అతడొక స్లేటు పలకపై 'శ్రీః|

## ఆశీర్వచనాదీని

[248]తతః గురవే యథాశక్తి దక్షిణాసమేతతాంబూలపూర్వకం వస్త్రయుగ్మం సమర్ప-యేత్. అశక్తశ్చేత్ విశేషదక్షిణాం దద్యాత్. బంధుజనాః యథాశక్తి కుమారాయ సత్కారాన్ కుర్యుః. అనంతరం సదస్యేభ్యః ఆశీర్వచనం అనుగ్రహం చ కారయిత్వా తేభ్యః ఫలపుష్పదక్షిణాసమేత తామ్బూలాని దత్వా, సుమంగళీభిః శుభారాత్రికపూర్వకం మంగళగానం కారయేత్.



ఓం నమో నారాయణాయ। అ ఆ ఇ ఈ।' అను అక్షరములను వ్రాసి, ఆఅక్షరములను కుమారునిచేత పలికించి, (అవసరమైన కుమారుని చేతిని పట్టుకొని) దిద్దించవలెను.

[248]తరువాత గురువునకు దక్షిణాతాంబూలములను నూతనవస్త్రములను సమర్పించుకొనవలెను. శక్తి లేకున్న విశేషదక్షిణ నీయవలెను. సదస్యులచేత కుమారునికి ఆశీర్వచనానుగ్రహములను చేయించి, వారికి ఫలపుష్పదక్షిణలతో కూడిన తాంబూలము సమర్పించుకొనవలెను. సుమంగళులు కుమారునికి మంగళగీతములతో కూడిన శుభహారతి నీయవలెను. (ఇష్టమున్నచో బంధువులీసందర్భములో కుమారునికి కానుక లీయవచ్చును.)

# సరస్వతీపూజావిధిః

(దసరా నవరాత్రుల సందర్భములో మూలానక్షత్రమునాడు భారతభాగవతవేదాదిగ్రంథ ములను పూజాస్థలములో నుంచి వానిని సరస్వతీప్రతిరూపముగా నెంచి అనుదినము వానికి షోడశోపచారపూజను చేయుచు శ్రవణానక్షత్రమురోజు ఉద్వాసన చేయుట జరుగుచున్నది. లేదా మహానవమినాడు ప్రారంభించి విజయదశమినాడు ఉద్వాసన చేయుట జరుగుచున్నది. ఈపుస్తకములను సరస్వతిపటము లేక విగ్రహమునకు ఎదుట నుంచి పూజించుటయు ఆచారము. ఎట్లు చేసినను ఇది సకలవిద్యాప్రదాయిని యగు సరస్వతీదేవి ఆరాధనమే. అంతేకాక పిల్లలకు అక్షరాభ్యాసము చేయునప్పు డును, కేవలము భక్తితోడను ఆదేవిని పుస్తకములతో నిమిత్తము లేకుండ పూజించు టయు జరుగుచున్నది. ఈ అధ్యాయములో పుస్తకరూపముగను, విగ్రహ, పటరూప ముగను సరస్వతీ దేవిని అర్చించు పద్ధతి చెప్పబడినది. దీనికై కర్త సుస్నాతుడై, మడి బట్టలను కట్టుకొని, ఊర్ధ్వపుండ్రముల ధరించి, అర్చనకు గావలసిన సంభారముల నన్నిటిని సిద్ధపరచుకొని, పూజాప్రదేశమునకు వచ్చి, దీపమును వెలిగించి, సరస్వతీ దేవి పటము లేక విగ్రహము, లేక పుస్తకములకు ముందొక పీటను వేసి, ఆపీటపై ఒక వెండిపళ్లెరములో రెండు వెండి గిన్నెలను ఒక ఉద్ధరణిని ఉంచి, ఆగిన్నెలలో నీటిని పోసి, నీటిలో కొంచెము ఏలకిపొడిని, కుంకుమపువ్వుపొడిని వేసి సుగంధయుతముగా చేసి, గంటను కూడ అట నుంచి, గంధము, పూవులు,దూర్వ (గరిక), పసుపుకుంకుమలు, అగరువత్తులు, హారతికర్పూరము మున్నగువాటి నన్నిటిని సన్నిధిలో నుంచుకొని, ముందుగా రెండుసార్లు సాష్టాంగప్రణామము చేసి కూర్చొని క్రింది ధ్యానశ్లోకములను చదువవలెను.)

## ధ్యానశ్లోకాః

*శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే॥*

*శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*

*శ్లో॥ యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥*

*శ్లో॥ సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి।*
*విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా॥*

*శ్లో॥ యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా।*
*యా వీణా వరదండ మండిత కరా యా శ్వేత పద్మాసనా।*
*యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవై స్సదాపూజితా।*
*సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥*

**సంకల్పము:** ఆ తర్వాత ఆచమించి, రెండుసార్లు ప్రాణాయామము చేసి ఇట్లు సంకల్పము చెప్పవలెను:

[249] *"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాదిషష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే----ఋతౌ ----మాసే ---పక్షే ---తిథౌ---వాసరే--- నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయాం*

---

[249] ఈపూజను కొడుకు లేక కూతురు యొక్క విద్యాభ్యాసకర్మకంగముగా చేసినప్పుడు ఇట్లు సంకల్పమును చెప్పవలెను: '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయాం అస్యాం శుభతిథౌ అస్య ---శర్మణః కుమారస్య (అస్యాః ---నామ్న్యాః కుమార్యాః) విద్యాభ్యాసకర్మాంగత్వేన ధర్మార్థకామమోక్షరూప చతుర్విధఫలపురుషార్థసిద్ధ్యర్థం సకలవిద్యాపారంగతత్వసిద్ధ్యర్థం సరస్వతీదేవతాముద్దిశ్య సరస్వతీదేవతాప్రీత్యర్థం కల్పోక్తవిధినా యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే*'

*అస్యాం శుభతిథౌ అస్మాకం ధర్మార్థకామమోక్షరూపచతుర్విధఫలపురుషార్థ సిద్ధ్యర్థం సకలవిద్యాపారంగతత్వసిద్ధ్యర్థం సరస్వతీదేవతాముద్దిశ్య సరస్వతీదేవతా ప్రీత్యర్థం కల్పోక్తవిధినా యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే''*
– (ఇట్లు సంకల్పించి, క్రింద నిచ్చిన 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి పూజ నారంభించవలెను.)

*శ్లో॥ స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

**ధ్యానం**

*శ్లో॥ అంకుశం చాక్ష సూత్రంచ పాశం వీణాంచ ధారిణీం।*
*ముక్తాహార సమాయుక్తాం మోదరూపాం మనోహరామ్॥*
*కృతేన దర్పణాభేన వస్త్రేణోపరిభూషితాం।*
*సుస్తనీం వేదవేద్యాం చ చంద్రార్ధకృతశేఖరామ్॥*
*జటాకలాపసంయుక్తాం పూర్ణచంద్రనిభాననాం।*
*త్రిలోచనాం మహాదేవీం స్వర్ణనూపురధారిణీమ్॥*
*కటకై స్స్వర్ణరత్నాద్యై ర్ముక్తావలయభూషితాం।*
*కంబుకంఠీం సుతామ్రోష్ఠీం సర్వాభరణభూషితామ్॥*
*కేయూరై ర్మేఖలాద్యైశ్చ ద్యోతయంతీం జగత్త్రయం।*
*శబ్దబ్రహ్మాత్మికాం దేవీం ధ్యానకర్మ సమాహితః॥*

(*ఓం ఐం సరస్వత్యై నమః - ధ్యాయామి - ధ్యానం సమర్పయామి*)

**ఆవాహనం**

మం॥ ఓంప్రణో దేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనా మవిత్ర్యవతు॥

*శ్లో॥ అత్రాగచ్ఛ జగద్వంద్యే సర్వలోకైక పూజితే।*
*మయా కృతా మిమాం పూజాం గృహాణ జగదీశ్వరి॥*

*ఓం ఐం సర్వాభరణభూషితాయై నమః। ఓం భువనమాతస్సర్వవాఙ్మయరూపే ఆగచ్ఛాగచ్ఛ। ఆవాహనం సమర్పయామి।*

(అమ్మవారిపై (లేదా పుస్తకములపై) అక్షతలు వేయవలెను.)

**ఆసనం:**

*శ్లో॥ అనేక రత్న సంయుక్తం సువర్ణేన విరాజితం/*

*ముక్తామణ్యంచితం చారు సింహాసనం దదామ్యహమ్॥*

*ఓం ఐం సరస్వత్యై నమః/రత్న సింహాసనం సమర్పయామి/*

(అమ్మవారి పాదములపై (లేదా పుస్తకములపై) పుష్పమును ఉంచవలెను.)

**అర్ఘ్యం**

*శ్లో॥ భక్తాభీష్టప్రదే దేవి దేవదేవాదివందితే/*

*ధాతృప్రియే జగద్ధాత్రి దదామ్యర్ఘ్యం గృహాణ మే॥*

*ఓం ఐం ధాతృప్రియాయై నమః/ అర్ఘ్యం సమర్పయామి/*

(ఎడమవైపు గిన్నెలోని నీటిని ఉద్ధరణిలో తీసికొని సరస్వతికి (లేదా పుస్తకములకు) చూపించి, దానిని కుడివైపు గిన్నెలో నుంచవలెను.)

**పాద్యం**

*శ్లో॥ గంధపుష్పాక్షతైస్సార్ధం శుద్ధతోయేన సంయుతం/*

*శుద్ధస్ఫటికతుల్యాంగి పాద్యం తే ప్రతిగృహ్యతామ్॥*

*ఓం ఐం స్ఫాటికాభాయై నమః/ పాద్యం సమర్పయామి/*

(రెండుసార్లు ఎడమవైపు గిన్నెలోని నీటిని ఉద్ధరణిలో తీసికొని సరస్వతికి (లేదా పుస్తకములకు) చూపించి, దానిని కుడివైపు గిన్నెలో నుంచవలెను.)

**ఆచమనీయం**

*శ్లో॥ పూర్ణచంద్రసమానాస్యే కోటిసూర్యసమప్రభే/*

*భక్త్యా సమర్పితం వాణి, గృహాణాచమనీయకమ్॥*

*ఓం ఐం వాగీశ్వర్యై నమః/ ఆచమనం సమర్పయామి/*

(మూడుసార్లు ఎడమవైపు గిన్నెలోని నీటిని ఉద్ధరణిలో తీసికొని సరస్వతికి (లేదా పుస్తకములకు) చూపించి, దానిని కుడివైపు గిన్నెలో నుంచవలెను.)

**మధుపర్కం**

*శ్లో॥ కమలభువనజాయే, కోటిసూర్యప్రకాశే।*
*విశదశుచివిలాసే, కోమలే హారయుక్తే।*
*దధిమధుఘృతయుక్తం, క్షీరరమ్భాఫలాఢ్యం।*
*రుచిరమధుపర్కం గృహ్యతాం దేవవంద్యే॥*

*ఓం ఐం భక్తాభీష్టదాయిన్యై నమః। మధుపర్కం సమర్పయామి।*

( ఉన్నచో మధుపర్కమును, లేనిచో అక్షతలు సమర్పించవలెను.)

**పంచామృతస్నానం**

*శ్లో॥ దధిక్షీరఘృతోపేతం శర్కరామధుసంయుతం।*
*పంచామృతస్నానమిదం స్వీకురుష్వ మహేశ్వరి॥*

*ఓం ఐం మహేశ్వర్యై నమః। పంచామృతస్నానం సమర్పయామి।*

(ఒక పువ్వుతో పంచామృతమును చల్లవలెను. లేకున్న అక్షతలు వేయవలెను.)

**స్నానం**

*శ్లో॥ శుద్ధోదకైశ్చ సుస్నానం కర్తవ్యం విధిపూర్వకం।*
*సువర్ణకలశానీతైర్నానాగంధసువాసితైః॥*

*ఓం ఐం సువర్ణకవచాయై నమః। శుద్ధోదకస్నానం సమర్పయామి।*

(ఎడమవైపు గిన్నెలోని నీటిని ఉద్ధరణిలో తీసికొని ఆనీటిని పువ్వుతో నద్దుకొని నీరు చిలుకరించవలెను. ఉద్ధరణిలో మిగిలిన జలమును సరస్వతికి (లేదా పుస్తకములకు) చూపించి, దానిని కుడివైపు గిన్నెలో నుంచవలెను.)

**వస్త్రం**

*శ్లో॥ శుక్లవస్త్రద్వయం దేవి కోమలం కుటిలాలకే।*
*మయి ప్రీత్యా త్వయా వాణి బ్రహ్మాణి ప్రతిగృహ్యతామ్॥*

*ఓం ఐం బ్రహ్మాణ్యై నమః। వస్త్రయుగ్మం సమర్పయామి।*

(శక్తియున్నచో వస్త్రమును, లేకున్న అక్షతలను సమర్పించవలెను.)

**యజ్ఞోపవీతం**

*శ్లో॥ శబ్దబ్రహ్మాత్మికే దేవి శబ్దశాస్త్రకృతాలయే।*

*బ్రహ్మసూత్రం గృహాణ త్వం బ్రహ్మశక్రాదిపూజితే॥*

*ఓం ఐం బ్రహ్మ శక్రాది పూజితాయై నమః। యజ్ఞోపవీతం సమర్పయామి।*

( ఉన్నచో యజ్ఞోపవీతం లేదా అక్షతలు వేయవలెను.)

**ఆభరణం**

*శ్లో॥ కటక మకుటహారైర్నూపురై రంగదాద్యైః।*

*వివిధ సుమణియుక్తై ర్మేఖలారత్న హారైః।*

*కమలదళవిలాసే కామదే సంగృహీష్వ।*

*ప్రకటిత కరుణార్ద్రే భూరిశో భూషణాని॥*

*ఓం ఐం కమలదళవిలాసిన్యై నమః। సర్వాభరణాని సమర్పయామి।*

( అక్షతలు వేయవలెను.)

**గంధం**

*శ్లో॥ చందనాగురుకస్తూరీ కర్పూరాద్యైశ్చ సంయుతం।*

*గంధం గృహాణ తం దేవి విధిపత్నీ నమోస్తుతే॥*

*ఓం ఐం విధిపత్న్యై నమః। గంధం సమర్పయామి।*

(గంధం చిలకరించవలెను.)

**అక్షతలు**

*శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలితండులనిర్మితాన్।*

*గృహాణ వరదే దేవి బ్రహ్మపత్ని శుభాత్మకాన్॥*

*ఓం ఐం గీర్వాణ్యై నమః। అక్షతాన్ సమర్పయామి।*

(అక్షతలు వేయవలెను.)

**పుష్పం**

*శ్లో॥ నంద్యావర్తాదిపుష్పైశ్చ మల్లికాభిర్మనోహరైః।*

*కరవీరైర్మనోరమ్యైర్వకులైః కేతకైశ్శుభైః।*

*పున్నాగైర్జాతికుసుమై ర్మందారైశ్చ సుశోభితైః।*
*నీలోత్పలైః శుభైశ్చాన్యై స్తత్కాలతరుసంభవైః।*
*కల్పితాని చ మాల్యాని గృహాణామరవందితే॥*

*ఓం ఐం బ్రహ్మణ్యై నమః। పుష్పాణి సమర్పయామి।*

(పూవులు, గరిక సమర్పించవలెను.)

**అథాంగ పూజా**

(పసుపు, కుంకుమ, అక్షతలు, పూవులు చేతబట్టి సరస్వతిని స్మరిస్తూ ఆమె సర్వావయములను పూజించవలెను.)

*ఓం బ్రహ్మణ్యై నమః పాదౌ పూజయామి*
*ఓం బ్రహ్మణ్యమూర్తయే నమః గుల్ఫౌ పూజయామి*
*ఓం జగత్స్వరూపిణ్యై నమః జంఘే పూజయామి*
*ఓం జగదాద్యాయై నమః జానునీ పూజయామి*
*ఓం చారువిలాసిన్యై నమః ఊరూ పూజయామి*
*ఓం కమలభూమయే నమః కటిం పూజయామి*
*ఓం జన్మహీనాయై నమః జఘనం పూజయామి*
*ఓం గంభీరనాభయే నమః నాభిం పూజయామి*
*ఓం హరిపూజ్యాయై నమః ఉదరం పూజయామి*
*ఓం లోకమాత్రే నమః స్తనౌ పూజయామి*
*ఓం విశాలవక్షసే నమః వక్షఃస్థలం పూజయామి*
*ఓం గానవిచక్షణాయై నమః కంఠం పూజయామి*
*ఓం స్కంధప్రపూజ్యాయై నమః స్కంధౌ పూజయామి*
*ఓం ఘనబాహవే నమః బాహూ పూజయామి*
*ఓం పుస్తకధారిణ్యై నమః హస్తౌ పూజయామి*
*ఓం శ్రోత్రియబంధవే నమః శ్రోత్రే పూజయామి*
*ఓం వేదస్వరూపాయై నమః వక్త్రం పూజయామి*
*ఓం సునాసాయై నమః నాసికాం పూజయామి*

*ఓం బింబోష్ఠ్యై నమః ఓష్ఠౌ పూజయామి*
*ఓం కమలచక్షుషే నమః నేత్రే పూజయామి*
*ఓం తిలకధారిణ్యై నమః ఫాలం పూజయామి*
*ఓం చంద్రమూర్తయే నమః చికురాన్ పూజయామి*
*ఓం సర్వప్రదాయై నమః ముఖం పూజయామి*
*ఓం మహాసరస్వత్యై నమః శిరః పూజయామి*
*ఓం బ్రహ్మరూపిణ్యై నమః సర్వాణ్యంగాని పూజయామి*

(తర్వాత ఈ అధ్యాయము చివర నీయబడిన అష్టోత్తరశతనామములు గాని సహస్ర నామములు గాని చదువుచూ యథాశక్తి పూజించవలెను.ప్రతినామము చివర నమః అని చెప్పవలెను.)

**ధూపం**

*శ్లో॥ దశాంగం గుగ్గులోపేతం సుగంధం సుమనోహరం।*
*ధూపం గృహాణ కళ్యాణి భక్తిం త్వయ్యచలాం కురు॥*
*ఓం ఐం విశ్వాయై నమః। ధూపమాఘ్రాపయామి।*

(అగరువత్తులుగాని సాంబ్రాణి కడ్డీలుగాని వెలిగించి అమ్మవారికి (పుస్తకములకు) చూపవలెను.)

**దీపం**

*శ్లో॥ ఘృతవర్తి సమాయుక్తం దీపితం దీపమంబికే।*
*గృహాణ చిత్స్వరూపే త్వం కమలాసనవల్లభే॥*
*ఓం ఐం కమలాసనవల్లభాయై నమః। దీపం దర్శయామి।*

(దీపం వెలిగించి అమ్మవారికి (పుస్తకములకు)చూపెట్టి నమస్కరించవలెను.)

**నైవేద్యం**

*శ్లో॥ అపూపాన్ వివిధాన్ స్వాదూన్ శాలిపిష్టోపపాచితాన్,*
*మృదులాన్ గుడసమ్మిశ్రాన్ సజీరకమరీచికాన్,*
*కదళీపనసామ్రం చ సుపక్వాని ఫలాని చ,*
*కందమూలవ్యంజనాది సోపదంశం మనోహరం,*

*అన్నం చతుర్విధోపేతం క్షీరాన్నం చ ఘృతం దధి,*

*శీతోదకంచ సుస్వాదు కర్పూరైలాదివాసితం,*

*భక్ష్యభోజ్యసమాయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతామ్॥*

[250] *ఓం ఐం సరస్వత్యై నమః। మహానైవేద్యం సమర్పయామి।*

***"ఓం భూర్భువస్సువః।", "సత్యం త్వర్తేన పరిషిఞ్చామి", "అమృతమస్తు, అమృతోపస్తరణమసి", "ఓంప్రాణాయ స్వాహా। ఓం అపానాయ స్వాహా। ఓం వ్యానాయ స్వాహా। ఓం ఉదానాయ స్వాహా। ఓం సమానాయ స్వాహా। ఓం బ్రహ్మణే స్వాహా। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి।", "అమృతాపిధానమసి"***

*"హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి।"*

**తాంబూలం**

*శ్లో॥ తాంబూలం చ సకర్పూరం పూగనాగదళైర్యుతం।*

*గృహాణ దేవదేవేశి తత్త్వరూప నమోస్తుతే॥*

*ఓం ఐం దేవదేవేశి తత్త్వరూపిణ్యై నమః। తాంబూలం సమర్పయామి।*

అని తాంబూలమును అమ్మవారి (పుస్తకముల) యెదుట నుంచవలెను. )

**నీరాజనం**

---

250 పై శ్లోకములను చదివి, '*ఓం ఐం సరస్వత్యై నమః మహానైవేద్యం సమర్పయామి*' అని చెప్పి, నైవేద్యమునకై ఉన్నచో పాయసాపూపాన్నాదులను, లేకున్నచో అరటిపండ్లను, పాలను దేవి (పుస్తకముల) సన్నిధిలో నుంచి, వానిని *"ఓం భూర్భువస్సువః।"*- అని ప్రోక్షించి, *"సత్యం త్వర్తేన పరిషిఞ్చామి"*- అని పరిషేచనము చేసి, *"ఓం ప్రాణాయ స్వాహా ------ఓం బ్రహ్మణే స్వాహా।"*అని ప్రాణాహుతులను పలికి నివేదన చేసి, *"మధ్యేమధ్యే పానీయం సమర్పయామి।"*- అనుచు ఎడమవైపుగిన్నెలోని ఉదకమును ఉద్ధరణిలో తీసికొని దేవికి (పుస్తకములకు) చూపెట్టి, దానిని కుడివైపుగిన్నెలో పోసి, *"అమృతాపిధానమసి"*- అని మరల అట్లే ఉదకముతో ఉత్తరాపోశనము నొసగి, *"హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి।"*- అనుచు హస్త, పాదోదక, ఆచమనములకై అట్లే జలము నొసగవలెను.

*శ్లో॥ నీరాజనం గృహాణ త్వం జగదానందదాయినీ।*
*జగత్తిమిరమార్తాండమండలే తే నమోనమః॥*

*''ఓం ఐం జగత్తిమిరమార్తాండమండలాయై నమః। నీరాజనం సమర్పయామి।''*

*''ఓం వాగ్దేవీ జుషతామిదగ్ం హవిః। చక్షుర్దేవానాం జ్యోతిరమృతే న్యక్తమ్। అస్య విజ్ఞానాయ బహుధా నిధీయతే। తస్య సుమ్న మశీమహి। మా నో హాసీద్విచక్షణమ్। ఆయురిన్నః ప్రతీర్యతామ్। అనన్ధాశ్చక్షుషా వయమ్। జీవా జ్యోతిరశీమహి। సువర్జ్యోతిరుతామృతమ్। శ్రోత్రేణ భద్రముత శృణ్వన్తి సత్యమ్। శ్రోత్రేణ వాచం బహుధోద్యమానామ్। శ్రోత్రేణ మోదశ్చ మహశ్చ శ్రూయతే। శ్రోత్రేణ సర్వా దిశ ఆ శృణోమి। యేన ప్రాచ్యా ఉత దక్షిణా। ప్రతీచ్యై దిశశ్శృణ్వన్త్యుత్తరాత్। తదిచ్ఛ్రోత్రం బహుధోద్యమానమ్। అరాన్న నేమిః పరిసర్వం బభూవ॥* (తై.బ్రా.2.5.1)

(కర్పూర నీరాజనం వెలిగించి అమ్మవారికి (పుస్తకములకు) హారతి నీయవలెను.)

**పుష్పాంజలి**

*శ్లో॥ శారదే లోకమాత స్త్వమాశ్రితాభీష్టదాయిని।*
*పుష్పాంజలిం గృహాణ త్వం మయా భక్త్యా సమర్పితమ్॥*

*ఓం ఐం శారదాయై నమః। మంత్రపుష్పం సమర్పయామి।*

(దోసిటినిండ పూవులను తీసికొని అమ్మవారి పాదములకడ (పుస్తకములపై) ఉంచ వలెను.)

**సర్వోపచార సమర్పణము**

*ఓం ఐం - సరస్వత్యై నమః ఛత్రం ధారయామి।* (అక్షతలు వేయవలెను)

*ఓం ఐం - సరస్వత్యై నమః చామరౌ వీజయామి।* (అక్షతలు వేయవలెను)

*ఓం ఐం - సరస్వత్యై నమః గీతం శ్రావయామి।* (అక్షతలు వేయవలెను)

*ఓం ఐం - సరస్వత్యై నమః నృత్యం దర్శయామి।* (అక్షతలు వేయవలెను)

*ఏవం సమస్తరాజోపచార, దేవోపచార, శక్త్యుపచార, భక్త్యుపచార, సమస్తం సమర్పయామి।*

### ప్రార్థనా, సాష్టాంగ నమస్కారం

*శ్లో॥ పాశాంకుశధరా వాణీ వీణాపుస్తకధారిణీ।*
*మమ వక్త్రే వసేన్నిత్యం దుగ్ధకుందేందునిర్మలా॥*
*చతుర్దశసు విద్యాసు రమతే యా సరస్వతీ।*
*చతుర్దశసు లోకేషు సా మే వాచి వసేచ్చిరమ్॥*
*పాహి పాహి జగద్వంద్యే నమస్తే భక్తవత్సలే।*
*నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమో నమః।*
*మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సరస్వతి।*
*యత్పూజితం మయా దేవి పరిపూర్ణం తదస్తు తే॥*

*అనయా మయాకృత పూజయా భగవతీ సర్వాత్మికా శ్రీసరస్వతీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు। ఏతత్సర్వం సరస్వతీ దేవతార్పణమస్తు।*
*ఓం ఐం సరస్వత్యై నమః। సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి॥*
(అని ప్రార్థించి, అమ్మవారికి (పుస్తకములకు) నాల్గుసార్లు సాష్టాంగనమస్కారము చేసి ముగించవలెను.)

## సరస్వత్యష్టోత్తరశతనామావళిః

| | | |
|---|---|---|
| ఓం సరస్వత్యై నమః | ఓం మహాంకుశాయై | ఓం జటిలాయై |
| ఓం మహాభద్రాయై | ఓం పీతాయై | ఓం వింధ్యవాసిన్యై \|50\| |
| ఓం మహామాయాయై | ఓం విమలాయై | ఓం వింధ్యాచల |
| ఓం వరప్రదాయై | ఓం విశ్వాయై | విరాజితాయై |
| ఓం పద్మనిలయాయై | ఓం విద్యున్మాలాయై \|30\| | ఓం చండికాయై |
| ఓం పద్మాక్ష్యై | ఓం వైష్ణవ్యై | ఓం బ్రాహ్మ్యై |
| ఓం పద్మవక్త్రాయై | ఓం చంద్రికాయై | ఓం బ్రహ్మజ్ఞానైక |
| ఓం శివానుజాయై | ఓం చంద్రవదనాయై | సాధనాయై |
| ఓం పుస్తకహస్తాయై | ఓంచంద్రలేఖా | ఓం సౌదామిన్యై |
| ఓం జ్ఞానముద్రాయై \|10\| | విభూషితాయై | ఓం సుధామూర్తయే |
| ఓం రమాయై | ఓం సావిత్ర్యై | ఓం సుభద్రాయై |
| ఓం పరాయై | ఓం సురసాయై | ఓం సురపూజితాయై |
| ఓం కామరూపిణ్యై | ఓం దేవ్యై | ఓం సురవాసిన్యై |
| ఓం మహావిద్యాయై | ఓందివ్యాలంకార | ఓం సునాసాయై \|60\| |
| ఓం మహాపాతకనాశిన్యై | భూషితాయై | ఓం వినిద్రాయై |
| ఓం మహాశ్రయాయై | ఓం వాగ్దేవ్యై | ఓం పద్మలోచనాయై |
| ఓం మాలిన్యై | ఓం వసుధాయై \|40\| | ఓం విద్యారూపాయై |
| ఓంమహాభోగాయై | ఓం తీవ్రాయై | ఓం విశాలాక్ష్యై |
| ఓం మహాభుజాయై | ఓం మహాభద్రాయై | ఓం బ్రహ్మజాయాయై |
| ఓం మహాభాగాయై \|20\| | ఓం మహాబలాయై | ఓం మహాబలాయై |
| ఓం మహోత్సాహాయై | ఓం భోగదాయై | ఓం త్రయీమూర్తయే |
| ఓం దివ్యాంగాయై | ఓం భారత్యై | ఓం త్రికాలజ్ఞాయై |
| ఓం సురవందితాయై | ఓం భామాయై | ఓం త్రిగుణాయై |
| ఓం మహాకాళ్యై | ఓం గోవిందాయై | ఓం శాస్త్రరూపిణ్యై \|70\| |
| ఓం మహాపాశాయై | ఓం గోమత్యై | ఓం శుంభాసుర ప్రమథిన్యై |

| | | |
|---|---|---|
| ఓం మహాకారాయై | ఓం కలాధారాయై | ఓం విద్యాధర |
| ఓం శుభదాయై | ఓం రూపసౌభాగ్య | సుపూజితాయై |
| ఓం సర్వాత్మికాయై | దాయిన్యై | ఓం శ్వేతాననాయై |
| ఓం రక్తబీజనిహంత్ర్యై | ఓం వాగ్దేవ్యై | ఓం నీలభుజాయై |
| ఓం చాముండాయై | ఓం వరారోహాయై | ఓం చతుర్వర్గఫల |
| ఓం అంబికాయై | ఓం వారాహ్యై | ప్రదాయై |
| ఓం ముండకాయ | ఓంవారిజాసనాయై | ఓం రక్తమధ్యాయై \|100\| |
| ప్రహరణాయై | ఓం చిత్రాంబరాయై \|90\| | ఓం నీలజంఘాయై |
| ఓం ధూమ్రలోచన | ఓం చి త్రగంధాయై | ఓం నిరంజనాయై |
| మర్దనాయై | ఓం చిత్రమాల్య | చతురాననసామ్రాజ్యై |
| ఓం సర్వదేవస్తుతాయై \|80\| | విభూషితాయై | చతుర్వర్గఫలప్రదాయై |
| ఓం సౌమ్యాయై | ఓం కారకాయై | ఓం హంసవాహనాయై |
| ఓం సురాసురనమ | ఓం కామప్రదాయై | ఓం బ్రహ్మవిష్ణు |
| స్కృతాయై | ఓం వంద్యాయై | శివాత్మికాయై |
| ఓం కాలరాత్ర్యై | | ఓం శ్రీప్రదాయై నమః \|108\| |

*(శ్రీ సరస్వత్యై నమః/ అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి/)*



# ఉపనయనవిధిః

(ఉప=(వేదాధ్యాపకుడైన గురువుయొక్క) సమీపమునకు, నయనము=కొనిపోవుట అని ఉపనయనపదమున కర్థము. ఈ ఉపనయనసంస్కారమువలన కుమారునికి ద్విజత్వము సిద్ధించి, గురువుద్వారా వేదముల నభ్యసించు అర్హత కలుగును. ఇంత వరకు అజ్ఞానుడుగా నుండి, ఆటపాటలతో విహితాచారనియమరహితముగ కాలము బుచ్చుచున్న కుమారునికి వేదాధ్యయనార్హతను, సునియమప్రవర్తనావళిని కలిగించి అతనిని సుజ్ఞానయుతునిగా జేయుట ఈ సంస్కారముయొక్క లక్ష్యము. అందుచేత బ్రాహ్మణుడైనవాని కిది అతిముఖ్యమైన సంస్కారము.)

[251]సూ॥గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత,గర్భైకాదశేషు రాజన్యం, గర్భద్వాదశేషు వైశ్యం, వసన్తో గ్రీష్మశరదిత్యృతవో వర్ణానుపూర్వ్యేణ।

## జాతకర్మాదీనాం స్వస్వకాలేష్వకరణప్రాయశ్చిత్తమ్

[252]ఉపనయనాత్పూర్వం విహితకాలేషు జాతకర్మాదికర్మాణి కర్తవ్యాని భవన్తి. ఏతాని తత్తత్కాలేష్వకరణదోషపరిహరణార్థం పూర్వోక్తప్రకారేణ ప్రాయశ్చిత్తం కృత్వా,

---

251 వరుసగా బ్రాహ్మణక్షత్రియవైశ్యవర్ణములకు ఉపనయనము చేయవలసిన కాలమును ఈ సూత్రము తెల్పుచున్నది. గర్భాష్టమేషు = తల్లి గర్భములో పడిన మాసమునుండి లెక్కింపగా 8వ సంవత్సరమున; బ్రాహ్మణమ్=బ్రాహ్మణుని; గర్భైకాదశేషు రాజన్యం = గర్భాది 11వ సంవత్సరమున క్షత్రియుని; గర్భద్వాదశేషు వైశ్యం= గర్భాది 12వ సంవత్సరమున వైశ్యుని; ఉపనయీత=ఉపనయనము చేయవలెను; వర్ణానుపూర్వ్యేణ=ఈవర్ణములవారికి క్రమముగా; వసన్తో గ్రీష్మశరదిత్యృతవః = వసంతము, గ్రీష్మము, శరత్తు (ఉపనయనము చేయవలసిన) ఋతువులు – అని ఈ సూత్రమున కర్థము. ఈకాలనిర్ణయ మింకను విస్తృతముగా ధర్మసింధు, కాలామృతమువంటి గ్రంథములలో నున్నది. జిజ్ఞాసువులు వాటిని చూడవలెను.

[252] ఉపనయనాతూర్వం =ఉపనయనమునకంటె ముందుగా; విహితకాలేషు=అవి యవి చేయ వలసిన కాలములందు; జాతకర్మాదికర్మాణి = జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము,

అతీతాని కర్మాణి సద్యః కృత్వా, అనంతర ముపనయనకర్మాంగత్వేనాంకురార్పణ, ప్రతిసరబంధ, అభ్యుదయ,పుణ్యాహవాచనాని క్రమాత్కృత్వా, ఉపనయన మారభేత।
[253]అత్రోదకశాన్త్యఙ్కురార్పణప్రతిసరబంధకర్మాణి కేచిత్పూర్వేద్యురేవ పరిసమాప్య, అద్యాభ్యుదయపుణ్యాహవాచనే కృత్వా, ఉపనయన మారభన్తే।

## [254]పరిషదనుజ్ఞా

కర్తా తాంబూలఫలదక్షిణాసమేత హరిద్రాక్షతపాత్రం హస్తే గృహీత్వా, పత్నీకుమార సహితః వేదికాయాః పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ,

---

చౌలము అను కర్మలు; కర్తవ్యాని భవన్తి = చేయవలసియున్నవి; ఏతాని=ఈకర్మలు; తత్తత్కాలేషు=ఆయాకాలములలో; అకరణదోషపరిహరణార్థం=చేయని దోషమును తప్పించు కొనుటకై; పూర్వోక్తప్రకారేణ = 'జాతకర్మాదీనాం స్వస్వకాలేష్వకరణ ప్రాయశ్చిత్తమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగ; ప్రాయశ్చిత్తం =ప్రాయశ్చిత్తమును; కృత్వా=చేసి; అతీతాని కర్మాణి=ఈకర్మలలో ఏవైన అసలే చేయకుండినవో వానిని; సద్యః = ఇప్పుడు; కృత్వా=చేసి; అనంతరమ్=తదుపరి; ఉపనయనకర్మాంగత్వేన = (ఇప్పుడు చేయబోవు) ఉపనయనమున కానుషంగికకర్మలైన; అంకురార్పణ, ప్రతిసరబంధ,అభ్యుదయ పుణ్యాహవాచనాని = అంకురార్పణ, ప్రతిసరబంధ, అభ్యుదయ, పుణ్యాహవాచనములను; క్రమాత్=వరుసగా; కృత్వా= చేసి; ఉపనయనమ్= ప్రధానకర్మయైన ఉపనయనమును; ఆరభేత=ఆరంభింపవలెను; అనగా ఉపనయనమునకంటె ముందుగా జాతకర్మాదిసంస్కారములు విహితకాలములలో చేయవలసి యున్నది. వానిని సకాలములో చేయని దోషనివృత్తికై 'జాతకర్మాదీనాం స్వస్వకాలేష్వకరణ ప్రాయశ్చిత్తమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగ ప్రాయశ్చిత్తమును చేసి, ఈసంస్కారము లలో ఏవైన అసలే చేయకున్నచో దాని నిప్పుడు పూర్తి చేసి, ఆతర్వాత ప్రస్తుతోపనయనకర్మ కంగములైన అంకురార్పణ, ప్రతిసరబంధ, అభ్యుదయ, పుణ్యాహవాచనములను వరుసగా చేసి, అవి పూర్తియైన తర్వాత ఉపనయనకర్మను ఆరంభింపవలె నని తాత్పర్యము.

[253] కొందరు ముందురోజే ఉదకశాంతి, అంకురార్పణ, ప్రతిసరబంధములను చేసి, తరువాతి రోజున అభ్యుదయపుణ్యాహవాచనములను పూర్తిచేసి ఉపనయనము నారంభింతురు.

254 ఈపరిషదనుజ్ఞావివరణకై మొదటి అధ్యాయములోని 29-30 పుటలను చూచునది.

*ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై*/ (తై.సం.3-2-4-14)/ *సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యాస్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్/* (తై.బ్రా.1-2-1-26)

*సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః/ స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితా మిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే ఉపనయనకర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ లగ్నస్య సర్వే గ్రహాశ్శుభైకాదశస్థానఫలదా స్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తోమహాన్తోఽనుగృహ్ణన్తు/*' - ఇతి ప్రార్థ్య నమస్కుర్యాత్. "*ఉత్తరే కర్మణ్య విఘ్నమస్తు/*" - ఇతి పరిషద్వచనమ్.

## ప్రధానసంకల్పః

[255]కర్తా దర్భేష్వాసీనః, ద్విరాచమ్య, పవిత్రపాణిః, దర్భాన్ ధారయమాణః, త్రిః ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే//*

---

[255] తర్వాత ఉపనయనకర్మార్థమై సంకల్పమును చేయవలెను. దీనికై తాను కూర్చొను పీటపై కర్త రెండు ఉత్తరాగ్రపు దర్భలను వేసి, యథావసరముగా భార్యాకుమారులతో సహా పీటలపై కూర్చొని రెండుసార్లు ఆచమించి, కుడిచేతి అనామికకు పవిత్రమును పెట్టుకొని, రెండు దర్భలను కుడి వైపు మొలలో దోపికొని, మూడుసార్లు ప్రాణాయామము చేసి, 'శుక్లాంబరధరం విష్ణుం' నుండి మొదలిడి 'కరిష్యే' వరకు సంకల్పమును చెప్పవలెను. '----' అని గీతలుంచిన స్థలములలో కావలసిన అయన ఋతు తిథి వార నక్షత్రముల పేర్లు చెప్పుకొనవలెను. ----గోత్రం ---శర్మాణం అని ఉన్న చోట గీతలకు బదులు కుమారుని గోత్రమును, పేరును చెప్పవలెను. ఇట్లు సంకల్పించిన తరువాత 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి, తదుపరి 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధనను చేయవలెను.

*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ----గోత్రం ---శర్మాణం మమ కుమారం ఉపనేష్యే, తదంగం కర్మ నిర్విఘ్నేనపరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే* - ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా విష్వక్సేనారాధనం కుర్యాత్.

## అంకురార్పణమ్

[256]పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభ*

---

[256] మునుపటిరోజే అంకురార్పణకర్మ చేసియుండనిచో, మఱల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ----గోత్రస్య---శర్మణః కుమారస్య ఉపనయనకర్మాంగత్వేన అంకురార్పణకర్మ కరిష్యామి*' అని సంకల్పించి, 'ఆఙ్కురార్పణమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా ఆఙ్కురార్పణమును చేయవలెను.

*తిథౌ అస్య---గోత్రస్య---శర్మణః కుమారస్య ఉపనయన కర్మాంగత్వేన అంకురా-ర్పణకర్మ కరిష్యామి'* ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ అంకురార్పణం కుర్యాత్.

## ప్రతిసరబంధః

[257]పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అస్య---గోత్రస్య---శర్మణః కుమారస్య ఉపనయనకర్మాంగత్వేన ప్రతిసరబంధకర్మ కరిష్యామి'* ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ ప్రతిసరబంధనం కుర్యాత్.

## నాందీముఖమ్ (అభ్యుదయమ్)

[258]పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అస్య---గోత్రస్య---శర్మణః కుమారస్య ఉపనయనకర్మాంగత్వేన నాందీదేవతా-హ్వానం కరిష్యామి'* ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ నాన్దీముఖం కుర్యాత్.

## పుణ్యాహవాచనమ్

[259]పునః ప్రాణానాయమ్య,'*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ*

---

[257] మునుపటిరోజే ప్రతిసరబంధమును చేసియుండనిచో, మఱల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభ తిథౌ అస్య---గోత్రస్య ---శర్మణః కుమారస్య ఉపనయనకర్మాంగత్వేన ప్రతిసరబంధనకర్మ కరిష్యామి'* అని సంకల్పించి, 'ప్రతిసరబంధప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగ రక్షాబంధనకర్మను చేయవలెను.

[258] అంకురార్పణప్రతిసరబంధములను మునుపటిరోజు చేసి, సామాన్యముగా ఆరోజు నాందీ ముఖమును, పుణ్యాహమును చేసి ఉపనయనకర్మ నారంభించుచున్నారు. అందుచేత నాందీ ముఖమునకై కర్త మఱల ప్రాణాయామం చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ---ఉపనయనకర్మాంగత్వేన నాందీదేవతాహ్వానం కరిష్యామి'* అని సంక ల్పించి, 'నాందీముఖమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా నాందీముఖమును చేయవలెను.

[259] పుణ్యాహవాచనమునకై కర్త మఱల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణ విశిష్టాయా మస్యాం శుభతిథౌ అస్య-----గోత్రస్య -----శర్మణః కుమారస్య ఉపనయన కర్మాంగత్వేన కర్మణః పుణ్యాహం వాచయిష్యే'* అని సంకల్పించి, 'పుణ్యాహవాచనమ్'

*అస్య---గోత్రస్య---శర్మణః కుమారస్య ఉపనయనకర్మాంగత్వేన కర్మణఃపుణ్యాహం వాచయిష్యే'* ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ కర్మణఃపుణ్యాహం వాచయిత్వా, పుణ్యాహజలేన ఆత్మానం ప్రోక్ష్య, భార్యాం, కుమారం యజ్ఞోపవీతం చ ప్రోక్షయేత్.

## (లౌకికమ్ – మాతులకట్నమ్)

[260]అథ కుమారస్య మాతులో వా తత్సంబంధీకో వా దమ్పత్యోః నూతనవస్త్రాణి దదాతి. తత్సమయే ఆచార్యః వక్ష్యమాణ మన్త్రపూర్వకాశీర్వచనవాక్యాని పఠతి.

---

అను అధ్యాయములో చెప్పినట్లుగా పుణ్యాహవాచనము చేసి, పుణ్యాహజలముచే కర్త ముందుగా తనను ప్రోక్షించుకొని, తదుపరి భార్యను, కుమారుని, కుమారునికి వేయబోవు యజ్ఞోపవీతమును ప్రోక్షింపవలెను.

[260] ఈసమయములో కుమారుని మేనమామగాని, తత్సంబంధీకులైన ఇతరులుగాని కుమారుని మాతాపితరులకు నూతనవస్త్రము లిచ్చు సంప్రదాయము వైష్ణవులలో నున్నది. దీనికై వస్త్రప్రదాత ధోవతి, ఉత్తరీయములు, పూవులు,పండ్లు, కుంకుమ,అక్షతలు,తాంబూలముల నొక తట్టలో పెట్టుకొని వాధ్యారు 'ఆశాస్తేయం' అను మంత్రమును, 'శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాన్తప్రవర్తక కుమారస్య మాతులః శ్రీమదిత్యాది శ్రీమాన్ ----ఆచార్యస్య ఆశీర్వాదమ్' అను వాక్యమును చెప్పుచుండగా ఉపనయనకర్తకు (సామాన్యముగా తండ్రి) ముఖమున బొట్టును పెట్టి, ఆవస్త్రతాంబూలాదులను చేతికిచ్చి తలపై అక్షతలు వేయవలెను. ప్రదాత గ్రహీత కంటె చిన్నవాడైనచో వాక్యములో 'ఆశీర్వాదమ్' అనుటకు బదులు 'సమర్పణమ్' అని చెప్పవలెను. వాక్యములో గీతలున్నచోట ప్రదాతృపక్షములోని పెద్దవారిపేరును చెప్పవలెను. ఇచ్చునది మాతులుడు (మేనమామ) గాక ఇతరుడైనచో'మాతులః' అను శబ్దమునకు బదులుగ తగిన సంబంధమును చెప్పవలెను. తరువాత ప్రదాతృపక్షమునకు చెందిన ఒకస్త్రీ అదేవిధముగా ఉపనయనకర్తయొక్క భార్యకు (సామాన్యముగా తల్లి) చీరరవికలను కట్నముగా నీయవలెను. ఉపనయనకర్తలు ఈ నూతనవస్త్రములను ధరించివచ్చి పీటలపై కూర్చొని తరువాతి కార్యక్రమమును చేయవలెను. ఇట్లు కట్నము లిచ్చువారు లేకున్న తామే క్రొత్తబట్టలను కొని ధరించి తరువాతి కార్యక్రమమును చేయవలెను. అభ్యుదయ,పుణ్యాహములకు పూర్వమే క్రొత్తబట్టల నీయవలెను. అట్లిచ్చిన క్రొత్తబట్టలను ధరించియే తరువాతి కార్యక్రమమును చేయ

*మం॥ఆశాస్తేఽయం యజమానోఽసౌ / ఆయురాశాస్తే/ సుప్రజాస్త్వమాశాస్తే/ సజాత-వనస్యామాశాస్తే/ ఉత్తరాం దేవయజ్యామాశాస్తే/ భూయో హవిష్కరణమాశాస్తే/ దివ్యం ధామాశాస్తే/ విశ్వం ప్రియ మాశాస్తే/ యదనేన హవిషాఽఽశాస్తే/ తదశ్యాత్తదృధ్యాత్/ తదస్మై దేవా రాసన్తామ్॥ త్వష్టా జాయామజనయ త్త్వష్టాస్యై త్వాం పతిమ్/ త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్/ సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత/ సౌభాగ్య మస్యై దత్వా యాథాస్తం విపరేతన/ ఇమాం త్వ మిన్ద్ర మీఢ్వస్సుపుత్రాగ్ం సుభగాం కృణు/ దశాస్యాం పుత్రా నాధేహి పతి మేకాదశం కృధి॥*

వా॥శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాన్తప్రవర్తక కుమారస్య మాతులః శ్రీమదిత్యాది శ్రీమాన్ ----ఆచార్యస్య ఆశీర్వాదమ్ (సమర్పణమ్)॥

[261]తతో యజ్ఞోపవీతమౌంజ్యజినభిక్షాపాత్రాణి సుజనైస్సహానుగ్రహం కారయేత్.

## యజ్ఞోపవీతధారణమ్

[262]కర్తా ద్విః ప్రాణానాయమ్య, ‘‘*హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద–*

---

వలెనని కొందరి మతము. ఈపద్ధతియే ప్రశస్తముగా నున్నది. కాని ఎవరిపద్ధతి ప్రకారము వారు చేసికొనవచ్చును.

[261] ఉపనయనకర్తగాని, తత్సంబంధీకుడు గాని వటువుచే ధరింపజేయవలసిన యజ్ఞోపవీతమును, మౌంజిని, అజినమును, భిక్షాపాత్రను ఒకతట్టలో నుంచుకొని సమక్షములో నున్న పెద్ద వారికి చూపించగా వారు ఆతట్టను అభిమంత్రించి యజ్ఞోపవీతధారణ ననుగ్రహింపవలెను.

[262] తర్వాత కుమారునికి యజ్ఞోపవీతమును వేయవలెను. దీనికై కర్త రెండుసార్లు ప్రాణాయామముచేసి, ‘హరిరోం తత్సత్ ---యజ్ఞోపవీతం ధారయిష్యే’ పర్యంతము సంకల్పమును చెప్పి, కుమారుని మంత్రరహితముగా ఆచమింపజేయవలెను. ఈ సందర్భములో బ్రాకెట్లలో నిచ్చిన రెండు కారికలున్నవి. మొదటికారిక పుణ్యాహవాచనానంతరము, సమిధాధానమునకు పూర్వము కుమారునకు యజ్ఞోపవీతమును వేయవలెనని యజ్ఞోపవీతమును వేయవలసిన సమయమును నిర్ధరించుచున్నది. రెండవకారిక కర్త దర్భాసనముపై కూర్చుండి, ప్రాణాయా

*అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ---- మాసే ----పక్షే ----తిథౌ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభ నక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమ న్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం అస్య---గోత్రస్య---శర్మణః కుమా- రస్య శ్రౌతస్మార్తనిత్యకర్మానుష్ఠానయోగ్యతాఫలసిద్ధ్యర్థం నూతనయజ్ఞోపవీతం ధారయిష్యే* - ఇతి సంకల్ప్య,

(అత్ర కారికాః:

శ్లో॥ యజ్ఞోపవీతకాలస్యా ద్వాచనే కృత ఆశిషాం।
పురస్తాత్సమిధాధానా చ్ఛివస్వామిమతేన తు॥
ఉపవిశ్యాసనే దర్భైః ప్రాణానాయమ్య వాగ్యతః।
మన్త్రం సదైవ ముచ్చార్య బ్రహ్మసూత్రం గళే క్షిపేత్॥)

[263]కుమార మాచమయిత్వా, *యజ్ఞోపవీతధారణమంత్రస్య బ్రహ్మా ఋషిః। త్రిష్టుప్ ఛన్దః। వేదాస్త్రయో దేవతాః। యజ్ఞోపవీతధారణే వినియోగః।-*

---

మము చేసి, తానే మంత్రములను చెప్పుచు కుమారుని గళములో యజ్ఞోపవీతమును వేయవలె ననుచు ఆయజ్ఞోపవీతమును వేయవలసిన విధానమును తెల్పుచున్నది.

[263] సదస్యులకు అక్షత లిచ్చి, కుమారునిచేత ఆచమనము చేయించి, తండ్రి లేచి పడమటికి మళ్లి నిలబడి, బ్రహ్మముడి రెండు అరచేతులకు మధ్యనుండునట్లు యజ్ఞోపవీతమును పట్టుకొని, 'యజ్ఞోపవీతధారణమంత్రస్య బ్రహ్మా ఋషిః' – అని ఆ యజ్ఞోపవీతముతో కూడిన దోసిలిని కుమారుని శిరస్సునకు తాకించి, ' త్రిష్టుప్ ఛన్దః' – అనుచు ఆ దోసిలిని అతని పెదవులకు తాకించి, 'వేదాస్త్రయో దేవతాః' – అనుచు ఆదోసిలిని అతని హృదయమునకు తాకించి 'యజ్ఞోపవీతధారణే వినియోగః' – అనుచు దోసిలిని అతని నాభికి తాకించి, 'యజ్ఞోపవీతం పరమం పవిత్రం—బలమస్తు తేజః' అను మంత్రమును చెప్పి, ఆ యజ్ఞోపవీతమును అతని

*మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥*

- ఇతి యజ్ఞోపవీతం కుమారస్య గళే నిక్షిప్య, కుమారేణ తన్మన్త్రం వాచయిత్వాఽఽ చామయేత్. *'యజ్ఞోపవీత ధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు'*– ఇత్యాశీర్వాదః.

[264]సూ॥ కుమారం భోజయిత్వా॥ ఆచార్యః స్వయం మన్త్రముక్త్వా ప్రోక్షణపరిషేచనాని కృత్వా, ఆపోశనప్రాణాహుతిసహితం క్షారలవణవర్జం ఘృతక్షీరమిశ్రమన్నం (కేచిత్ మాత్రాసహ) కుమారం భోజయేత్। భోజనానన్తర ముత్తరాపోశనం ప్రాశయిత్వా, హస్త పాదౌ చ ప్రక్షాళయిత్వా ద్విరాచామయేత్।

## వపనమ్

[265]కుమారం స్వదక్షిణతః ఉపవేశ్య, అపాం సంసర్జనాద్యాకేశనిధానాన్తం చౌలవత్

---

ఎడమభుజముపైనుండి కుడివంకకు క్రిందుగా వ్రేలాడునట్లు వేసి, అట్లు వేసిన తర్వాత కుమారునిచేత 'యజ్ఞోపవీతం పరమం పవిత్రం...' అను మంత్రమును పలికించి, మఱల ఆచమనము చేయింపవలెను. అప్పుడు సదస్యులు 'యజ్ఞోపవీతధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు' – అనుచు కుమారునిపై తమ కిచ్చిన అక్షతలను వేసి దీవించవలెను.

[264] తర్వాత కుమారుని తూర్పుముఖముగా కూర్చుండబెట్టి, స్థలశుద్ధి చేసి, విస్తరాకులో ఉప్పు కారము లేని నేయిపాలతో కూడిన (లఘు)భోజనమును వడ్డించి, ఆచార్యుడే అన్నపరిషేచనమునకు కావలసిన మంత్రములను చెప్పుచు అన్నపరిషేచనమును చేయించి, 'అమృతోపస్తరణమసి' అను మంత్రమును చెప్పుచు ఆపోశనము చేయించి, 'ఓం ప్రాణాయ స్వాహా' ఇత్యాది మంత్రములు చెప్పుచు ప్రాణాహుతులను చేయించి, భోజనము ముగిసిన తరువాత 'అమృతాపిధానమసి' అను మంత్రమును చెప్పి ఉత్తరాపోశనము చేయించి, కాలుసేతులు, నోరు కడిగికొని వచ్చిన కుమారునిచేత రెండుసార్లు ఆచమింపజేయవలెను. ఈసందర్భములో తల్లిని, ఇతరబ్రహ్మచారులను సహపంక్తిలో భుజింపజేయవలెనని కొందరి పద్ధతి. కాని ఇది శాస్త్రాధార రహితమని, అందుచే కుమారుని మాత్రమే భుజింపజేయవలెనని నృసింహపండితుడు 'స్మార్త కారికావృత్తి' అను గ్రంథములో వ్రాసినాడు.

[265] తర్వాత తండ్రి కుమారుని తనకుడివైపునకు కూర్చుండబెట్టుకొనగా, ఆచార్యుడు 'చౌల'

కుర్యాత్।[266]వపనాన్తరం సుస్నాతం ధృతకౌపీనం శుద్ధవస్త్రాచ్ఛన్నం ధృతోర్ధ్వపుండ్రం బద్ధశిఖ మాచాన్తం కుమారం దక్షిణత ఉపవేశ్య, [267]శ్రోత్రియాగారాదగ్ని మాహృత్య యత్రక్వచేతివిధినా అగ్నిప్రతిష్ఠాపనాదిపాత్రసాదనాంతే,

---

ప్రకరణమునందలి 234-238 పుటలలో చెప్పినట్లుగా దిగ్వపనమునుండి ఆరంభించి, 'క్షురం ప్రక్షాళ్య నిదధాతి' అను వాక్యమువరకుగల కర్మను చేయవలెను.

[266] అట్లు దిగ్వపనము, క్షురకునిచే చేయబడిన వపనము ముగిసిన పిమ్మట తండ్రియు, కుమారుడును సుస్నాతులై మడిబట్టలను కట్టుకొని, ఊర్ధ్వపుండ్రములను ధరించి, మఱల శుభవేదిక కడ పీటలపై యజమాని (తండ్రి) కుమారుని తన కుడికి కూర్చుండబెట్టుకొని, అతనిచేత ఆచమనము చేయించి, షట్పాత్రప్రయోగవిధానముచేత ఆజ్యభాగమును చేయవలెను. కాని ఇక్కడ ఒక సందేహ ముదయించుచున్నది. ఇదివఱకు శాస్త్రోక్తముగా సకాలమునకు చౌలము జరిగి యుండనిచో ఇప్పుడు ఉపనయనాత్పూర్వము దానిని పూర్తిచేసి, ఉపనయనము నారంభించుచున్నాము. ఇట్లు వటువునకు ముందే క్షురకర్మ జరిగియుండును. ఇట్టి పరిస్థితిలో ఉపనయనములో చెప్పబడిన వపనమున కర్థమేమి యను ప్రశ్న వచ్చును. ఇందుకు 'సర్వమతే తు చౌల ఏవ విధ్యుక్తమ్। ఉపనయనేతు దిగ్వపనమేవ।' అని చెప్పియుండుటచే చౌలములో చేసిన క్షురకర్మకే ప్రాధాన్యము. అట్లు వెంట్రుకలు ముందే కొరుగబడినను, ఉపనయనములో దర్భల నడ్డముగా నుంచి చౌలప్రయోగములో చెప్పినవిధముగా దిగ్వపనము చేయవలెను. ఒకవేళ చౌలము సకాలమునకు సమంత్రకముగా జరిగియుండినచో, ఉపనయనాత్పూర్వ మిప్పుడు దానిని చేయవలసిన అవసరము లేదు కనుక, ఉపనయనాంగముగనే ఇప్పుడు దిగ్వపనము, క్షురకకృత వపనములను చేయింపవలె ననుట స్పష్టము.

[267] శ్రోత్రియగృహమునుండి అగ్ని తెచ్చి, షట్పాత్రప్రయోగములో చెప్పినట్లుగా అగ్నిముఖమును (ఆజ్యభాగమును) చేయవలెను. ఆజ్యభాగమును చేయునపుడు దైవపాత్రలన్నియు ఆసాదన చేసిన తర్వాత, ఆ దైవపాత్రల కుత్తరమున పూర్వాగ్రముగా దర్భలను పరచి, వానిపై నొకతట్టలో ప్రస్తుత ముపనయనమున కవసరమైన విశేష (మనుష్య)పాత్రల నుంచవలెను. ఈ విశేషపాత్ర లేవియో 'పాత్రప్రయోగేతు...' అను శ్లోకము చెప్పుచున్నది. దీని ప్రకారము, కుశ= అగ్రములు గల దర్భకట్టయు, అంబు = ఉదకము నుంచిన పాత్రయు, కూర్చ=కూర్చయు, దండ = అగ్రము గల మోదుగుదండమున్ను, అజిన=కృష్ణాజినమున్ను, వస్త్ర= ఆనాడే చింపి, నీటిలో తడిపి ఆరవేసినట్టి వస్త్రమున్ను, అశ్మ= గుండ్రాయి, లేక సన్నెకల్లును, మేఖలా

శ్లో॥ పాత్రప్రయోగేతు కుశాంబు కూర్చ వస్త్రాశ్మ దండాజినమేఖలాశ్చ(భిక్షాపాత్రంచ)।
దైవాని పాత్రాణి నియుజ్య పశ్చాద్యుంజీత చామూని సహోపనేతా॥

### [268]ఆజ్యభాగః

**సంకల్పః** కర్తా ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ఉపనయనకర్మాంగత్వేన షట్పాత్రప్రయోగవిధానేన అగ్నే ముఖం కరిష్యే'* - ఇతి సంకల్ప్య। గోమయేనోపలిప్తే శుచౌ దేశే, శ్వేతతండులచూర్ణేన ప్రాదేశమాత్రం చతురస్రసమం స్థండిలం కల్పయిత్వా। ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్। అవాక్కరోఽభ్యుక్ష్య। తృణం నైఋత్యాం నిరస్య। అప ఉపస్పృశ్య। *"ఓం భూర్భువస్సువరోమ్"*– ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య। ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్। అగ్ని మిద్ధ్వా (ప్రజ్వాల్య)॥

*"ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య। త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ(తై.ఆ.6.10)।అగ్నిం ధ్యాయామి"* - ఇతి ధ్యాత్వా।

*"ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః। స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః।" ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ। సుముఖో భవ। సుప్రసన్నో భవ। వరదో భవ। యథోక్తజిహ్వయా హవిర్గృహాణ।* - ఇత్యగ్ని మావాహ్య। ప్రార్థ్య।అగ్నేః పురతోఽక్షతోదకం నినీయ।

---

=ముప్పేటగా పేనబడి, నడుముకు మూడుచుట్లు తిరుగునంత పొడవుగా నున్న ముంజగడ్డి లేక దర్భయొక్క త్రాడున్ను, మఱియు భిక్షాపాత్రయును – అను తొమ్మిది ఈ మనుష్యపాత్రలు. వీటన్నిటిని ఒక తట్టలో పెట్టి, ఆతట్టను అగ్ని కుత్తరమున దర్భలపై నుంచవలెను.

[268]ఇచ్చట అగ్నిముఖము వివరణ లేకుండ వ్రాయబడినది. వివరణకై 'షట్పాత్రప్రయోగ' ప్రకరణమును చూచునది. ఆజ్యభాగ మనుటచే నిచ్చట శమ్యలను వాడవలెను.

పరిసమూహ్య, *1. ఓం అగ్న యే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతై రలంకృత్య।

ప్రాగగ్రైరుదగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్। [269]ఉత్తరేణాగ్నిం దర్భాన్ సగ్గంస్తీర్య। ద్వంద్వం న్యఞ్చిపాత్రాణి ప్రయునక్తి దర్వీ మాజ్యస్థాలీమ్। ప్రోక్షణీం ప్రణీతీమ్। ఇధ్మ మితరదర్వీం।
సమౌ సాగ్రౌ ద్వౌ దర్భౌ ప్రాదేశ మాత్రౌ పవిత్రే కృత్వా। తృణం కాష్ఠం వాంతర్ధాయ ఛినత్తి న నఖేన। అప ఉపస్పృశ్య। అద్భిరనుమృజ్య। ప్రోక్షణ్యామవధాయ। తస్యామప అనీయ। హస్తయోరఙ్గుష్ఠోపకనిష్ఠికాభ్యాం ఉత్తానాభ్యాం ఉదగగ్రే గృహీత్వా। ప్రాచీ స్త్రిరుత్పూయ। అభిమన్త్ర్య। సపవిత్రేణ పాణినా పాత్రాణి సంమృశ్య। పాత్రాణ్యుత్తానాని కృత్వా। విస్రస్యేధ్మం। త్రిః ప్రోక్షతి। శేషముత్సిచ్య। పునః పూరయిత్వా। దక్షిణతో నిధాయ। పూర్ణపాత్రమాదాయ। అపరేణాగ్నిం పవిత్రాంతర్హితే పాత్రే అప ఆనీయ। ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం త్రిరుత్పూయ। ముఖసమముద్ధృత్య। సమం ప్రాణైర్హుత్వోత్తరేణాగ్నిం దర్భేషు సాదయిత్వా। తత్పవిత్రమాజ్యస్థాల్యాం నిధాయ। దర్భైః ప్రచ్ఛాద్య।
"అస్మిన్ ఉపనయనహోమకర్మణి బ్రహ్మాణం త్వాం వృణీమహే।బ్రహ్మణే నమః। ఇద మాసనమ్। ఆవాహనాది షోడశోపచారాన్ సమర్పయామి।" - ఇతి బ్రహ్మాణం దర్భేషు అగ్నేర్దక్షిణతో నిషాద్య। అక్షతైరభ్యర్చ్య।

ఆజ్యం విలాప్య। అపరేణాగ్నిం పవిత్రాంతర్హితయామాజ్యస్థాల్యాం ఆజ్యం నిరూప్య। ఉదీచోఽఙ్గారాన్నిరూహ్య। తేష్వధిశ్రిత్య।జ్వలతా తృణేనావద్యోత్య। తం విసృజ్య।

---

[269] **పాత్రాసాదనమ్**:అగ్నికి ఉత్తరమున 6-6 దర్భలను రెండువరుసలుగా పూర్వాగ్రముగా పఱచి, ముందుగా దైవపాత్రలను కుడి, ఎడమచేతులలో జంటగా తీసికొని 'షట్పాత్రప్రయోగ ములో' చెప్పినట్లుగా బోర్లించి పెట్టవలెను. తర్వాత ఆపాత్రల కుత్తరమున పూర్వాగ్రముగా దర్భలను పరచి, వానిపై నొక తట్టలో లోగడచెప్పిన 9 మనుష్యపాత్రలను ఉంచవలెను.

అప ఉపస్పృశ్య| ద్వే దర్భాగ్రే నఖాద్యనేన (అంగుష్ఠపర్వమాత్రం) సకృత్ప్రచ్ఛిద్య| ప్రక్షాళ్య| అప ఉపస్పృశ్య| ప్రత్యస్య (ఆజ్యే ప్రాశ్య) | ప్రాగాది ప్రదక్షిణం త్రిః పర్యగ్నిః కృత్వా| అప ఉపస్పృశ్య| ఉదగుద్వాస్య| అంగారానగ్నౌ ప్రత్యూహ్య| ఆజ్యస్థాలీం స్వస్య పురస్తాన్నిధాయ| ఉదగగ్రాయామతేన పునరాహారమాజ్యం త్రిరుత్పూయ| పవిత్రగ్రంథిం విస్రస్య| ప్రక్షాళ్య| అప ఉపస్పృశ్య| ప్రాగగ్రమగ్నౌ ప్రహరతి| దర్వీ న్నిష్టప్య| త్రిభిః దర్భైః సంమృజ్య| పునర్నిష్టప్య| ప్రోక్ష్య| నిధాయ| అద్భిః సంస్పృశ్య| అగ్నౌ ప్రహరతి|

## శమ్యానిధానమ్

పరిధ్యర్థే శమ్యాః దధాతి| స్థవిష్ఠో మధ్యమః| అణీయాన్ ద్రాఘీయాన్ దక్షిణార్ధ్యః| అణిష్ఠో హ్రసిష్ఠ ఉత్తరార్ధ్యః| మధ్యమముదగగ్ర మితరౌ ప్రాగగ్రౌ|| మధ్యమపరిధి ముప స్పృశ్య| ద్వే ఆఘారసమిధౌ పురస్తాదూర్ధ్వే దక్షిణోత్తర మాదధాతి||

## పూర్వపరిషేచనమ్

అగ్నిం పరిషించతి| *"అదితేఽనుమన్యస్వ"* (ఇతి దక్షిణతః ప్రాచీనమ్), *"అను-మతేఽనుమన్యస్వ"* (ఇతి పశ్చాదుదీచీనమ్), *"సరస్వతేఽనుమన్యస్వ"* (ఇత్యుత్తరతః ప్రాచీనమ్),"*దేవసవితః ప్రసువ*" (ఇతి సమంతమ్) పరిషిచ్య||

ఇధ్మమలంకృత్య| స్వయమలంకృత్య| బ్రహ్మాణమలంకృత్య| ఇధ్మమభిఘార్య|| *అస్మిన్---హోమ కర్మణి బ్రహ్మన్ ఇధ్మ మాధాస్యే"*- ఇతి ప్రార్థ్య| *"ఆధత్స్వ"*

- ఇత్యనుజ్ఞాతః| ఇధ్మమాధాయ| అప ఉపస్పృశ్య|

## ఆఘారహోమః

స్రువేణ ఆజ్యమాదాయ, వాయవ్యాదాగ్నేయ్యాన్తం ప్రజాపతిం మనసా ధ్యాయన్ *"ప్రజాపతయ ఇదం న మమ"* – ఇతి సంతతధారయా హుత్వా, ప్రధానదర్వ్యా ఆజ్య మాదాయ, ఇన్ద్రం మనసా ధ్యాయన్ నైఋత్యాదీశానాన్తం *"ఇన్ద్రాయేదం న మమ"*–ఇతి సంతతధారయా హుత్వా,

## చక్షుర్హోమాః

*1 ఓం అగ్న యే స్వాహా॥ అగ్న య ఇదం నమమ*। - ఇత్యుత్తరార్ధపూర్వార్ధే,

*2. ఓం సోమాయ స్వాహా*। *సోమాయేదం నమమ*। - ఇతి దక్షిణార్ధపూర్వార్ధే,

*3. ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం నమమ॥"* - ఇత్యగ్నిమధ్యే

ప్రధానదర్వ్యా చతుర్గృహీతేనాజ్యేన జుహోతి.

## పాలాశసమిధాహుతిః

[270]తతః కుమార 'మాయుర్దా' ఇతి పాలాశీం సమిధ ముత్తరయాఽఽధాప్య।

(శ్లో॥ స్వాహాకారో న చాయుర్దా ఇత్యత్ర సమిధా హుతౌ।
ఆధేహీతివ మన్త్రాన్తే వటు మాధాపయేద్గురుః॥
)

*మం॥ ఆయుర్దా దేవ జరసం గృణానో ఘృతప్రతీకో ఘృతపృష్ఠో అగ్నే*। *ఘృతం పిబ - న్న మృతం చారు గవ్యం పితేవ పుత్రం జరసే నయేమమ్॥ ఆధేహి॥* (తై.మం.పా.2.2)

వా॥ ఇత్యాచార్య స్స్వయముచ్చరన్ మన్త్రాన్తే ఆధేహీత్యుక్త్వాఽఽధాపయిత్వా,

'*అగ్న య ఇదం న మమ*' ఇతి కుమారేణ త్యాగం వాచయేత్.

---

[270]తతః=తర్వాత, కుమారమ్=కుమారునిచే, ఉత్తరయా=తరువాత నిచ్చిన, ఆయుర్దా ఇతి= ఆయుర్దా దేవ జరసం అను మంత్రముతో, పాలాశీం సమిధం= ఒక మోదుగుసమిధను, ఆధాప్య = అగ్నిలో వేయించి; అనగా ఆచార్యుడు ఒక పాలాశసమిధను నేతిలో నద్ది, దానిని వటువు చేతి కిచ్చి, 'ఆయుర్దా దేవ జరసం' అను మంత్రమును చెప్పుచు, మంత్రము చివర 'ఆధేహి' అని పలికిన వెంటనే ఆ సమిధను అగ్నిలో వేయించవలెను. గమనిక: పైన బ్రాకెట్లలో నిచ్చిన కారికా శ్లోకము 'ఆయుర్దా' అను మంత్రము చివర స్వాహాకారము లేదు. అందుచేత 'ఆధేహి' అని చెప్పి నప్పుడే గురువు వటువుచే సమిధను అగ్నిలో వేయించవలెను – అని తెల్పుచున్నది. ఇట్లు సమిధను వేసిన తర్వాత 'అగ్నయ ఇదం న మమ' అని వటువుచే త్యాగము చెప్పించవలెను.

## అశ్మాస్థాపనమ్

[271]వా॥ ఉత్తరేణాగ్నిం దక్షిణేన పదాఽఽశ్మాన మాస్థాపయత్యాతిష్ఠేతి।

(శ్లో॥ అశ్మాన మభితిష్ఠంతం వాసో మౌంజ్యజినం తథా।
ధారయేదితి సర్వేషాం సర్వస్మార్తమతో భవేత్॥)

*మం॥ ఆతిష్ఠేమమశ్మానమశ్మేవ త్వగ్గ్ స్థిరోభవ। అభితిష్ఠ పృతన్యతస్సహస్వ పృతనాయతః ॥*(తై.మం.పా.2.2)

## వస్త్రాభిమన్త్రణమ్

[272]సూ॥ వాసస్సద్యః కృత్తోత ముత్తరాభ్యామభిమన్త్ర్య।

*మం॥ రేవతీస్త్వా వ్యక్ష్ణన్కృత్తికాశ్చాకృన్తగ్ స్త్వా। ధియోఽవయన్న వగ్నా అవృఞ్జన్సహస్రమన్తాగ్ం అభితో అయచ్ఛన్న్ ॥౧॥ దేవీర్దేవాయ పరిధీ సవిత్రే మహత్తదాసామభవన్మహిత్వనమ్॥౨॥*(తై.మం.పా.2.2)

## వస్త్రధారణమ్(తై.మం.పా.2.2)

[273]వా॥ఉత్తరాభి స్తిసృభిః వస్త్రం కుమారస్య కటిదేశే ప్రదక్షిణం పరిధాప్య।

---

[271] తరువాత అగ్నికి ఉత్తరమున మనుష్యపాత్రలలోనిదిగా నుంచిన రాతికి పసుపును పూసి, దానిని వేరుగానుంచి, కుమారుని ప్రదక్షిణముగా దానికడకు కొనివచ్చి తూర్పుముఖముగా నిలబెట్టి, 'ఆతిష్ఠేమమశ్మాన' మను మంత్రమును చెప్పి, అతని కుడిపాదముచే ఆరాతిని త్రొక్కించవలెను. వటువు రాతిని త్రొక్కుచటనే నిలుచుండవలెను. ఈసందర్భములో బ్రాకెట్లలో నిచ్చిన 'అశ్మానమభితిష్ఠంతం' అను కారిక అట్లు రాతిపై నిలుచున్నపుడే వటువునకు ముందు చెప్పబోవు వస్త్రమౌంజ్యజినధారణ చేయించుట సర్వస్మార్తపద్ధతిసమ్మతమని తెల్పుచున్నది.

[272] తరువాత అగ్నికి ఉత్తరమున మనుష్యపాత్రలలోనిదిగా నుంచిన దీక్షావస్త్రమును ఆచార్యుడు ఎడమచేతిలో నుంచుకొని, దానిపై కుడిచేతిని కప్పియుంచి, తరువాత నొసగిన 'రేవతీస్త్వా', 'దేవీర్దేవాయ' అను రెండుమంత్రములతో అభిమంత్రింపవలెను.

[273] తరువాత 'యా అకృన్తన్నవయా', 'పరిధత్తవాససైనగ్ం', 'జరాం గచ్ఛాసి' అను 3 మంత్ర ములను చదివి ఆచార్యుడు కుమారుని కటిప్రదేశమున ప్రదక్షిణముగా వస్త్రమును కట్టవలెను.

*మం॥ యా అకృన్తన్నవయన్ యా అతన్వత యాశ్చ దేవీరన్తానభితోఽదదన్త।*
*తాస్త్వా దేవీర్జరసే సంవ్యయన్త్వాయుష్మానిదం పరిధత్స్వ వాసః॥1॥పరిధత్త ధత్త*
*వాససైనగ్ం శతాయుషం కృణుత దీర్ఘమాయుః।బృహస్పతిః ప్రాయచ్ఛద్వాస ఏత-*
*థ్సోమాయ రాజ్ఞే పరిధాతవా ఉ ॥2॥జరాం గచ్ఛాసి పరిధత్స్వ వాసో భవా కృష్టీనా*
*మభిశస్తిపావా। శతంచ జీవ శరదస్సువర్చా రాయశ్చ పోషముపసంవ్యయస్వ॥3॥*

[274]వా॥ఇతి పరిధాప్య, ఆచమయ్య, పరిహితవస్త్రం కుమారముత్తరానుమన్త్రయతే।
*మం॥ పరీదం వాసో అధిధాస్స్వస్తయేఽభూరాపీనామభిశస్తిపావా। శతంచ జీవ శరదః*
*పురూచీర్వసూని చార్యో విభజాసి జీవన్న్॥* (తై.మం.పా.2.2)

## [275]మేఖలాధారణమ్

సూ॥ మౌంజీం మేఖలాం త్రివృతాం త్రిః ప్రదక్షిణ మియం దురుక్తాదితి ద్వాభ్యాం పరివీయ। నాభిదేశే గ్రంథిం కృత్వా తౌ మన్త్రౌ కుమారం వాచయేత్।

(శ్లో॥ మౌంజ్యజినావస్థాపన ప్రోక్షణోత్థాపనాని తు।
సమంత్ర మేతాన్యాచార్యః పూర్వం కృత్వాఽథ వాచయేత్॥)

---

[274] ఆతరువాత వటువుచే ఆచమయ్య=ఆచమనము చేయించి, పరిహితవస్త్రం కుమారం=ఇట్లు వస్త్రమును కట్టుకొన్న కుమారుని, ఉత్తరానుమంత్రయతే= తర్వాతి ‘ *పరీదం వాసో*’ అను మంత్ర ముతో (ఆచార్యుడు వటువుతలను కుడిఅరచేతితో తాకి) అభిమంత్రించుచున్నాడు.

[275] తరువాత ఆచార్యుడు తర్వాత నిచ్చిన ‘ఇయం దురుక్తాత్’ ‘ఋతస్య గోప్త్రీ’ అను రెండు మంత్రములను చెప్పి ముప్పిరి వేసిన ముంజగడ్డి లేక దర్భత్రాటిని వటువుయొక్క మొలచుట్టును మూడుచుట్లు ప్రదక్షిణముగా చుట్టి, ఆమూడువరుసలకు నాభి దగ్గర ముడి వేసి, తదుపరి ఆ రెండుమంత్రములను వటువుచేత చెప్పించవలెను. ఈవిషయములో బ్రాకెట్లలో నిచ్చిన కారికా శ్లోకము ప్రమాణముగా నున్నది. దీని అర్థమిది: మౌంజ్యజిన=మౌంజీని, అజినమును ధరింప జేయుట,అవస్థాపన=దర్భలపై కూర్చుండబెట్టుట, ప్రోక్షణ=దోసిలిలోని నీటితో ప్రోక్షించుట, ఉత్థాపనాని=ధేనువు నుత్థాపనము చేయుట(అనగా లేపుట), ఏతాని=వీటిని, ఆచార్యః=ఆచా ర్యుడు, పూర్వం=ముందుగా, సమంత్రం=తాను మంత్రయుతముగ, కృత్వా= చేసి, అథ= పిదప, వాచయేత్= (ఆమంత్రములను) వటువుతో పలికించవలెను.

*మం॥ ఇయం దురుక్తాత్పరిబాధమానా శర్మ వరూథం పునతీ న ఆగాత్।*
*ప్రాణాపానాభ్యాం బలిమాభరన్తీ ప్రియా దేవానాగ్ం సుభగా మేఖలేయమ్॥౧॥*
*ఋతస్య గోప్త్రీ తపసః పరస్పీ ఘ్నతీ రక్షస్సహమానా అరాతీః। సానస్సమన్త మను*
*పరీహి భద్రయా భర్తారస్తే మేఖలే మారిషామ॥౨॥* (తై.మం.పా.2.2)
*పదం॥ ఇయం। దురుక్తాత్। పరి।బాధమానా। శర్మ। వరూథమ్। పునతీ। నః ।ఆగాత్।*
*ప్రాణాపానాభ్యామ్। బలమ్। ఆభరన్తీ। ప్రియా। దేవానామ్। సుభగా। మేఖలా।ఇయమ్॥౧॥*
*ఋతస్య। గోప్త్రీ ।తపసః। పరస్పీ। ఘ్నతీ రక్షః। సహమానాః। అరాతీః। సానః। సమన్తమ్।*
*అను।పరిహి। భద్రయా। భర్తారః। తే। మేఖలే ।మారిషామ॥౨॥*

## అజినధారణమ్

[276]సూ॥ అజినముత్తర ముత్తరయా। కృష్ణాజినముత్తరలోమకముత్తరీయార్థే ధార-యిత్వా తం మన్త్రం వాచయీత।

*మం॥ మిత్రస్య చక్షుర్ధరుణం బలీయస్తేజో యశస్వి స్థవిరగ్ం సమిద్ధమ్। అనాహనస్యం వసనం జరిష్ణు పరీదం వాజ్యజినం దధేఽహమ్॥౧॥* (తై.మం.పా.2.2)

*పదం॥ మిత్రస్య। చక్షుః। ధరుణమ్। బలీయః। తేజః। యశస్వి। స్థవిరమ్। సమిద్ధమ్।*
*అనాహనస్యమ్। వసనమ్। జరిష్ణు। పరీదమ్। వాజి। అజినమ్। దధే। ఽహమ్॥౧॥*

## అవస్థాపనమ్

[277]సూ॥ ఉత్తరేణాగ్నిం దర్భాన్త్సగ్ స్తీర్య తేష్వేన ముత్తరయావస్థాప్య ।(అగ్నే రుత్తరత

---

[276] తరువాత ఆచార్యుడు 'మిత్రస్య చక్షుః' అను మంత్రమును చెప్పి సన్నగా పొడువుగా నున్న కృష్ణాజినమును వటువునకు ఉత్తరీయార్థము జందమువలె వేసి, అతనిచే ఈమంత్రమును పలి కించవలెను. (పూర్వ మెప్పు డిట్లు చేయుచుండిరో కాని, ఈకాలములో యజ్ఞోపవీతముయొక్క బ్రహ్మముడికి క్రిందుగ ఒక చిన్న కృష్ణాజినపుముక్కను కట్టి ఈ క్రియను జరిపించుచున్నారు.)
[277] ఉత్తరేణాగ్నిం=అగ్నికి ఉత్తరమున, దర్భాన్=సరిసంఖ్య గల దర్భలను, సగ్ స్తీర్య= (ఉత్త రాగ్రముగ) పఱచి, తేషు=ఆదర్భలపై, ఏనం=ఈవటువును,ఉత్తరయా='అగన్మాసమగన్మహి'

ఉత్తరాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తేషు కుమారం ప్రత్యఙ్ముఖ మవస్థాప్య తం మన్త్రం వాచ యిత్వా స్వయం ప్రాఙ్ముఖ స్తిష్ఠేత్)।

*మం॥ ఆగన్త్రా సమగన్మహి ప్రసు మృత్యుం యుయోతన/ అరిష్టాస్సంచరేమహి స్వస్తి చరతాదిహ స్వస్త్యా గృహేభ్యః ॥౧॥* (తై.మం.పా.2.3)

*పదం॥ ఆగన్త్రా/సమగన్మహి/ప్రసు/మృత్యుమ్/ యుయోతన/ అరిష్టాః/ సంచరేమహి/ స్వస్తి/ చరతాత్/ఇహ/ స్వస్తి/ ఆగృహేభ్యః ॥౧॥*

## ప్రోక్షణమ్

[278]సూ॥ ఉదకాంజలి మస్మా అంజలావానీయోత్తరయా త్రిః ప్రోక్ష్య । సకృన్మంత్రేణ ద్విస్తూష్ణీమ్।

(ప్రత్యఙ్ముఖస్య తిష్ఠతః కుమారస్యాంజలావాచార్యోఽన్యావర్జితమస్మా ఉదకాంజలిం నినీయ,తజ్జలేన 'సముద్రాదూర్మిః' ఇతి త్రిః కుమారం ప్రోక్ష్య, తం కుమారం వాచయేత్)

*మం॥ సముద్రాదూర్మిర్మధుమాగ్ం ఉదారదుపాగ్ంశునా సమమృతత్వమశ్యామ్/ ఇమే ను తే రశ్మయస్సూర్యస్య యేభిస్సపిత్వం పితరో న ఆయన్ ॥౧॥*(మం.పా.2.3)

---

అను మంత్రమును చెప్పుచు, అవస్థాప్య=పశ్చిమముఖముగా కూర్చుండబెట్టి, ఆచార్యుడు తూర్పుముఖముగా వటువున కెదురుగా కూర్చొని, వటువుచే నదే మంత్రమును పలికించవలెను.

[278] అస్మై=అట్లు పశ్చిమముఖముగనే కూర్చున్న వటువుయొక్క, అంజలౌ=దోసిటియందు, ఆనీయ=(పాత్రప్రయోగాంతర్వర్తియగు) జలమునుంచి, ఉత్తరయా మంత్రేణ = 'సముద్రాదూర్మిః' అను మంత్రముతో, సకృత్=ఒకసారి, తూష్ణీం=అమంత్రకముగా, ద్విః=రెండుసార్లు, త్రిః=ఇట్లు మొత్తం మూడుసార్లు, ప్రోక్ష్య= వటువు నా జలముచే ఆచార్యుడు ప్రోక్షించి, తం=అదే మంత్రమును, కుమారం=కుమారునితో, వాచయేత్=పలికించవలెను. అనగా అట్లు దర్భలపై కూర్చున్న వటువు దోసిలిపై ఆచార్యుడు తన దోసిలిని పట్టి, అందులో బ్రహ్మచేత పాత్రప్రయోగాంతర్వర్తిజలమును పోయించుకొని, ఆనీటిని వటువుదోసిలిలో కిందపడకుండ పోసి, కూర్చ చేత ఆదోసిలిలోని నీటిని అద్దుకొని, 'సముద్రాదూర్మిః' అను మంత్రమును చెప్పుచు వటువు శిరస్సును ఆజలముతో మంత్రయుతముగా నొకసారి, మంత్రరహితముగా రెండుసార్లు ప్రోక్షించి, తర్వాత వటువుచే అదే మంత్రమును పలికించవలెను.

*పదం॥ సముద్రాత్।ఊర్మిః। మధుమాన్। ఉదారత్।ఉపాగంశునా।సమమ్।అమృతత్వమ్। అశ్యామ్। ఇమేనుతే। రశ్మయః।సూర్యస్య। యేభిః। సవిత్వమ్। పితరోనః।ఆయన్న్ ॥౧॥*

## హస్తగ్రహణమ్

[279]సూ॥ ఉత్తరై ర్దక్షిణహస్తే గృహీత్వా। (ఉత్తరోక్త దశానాం మంత్రాణామన్తే కుమారస్య సాఙ్గుష్ఠముత్తానం దక్షిణహస్తంగృహ్ణీయాత్)।

*మం॥ అగ్నిష్టే హస్తమగ్రభీత్। సోమస్తే హస్తమగ్రభీత్। సవితా తే హస్తమగ్రభీత్। సరస్వతీ తే హస్తమగ్రభీత్। పూషా తే హస్తమగ్రభీత్। బృహస్పతిస్తే హస్తమగ్రభీత్। అర్యమా తే హస్తమగ్రభీత్। అగంశుస్తే హస్తమగ్రభీత్। భగస్తే హస్తమగ్రభీత్। మిత్రస్తే హస్తమగ్రభీత్। మిత్రస్త్వమసి ధర్మణాఽగ్ని రాచార్యస్తవ॥* (త్తై.మం.పా.2.3)

## పరీదానమ్

[280]సూ॥ ఉత్తరై ర్దేవతాభ్యాం పరీదాయ। (వా॥ ఇత్యేతైరేకాదశభిః ప్రతిమంత్రం శర్మాన్తే అగ్న్యాదిభ్యో దేవతాభ్యో రక్షణార్థం కించిత్కించిత్ప్రసార్య హస్తం ప్రదర్శ్య దద్యాత్।)

---

[279] తరువాత 'అగ్రభీత్' అను పదముతో అంతమగు 10 మంత్రములను పఠించి, ఆచార్యుడు పశ్చిమముఖముగనే కూర్చున్న వటువుయొక్క పైకి చాచిన కుడిచేతిని అంగుష్ఠసహితముగా తనకుడిచేత నొకసారి గ్రహించవలెను.

[280] ఉత్తరైః= తరువాత నిచ్చిన మంత్రములతో, దేవతాభ్యాం= దేవతలకు, పరీదాయ= (వటువును) అప్పగించి – అని సూత్రార్థము. బ్రాకెట్లలోనిచ్చిన వాక్యము దీనిని వివరించుచున్నది. ఇత్యేతైః ఏకాదశభిః = (ఆచార్యుడు) ఈ 11 మంత్రములతో, ప్రతిమంత్రం శర్మాన్తే = 'శర్మన్' అని అంతమగు ప్రతిమంత్రముచివర, రక్షణార్థం=వటువురక్షణార్థమై, హస్తం= ఆచార్యుడు వటువుయొక్క కుడిచేతిమణికట్టును తన కుడిచేత పట్టుకొని, కించిత్కించిత్=కొంచెము కొంచెముగా, ప్రసార్య=ముందుకుచాపి, ప్రదర్శ్య= (అగ్నికి) చూపెట్టి, అగ్న్యాదిభ్యో దేవతాభ్యః = అగ్నిమొదలగుదేవతలకు,దద్యాత్=వటువును అప్పగించవలెను.మంత్రాలలో '*విష్ణుశర్మనో*' – అని ఉన్నచోట '*విష్ణు*' శబ్దమునకు బదులు వటువుపేరును చెప్పుచు ఈకార్యమును చేయ

(శ్లో॥ అన్తే తు సర్వమంత్రాణాం హస్తగ్రహణ మిష్యతే।
దేవతాభ్యః పరీదానం రక్షణాయ పృథక్పృథక్॥)

*మం॥అగ్న యే త్వా పరిదదామి విష్ణుశర్మన్/౧/సోమాయ త్వా పరిదదామి విష్ణు శర్మన్/౨/ సవిత్రే త్వా పరిదదామి విష్ణుశర్మన్/3/సరస్వత్యై త్వా పరిదదామి నారాయణశర్మన్/౪/మృత్యవే త్వా పరిదదామి విష్ణుశర్మన్/౫/ యమాయ త్వా పరిదదామి విష్ణుశర్మన్/౬/గదాయ త్వా పరిదదామి విష్ణుశర్మన్/౭/అన్తకాయ త్వా పరిదదామి విష్ణుశర్మన్/ ౮/అద్భ్యస్త్వా పరిదదామి విష్ణుశర్మన్/౯/ఓషధీభ్యస్త్వా పరిదదామి విష్ణుశర్మన్/౧౦/పృథివ్యై త్వా సవైశ్వానరాయై పరిదదామి విష్ణుశర్మన్/ ౧౧॥* (తై.మం.పా.2.3)

## ఉపనయనసుముహూర్తః

[281]వా॥యథాస్థాన ముపవిశ్య, సూ॥ ఉత్తరేణ యజుషోపనీయ।

*మం॥దేవస్య త్వా సవితుః ప్రసవ ఉపనయే విష్ణుశర్మన్॥* (తై.మం.పా.2.3)

ఆచార్యో హస్తాభ్యాం కుమారమాలింగ్య, తతః సుముహూర్తే ఆత్మనస్సమీపం నీత్వా, అభిముఖముపవేశ్య, 'సుప్రజాః' ఇతి దక్షిణకర్ణే జపతి।

*మం॥సుప్రజాః ప్రజయా భూయాస్సువీరో వీరైస్సువర్చా వర్చసా సుపోషః పోషైః।*

---

వలెను. ఈ విషయములో క్రింద నిచ్చిన 'అన్తే తు' అను కారిక యున్నది. మంత్రము లన్నియు చెప్పిన తర్వాత హస్తగ్రహణమును ఒకసారి చేయవలెననియు, రక్షణార్థమై చేయు పరీదానము ప్రతిమంత్రము చివర, 11మంత్రములకు 11సార్లు చేయవలెననియు ఈకారిక కర్థము.

[281] తరువాత పీటలపై యథాస్థానములో కూర్చొని, ఉపనయనసుముహూర్తకాలములో ఆచార్యుడు 'దేవస్యత్వా' అను మంత్రమును చెప్పుచు తన రెండుచేతులతో వటువు రెండుచేతులను పట్టుకొని అతనిని తన కెదురుగా (అనగా తాను తూర్పుముఖముగా, అతడు పశ్చిమముఖముగా నుండునట్లు) కూర్చొనబెట్టుకొని, వటువు కుడిచెవిలో 'సుప్రజాః' అను మంత్రమును జపించుచున్నాడు. గమనిక: మంత్రములలోని (విష్ణు)కు బదులుగా వటువుపేరును చెప్పవలెను.

[282]వా॥ బ్రహ్మచర్య మాగామితి కుమారం వాచయిత్వా।

*మం॥బ్రహ్మచర్యమాగాముప మానయస్వ దేవేన సవిత్రా ప్రసూతః॥* (తై.మం.పా.2.3)

*పదం॥బ్రహ్మచర్యమ్।ఆగామ్।ఉప।మానయస్వ ।దేవేన।సవిత్రా।ప్రసూతః।*

## ప్రశ్నోత్తరాణి

[283]సూ॥ప్రష్టం పరస్య, ప్రతివచనం కుమారస్య। వా॥ కుమారం దక్షిణహస్తే గృహీత్వా,

1. *కో నామాసి?* (ఇత్యాచార్యః పృచ్ఛతి)
   *విష్ణుశర్మా నామాస్మి* (ఇతి కుమారః ప్రత్యాహ)
2. *కస్య బ్రహ్మచార్యసి విష్ణుశర్మన్?* (ఇత్యాచార్యః పృచ్ఛతి)
   *ప్రాణస్య బ్రహ్మచార్యస్మి* (ఇతి కుమారః ప్రత్యాహ)

*[284]*సూ॥శేషం పరో జపతి। ప్రత్యగాశిషం కుమారేణ వాచయతి।

---

[282] (తరువాత) బ్రహ్మచర్యమాగామితి='బ్రహ్మచర్యమాగామ్' అను మంత్రమును, కుమారం =వటువుచేత, వాచయిత్వా= చెప్పించి,

[283]పరస్య=ఆచార్యునిచేత, ప్రష్టం=ప్రశ్నింపబడిన, కుమారస్య=కుమారునియొక్క, ప్రతివచనమ్ = జవాబు. అనగా, ఆచార్యుడు కుమారుని కుడిచేతితో తాకుచు, 'కో నామాసి' (నీ వేమి పేరుగలవాడవు అని ప్రశ్నింపగా), కుమారుడు 'విష్ణుశర్మా నామాస్మి'(నేను విష్ణుశర్మ అను పేరుగలవాడను) అని చెప్పవలెను. తరువాత ఆచార్యుడు 'కస్య బ్రహ్మచార్యసి విష్ణుశర్మన్' (నీవెవరి బ్రహ్మచారివై ఉన్నావు విష్ణుశర్మా?) అని ప్రశ్నింపగా, కుమారుడు 'ప్రాణస్య బ్రహ్మచార్యస్మి' ( నేను ప్రాణముయొక్క బ్రహ్మచారినై యున్నాను) అని ప్రతివల్కవలెను. గమనిక: పై ఉత్తరప్రత్యుత్తరములలో 'విష్ణు'నకు బదులు కుమారుని యొక్క యథార్థనామమును చెప్పవలెను.

[284] శేషమ్=మిగితా 'విష్ణుశర్మైషతే..' అను మంత్రమును, పరః=ఆచార్యుడు, జపతి= జపించును. గమనిక:పైమంత్రములో 'విష్ణు'నకు బదులు కుమారునిపేరును చెప్పవలెను. ప్రత్యగాశిషం=తర్వాతి 'అధ్వనామధ్వపతే' అను ఆశిషమంత్రమును, కుమారేణ=వటువుచేత, వాచయతి=(ఆచార్యుడు) చెప్పించుచున్నాడు. అనగా వటువునకే ఫలము చెందు 'అధ్వనామధ్వపతే', 'యోగేయోగే' ఇత్యాది మంత్రములను వటువుచే చెప్పించుచున్నాడని అర్థము.

*(విష్ణు)శర్మైష తే దేవ సూర్య బ్రహ్మచారీ తం గోపాయ స మా మృతైష తే సూర్య పుత్రస్సదీర్ఘాయు స్సమా మృత యాగ్ స్వస్తిమగ్నే ర్వాయుస్సూర్య శ్చంద్రమా ఆపోఽను సంచరన్తి తాగ్ స్వస్తి మను సంచర (విష్ణు)శర్మన్॥*

*మం॥ అధ్వనామధ్వపతే శ్రేష్ఠస్యాధ్వనః పారమశీయ॥* (కుమారం వాచయతి)

*పదం॥ అధ్వనామ్। అధ్వపతే। శ్రేష్ఠస్య। అధ్వనః। పారమ్। అశీయ।*

## ప్రధానహోమాః (త్రై.మం.పా 2.4)

[285]వా॥ కుమారః ప్రదక్షిణ మగ్నిం కృత్వా, ఆచార్యస్య దక్షిణత ఉపవిశేత్। అథాఽచార్యః యోగాదీన్నవమన్త్రాన్ కుమారం వాచయన్, ద్వితీయచతుర్థౌ స్వయం బ్రువన్ చతుర్గృహీతాజ్యేన ప్రతిమంత్ర మేకాదశాజ్యాహుతీః కుమారేణ హావయిత్వా।
(శ్లో॥ యోగాదీన్వాచయన్నేవ కుమారం హావయేత్తథా।
ద్వితీయచతుర్థౌ బ్రూయాదాచార్యో జుహుయాద్వటుః॥)

1. (కుమారః) *యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే। సఖాయ ఇన్ద్ర మూతయే స్వాహా। ఇన్ద్రాయేదం న మమ।*
   *పదం॥ యోగే యోగే। తవస్తరమ్। వాజే వాజే। హవామహే। సఖాయః। ఇన్ద్రమ్। ఊతయే। స్వాహా।*
2. (ఆచార్యః) *ఇమమగ్న ఆయుషే వర్చసే కృధి ప్రియగ్ం రేతో వరుణ సోమరాజన్। మాతేవాస్మా అదితే శర్మ యచ్ఛ విశ్వే దేవా జరదష్టిర్యథాఽసత్స్వాహా। అగ్నీ వరుణసోమాదితివిశ్వేభ్యో దేవేభ్య ఇదం న మమ।*

---

[285] తర్వాత వటువు అగ్నిని ప్రదక్షిణము చేసి, ఆచార్యునికి కుడివైపు కూర్చొనవలెను. అప్పుడాచార్యుడు 'యోగే యోగే' ఇత్యాది 11మంత్రములతో కుమారునిచేత ప్రధానదర్వితో చతుర్గృహీతాజ్యముతో హోమము చేయింపవలెను. కాని ఈమంత్రములలో 2వ,4వమంత్రములను మాత్ర మాచార్యుడే పఠించుచు, ఈ మంత్రముల చివర గల 'స్వాహా'కారమును మాత్రము కుమారునిచేత పలికించుచు, కుమారునిచే హోమము చేయించవలెను. మిగితా 9 మంత్రములను సొంతముగా కుమారునిచేత పఠింపజేయుచు హోమము చేయింపవలెను.

3. (కుమారః) శతమిన్ను శరదో అన్తి దేవా యత్రా నశ్చక్రా జరసం తనూనామ్।
పుత్రాసో యత్ర పితరో భవన్తి మా నో మధ్యా రీరిషతాయుర్గన్తోః స్వాహా।
దేవేభ్య ఇదం న మమ।

పదం॥ శతమిన్న్ / శరదః। అన్తి /దేవాః /యత్రానః। చక్రాః।జరసమ్। తనూనామ్।
పుత్రాసః। యత్ర /పితరః। భవన్తి। మానః। మధ్యా / రీరిషత।ఆయుః। గన్తోః। స్వాహా।

4. (ఆచార్యః) అగ్నిష్ట ఆయుః ప్రతరాం దధాత్వగ్నిష్టే పుష్టిం ప్రతరాం కృణోతు।
ఇన్ద్రో మరుద్భిర్ ఋతుధా కృణోత్వాదిత్యైస్తే వసుభిరాదధాతు స్వాహా।
అగ్నీంద్రమరుదాదిత్యవసుభ్య ఇదం న మమ।

5. (కుమారః) మేధాం మహ్యమంగిరసో మేధాగ్‍ం సప్తర్షయో దదుః। మేధాం
మహ్యం ప్రజాపతిర్మే ధామగ్ని ర్దదాతు మే స్వాహా। అంగిరస్సప్తర్షిప్రజాపత్య
గ్నిభ్య ఇదం న మమ।

పదం॥ మేధాం। మహ్యమ్। అంగిరసః। మేధామ్। సప్తఋషయః। దదుః। మేధాం।
మహ్యమ్। ప్రజాపతిః। మేధామ్। అగ్నిః। దదాతు। మే / స్వాహా।

6. (కుమారః) అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ యద్యశః। దైవీ యా మానుషీ
మేధా సా మామావిశతాదిహ స్వాహా। మేధాదేవ్యా ఇదం న మమ।

పదం॥ అప్సరాసు చ / యా మేధా। గంధర్వేషు చ। యద్యశః। దైవీ। యా మానుషీ /
మేధా। సా మామ్। ఆవిశతాత్। ఇహ। స్వాహా।

7. (కుమారః) ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే
స్వాహా। వరుణాయేదం న మమ।(తై.సం 2.1.11)

పదం॥ ఇమమ్। మే।వరుణ / శ్రుధీ। హవమ్।అద్య చ / మృడయ। త్వామ్।అవస్యుః।
ఆచకే /స్వాహా।

8. (కుమారః) తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః।
అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్‍ంస మా న ఆయుః ప్రమోషీః స్వాహా।
వరుణాయేదం న మమ।(తై.సం 2.1.1)

*పదం॥ తత్త్వా/యామి/బ్రహ్మణా/వన్దమానః/ తదాశాస్తే/యజమానః/హవిర్భిః/*
*అహేడమానః/వరుణేహ/బోధి/ఉరుశగ్ంస/మా/నః/ఆయుః/ప్రమోషీః/స్వాహా/*

9. (కుమారః) *త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః/*
*యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా/*
*అగ్నీ వరుణాభ్యామిదం న మమ॥*(తై.సం.2.5.12)
*పదం॥ త్వన్నో అగ్నే /వరుణస్య/విద్వాన్/దేవస్య హేడః/అవయాసి/సీష్ఠాః/*
*యజిష్ఠః/వహ్నితమః/శోశుచానః/విశ్వాద్వేషాంసి/ప్రముముగ్ధి/అస్మత్స్వాహా/*

10. (కుమారః) *స త్వన్నో అగ్నే ఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ/*
*అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా/*
*అగ్నీ వరుణాభ్యామిదం న మమ॥* (తై.సం.2.5.12)
*పదం॥ సత్వమ్/నో అగ్నే /అవమః/భవ/ఊతీ/నేదిష్ఠః/అస్య /ఉషసః/వ్యుష్టౌ/*
*అవయక్ష్వనః/వరుణమ్/రరాణః/వీహి/మృడీకమ్/సుహవోనః/ఏధి /స్వాహా/*

11. (కుమారః) *త్వమగ్నే అయాస్యయాసన్మనసా హితః/అయాసన్ హవ్య-*
*మూహిషే ఽయానో ధేహి భేషజగ్గ్ స్వాహా/ అగ్న యే అయస ఇదం న మమ/*
*పదం॥ త్వమగ్నే / అయాసి/ అయాసన్/ మనసా/ హితః/ అయాసన్/ హవ్యమ్/*
*ఊహిషే/ అయానః/ధేహి /భేషజగ్గ్/స్వాహా/*

## జయాదిహోమాః

వా॥ [286]తత ఆచార్యైవ అనన్వారబ్ధః జయాది ప్రతిపద్యతే। స్విష్టకృదన్తం హుత్వా। శమ్యా అపోహ్య। ఆఘారసమిధౌ ప్రహృత్య। దర్వ్యైకయా తూష్ణీం సంస్రావహోమం కృత్వా, యజుర్భ్రేషప్రాయశ్చిత్తం కుర్యాత్।

---

[286] తరువాత వటువును తాకకుండ ఆచార్యుడే జయాదిహోమములను స్విష్టకృద్ధోమపర్యంతము, అనగా షట్పాత్ర ప్రయోగములో 56నుండి 65పుటలలో నిచ్చిన ‘ఓం చిత్తం చ స్వాహా’ అనుదానినుండి మొదలిడి, ‘అగ్నయే స్విష్టకృత ఇదం నమమ’ అనుదానివరకు గల సమస్త

## యజుర్భ్రేషప్రాయశ్చిత్తహోమః

[287](శ్లో॥ యత్కర్మణి బ్రాహ్మణశబ్ద ఉక్తో భ్రేషోఽస్తిచేత్తత్ర తథోపనీతౌ।
తత్కర్మ వహ్నౌ భువ ఆహుతిస్స్యాద్భవేదనాజ్ఞాతవిధిత్రయం వా॥)

వా॥ ఆచార్యః ప్రాణానాయమ్య। '*అస్మిన్నుపయనకర్మణి యజుర్భ్రేషప్రాయశ్చిత్తం కరిష్యే'* – ఇతి సంకల్ప్య,

*మం॥ ఓం భువస్స్వాహా॥ వాయవ ఇదం న మమ॥*

-ఇతి ప్రధానదర్వ్యా జుహుయాత్।

## అనాజ్ఞాతాదిహోమః

[288]వా॥ ఆచార్యః ప్రాణానాయమ్య।'*అస్మిన్నుపనయనహోమకర్మణి మధ్యే సంభావిత జ్ఞాతాజ్ఞాతాదిదోషప్రాయశ్చిత్తార్థం అనాజ్ఞాతాదిహోమం కరిష్యే'* – ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ (పుటసంఖ్యా 62-63) అనాజ్ఞాతాదిహోమం కుర్యాత్।

## సర్వప్రాయశ్చిత్తహోమః

ప్రాణానాయమ్య, *"అస్మిన్ ఉపనయనహోమకర్మణి మధ్యే సంభావిత మన్త్ర-తంత్ర-*

---

హోమములను చేసి, శమ్యలను, ఆఘారసమిధలను అగ్నికి ఉత్తరమున పరిస్తరణములకు వెలుపల పరిహరించి, ప్రధానదర్వీతో మంత్రరహితముగా సంస్రావహోమమును చేసి, యజుర్భ్రేషప్రాయశ్చిత్తమును చేయవలెను.

[287] 'వేదమంత్రోచ్చారణలో దోషము కల్గినచో నుపనయనమందు 'ఓం భువః' అను మంత్రముతోగాని, అనాజ్ఞాతమంత్రత్రయముచేగాని యజుర్భ్రేషప్రాయశ్చిత్తమును చేయవలెనని ఇచ్చట నిచ్చిన కారిక తెల్పుచున్నది. దీనికై ఆచార్యుడు ప్రాణాయామము చేసి, '*అస్మిన్నుపనయన కర్మణి యజుర్భ్రేష ప్రాయశ్చిత్తం కరిష్యే'* అని సంకల్పించి, '*ఓం భువస్స్వాహా*' అను మంత్రముతో ప్రధానదర్విలోనికి ఆజ్యమును తీసికొని హోమము చేయవలెను.

[288] తరువాత ఆచార్యుడు ప్రాణాయామము చేసి, '*అస్మిన్నుపనయనకర్మణి ---అనాజ్ఞాతాదిహోమం కరిష్యే'* అని సంకల్పించి, షట్పాత్రప్రయోగమునందు 62-63 పుటలలో నిచ్చిన 14 మంత్రములతో ఆజ్యహోమము చేయవలెను.

*స్వర-వర్ణ-విధివిపర్యాస-న్యూనాతిరిక్త-దోషప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్త హోమం హోష్యామి"*- [289]ఇతి సంకల్ప్య, స్రువేణాజ్యమాదాయ జుహుయాత్।

*1. ఓం భూర్భువస్సువస్స్వాహా।ప్రజాపతయ ఇదం న మమ॥*

*2. శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం నమమ॥*

## ఉత్తరపరిషేచనమ్

[290] *"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- ఇతి దక్షిణతః ప్రాచీనమ్, *"అనుమతేఽన్వమగ్గ్ స్థాః"*- ఇతి పశ్చాదుదీచీనమ్, *"సరస్వతేఽన్వమగ్గ్ స్థాః"*- ఇత్యుత్తరతః ప్రాచీనమ్, *"దేవ సవితః ప్రాసావీః"*- ఇతి సమంతమగ్నిం పరిషిచ్య।

## ప్రణీతామోక్షణమ్

[291]ప్రణీతిపాత్రం పురస్తాన్యస్య। 'సదసీ' తి తస్మిన్ పాత్రాంతరజలగ్ం సగ్గ్ స్రావ్య। మం॥ *ఓం సదసి సన్మే భూయాస్సర్వమసి సర్వం మే భూయాః పూర్ణమసి పూర్ణం మే*

---

[289] మరల ఆచార్యుడు ప్రాణాయామము చేసి, '*అస్మిన్ ఉపనయనహోమకర్మణి మధ్యే సంభావిత---సర్వప్రాయశ్చిత్తహోమం కరిష్యే*' అని సంకల్పించి, స్రువముతో నేతిని తీసికొని క్రింద నిచ్చిన రెండు మంత్రములతో సర్వప్రాయశ్చిత్తహోమమును చేయవలెను.

[290] *"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- అని దక్షిణమునందు పడమటి నుండి తూర్పునకు, *"అనుమతే ఽన్వమగ్గ్ స్థాః"*- అని పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽన్వ మగ్గ్ స్థాః"* - అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవసవితః ప్రాసావీః"* - అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని పరిషేచనము చేయవలెను.

[291] ప్రణీతిపాత్రను తీసికొని వచ్చి తన ముందుంచుకొని, దానిలో నితరపాత్రలలో (అనగా, ప్రోక్షణి లోను, అగ్నికి తూర్పున నుంచిన పాత్రలోను) ఉన్న జలమును 'సదసి సన్మే' అను మంత్రముతో పోసి, అగ్నికి ఉత్తరమున ఆ ప్రణీతిక్రింద వేసిన దర్భలను, దానిపై కప్పిన 8 దర్భలను చేర్చి కొనలు జోడించి పట్టుకొని, ఆదర్భలకొనలచే ప్రణీతిలోని జలము నద్దుకొనుచు 1-5 మంత్రము లతో వరుసగా పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్ధ్వదిశలందు ప్రోక్షించి, ఆ తర్వాత '*సముద్రం వః ప్రహిణోమి*' అను మంత్రముతో ఆజలముతో ఆచార్యుడు మొదట తనను ప్రోక్షించుకొని, పిదప కుమారుని ప్రోక్షించవలెను.

*భూయా అక్షితమసి మామేక్షేష్ఠాః॥*

తతః పాత్రప్రయుక్త దర్భా నాదాయ।

1. *ప్రాచ్యాం దిశి దేవా ఋత్విజో మార్జయన్తామ్।*
2. *దక్షిణాయాం దిశి మాసాః పితరో మార్జయన్తామ్।*
3. *ప్రతీచ్యాం దిశి గృహాః పశవో మార్జయన్తామ్।*
4. *ఉదీచ్యాం దిశ్యాప ఓషధయో వనస్పతయో మార్జయన్తామ్।*
5. *ఊర్ధ్వాయాం దిశి యజ్ఞస్సంవత్సరో యజ్ఞపతిర్మార్జయన్తామ్।*

ఇతి ప్రోక్ష్య, *"సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమపి గచ్ఛత। అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మా పరాసేచి మత్పయః"*- ఇత్యాత్మానం , కుమారంచ ప్రోక్ష్య,

## బ్రహ్మోపదేశః

[292]ఆచార్యః తాంబూల ఫల దక్షిణాసమేత హరిద్రాక్షతపాత్రం హస్తే గృహీత్వా, వేదికాయాః పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ,

*ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై*।(తై.సం.3-2-4-14)।*సప్రథ సభాం మే గోపాయ। యే చ సభ్యాస్సభాసదః। తానిన్ద్రియావతః కురు। సర్వమాయురుపాసతామ్*। (తై.బ్రా.1-2-1-26)

*సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః। అశేషే హే పరిషత్। మదీయాం విజ్ఞాపనాం సమాకర్ణ్య*

---

292 సామాన్యముగా వటువునకు బ్రహ్మోపదేశము ఆస్తికుడును, మాన్యుడును, వయసులోపెద్దవాడును ఐన వ్యక్తిచే చేయబడుట జరుగుచున్నది. ఇట్టి వ్యక్తినే ఇచ్చట ఆచార్యుడనియు 'ఉపనేత' యనియు అనుచున్నాము. అట్టి వ్యక్తి తాంబూలఫలదక్షిణాదుల నొక తట్టలో పెట్టుకొని, అగ్నికి పశ్చిమమున పీటలకు వెనుకగా నిలబడి, 'నమస్సదసే' అను మంత్రమును చెప్పి, '*సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః*' నుండి '*సర్వే గ్రహా ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు*' అని చెప్పి పరిషత్తుకు నమస్కరించి, దక్షిణ నీయవలెను. పరిషత్తు '*ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు*' అని అనుగ్రహింపవలెను.

*మయా సమర్పితాం యథాశక్తి పరిషద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్య--శర్మణః కుమారస్య గాయత్రీం స్వీకర్తుం మమ చ గాయత్రీముపదేష్టుం యోగ్యతా సిద్ధిరస్త్వితి భవన్తో బ్రువన్తు/ గాయత్ర్యుపదేశలగ్న స్య ఆదిత్యాదిసర్వేగ్రహాశ్శుభైకాదశ స్థానఫలదాస్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ గాయత్ర్యుప దేశకర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ సర్వే గ్రహా ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/*- ఇతి ప్రార్థ్య, నమస్కృత్వా దక్షిణాం దద్యాత్. '*యోగ్యతాసిద్ధిరస్తు గాయత్ర్యుపదేశకర్మారంభ ముహూర్తస్సుముహూర్తోఽస్తు ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్తు*' - ఇతి పరిషద్వచనమ్.

## కూర్చనిధానాదీని

[293]సూ॥ అపరేణాగ్నిం కూర్చం నిధాయ। తస్మిన్నుత్తరేణ యజుషోపనేతోపవిశతి।

*మం॥ రాష్ట్రభృదస్యాచార్యాసన్దీ మా త్వద్యోషమ్॥* (తై.మం.పా.2.4)

[294]వా॥ పురస్తాద్దర్భేషు ప్రత్యఙ్ముఖమాసీనః కుమారో దక్షిణేన పాణినా గురోర్దక్షిణ పాద మన్వారభ్య, సవ్యేన సవ్య మన్వారభ్య, '*సావిత్రీం భో అనుబ్రూహి*' ఇత్యాహ।

[295]సూ॥ తస్మా అన్వాహ తత్సవితురితి। పచ్ఛోఽర్ధర్చశ స్తత స్సర్వామ్।వ్యాహృతీ

---

293 తర్వాత కుమారుడు 5, లేక 7, లేక 9 దర్భలతో కట్టిన కూర్చను ఆచార్యున కీయవలెను. ఉపనేత (ఆచార్యుడు), అపరేణాగ్నిం= అగ్నికి పడమట, కూర్చం=ఆకూర్చను, నిధాయ =ఉత్తరాగ్రముగ వేసికొని, తస్మిన్=ఆకూర్చపై, ఉత్తరేణ యజుషా=తర్వాత నీయబడిన 'రాష్ట్ర భృదసి...' అను మంత్రముతో, ఉపవిశతి=(తూర్పుముఖముగా) కూర్చొనుచున్నాడు.

294 తర్వాత, కుమారః=కుమారుడు, పురస్తాత్=ఆచార్యుని కెదురుగా, దర్భేషు=ఉత్తరాగ్ర ముగ వేసిన దర్భలపై, ప్రత్యఙ్ముఖ మాసీనః =పడమటికి మళ్లి కూర్చుండి, దక్షిణేన పాణినా =తన కుడిచేతితో, గురోః=గురువుయొక్క, దక్షిణపాదమ్=కుడిపాదమును, సవ్యేన=తన ఎడమచేతితో, సవ్యమ్=గురువుయొక్క ఎడమ పాదమును, అన్వారభ్య=పట్టుకొని, '*సావిత్రీం భో అనుబ్రూహి*' ఇతి='నాకు సావిత్రిని ఉపదేశింపుడు' అని, ఆహ=పలుకును.

295 తస్మై= ఆకుమారునికొరకు, తత్సవితురితి= 'తత్సవితుః' అను మంత్రమును, అన్వాహ

ర్వ్యాహృతాః పాదాదిష్వంతేషు వా తథార్ధర్చయో రుత్తమా కృత్స్నాయామ్।

## సావిత్ర్యుపదేశక్రమః

*ఓం భూః తత్సవితుర్వరేణ్యమ్।*

*ఓం భువః భర్గోదేవస్య ధీమహి।*

*ఓగ్ం సువః ధియో యో నః ప్రచోదయాత్॥*

*ఓం భూః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి।*

*ఓం భువః ధియో యో నః ప్రచోదయాత్॥*

*ఓగ్ం సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥*

[296]వా॥ ఇత్యుక్తక్రమేణ కుమారస్య దక్షిణే కర్ణే జపిత్వా। తథైవ తం వాచయిత్వా।

## ఓష్ఠశ్రోత్రస్పర్శనమ్

[297]వా॥ కుమారః అవృధమితి యజుషా ఉత్తరమోష్ఠ ముపస్పృశ్యాచమ్యతి। తతః

---

ఆచార్యుడు చెప్పుచున్నాడు. అదెట్లనగా, పచ్ఛః= పాదములను వేరుగా చెప్పి, అర్ధర్చశః = పిదప వాక్యములను వేరుగా చెప్పి,తతస్సర్వామ్=ఆపైని మంత్రము నంతయు చెప్పుచున్నాడు. వ్యాహృతీర్వ్యాహృతాః= ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః అను వ్యాహృతులను, పాదాదిష్వం తేషు వా=పాదముల మొదటగాని, అంతమందుగాని, తథార్ధర్చయోః=అట్లే ఓం భూః, ఓం భువః అను వానిని వాక్యముల ఆదియందుగాని, అంతమందుగాని, ఉత్తమా=ఓగ్ం సువః అను దానిని, కృత్స్నాయామ్=పూర్తిమంత్రము మొదటగాని, చివరగాని చెప్పుచున్నాడు. ఇట్లు సిద్ధించు మంత్రక్రమము పైన ఈయబడినది.

296పరిషత్తునకు (బ్రహ్మోపదేశానంతరము వటువుపై వేయుటకు) హరిద్రాక్షల నిచ్చి, బ్రహ్మోప దేశమును గోప్యముగా నుంచుటకై ఆచార్యవటువుల నావరించునట్లొక శాలువను గాని ఉత్తరీ యమునుగాని కప్పుకొని, ఆచార్యుడు పైనొసగిన క్రమముగా (6 భాగములుగా) గాయత్రీమంత్ర మును వటువు కుడిచెవిలో నుచ్చరించి, తరువాత అట్లే వటువుచేత పలికించవలెను. ఇట్లు మంత్రోపదేశము జరిగిన తర్వాత వటువు పరిషత్తుకు నమస్కరింపగా, పరిషత్తు అతనిపై తమ కిచ్చిన అక్షతలు వేసి దీవించవలెను. అట్లే ఆచార్యుడును అక్షతలు వేసి దీవించవలెను.

297 కుమారః=వటువు, అవృధమితి యజుషా= తర్వాత నిచ్చిన ‘ అవృధమసౌ’ అను మంత్ర

'బ్రహ్మణ ఆణిస్థః' ఇతి కర్ణౌ వుపస్పృశతి। (నాత్ర 'అసౌ' శబ్దే నామనిర్దేశః)

*మం॥ అవృధమసౌసౌమ్య ప్రాణ స్వం మే గోపాయ*/(ఇత్యోష్ఠౌ స్పృశతి)/ (మం.పా.2.4)

*మం॥ బ్రహ్మణ ఆణీస్థః*/ (ఇతి హస్తాభ్యాం కర్ణౌ యుగపదుపస్పృశతి)/ (మం.పా.2.4)

## దండగ్రహణమ్

[298]సూ॥ దండముత్తరేణాదత్తే। పాలాశదండో బ్రాహ్మణస్య।

*మం॥ సుశ్రవస్సుశ్రవసం మా కురు యథా త్వగ్ం సుశ్రవస్సుశ్రవా అస్యేవమహగ్ం సుశ్రవస్సుశ్రవా భూయాసం యథాత్వగ్ం సుశ్రవస్సుశ్రవో దేవానాం నిధిగోపోఽస్యేవ-మహం బ్రాహ్మణానాం బ్రహ్మణో నిధిగోపో భూయాసమ్*॥ (తై.మం.పా.2.5)

*పదం॥ సుశ్రవః/ సుశ్రవసమ్/ మా కురు/ యథా త్వమ్/ సుశ్రవః/ సుశ్రవా అసి/ ఏవ మహమ్/ సుశ్రవః/ సుశ్రవా/ భూయాసమ్/ యథా త్వమ్/ సుశ్రవః/ సుశ్రవః/ దేవానామ్/ నిధి గోపోఽసి/ ఏవమహమ్/ బ్రాహ్మణానామ్/ బ్రహ్మణః/ నిధిగోపః/ భూయాసమ్*॥

వా॥మంత్రాన్తే పాలాశదండ మార్యదత్తం వటుర్దక్షిణపాణినాఽఽదత్తే।

సూ॥ స్మృతంచమ ఇత్యేతద్వాచయిత్వా।

---

మును చెప్పించుకొని, ఉత్తరమోష్ఠం=పైపెదవిని, ఉపస్పృశ్య=ముట్టుకొని, ఆచమ్యతి= ఆచమనము చేయుచున్నాడు; బ్రహ్మణ ఆణీస్థః ఇతి= 'బ్రహ్మణ ఆణీస్థః' అను మంత్రమును చెప్పించుకొని, కర్ణౌ=కుడి,ఎడమచెవులను, యుగపత్=ఏకకాలములో, ఉపస్పృశతి=తాకుచున్నాడు. అనగా బ్రహ్మోపదేశము ముగియగనే వటువు తూర్పునకు దిరిగి 'అవృథమసౌ' అను మంత్రమును ఆచార్యునిచేత చెప్పించుకొని కుడిచేతి నాల్గువ్రేళ్లతో పైపెదవిని తాకి,అరచేతిలో కొంచెము నీటిని పోసికొని కుడిచెలమనుండి ఎడమచెలమవరకు తుడుచుకొని, ఆచమింపవలెను. తర్వాత 'బ్రహ్మణ ఆణీస్థః' అను మంత్రమును చెప్పించుకొని రెండుచెవుల నొకేసారి రెండుచేతులతో తాకవలెను. ఇచ్చట 'అసౌ'శబ్దస్థానములో వటువుపేరు చెప్ప నవసరము లేదు.

298 తర్వాత వటువు తూర్పుముఖముగా లేచి నిలుచుండగా, ఆచార్యుడు 'సుశ్రవసః' అను మంత్రమును అతనిచేత చెప్పించి, అతనికుడిచేతికి మోదుగు దండమును పట్టించవలెను. అట్లు దండమును ధరించిన వటువుచే 'స్మృతంచ మే' ఇత్యాది మంత్రములను చెప్పించవలెను.

*మం॥స్మృతం చ మేఽస్మృతం చ మే తన్మే ఉభయం వ్రతమ్।నిందా చ మేఽనిందా చ మే తన్మే ఉభయం వ్రతమ్।శ్రద్ధా చ మేఽశ్రద్ధా చ మే తన్మే ఉభయం వ్రతమ్।విద్యా చ మేఽవిద్యా చ మే తన్మే ఉభయం వ్రతమ్।శ్రుతం చ మేఽశ్రుతం చ మే తన్మే ఉభయం వ్రతమ్।సత్యం చ మేఽనృతం చ మే తన్మే ఉభయం వ్రతమ్। తపశ్చ మేఽతపశ్చ మే తన్మే ఉభయం వ్రతమ్।వ్రతం చ మేఽవ్రతం చ మే తన్మే ఉభయం వ్రతమ్।యద్బ్రాహ్మ-ణానాం బ్రహ్మణి వ్రతం యదగ్నేస్సేన్ద్రస్య సప్రజాపతికస్య సదేవస్య సదేవరాజస్య సమనుష్యస్య సమనుష్యరాజస్య సపితృకస్య సపితృరాజస్య సగంధర్వాప్సరస్కస్య యన్మ ఆత్మని ఆత్మని వ్రతం తేనాహగ్ం సర్వవ్రతో భూయాసమ్॥* (తై.మం.పా.2.5)

*పదం॥స్మృతంచమే।అస్మృతం చ మే।తన్మే।ఉభయం వ్రతమ్।నిందాచమే।అనిందాచమే। తన్మే। ఉభయం వ్రతమ్। శ్రద్ధాచమే।అశ్రద్ధాచమే। తన్మే। ఉభయం వ్రతమ్। విద్యాచమే। అవిద్యాచమే।తన్మే।ఉభయం వ్రతమ్।శ్రుతంచమే।అశ్రుతంచమే।తన్మే।ఉభయం వ్రతమ్। సత్యంచమే। అనృతంచమే। తన్మే। ఉభయం వ్రతమ్। తపశ్చమే। అతపశ్చమే। తన్మే। ఉభయం వ్రతమ్। వ్రతంచమే।అవ్రతంచమే। తన్మే। ఉభయం వ్రతమ్। యత్। బ్రాహ్మ-ణానాం। బ్రహ్మణి। వ్రతమ్। యదగ్నేః। సేన్ద్రస్య। సప్రజాపతికస్య। సదేవస్య। సదేవ-రాజస్య।సమనుష్యస్య।సమనుష్యరాజస్య।సపితృకస్య।సపితృరాజస్య।సగంధర్వాః। అప్సరస్కస్య।యన్మ ఆత్మనః।ఆత్మని వ్రతమ్।తేనాహమ్।సర్వవ్రతః।భూయాసమ్॥*

**వరదానమ్:**[299]వా॥ తతః ‘గురో వరం తే దదామి’ –ఇతి గురవే వటుర్వరం దద్యాత్। గురు స్సప్తదశ కృత్వోఽపాస్య దేవస్యేతి ప్రతిగృహ్ణాతి।

---

299 తర్వాత ‘గురో= ఓగురువా! తే=నీకు, వరం= గోవును, దదామి=ఇస్తున్నాను’, ఇతి=అని, గురవే=మంత్రము నుపదేశించిన గురువునకు, వటుః=వటువు, వరం=ఆవును (లేక దానికి సమ మైన దక్షిణను), దద్యాత్=ఈయవలెను. అప్పుడు, గురుః=గురువు, సప్తదశకృత్వా=17సార్లు, ఉపాస్య= ‘ఓం భూః’ అని జపించి, ప్రతిగృహ్ణాతి= దానిని తీసికొనును. గమనిక: కంఠభూషణ ములో గురువు అమంత్రకముగనే గోవును గ్రహించవలెనని యున్నది. అట్లే ఇచ్చటచెప్పబడినది.

బ్రహ్మోద్వాసనమ్:[300]*బ్రహ్మణే నమః/సదక్షిణాకం తాంబూలం సమర్పయామి/ యథాస్థాన ముద్వాసయామి//* – ఇతి బ్రహ్మణే తాంబూలదక్షిణాంచ దత్వా బ్రహ్మోద్వాసనం కుర్యాత్. ప్రాగాదిపరిస్తరణ ముత్తరే విసృజేత్.

## సూర్యోపస్థానమ్

[301]వా॥అథాచార్యః ప్రత్యఙ్ముఖమాసీనం కుమారం 'ఉదాయుషా' ఇతి యజుషోత్థాప్య, తద్వాచయేత్।

*మం॥ఉదాయుషా స్వాయుషోదోషధీనాగ్ం రసేనోత్పర్జన్యస్య శుష్మేణోదస్థామమృతాగ్ం అను//* (త్తై.మం.పా.2.5)

*పదం॥ ఉదాయుషా/ స్వాయుషా/ ఉదోషధీనామ్/ రసేన/ ఉత్పర్జన్యస్య/ శుష్మేణ/ ఉదస్థామ్/ అమృతాగ్ం అను//*

[302]వా॥ 'తచ్చక్షు' రితి దశభిర్మంత్రై ర్వటు రాచార్య వాచితై రాదిత్య ముపతిష్ఠేత।

*మం॥తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్/పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం నన్దామ శరదశ్శతం మోదామ శరదశ్శతం భవామ శరదశ్శతగ్ం శృణవామ శరదశ్శతం ప్రబ్రవామ శరదశ్శతమజీతాస్స్యామ శరదశ్శతం జ్యోక్చ సూర్యం దృశే//*

---

[300] తదుపరి '*బ్రహ్మణే నమః---ఉద్వాసయామి*' అని చెప్పుచు బ్రహ్మస్థానమున కూర్చున్న బ్రాహ్మణునికి తాంబూలదక్షిణ లిచ్చి అతనిని ఉద్వాసన చేసి, తూర్పునుండి మొదలిడి ప్రదక్షిణముగా అగ్నిచుట్టు వేసిన పరిస్తరణలను తీసి అగ్నికి ఉత్తరమువైపు పడవేయవలెను.

301 అథ=పిదప, ఆచార్యః=ఆచార్యుడు, ప్రత్యఙ్ముఖమాసీనం కుమారం=పడమటికి మళ్లి కూర్చున్న కుమారుని, 'ఉదాయుషా'ఇతి యజుషా='ఉదాయుషా' అను మంత్రముతో, ఉత్థాప్య=తనకుడిచేతితో అతని కుడిచేతిని పట్టుకొని లేపి, తద్వాచయేత్=ఆమంత్రమును అతని చేత చెప్పించవలెను.

302 తరువాత, సూర్యుడు కన్పడుచోటికి పోయి, ఆచార్యుడు 'తచ్చక్షుర్దేవహితం' అను మంత్రముల వటువుచే పలికించుచు సూర్యునికి ఉపస్థానము చేయించవలెను.

*పదం॥ తచ్చక్షుః।దేవహితమ్। పురస్తాత్। శుక్రమ్। ఉచ్చరత్। పశ్యేమ। శరదశ్శతమ్। జీవేమ। శరదశ్శతమ్। నన్దామ। శరదశ్శతమ్। మోదామ। శరదశ్శతమ్। భవామ। శరదశ్శతమ్।శృణవామ।శరదశ్శతమ్।ప్రబ్రవామ।శరదశ్శతమ్। అజీతాస్స్యామ।శరదశ్శతమ్। జ్యోక్చ।సూర్యమ్।దృశే॥*

## కామ్యవిధిః

సూ॥[303] యం కామయేత నాయమచ్ఛిద్యేతేతి తముత్తరయా దక్షిణహస్తే గృహ్ణీయాత్।
*మం॥ యస్మిన్భూతం చ భవ్యం చ సర్వే లోకాస్సమాహితాః। తేన గృహ్ణామి త్వామహం మహ్యం గృహ్ణామి త్వామహం ప్రజాపతినా త్వా మహ్యం గృహ్ణామి (విష్ణు) శర్మన్॥* (తై.మం.పా.2.5)

## దీక్షావిధిః

[304] సూ॥ త్ర్యహమేతమగ్నిం ధారయన్తి క్షారలవణవర్జనం చ। పరిత్వేతి పరిమృజ్య తస్మిన్నుత్తరైర్మంత్రైస్సమిధ ఆదధ్యాత్। దీక్షానంతరం లౌకికాగ్నౌ సమిదాధానమ్।

---

303యం=ఏవటువునుగుఱించి,ఆచార్యః=ఆచార్యుడు,అయం=ఈవటువు,మత్తః=నానుండి, న అచ్ఛిద్యేత=(స్నాతకపర్యంతము) విడిపోకుండ ఉండవలెనని, కామయేత=కోరుకొనునో, తం=ఆవటువును, ఉత్తరయా =తరువాత నిచ్చిన మంత్రముతో, దక్షిణహస్తే = తన కుడిచేత, గృహ్ణీయాత్=గ్రహింపవలెను. అనగా, వటువును స్నాతకపర్యంతము తనకడనే ఉంచుకొని, అతనికి వేదాదివిద్యలు చెప్పదలచినచో, ఆచార్యుడు తరువాత నిచ్చిన 'యస్మిన్భూతం చ' అను మంత్రముతో అతనిని తన కుడిచేత గ్రహింపవలెనని తాత్పర్యము. సూచన: మంత్రములో (విష్ణు) కు బదులుగా వటువు పేరును చెప్పవలెను. ఆచార్యుడట్లు కోరనిచో నిట్లు చేయ వలసిన అవసరము లేదు గావున నీకర్మ ఐచ్ఛికము.

304 ఏతం అగ్నిం=ఈ ఉపనయనాగ్నిని, త్ర్యహం=మూడురోజులు, ధారయన్తి=ఆరిపోకుండా ఉంచుకొనవలెను; క్షారలవణవర్జనం చ= ఈ 3 దినములును వటువు కారము, ఉప్పు లేని ఆహారమును తీసికొనవలెను. పరిత్వేతి పరిమృజ్య= 'పరిత్వాగ్నే' అను మంత్రముతో ఆ అగ్ని చుట్టు పరిమార్జనము చేసి, తస్మిన్=ఆ అగ్నిలో, ఉత్తరైర్మంత్రైః=తర్వాత నిచ్చిన 12 మంత్రములతో, సమిధ ఆదధ్యాత్=సమిధలను నేతిలో నద్దుచు అగ్నిలో వేసి సమిద్ధోమమును చేయవలెను. దీనికే

## సమిదాధానమ్

[305] వటు రాచమ్య, త్రిః ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం ... ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే॥*

*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*

*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*

*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*

*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*

*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*

*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ----మాసే ----పక్షే ---తిథౌ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయాం*

---

అగ్నికార్యమని పేరు. ఇది ముందు చెప్పబడినది. దీనిని 3 రోజులు ప్రాతస్సాయంకాలములందు చేయవలెను. ఈ మూడురోజులు ఉప్పు, కారము, తీపి ఇటువంటివి ప్రత్యేకముగా తినగూడదు గాని, వీనిని వేసిన పాకమును తినవచ్చునని కొందరు వ్యాఖ్యానించుచున్నారు.

305 వటు వాచమనము చేసి, మూడుసార్లు ప్రాణాయామము చేసి, 'శుక్లాంబరధరం విష్ణుం' నుండి 'కరిష్యే' వరకు గల సంకల్పమును గీతలుంచిన చోట్ల తగిన తిథివారనక్షత్రాదులను చేర్చుచు చెప్పవలెను. ఈసంకల్పములో ఉదయము చేయు సమిదాధానమునకు 'ప్రాతస్సమిధమాధాస్యామి' అనియు, సాయంకాలము చేయు సమిదాధానమునకు 'సాయం సమిధమాధాస్యామి' అని చెప్పవలెను. (ఉపనయనాగ్ని ఆరిపోకుండ కాపాడుకొని ముందుగా పుల్లల చేత ఆ యగ్నిని ప్రజ్వలింపజేసి, వటువుచేత ఆచార్యు డీమంత్రములను పలికించుచు ప్రాతస్సాయంకాలములయం దుపనయనాది మూడుదినములపాటు సమిదాధానమును చేయించవలెను.)

*మస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం సాయంసమిధ మాధాస్యామి (అథవా, ప్రాతస్సమిధ మాధాస్యామి)''* – ఇతి సంకల్ప్య। పూర్వం కాష్ఠైరగ్నిమిధ్వా।

*మం॥ పరి త్వాఽగ్నే పరి మృజామ్యాయుషా చ ధనేన చ। సుప్రజాః ప్రజయా భూయా-సగ్ం సువీరో వీరైస్సువర్చా వర్చసా సుపోషః పోషైస్సుగృహో గృహైస్సుపతిః పత్యా సుమేధా మేధయా సుబ్రహ్మా బ్రహ్మచారిభిః॥* (తై.మం.పా.2.6)

*పదం॥ పరిత్వా ఽగ్నే / పరిమృజామి/ ఆయుషా చ/ ధనేన చ/ సుప్రజాః/ ప్రజయా / భూయాసమ్/ సువీరః/ వీరైః/ సువర్చాః/ వర్చసా/ సుపోషః/ పోషైః/ సుగృహః/ గృహైః/ సుపతిః/ పత్యా/ సుమేధా/ మేధయా/ సుబ్రహ్మా/ బ్రహ్మచారిభిః/*

[306]ఇతి పరిమృజ్య (సర్వతో మార్జనం జలేన కృత్వా), పరిసమూహ్య (విప్రకీర్ణస్యాగ్నేః రాశీకరణం కృత్వా) *1. ఓం అగ్నయే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతైరలంకృత్య,

[307] *"అదితేఽనుమన్యస్వ"* (ఇతి దక్షిణతః ప్రాచీనమ్), *"అనుమతేఽనుమన్యస్వ"* (ఇతి పశ్చాదుదీచీనమ్), *"సరస్వతేఽనుమన్యస్వ"* (ఇత్యుత్తరతః ప్రాచీనమ్), *"దేవసవితః*

---

[306] '*పరిత్వాగ్నే*' అను మంత్రముతో తడిచేసికొన్న తన కుడిఅరచేతితో అగ్నిచుట్టును ప్రదక్షిణముగా నలికి – ఇదియే పరిమార్జనము; 'పరిసమూహ్య' అని చెప్పుచు చెదరిన అగ్నిని రాశిగా చేర్చి; '*ఓం అగ్నయే నమః*' నుండి మొదలిడి '*ఓం విసర్పిణే నమః*' వరకు గల వాక్యములను చెప్పుచు ప్రదక్షిణముగా తూర్పునుండి మొదలిడి 8 దిక్కులందును అగ్నిచుట్టును అక్షతల నుంచి, '*శ్రీయజ్ఞపురుషాయ నమః*' అనుచు అగ్నిమధ్య కొన్ని అక్షతలనుంచి, '*సర్వేభ్య శ్శ్రీ వైష్ణవేభ్యో నమః*'- అనుచు సదస్యులపై అక్షతలు వేయవలెను.

[307] తరువాత "*అగ్నిం పరిషించతి*" అని చెప్పి, " *అదితేఽనుమన్యస్వ*"- అనుచు దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, "*అనుమతేఽనుమన్యస్వ*" - అనుచు పశ్చిమమునందు

ప్రసువ" (ఇతి సమంతమ్) అగ్నిం పరిషిచ్య॥

## సమిద్ధోమాః (తై.మం.పా.2.6)

[308]వా॥ అగ్నయే సమిధమిత్యాది ద్వాదశభిర్వ్యాహృతీ ర్విహృతాభి స్సమస్తాభిశ్చేతి చతసృభిః ప్రతిమంత్రం సమిధషోడశమాదధ్యాత్।

1. అగ్నయే సమిధమాహార్షం బృహతే జాతవేదసే। యథా త్వమగ్నే సమిధా సమిధ్యస ఏవం మామాయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సమేధయ స్వాహా। అగ్నయ ఇదం న మమ।
   పదం॥ అగ్నయే। సమిధమ్। ఆహార్షమ్। బృహతే। జాతవేదసే। యథా। త్వమగ్నే। సమిధా। సమిధ్యసే। ఏవం। మామ్। ఆయుషా। వర్చసా। సన్యా। మేధయా। ప్రజయా। పశుభిః। బ్రహ్మవర్చసేన। అన్నాద్యేన। సమేధయ। స్వాహా।
2. ఏధోఽస్యేధిషీమహి స్వాహా। అగ్నయ ఇదం న మమ।
   పదం॥ ఏధోసి। ఏధిషీమహి। స్వాహా।
3. సమిదసి సమేధిషీమహి స్వాహా। అగ్నయ ఇదం న మమ।
   పదం॥ సమిదసి। సమేధిషీమహి। స్వాహా।
4. తేజోఽసి తేజో మయి ధేహి స్వాహా। అగ్నయ ఇదం న మమ।
   పదం॥ తేజోఽసి। తేజోమయి। ధేహి। స్వాహా।
5. అపో అద్యాన్వచారిషగ్ం రసేన సమసృక్ష్మహి। పయస్వాగ్ం అగ్న ఆగమం తం మా సగ్ంసృజ వర్చసా స్వాహా। అగ్నయ ఇదం న మమ।

---

దక్షిణమునుండి ఉత్తరమునకు, "*సరస్వతే ఽనుమన్యస్వ*"- అనుచు ఉత్తరమునందు పడమటి నుండి తూర్పునకు, "*దేవసవితః ప్రసువ*"- అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు పూర్ణకుంభములోని నీటిని చేతితో లేక కూర్చతో తీసికొని అగ్నిని పరిషేచనము చేయవలెను.

[308]క్రింది 16మంత్రములను వటువుచే పలికించుచు ప్రతిమంత్రము చివర నేతిలో నద్దిన ఒక సమిధను అగ్నిలో వేయించవలెను. ఇదియే సమిదాధానహోమము.

పదం॥ ఆపః/ అద్య/ అన్వచారిషమ్/ రసేన/ సమసృక్ష్మహి/ పయస్వాన్/ అగ్నే/ ఆగమమ్/ తం/ మా/ సగ్ంసృజ/ వర్చసా/ స్వాహా/

6. సంమాఽగ్నే వర్చసా సృజ ప్రజయా చ ధనేన చ స్వాహా/ అగ్నయ ఇదం న మమ/

   పదం॥ సంమాఽగ్నే/ వర్చసా సృజ/ ప్రజయా చ/ ధనేన చ/ స్వాహా/

7. విద్యున్మే అస్య దేవా ఇన్ద్రో విద్యాత్సహ ఋషిభిస్స్వాహా/ ఇన్ద్రాయేదం న మమ/

   పదం॥ విద్యుత్/ మే/ అస్య/ దేవా/ ఇన్ద్రః/ విద్యాత్/ సహ ఋషిభిః/ స్వాహా/

8. అగ్నయే బృహతే నాకాయ స్వాహా/ అగ్న యే బృహతే నాకాయేదం న మమ/

   పదం॥ అగ్నయే/ బృహతే/ నాకాయ/ స్వాహా/

9. ద్యావాపృథివీభ్యాగ్ స్వాహా/ ద్యావాపృథివీభ్యామిదం న మమ/

   పదం॥ ద్యావాపృథివీభ్యామ్/ స్వాహా/

10. ఏషాతే అగ్నే సమిత్తయా వర్ధస్వ చాఽఽప్యాయస్వ చ తయాఽహం వర్ధమానో భూయాసమాప్యాయమానశ్చ స్వాహా/ అగ్నయ ఇదం న మమ/

    పదం॥ ఏషాతే/ అగ్నే/ సమిత్తయా/ వర్ధస్వ చ/ ఆప్యాయస్వ చ/ తయాఽహం/ వర్ధమానః/ భూయాసమ్/ ఆప్యాయమానశ్చ/ స్వాహా/

11. యో మాఽగ్నే భాగినగ్ం సన్తమథాభాగం చికీర్షత్యభాగమగ్నే తం కురు మామగ్నే భాగినం కురు స్వాహా/ అగ్నయ ఇదం న మమ/

    పదం॥ యో మాఽగ్నే/ భాగినగ్ం సన్తమ్/ అథా భాగమ్/ చికీర్షతి/ అభాగమగ్నే/ తం కురు/ మామగ్నే/ భాగినమ్/ కురు/ స్వాహా/

12. సమిధమాధాయాఽగ్నే సర్వవ్రతో భూయాసగ్ స్వాహా/ అగ్నయ ఇదం న మమ/

    పదం॥ సమిధమాధాయ/ అగ్నే/ సర్వవ్రతః/ భూయాసం/ స్వాహా/

13. ఓం భూస్స్వాహా/ అగ్నయ ఇదం నమమ॥

14. ఓం భువస్స్వాహా/ వాయవ ఇదం నమమ॥

15. *ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం నమమ॥*

16. *ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।*

**ఉత్తరపరిషేచనమ్:** [309]పునః ప్రాణానాయమ్య, *"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- ఇతి దక్షిణతః ప్రాచీనమ్, ''*అనుమతే ఽన్వమగ్గ్ స్థాః*" - ఇతి పశ్చాదుదీచీనమ్, *"సరస్వతే ఽన్వమగ్గ్ స్థాః"*- ఇత్యుత్తరతః ప్రాచీనమ్, *"దేవ సవితః ప్రాసావీః"* - ఇతి సమంత మగ్నిం పరిషిచ్య।

17. *"శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం న మమ।"*

ఇతి సమిధమగ్నౌ నినీయ, ఉత్థాయ, అంజలిం బధ్వా, అగ్న్యుపస్థానం కుర్యాత్।

## అగ్న్యుపస్థానమ్

*మం॥ యత్తే అగ్నే తేజస్తేనాహం తేజస్వీ భూయాసం యత్తే అగ్నే వర్చస్తేనాహం వర్చస్వీ భూయాసం యత్తే అగ్నే హరస్తేనాహగ్ం హరస్వీ భూయాసమ్॥౧॥*

*మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు మయి మేధాం మయి ప్రజాం మయీన్ద్ర ఇన్ద్రియం దధాతు మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు॥౨॥* (తై.సం.3.3.1)

---

[309]మరల ప్రాణాయామమును చేసి, *"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- అని దక్షిణమునందు పడమటి నుండి తూర్పునకు, *"అనుమతేఽన్వమగ్గ్ స్థాః"*- అని పశ్చిమమునందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽన్వమగ్గ్ స్థాః"* - అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవ సవితః ప్రాసావీః"* - అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నికి నీటితో (ఉత్తర)పరిషేచనము చేసి, మఱొక సమిధను నేతిలో నద్ది శ్రీవిష్ణవే స్వాహా అను మంత్రముతో హోమము చేయవలెను. (సూచన: కొన్నిప్రయోగములలో పూర్వోత్తరపరిషేచనములను మంత్రరహితముగనే చేయుమని వ్రాసినారు.)తర్వాత వటువు దండధారియై లేచి నిలబడి అగ్నికి అంజలించుచు 'యత్తే అగ్నే' ఇత్యాది 3 మంత్రములను, ప్రార్థనాశ్లోకములను చెప్పి, గోత్రనామములతో కూడిన అభివాదమును చేయవలెను.

*పదం॥ యత్తే అగ్నే / తేజస్తేన/అహమ్/తేజస్వీ/భూయాసమ్/యత్తే అగ్నే /వర్చస్తేన/ అహమ్/ వర్చస్వీ/భూయాసమ్/యత్తే అగ్నే /హరస్తేన/అహమ్/హరస్వీ/ భూయాసమ్॥౧॥* (తై.సం.3.5.3)

*మయి మేధామ్/మయి ప్రజామ్/ మయ్యగ్నిః/ తేజో దధాతు/మయి మేధామ్/మయి ప్రజామ్/ మయీన్ద్రః/ఇన్ద్రియమ్/దధాతు/మయి మేధామ్/మయి ప్రజామ్/ మయి సూర్యః/ భ్రాజో దధాతు॥౨॥*

## ప్రార్థనశ్లోకాః

*శ్లో॥ స్వస్తి శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమ్/*
*ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన॥*

*శ్లో॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో హోమక్రియాదిషు/*
*న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే హుతాశనమ్॥*

*శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన/*
*యద్ధుతన్తు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥*

## అభివాదః

[310] *చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు/ అభివాదయే ఆంగీరస పౌరుకుత్స త్రసదస్యుః త్రయార్షేయ ప్రవరాన్విత శతమర్షణసగోత్రః, ఆపస్తమ్బసూత్రః, యజుశ్శాఖాధ్యాయీ విష్ణుశర్మ అహం భో అభివాదయే॥*

## సగ్ంశాసనమ్

[311] అథ కుమార మాచార్యః 'బ్రహ్మచార్యోసీ' త్యాదీన్ షడర్థాన్ సంశాస్తి ప్రతిశాసనం

---

[310]గమనిక: ఇచ్చట శతమర్షణగోత్రికుడైన విష్ణుశర్మ అను వటువుయొక్క అభివాదన మీయబడినది. దీని స్థానములో ప్రస్తుతవటువుయొక్క అభివాదమును చెప్పుకొనవలెను.

[311] పిదప గురువు 'బ్రహ్మచార్యసి' మున్నగు 6 నియమముల పాటింతువా అని వటువును ప్రశ్నించుచున్నాడు. ఆప్రశ్నలకు అర్థములివి:

కుమారో 'బాఢ' మితి ప్రతిబ్రూయాత్।

| | |
|---|---|
| 1.ఆచార్యః: *బ్రహ్మచార్యసి?* | వటుః: *బాఢమ్* |
| 2.ఆచార్యః: *అపోఽశాన?* | వటుః: *బాఢమ్* |
| 3. ఆచార్యః: *కర్మ కురు?* | వటుః: *బాఢమ్* |
| 4. ఆచార్యః: *మా సుషుప్థాః?* | వటుః: *బాఢమ్* |
| 5. ఆచార్యః: *భిక్షాచర్యం చర?* | వటుః: *బాఢమ్* |
| 6. ఆచార్యః: *ఆచార్యాధీనో భవ?* | వటుః: *బాఢమ్* |

తతో వటుః గురుం మాతర మన్యాంశ్చ వృద్ధా న్నమస్కుర్యాత్।

## భిక్షాక్రమః

[312] అథాచార్య స్తస్మై అరిక్తం పాత్రం ప్రయచ్ఛన్ మాతరమేవాగ్రే భిక్షస్వ భగినీం వేతి

---

1. బ్రహ్మచార్యసి = బ్రహ్మచారి వైతివి. అందుచే కామచార,కామవాద, కామభక్షణములను (అనగా నియమరహితముగా చరించుట,మాట్లాడుట,తినుట) చేయకుము; 2. అపోశాన=నా యనుమతితోనే ఉదకమును త్రాగుము; 3. కర్మకురు= నా నిమిత్తమైన పనిని చేయుము; 4. మా సుషుప్థాః=పగలు నిద్రింపకుము; 5.భిక్షాచర్యం చర=భిక్షాచరణమును చేయుము; 6.ఆచార్యాధీనోభవ=నాకు చెప్పకుండ యాజనాధ్యాపనప్రతిగ్రహములను మూడుకర్మలను చేయకుము; ఈ ప్రశ్నల కన్నిటికి వటువు బాఢమ్='సరే, అట్లాగే', అని జవాబిచ్చుచున్నాడు.తర్వాత వటువు ముందుగా తల్లికిని, ఆపైని తండ్రి, గురువు మున్నగు వేరే పెద్దవారికిని సాష్టాంగదండ ప్రణామము చేయుచున్నాడు.

[312]అథ=పిదప, ఆచార్యః=ఆచార్యుడు, తస్మై=వటువునకు, అరిక్తం పాత్రం=శక్త్యనుసారముగా (మణిసువర్ణాదుల నుంచిన, లేక బియ్యము నుంచిన) వెండి, లేక ఇతరమైన పాత్రను, ప్రయచ్ఛన్=ఇచ్చి, మాతరమేవాగ్రే=మొట్టమొదట తల్లినుండే, వా=లేకున్నచో, భగినీం=అక్క (లేక చెల్లెలు) నుండి, భిక్షస్వ =భిక్షమడుగుకొనుము, ఇతి=అని, బ్రూయాత్= చెప్పవలెను. స చ=అప్పు డావటువు, 'భవతి భిక్షాం దేహి' ఇతి='భవతి భిక్షాం దేహి' అని చెప్పుచు, అగ్రే= మొట్టమొదట, మాతరమేవ= తల్లినే, వా=లేకున్న, స్వభగినీం=తన సోదరిని, భిక్షేత=భిక్షమడుగవలెను. తత్సమాహృత్య= దానిని తీసికొనివచ్చి, ఉపనిధాయ= గురువు ఎదుట నుంచి,

బ్రూయాత్। స చ ‘భవతి భిక్షాం దేహి’ – ఇతి మాతరమేవాగ్రే భిక్షేత, స్వభగినీం వా। తత్సమాహృత్య, ఉపనిధాయ, ‘భైక్షమిదమాహృతమ్’–ఇత్యాచార్యాయ దద్యాత్। ‘సుభైక్షమ్’ ఇత్యాచార్యః తత్ప్రతిగృహ్ణీయాత్। అథో మంగళారాత్రికం, బ్రాహ్మణాశీర్వచనం, ఫలదానం, బృహస్పతిసంభావనా, బ్రాహ్మణభోజనాదికమ్।
[313]ఉపనీతో మధ్యాహ్నే మాధ్యాహ్నికం కృత్వా, తదాది నిత్యం నియతః సంధ్యాత్రయ

---

‘భైక్షమిదమాహృతమ్’ ఇతి=‘ఇదిగో! ఈభిక్షము తేబడినది’ అనుచు, ఆచార్యాయ= గురువునకు, దద్యాత్=ఈయవలెను. ‘సుభైక్షమ్’ ఇతి=‘సుభైక్షమ్’ అని చెప్పుచు, ఆచార్యః=గురువు, తత్=దానిని, ప్రతిగృహ్ణీయాత్=తీసికొనవలెను. లౌకికపద్ధతి: వటువును పీటపై తూర్పుముఖముగా కూర్చుండబెట్టి, అతని యెదుట ఒక పెద్దపాత్రలో పసుపుబియ్యమును పోసి, అందులోనొక వెండిస్థాలీ నుంచెదరు. అప్పుడు ముందుగా తల్లి, ఆ తరువాత అక్కసెల్లెండ్రు, ఇతర బంధువులు వరుసగా వచ్చి, ఆస్థాలీలో పాత్రలోని బియ్యమును నింపి, దానితోబాటు తామీయదలచిన ధనమును గూడపెట్టి, స్త్రీలిచ్చునప్పుడు ‘భవతి భిక్షాం దేహి’ అనియు, పురుషులిచ్చునప్పుడు ‘భవాన్ భిక్షాం దదాతు’ అనియు వటువు చెప్పుచుండగా అబియ్యమును, ధనమును వటువు దోసిలిలో నుంతురు. ఇది ముగిసిన పిమ్మట తరువాత వటువునకు మంగళహారతినిచ్చుట జరుగును. ఆతర్వాత వటువు తగిన దక్షిణను బియ్యముతో చేర్చి ఆచార్యున కిచ్చి, గోత్రనామయుతమైన ప్రవరను చెప్పి, అతని కభివాదము చేయును. అథః=పిదప, ఫలదానం =ఆహూతులకు ఫలదానము లిచ్చుట, బృహస్పతిసంభావనా=వాధ్యారునకు సంభావననిచ్చుట, బ్రాహ్మణభోజనాదికమ్= బ్రాహ్మణులకు సంతర్పణమొనర్చుట చేయవలెను.

[313] ఉపనీతః=వటువు, మధ్యాహ్నే=ఆనాటి మధ్యాహ్నమందు, మాధ్యాహ్నికం కృత్వా= మధ్యాహ్నము చేయవలసిన సంధ్యావందనమును చేసి, తదాది=అప్పటినుండి, నిత్యం=ప్రతిరోజు,నియతః=నియమముగా,సంధ్యాత్రయమ్=మూడుసంధ్యలను,ఉపాసీత=వార్చవలెను. తదనంతరమ్=సంధ్య వార్చిన పిమ్మట, ఉభయసంధ్యయోరపి=ప్రాతస్సాయంసంధ్యవేళలందు, అగ్నికార్యం=అగ్నికార్యమును, కుర్యాత్=చేయవలెను.ఉపనీతః=వటువు, త్ర్యహం= మూడురోజులు, క్షారలవణవర్జం=ఉప్పుకారములేకుండ, భుంజీత=తినవలెను; త్రీణ్యహాని= మూడునాళ్లు, ప్రత్యహమ్=ప్రతిదినమును, ఆమభైక్షమ్= అపక్వతండులాదిభిక్షనే, ఆచరేత్= ఎత్తవలెను (అటుపిమ్మట అనగా నాల్గవరోజునుండి స్నాతపక్వాన్నమునే భిక్షమెత్తుకొనవలెను.

ముపాసీత| తదనంతరముభయసంధ్యయో రగ్నికార్యం కుర్యాత్ I ఉపనీతస్త్ర్యహం క్షారలవణవర్జం భుంజీత|త్రీణ్యహాని ప్రత్యహమామభైక్షమాచరేత్| మంత్రవద్ధృతమేవ వస్త్రం ధారయేత్| [314]చతుర్థేఽహని తద్విస్రస్య, అన్యద్వస్త్రం పరిధాయ, 'గురో వాసస్తే దదామి' ఇతి పూర్వధృతవస్త్రమాచార్యాయ దద్యాత్| అథాచార్య స్సప్తదశకృత్వో పాస్య, ఉత్తరయా తత్ప్రతిగృహ్ణీయాత్|

*మం// యస్యతే ప్రథమ వాస్యగ్ం హరామస్తం త్వా విశ్వే అవన్తు దేవాః/ తం త్వా భ్రాతర స్సువృధో వర్ధమానమను జాయన్తాం బహవస్సుజాతమ్//* (త్తై.మం.పా.2.6)

## పాలాశకర్మ

[315]చతుర్థేహని కేచిత్పాలాశం కర్మ కుర్వన్తి| చతుర్థేహని పూర్వాహ్ణే స్నాత్వాచమ్య,

---

ఇట్లు శాస్త్రమున్నను, ఈకాలములో మొదటిరోజు తర్వాత ఎవ్వరూ భిక్షమెత్తుకొనుట లేదు); మన్త్రవద్ధృతమేవ=(ఆమూడురోజులు) మంత్రయుక్తముగా ఉపనయనములో కట్టింపబడిన వస్త్రమునే, ధారయేత్=ధరింపవలెను;

[314]చతుర్థేఽహని=నాల్గవనాడు, అన్యద్వస్త్రం=వేరొకవస్త్రమును, పరిధాయ=ధరించి, 'గురో వాసస్తే దదామి' ఇతి='గురో వాసస్తే దదామి' అని చెప్పుచు, ఆచార్యాయ=ఆచార్యునికి, పూర్వధృతవస్త్రం=పూర్వధృత దీక్షావస్త్రమును, దద్యాత్=ఈయవలెను; అథ=అప్పుడు, ఆచార్యః =ఆచార్యుడు, సప్తదశకృత్వోపాస్య=17సార్లు ప్రణవమును జపించి, ఉత్తరయా = తర్వాతి 'యస్యతే ప్రథమ వాస్యగ్ం' అను మంత్రముతో, తత్=ఆవస్త్రమును, ప్రతిగృహ్ణీయాత్ = తీసికొనవలెను. అనగా పూర్వధృతవస్త్రమును తాంబూలాదులతోసహ వటు వొకతట్టలోనుంచి, 'గురో వాసస్తే దదామి' అని దానిని గురువున కిచ్చి నమస్కరింపవలెను. అప్పు డా గురువు, 17 సార్లు ఓంకారమును జపించి, 'యస్యతే ప్రథమ వాస్యగ్ం' అను మంత్రమును చెప్పి దానిని తీసికొనవలెను. సూచన: కొందరీ కార్యక్రమమును నాల్గవదినమున (తరువాత చెప్పబడిన) పాలాశ కర్మలో నంతర్భాగముగ చేయుచున్నారు.

[315] చతుర్థేహని=నాల్గవనాడు, కేచిత్=కొందరు,పాలాశం కర్మ=పాలాశకర్మను, కుర్వన్తి= చేయుచున్నారు; చతుర్థేహని=నాల్గవనాడు, పూర్వాహ్ణే =ఉదయముననే, స్నాత్వా=తల స్నానమును చేసి, ఆచమ్య=ఆచమించి, సంధ్యావన్దనాగ్నికార్యాదికం =సంధ్యావందనమును,

సంధ్యావన్దనాగ్ని కార్యాదికం కృత్వా, పురా త్రీణ్యహని సమీకృత భిక్షాతండులానాం ఉపనయనాగ్నౌ స్థాలీపాకం పక్త్వా, ప్రతిష్ఠితాభిఘారణాంతం కుర్యాత్।[316]ఆచార్యః వటునా సహ ప్రాచీముదీచీం వా దిశ ముపనిష్క్రమ్య, పాలాశస్యాథస్తాత్పూర్వేణోత్త రేణ వా త్రీణి స్థండిలా న్యుదగపవర్గం కల్పయిత్వా, విష్వక్సేనపూజాం, కర్మణః పుణ్యాహవాచనం చ కృత్వా, స్థండిలేషు క్రమశః ప్రణవశ్రద్ధామేధాదేవతామావాహ్య, షోడశోపచారపూజాం స్థాలీపాకాన్న నివేదనయుతం కృత్వా, తైస్తైర్మన్త్రైరుపతిష్ఠేత్।

---

సమిధాధానమును, కృత్వా= చేసి, పురా త్రీణ్యహని =మునుపటి మూడురోజులు, సమీకృత = సేకరించిన, భిక్షాతండులానాం=భిక్షారూపకమైన బియ్యమును, ఉపనయనాగ్నౌ=ఉపనయ నాగ్నిలో, స్థాలీపాకం=స్థాలీపాకం, పక్త్వా=వండి, ప్రతిష్ఠితాభిఘారణాంతం= దానిని ప్రక్కకు దించి, అభిఘరించుటవఱకు, కుర్యాత్=చేయవలెను. అనగా అగ్నిపై నుండగనే అన్న మును లౌకికాజ్యముతో నభిఘరించి, అగ్నికి ఉత్తరమున పూర్వాగ్రముగా దర్భలనువేసి, ఆదర్భ లపై ఆ అన్న స్థాలీ నుంచి, దానిని మఱొకసారి లౌకికాజ్యముతో నభిఘారము చేయవలెను.

[316] ఆస్థాలీపాకమును తీసికొని, ఆచార్యః =ఆచార్యుడు, వటునా సహ=వటువుతో సహ, ప్రాచీ ముదీచీం వా దిశం=ఊరికి తూర్పు లేక ఉత్తరదిశకు, ఉపనిష్క్రమ్య=బయలుదేఱి, పాలాశ స్యాథస్తాత్ = ఒక మోదుగుచెట్టు క్రింద, పూర్వేణోత్త రేణ వా = తూర్పునందు గాని, ఉత్తర మందుగాని, త్రీణి స్థండిలాని=మూడు స్థండిలములను, ఉదగపవర్గం=ఉత్తరమున కంతమగు నట్లుగా, కల్పయిత్వా=కల్పించి, విష్వక్సేనపూజాం=విష్వక్సేనపూజను,కర్మణః పుణ్యాహ వాచనం చ=కర్మణః పుణ్యాహవాచనమును, కృత్వా=చేసి, స్థండిలేషు=ఆమూడు స్థండిలము లందు, క్రమశః =క్రమముగా, ప్రణవశ్రద్ధామేధాదేవతాం=ప్రణవశ్రద్ధామేధాదేవతలను, ఆవాహ్య =ఆవాహనము చేసి, షోడశోపచారపూజాం=(విష్వక్సేనారాధనలోవలె) షోడశోపచారపూజ, స్థాలీపాకాన్న నివేదనయుక్తం = స్థాలీపాకాన్న మును నివేదన చేయుచు, కృత్వా=చేసి, తైస్తై ర్మంత్రైః= ఆయా దేవతలకు గల మంత్రములతో (ఇవి ముందీయబడినవి), ఉపతిష్ఠేత్= ఉప స్థానమును చేయవలెను. లౌకికపద్ధతి: ఊరికి బయట నున్న మోదుగుచెట్టు క్రింద ఇది చేయుట కష్టము గనుక, ఉపనయనాగ్నికి ఉత్తరమున ఒక మోదుగకొమ్మను పాతి, దానివద్ద ఈకర్మను చేయుట జరుగుచున్నది.

## పాలాశకర్మసంకల్పః, విష్వక్సేనపూజనం చ

[317]ఆచార్యః దర్భేష్వాసీనః, ఆచమ్య, పవిత్రపాణిః, దర్భాన్ ధారయమాణః, ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాన్తయే//*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్/*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే//*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్/*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవ స్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ---వాసరే--- నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయా*

---

[317]పైవిధముగా స్థండిలకల్పనము చేసి, ఆచార్యుడు ఉత్తరాగ్రపుదర్భలపై ప్రాఙ్ముఖముగా కూర్చొని, తన కుడికి వటువు నట్లే కూర్చుండబెట్టి, ఆచమించి, ప్రాణాయామము చేసి, 'శుక్లాం బరధరం విష్ణుం' నుండి మొదలిడి 'విష్వక్సేనారాధనం కరిష్యే' వరకు సంకల్పమును చెప్ప వలెను. గీతలుంచిన స్థలములలో కావలసిన అయన ఋతు తిథి వార నక్షత్రముల పేర్లు చెప్పు కొనవలెను. ---శర్మణః అని ఉన్నచోట గీతలకు బదులు కుమారుని పేరును చెప్పవలెను. సంకల్పానంతరము 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి, తదుపరి విష్వక్సేనా రాధనను చేయవలెను.

*మస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం అస్య---శర్మణః కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం ప్రణవశ్రద్ధామేధాజనన సిద్ధ్యర్థం పాలాశకర్మ కరిష్యే/ తత్కర్మ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనా రాధనం కరిష్యే* - ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః/*

*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్//*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, పూర్వోక్తప్రకారేణ విష్వక్సేనారాధనం కుర్యాత్.

## కర్మణః పుణ్యాహవాచనమ్

[318]ఆచార్యః, ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ పాలాశకర్మాంగత్వేన మహాజనైస్సహ కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే*' – ఇతి సంకల్ప్య కర్మణః పుణ్యాహవాచనం కుర్యాత్.

[319]తతో వటుః ప్రాఙ్ముఖ ఉపవిశ్య తేషు స్థండిలేషు ప్రణవం, శ్రద్ధాం, మేధాం చావాహ్య, తేభ్యః అర్ఘ్య పాద్యాచమన స్నాన వస్త్ర గంధ మాల్య ధూప దీపాంతం విధివదభ్యర్చ్య, స్థాలీపాకాన్నం నివేదనం కృత్వోపతిష్ఠేత్।

---

[318] ఆచార్యుడు మఱల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ పాలాశకర్మాంగత్వేన మహాజనైస్సహ కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే*' అని సంకల్పించి, 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా కర్మణః పుణ్యాహ వాచనము చేయవలెను.

[319] ఆతర్వాత వటువు తూర్పునకు మళ్లి, ఆ స్థండిలములపై వరుసగా విస్తరాకులను గాని, వెండి లేక రాగి తట్టలనుంచి, వానిపై బియ్యమును పోసి చదునుగా నెఱపి, ఆ బియ్యముపై రెండు తమలపాకులను పూర్వాగ్రముగా వేసి, అందులో పూర్వాగ్రముగ ఆయామతముల నుంచి, ఈ ఆయామతములనే ప్రణవ, శ్రద్ధా, మేధా దేవతారూపముగా నెంచుచు, విష్వక్సేనారాధనలోవలె వానికి ఆవాహనాదిషోడశోపచారములు చేసి, స్థాలీపాకాన్నమును నివేదన చేసి, లేచి నిలబడి, ఆయాదేవతలకు క్రింద నిచ్చిన మంత్రములతో ఉపస్థానము చేయవలెను. ఈక్రమమెల్లను వటువునకు తెలియదు గనుక ఆచార్యుడతనిచే మంత్రములను చెప్పించుచు చేయించవలెను.

## ప్రణవాఽఽవాహనం పూజనం చ

'*ప్రణవమావాహయామి/స్థాపయామి/పూజయామి/*'

- ఇతి ప్రణవమావాహ్య, విష్వక్సేనారాధనవత్ షోడశోపచారపూజాం కృత్వా, నివేదన కాలే స్థాలీపాకాన్నం నివేద్యోత్తరై ర్మంత్రై రుపతిష్ఠతి।

*మం// యశ్ఛన్దసామృషభో విశ్వరూపః/ ఛన్దోభ్యో ఽధ్యమృతాథ్సంబభూవ/ స మేంద్రో మేధయా స్పృణోతు/ అమృతస్య దేవ ధారణో భూయాసమ్/ శరీరం మే విచర్-షణమ్/ జిహ్వా మే మధుమత్తమా/ కర్ణాభ్యాం భూరి విశ్రువమ్/ బ్రహ్మణః కోశోఽసి మేధయాఽపిహితః/ శ్రుతం మే గోపాయ/* (తై.ఉపని.1.5.9)

## శ్రద్ధాఽఽవాహనం పూజనం చ

'*శ్రద్ధామావాహయామి/స్థాపయామి/పూజయామి/*'

- ఇతి శ్రద్ధామావాహ్య, విష్వక్సేనారాధనవత్ షోడశోపచారపూజాం కృత్వా,

నివేదనకాలే స్థాలీపాకాన్నం నివేద్యోత్తరై ర్మంత్రై రుపతిష్ఠతి।

*మం// శ్రద్ధయాఽగ్ని స్సమిధ్యతే/ శ్రద్ధయా విన్దతే హవిః/ శ్రద్ధాం భగస్య మూర్ధని/ వచసా వేదయామసి/ ప్రియగ్గ్ శ్రద్ధే దదతః/ ప్రియగ్గ్ శ్రద్ధే దిదాసతః/ ప్రియం భోజేషు యజ్వసు/ ఇదం మ ఉదితం కృధి/ యథా దేవా అసురేషు/ శ్రద్ధాముగ్రేషు చక్రిరే/ ఏవం భోజేషు యజ్వసు/ అస్మాకముదితం కృధి/ శ్రద్ధాం దేవా యజమానాః/ వాయుగోపా ఉపాసతే/ శ్రద్ధాగ్ం హృదయ్యయా ఽఽకూత్యా/ శ్రద్ధయా హూయతే హవిః/ శ్రద్ధాం ప్రాతర్హవామహే/ శ్రద్ధాం మధ్యం దినం పరి/ శ్రద్ధాగ్ం సూర్యస్య నిమ్రుచి/ శ్రద్ధే శ్రద్ధాపయేహ మా/ శ్రద్ధా దేవా నధివస్తే/ శ్రద్ధా విశ్వమిదం జగత్/ శ్రద్ధాం కామస్య మాతరమ్/ హవిషా వర్ధయామసి//* (తై.బ్రా.2.8.8)

## మేధాఽఽవాహనం పూజనం చ

'*మేధామావాహయామి/స్థాపయామి/పూజయామి/*'

- ఇతి మేధామావాహ్య, విష్వక్సేనారాధనవత్ షోడశోపచారపూజాం కృత్వా,

నివేదనకాలే స్థాలీపాకాన్నం నివేద్యోత్తరై ర్మంత్రై రుపతిష్ఠతి।

*మం॥ మేధా దేవీ జుషమాణా న ఆగాద్విశ్వాచీ భద్రా సుమనస్యమానా। త్వయా జుష్టా నుదమానా దురుక్తాన్బృహద్వదేమ విదథే సువీరాః। త్వయా జుష్ట ఋషిర్భవతి దేవి త్వయా బ్రహ్మా గతశ్రీరుత త్వయా। త్వయా జుష్టశ్చిత్రం విన్దతే వసు సా నో జుషస్వ ద్రవిణో న మేధే। మేధాం మ ఇన్ద్రో దదాతు మేధాం దేవీ సరస్వతీ। మేధాం మే అశ్వినావుభా వాధత్తాం పుష్కరస్రజా। అప్సరాసు యా మేధా గన్ధర్వేషు చ యన్మనః। దైవీం మేధా సరస్వతీ సా మాం మేధా సురభిర్జుషతాగ్ం స్వాహా। ఆ మాం మేధా సురభిర్విశ్వరూపా హిరణ్యవర్ణా జగతీ జగమ్యా। ఊర్జస్వతీ పయసా పిన్వమానా సా మాం మేధా సుప్రతీకా జుషతామ్। మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు మయి మేధాం మయి ప్రజాం మయీన్ద్ర ఇన్ద్రియం దధాతు మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు॥* (తై.ఆ.6.42)

## నూత్నమేఖలావస్త్రదండధారణమ్

శ్లో॥ మేఖలామజినం దండం పాలాశాగ్రే వినిక్షిపేత్।
తద్వాసో గురవే దద్యాద్వటు రన్యాని ధారయేత్।

[320]తతో వటుః పలాశమూలే పూర్వధృత దండ,వస్త్ర,మేఖలాన్ విసృజ్య, తైస్తై ర్మంత్రైః పూర్వోక్తవిధినా నూతన దండ,వస్త్ర,మేఖలాని ధృత్వా, '*గురో వాసస్తే దదామి*' ఇతి

---

[320] తరువాత వటువు ఇంతవరకు ధరించిన దండమును, వస్త్రములను, మేఖలను ఆ మోదుగు చెట్టు మొదట త్యజించి, వాని స్థానములో నూతన దండ,వస్త్ర,మేఖలలను ఉపనయనములో ధరించినట్లుగనే, అవే మంత్రముల నాచార్యుడు చెప్పుచుండగా ధరించి, తాను ముందు ధరించిన వస్త్రమును 'గురో వాసస్తే దదామి' అని చెప్పుచు గురువున కిచ్చి నమస్కరింపవలెను. అప్పుడా గురువు 17సార్లు ఓంకారమును జపించి, 'యస్యతే ప్రథమ వాస్యగ్ం' అను మంత్రమును చెప్పి దానిని తీసికొనవలెను. తరువాత బ్రాహ్మణులకు త్రిమధురము, అనగా పెరుగు, తేనె, శర్కరలతో గూడిన భోజనసంతర్పణము చేసి, గురువుతో సహ వటువు ఇంటికి తిరిగి రావలెను (ఇంటి యందే మోదుగుకొమ్మను పాతి పాలాశకర్మను చేయునెడ తిరిగివచ్చుఅవసరముండ దనుట

పూర్వధృతవస్త్ర మాచార్యాయ దద్యాత్। అథాచార్య స్సప్తదశకృత్వోపాస్య, 'యస్య తే ప్రథమవాస్యగ్ం' ఇతి తత్ప్రతిగృహ్ణీయాత్।

*మం॥ యస్య తే ప్రథమ వాస్యగ్ం హరామస్తం త్వా విశ్వే అవన్తు దేవాః। తం త్వా భ్రాతర-స్సువృధో వర్ధమానమను జాయన్తాం బహవస్సుజాతమ్॥* (తై.మం.పా.2.6)

తతః త్రిమధురేణ బ్రాహ్మణాన్భోజయిత్వా సహాచార్యో గృహమాగచ్ఛేత్।

## దీక్షాగ్న్యుద్వాసనమ్

*మం॥ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః। తాని ధర్మాణి ప్రథమాన్యాసన్। తే హ నాకం మహిమానస్సచన్తే। యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః।*

[321]ఇతి దీక్షాగ్నిముద్వాస్య, '*శోభనకాలే పునరాగమనాయ చ*' - ఇత్యగ్నేః పశ్చాత్ హరిద్రాక్షతాన్ నిధాయ నమస్కుర్యాత్।

తతో యజమానః సదస్యేభ్యః యథాశక్తి ఫలదక్షిణాసహితతాంబూలసత్కారం కారయేత్। సుమంగళీః మంగళారాత్రికం, బ్రాహ్మణాః వేదమంత్రాశీర్వచనం కుర్యుః।

## వటో రాశీర్వాదమన్త్రాః

*హరిః ఓమ్। అగ్నే తేజస్విన్। తేజస్వీత్వన్తేజస్వీ। తేజస్వీ త్వమ్। త్వం దేవేషు। దేవేషు భూయాః। భూయాస్తేజస్వన్తమ్। తేజస్వన్తం మామ్। మామాయుష్మన్తమ్। ఆయు-*

---

స్పష్టము). ఇచ్చట పూర్వధృతమేఖలాదండాదివిసర్జనకు ముందుగా కొందఱు షట్పాత్రప్రయోగము ప్రకారము ఆజ్యభాగాంతము చేసి, 'యశ్ఛందసా' ది మంత్రములతో ప్రధానహోమము చేసి, జయాద్యగ్న్యుపస్థానాంతము చేసి, ఆపైని మేఖలాదులను త్యజించుచున్నారు. కాని ఈకాలములో పలువురట్లు చేయకుండుటచే, ఆ హోమభాగ మిక్కడ చెప్పలేదు.

[321] ఇట్లు నూతనమౌంజీదండాదులను ధరించిన పిమ్మట, వటువు కడచిన మూడురోజులపాటు రక్షించుకొన్న ఉపనయాగ్నిని (ఇదియే దీక్షాగ్ని) ఉద్వాసన చేయవలెను.దీనికై వటువు తూర్పు ముఖముగా నుండి, ఒక సమిధను తీసికొని, 'యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః' అను మంత్రమును చెప్పుచు, ఆ సమిధతో అగ్నిని కొంచెము తూర్పునకు త్రోసి ఉద్వాసన చేసి, హరిద్రాక్షతలు ఆ అగ్నికి పడమట నుంచుచు 'శోభనకాలే పునరాగమనాయ చ' అని చెప్పి నమస్కరింపవలెను.

ష్మన్తం వర్చస్వన్తమ్/వర్చస్వన్తం మనుష్యేషు/మనుష్యేషు కురు/కురు దీక్షాయై/
దీక్షాయై చ/చత్వా/త్వాతపసః/తపసశ్చ/చ తేజసే/తేజసే జుహోమి/జుహోమి తేజో-
విత్/తేజోవిదసి/తేజోవిదితి తేజః-విత్/అసి తేజః/తేజో మా/ మా మా/మా హాసీత్/
హాసీన్మా/మాఽహమ్/అహం తేజః/తేజో హాసిషమ్/హాసిషం మా/మామామ్/మాం
తేజః/తేజో హాసీత్/హాసీదిన్ద్ర/ఇన్ద్రౌజస్విన్/ఓజస్విన్నోజస్వీ/ఓజస్వీ త్వమ్/త్వం
దేవేషు/దేవేషు భూయాః/భూయా ఓజస్వన్తమ్/ఓజస్వన్తం మామ్/మామాయు-
ష్మన్తమ్/ఆయుష్మన్తమ్ వర్చస్వన్తమ్/వర్చస్వన్తం మనుష్యేషు/మనుష్యేషు కురు/
కురు బ్రహ్మణః/బ్రహ్మణశ్చ/చ త్వా/త్వా క్షత్రస్య/క్షత్రస్య చ/చౌజసే//౧// ఓజసే
జుహోమి/జుహోమ్యోజోవిత్/ఓజోవిదసి/ఓజోవిదిత్యోజః-విత్/అస్యోజః/ఓజో మా/
మా మా/మా హాసీత్/హాసీన్మా/మాఽహమ్/అహమోజః/ఓజో హాసిషమ్/హాసిషం
మా/మామామ్/మామోజః/ఓజో హాసీత్/హాసీత్సూర్య/సూర్య భ్రాజస్విన్/భ్రాజస్వి-
న్భ్రాజస్వీ/భ్రాజస్వీ త్వమ్/త్వం దేవేషు/దేవేషు భూయాః/భూయా భ్రాజస్వన్తమ్/
భ్రాజస్వన్తం మామ్/మామాయుష్మన్తమ్/ఆయుష్మన్తం వర్చస్వన్తమ్/వర్చస్వన్తం
మనుష్యేషు/మనుష్యేషు కురు/కురు వాయోః/వాయోశ్చ/చ త్వా/త్వాఽపామ్/
అపాం చ/ చ భ్రాజసే/భ్రాజసే జుహోమి/ జుహోమి సువర్విత్/సువర్విదసి/సువర్విదితి
సువః-విత్/అసి సువః/సువర్మా/మా మా/మా హాసీత్/హాసీన్మా/మాఽహమ్/
అహగ్ం సువః/ సువర్ హాసిషమ్/హాసిషం మా/మామామ్/మాగ్ం సువః/ సువర్
హాసీత్/హాసీన్మయి/మయి మేధామ్/మేధాం మయి /మయి ప్రజామ్/ప్రజాం మయి /
ప్రజామితి ప్ర-జామ్/మయ్యగ్నిః/అగ్నిస్తేజః/తేజో దధాతు/దధాతు మయి /మయి
మేధామ్/మేధాం మయి /మయి ప్రజామ్/ప్రజాం మయి /ప్రజామితి ప్ర-జామ్/
మయీన్ద్రః/ఇన్ద్ర ఇన్ద్రియమ్/ఇన్ద్రియం దధాతు/దధాతు మయి /మయి మేధామ్/
మేధాం మయి /మయి ప్రజామ్/ప్రజాం మయి /ప్రజామితి ప్ర-జామ్/మయి సూర్యః/
సూర్యో భ్రాజః/భ్రాజో దధాతు/దధాత్వితి దధాతు//౨//(తై.సం.3.3.1)

*పది॥ మేధా దేవీ జుషమాణా న ఆగాద్విశ్వాచీ భద్రా సుమనస్యమానా। త్వయా జుష్టా జుషమాణా దురుక్తాన్బృహద్వదేమ విదథే సువీరాః। త్వయా జుష్ట ఋషిర్భవతి దేవి త్వయా బ్రహ్మా గతశ్రీరుత త్వయా। త్వయా జుష్టశ్చిత్రం విన్దతే వసు సా నో జుషస్వ ద్రవిణో న మేధే। మేధాం మ ఇన్ద్రో దదాతు మేధాం దేవీ సరస్వతీ। మేధాం మే అశ్వినా-వుభా వాధత్తాం పుష్కరస్రజా। అప్సరాసు చ యా మేధా గన్ధర్వేషు చ యన్మనః। దైవీం మేధా సరస్వతీ సా మాం మేధా సురభిర్జుషతామ్ । ఆ మాం మేధా సురభిర్విశ్వరూపా హిరణ్యవర్ణా జగతీ జగమ్యా। ఊర్జస్వతీ పయసా పిన్వమానా సా మాం మేధా సుప్ర-తీకా జుషతామ్। మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు మయి మేధాం మయి ప్రజాం మయీన్ద్ర ఇన్ద్రియం దధాతు మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు॥* (తై.ఆ.6.42)

## (తథాస్తువచనాని)

*1.అనేన యజమానేన కృతశుభోపనయనముహూర్తస్సుముహూర్తో భూయాదితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు॥*

*2. అద్యానుష్ఠితోపనయనకర్మణి యజమానవాఙ్మనఃకర్మ జనితమంత్రతంత్రద్రవ్య విపర్యయాః సాధుమత్తరాస్సమగ్రాస్సన్త్వితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు॥*

*3.అయం వటుః మధురకంఠస్వరాధీత ఋగ్యజుస్సామాథర్వణ సంహితా బ్రాహ్మణ వేద వేదాఙ్గ సకలవిద్యా పారగ్ఞతో భూయాదితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు॥*

*4. అస్య వటోః ప్రణవశ్రద్ధామేధాప్రజ్ఞా ధారణాసిద్ధిర్భూయాదితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు।*

*5. అస్య వటోరనవద్యగద్యపద్యహృద్యవరవిద్యావైశద్యబుద్ధిర్భూయాదితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు॥*

*6. అస్య వటోశ్శమ దమ తప శ్శౌచ శాన్తి జ్ఞానార్జవాస్తిక్యాది నిత్యాత్మగుణసమృద్ధిర్భూయాదితి భవన్తః శ్రీమన్తో మహాన్తోఽను గృహ్ణన్తు॥ తథాస్తు॥*

# సంధ్యావన్దనమ్

ఉపనయనమైనది మొదలుకొని మరణాంతమువఱకు ఉపనయనార్హులైన త్రివర్ణ ముల వారును ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములందు సంధ్యావందనము నాచరింప వలెను. బ్రాహ్మణుడైన వానికి అన్ని కర్మలకంటెను సంధ్యావందనము ప్రధానమైనది. అందుచే దీనిని విడువకుండ ఆచరింపవలెను.

శ్లో॥ విప్రో వృక్ష స్తస్య మూలం హి సంధ్యా, వేద శ్శాఖా ధర్మకర్మాణి పర్ణాః।
తస్మా న్మూలం యత్నతో రక్షణీయం, ఛిన్నే మూలే నైవ శాఖా న పర్ణాః॥

పైశ్లోకము సంధ్యావందనముయొక్క ఆవశ్యకత నద్వితీయముగా చాటుచున్నది. బ్రాహ్మణుడు చెట్టువంటివాడు. ఆ చెట్టునకు మూలము సంధ్యావందనము, కొమ్మలు వేదము, ఆకులు ధర్మాచరణము. మూలమే నష్టమైన ఇక కొమ్మలు, ఆకు లెట్లు వర్ధి ల్లును? అందుచే బ్రాహ్మణునికి మూలభూతమైన సంధ్యావందనక్రియను సప్రయత్న ముగా సంరక్షించుకొనవలెను. అందుచేత బ్రాహ్మణుడైన వాడు సంధ్యావందనమును తప్పకుండ ఆచరింపవలెనని ఈశ్లోకముయొక్క తాత్పర్యము.

ప్రాతస్సంధ్యావందనమును సూర్యోదయాత్పూర్వము గాయత్రీజపమువఱకు చేసి, సూర్యోదయానంతరము ఉపస్థానమును చేయవలెను. మాధ్యాహ్నికమును అభిజిత్కాలము, అనగా మధ్యాహ్నము 12 గంటలకు చేయవలెను. సాయంసంధ్యా వందనమును సూర్యాస్తమయాత్పూర్వము గాయత్రీజపమువఱకు చేసి,నక్షత్రోదయా నంతరము ఉపస్థానమును చేయవలెను. సంధ్యావందనము నెప్పుడును స్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, ఊర్ధ్వపుండ్రములను ధరించి, శుచియై చేయవలెను.

సంధ్యావందనములో అర్ఘ్యప్రదానము, ఉపస్థానములను మాత్రము నిలబడి చేయ వలెను.మిగిలిన ఆచమన, మార్జన, ప్రాణాయామ, సంకల్ప, కేశవాదిద్వాదశనామజల తర్పణ, గాయత్రీమంత్రజప, జలప్రాశనాదు లన్నియు కూర్చుండియే చేయవలెను. ఆచమనము నెప్పుడును నిలుచుండి చేయరాదు. ప్రాతస్సంధ్యావందనము నంతయు తూర్పుముఖముగానే చేయవలెను. మధ్యాహ్న, సాయంసంధ్యలయందు గాయత్రీ మంత్రజపారంభమువఱకు తూర్పుముఖముగా చేసి, అర్ఘ్యప్రదాన, గాయత్రీమంత్రోప

స్థానములను పశ్చిమముఖముగా చేయవలెను. అనగా అర్ఘ్యప్రదానమును, ఉపస్థానమును సూర్యుని కభిముఖముగా నిలబడి చేయవలెనని తాత్పర్యము. గాయత్రీమంత్రమును జపించునప్పుడు జపసంఖ్యను కుడిచేతి వ్రేళ్లకణుపులపై లెక్కించుచు, పదులను ఎడమచేతివ్రేళ్లకణుపులపై గుర్తుపెట్టుకొనవలెను. లేదా కుడిచేతిలో జపమాలను పట్టుకొని జపించవచ్చును. ఈ అధ్యాయములో యజుశ్శాఖాధ్యాయులును, ఆపస్తంబసూత్రీకులును నగు శ్రీవైష్ణవుల సంధ్యావందనక్రమము చెప్పబడినది. ఇందును కొన్ని ప్రాంతీయభేదము లుండవచ్చును. ఐనను ఇచ్చట మాపూర్వీకులనుండి సంక్రమించుచున్న పద్ధతి చెప్పబడినది. గమనిక: ఇక్కడ నిచ్చిన ప్రయోగములో మూడు సంధ్యలకును వర్తించు విధముగా బ్రాకెట్లలో (ప్రాతస్సంధ్యాయాం) (మాధ్యాహ్నికసంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) – ఇత్యాదిగా నీయబడినవి. ఈ మూడుపదములలో నొక దానినే ప్రాత,ర్మాధ్యాహ్నిక,సాయం సంధ్యావందనములకు యథావసరముగా అనువర్తింపజేసికొనుచు సంకల్పాదులను చెప్పుకొనవలెను.

## త్రికాలవైష్ణవసంధ్యావన్దనవిధిః

[322]కర్తా స్నాత్వా, ధౌతవస్త్రాణి, ఊర్ధ్వపుండ్రాని చ ధృత్వా, ఆచమ్య,

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా।

యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః।

ఇతి శిరసి ప్రోక్ష్య, పునరాచమ్య,

---

[322] కర్త స్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, ఊర్ధ్వపుండ్రములు పెట్టుకొని, తూర్పునకు మళ్లి, ఎడమచేతిలో నీటిచెంబునుపట్టుకొని, కుక్కుటాసనముతో కూర్చుండి, మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా ఆచమనము చేసి, 'అపవిత్రః పవిత్రో వా' అను శ్లోకమును చెప్పుచు, చెంబులోని జలమును కుడిచేతి బొటనవ్రేలితో తలపై ప్రోక్షించుకొని, మఱల ఆచమనము చేయవలెను. ఆచమనము నెప్పుడును కూర్చుండియే చేయవలెను. ఆ తర్వాత మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా, కుడిచేతి బొటనవ్రేలు, చిటికెనవ్రేలు, ఉంగరపువ్రేళ్లతో ముక్కును పట్టుకొని ప్రాణాయామమంత్రమును జపించుచు ప్రాణాయామము చేయవలెను. 'ప్రాణానాయమ్య' అన్నప్పుడెల్ల ఇట్లే చేయవలెను.

## ప్రాణాయామమంత్రః

*ఓం భూః। ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యమ్ । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్। ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥* (తై.ఆ.6.28)

ఇతి ప్రాణానాయమ్య,

## సంకల్పః

*'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం (ప్రాతస్సంధ్యావన్దన )(మాధ్యాహ్నిక సంధ్యావన్దన) (సాయం సంధ్యావన్దన) ముపాసిష్యే'* – [323]ఇతి సంకల్ప్య,

## మార్జనమంత్రః

[324] *మం॥ ఓం ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే। యో వశ్శివతమో రసస్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః। ఓం భూర్భువస్సువః॥*

---

[323] తరువాత తన కుడితొడమీద ఎడమ అరచేతిని వెల్లకిల తెరచి యుంచి, కుడిచేతి బొటనవ్రేలు చూపుడువ్రేళ్లకు మధ్య యజ్ఞోపవీతమును పట్టుకొని, ఆ కుడిచేతిని ఎడమచేతిపై అడ్డముగా బోర్లించి యుంచి, 'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం (ప్రాతస్సంధ్యావన్దన) (మాధ్యాహ్నికసంధ్యావన్దన) (సాయంసంధ్యావన్దన) ముపాసిష్యే' అని యథావసరముగా బ్రాకెట్లో నిచ్చిన ఒకపదమును మాత్రమే ఎన్నుకొనుచు సంకల్పించవలెను. 'సంకల్ప్య' అన్నపుడెల్ల చేతుల నిట్లే ఉంచుకొని యథావసరముగా చేయబోవు కార్యమును చెప్పుకొనవలెను.

[324] తరువాత ఎడమచేతిలో నీటిచెంబునుపట్టుకొని, కుడిచేతి బొటనవ్రేలుతో 'ఆపో హిష్ఠా మయో భువః' అను మార్జనమంత్రమును చెప్పుచు తలపై ప్రోక్షించుకొనవలెను. కాని 'యస్య క్షయాయ జిన్వథ' అను వాక్యమును చెప్పినప్పుడు నీటిని శిరముపై గాక, కుడి, ఎడమ పాదములపైన ప్రోక్షించుకొని, తరువాతి 'ఆపో జనయథా చ నః' అను వాక్యమును చెప్పుచు నీటిని మరల తలపై ప్రోక్షించుకొని, చిట్టచివరి 'ఓం భూర్భువస్సువః' అను వాక్యమును చెప్పుచు కుడి అరచేతిలో నీటిని పోసికొని తలచుట్టును ప్రదక్షిణముగా త్రిప్పుచు వదలవలెను.

## జలప్రాశనమంత్రః (త్రై.ఆ.6.25,23,24)

[325] (ప్రాతస్సంధ్యాయాం) సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యు
కృతేభ్యః/పాపేభ్యో రక్షన్తామ్/ యద్రాత్రియా పాపమకార్షమ్/మనసా వాచా
హస్తాభ్యామ్/పద్భ్యాముదరేణ శిశ్నా/రాత్రిస్తదవలుమ్పతు/యత్కించ దురితం
మయి/ఇదమహం మామమృతయోనౌ/సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా//
(మధ్యాహ్నే) ఆపః పునన్తు పృథివీం పృథివీ పూతా పునాతు మామ్/పునన్తు బ్రహ్మణ
స్పతిర్బ్రహ్మ పూతా పునాతు మామ్/యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితం
మమ/సర్వం పునన్తు మామాపోఽసతాం చ ప్రతిగ్రహగ్ం స్వాహా//
(సాయం సంధ్యాయాం) అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యు
కృతేభ్యః/పాపేభ్యో రక్షన్తామ్/ యదహ్నా పాపమకార్షమ్/మనసా వాచా
హస్తాభ్యామ్/పద్భ్యాముదరేణ శిశ్నా/అహస్తదవలుమ్పతు/యత్కించ దురితం
మయి/ఇదమహం మామమృతయోనౌ/సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా//

## ద్వితీయమార్జనమంత్రః

[326]పునరాచమ్య,

మం// ఓం దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః/సురభి నో ముఖా కరత్ ప్రణ
ఆయూగ్ంషి తారిషత్/ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/మహే రణాయ

---

[325] తరువాత కుడి అరచేతిని గోకర్ణమువలె గుంతగా చేసి పట్టుకొని, ఎడమచేత చెంబులోని జలమునందులో పోసికొని, ప్రాతస్సంధ్యయందు 'సూర్యశ్చ మామన్యుశ్చ' అను మంత్రమును, మాధ్యాహ్నికమునందు 'ఆపః పునన్తు పృథివీం' అను మంత్రమును, సాయంసంధ్యయందు 'అగ్నిశ్చ మామన్యుశ్చ' అను మంత్రమును చెప్పి, ఆ నీటిని పూర్తిగా లోనికి పుచ్చుకొనవలెను. ఇట్లు త్రాగుటకే జలప్రాశన మనిపేరు.

[326] మరల ఆచమనము చేసి, చెంబులోని నీటిని 'ఓం దధిక్రావ్ణ్ణో అకారిషం' అను మంత్రముతో తలపై ప్రోక్షించుకొని, 'ఆపో హిష్ఠా' అను మంత్రమును చెప్పుచు మొదటివలెనే మార్జనము చేసికొనవలెను.

*చక్షసే। యో వశ్శివతమో రసస్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః। ఓం భూర్భువస్సువః॥*

## గాయత్రీమంత్రేణ అర్ఘ్యప్రదానమ్

[327] ప్రాణానాయమ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం (ప్రాత స్సంధ్యా-యాం ) (మాధ్యాహ్నిక సంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) అర్ఘ్యప్రదానం కరిష్యే*'–ఇతి సంకల్ప్య, ఉత్థాయ, సూర్యాభిముఖో భూత్వా, గాయత్ర్యాఽర్ఘ్యం దద్యాత్.

*మం॥ ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।*"

## కాలాతీతప్రాయశ్చిత్తార్ఘ్యప్రదానమ్

[328] కాలాతీతశ్చేత్, ప్రాణానాయమ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం*

---

[327] తరువాత ప్రాణాయామము చేసి, 'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం (ప్రాత స్సంధ్యాయాం) (మాధ్యాహ్నికసంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) అర్ఘ్యప్రదానం కరిష్యే' అని యథావసరముగా బ్రాకెట్లో నిచ్చిన ఒకపదమును మాత్రమే ఎన్నుకొనుచు సంక ల్పించి, లేచి నిలబడి సూర్యునివైపు (అనగా పూర్వాహ్ణమున తూర్పునకు, అపరాహ్ణమున పడమటికి) తిరిగి, ఎడమచేతి బొటనవ్రేలు, చూపుడువ్రేళ్లకుమధ్య నీటిచెంబును పట్టుకొని, కుడి చేతిని ఎడమచేతితో జోడించి దోసిలివలె చేసి, చెంబునువంచి, అందులోని జలమును దోసిలిలో పోసికొని, ఆదోసిలిని సూర్యునివైపు ఎత్తి చూపించుచు, గాయత్రీమంత్రమును పఠించి, దోసిటి లోని జలమును పరిశుద్ధమైన భూమిపై గాని, పాత్రలో గాని, జలములో గాని వదలవలెను. ప్రాత స్సాయంసంధ్యలయందు ఇట్లు మూడుసార్లు మంత్రము జపించి, మూడుసార్లు అర్ఘ్యము వదల వలెను. మాధ్యాహ్నికమందు ఒక్కసారి మంత్రము జపించి, ఒక్కసారి అర్ఘ్యము వదలవలెను.

[328] ఒకవేళ ప్రాతరర్ఘ్యమునకు ముందే సూర్యోదయమైనచో, మాధ్యాహ్నికము మధ్యాహ్నము రెండు గంటల తర్వాత చేసినచో, సాయంసంధ్యను సూర్యాస్తమయము తర్వాత చేసినచో, కాలాతీతదోషమునకై మఱియొక్క ప్రాయశ్చిత్తార్ఘ్యమును వదలవలెను. దీనికై కర్త ప్రాణాయా మమును చేసి, 'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం (ప్రాతస్సంధ్యా) (మాధ్యాహ్నిక

*(ప్రాతస్సంధ్యా) (మాధ్యాహ్నికసంధ్యా) (సాయంసంధ్యా) కాలాతీతదోషప్రాయశ్చి-త్తార్థం పునరర్ఘ్యప్రదానం కరిష్యే'* –ఇతి సంకల్ప్య, విశేషార్ఘ్యప్రదానం కుర్యాత్.

## జలతర్పణమ్

[329] అర్ఘ్యప్రదానానంతరం *'ఓం భూర్భువస్సువః। అసావాదిత్యో బ్రహ్మ।'* - ఇతి హస్తేన జలమాదాయ ప్రదక్షిణం కృత్వోపవిశ్యాఽచమేత్। తతః
*1.కేశవం తర్పయామి 2. నారాయణం తర్పయామి 3. మాధవం తర్పయామి 4. గోవిందం తర్పయామి 5. విష్ణుం తర్పయామి 6.మధుసూదనం తర్పయామి 7. త్రివిక్రమం తర్పయామి 8. వామనం తర్పయామి 9. శ్రీధరం తర్పయామి 10.హృషీకేశం తర్పయామి 11.పద్మనాభం తర్పయామి 12. దామోదరం తర్పయామి*

ఇతి జలతర్పణం కృత్వాఽచమ్య విరమేత్।

## జపప్రారంభః

[330] *శ్లో॥ అపసర్పన్తు యే భూతా యే భూతా భువి సంస్థితాః। యే భూతా విఘ్నకర్తారః తే గచ్ఛన్త్వాజ్ఞయా హరేః॥*

---

సంధ్యా) (సాయంసంధ్యా) కాలాతీతదోషప్రాయశ్చిత్తార్థం పునరర్ఘ్యప్రదానం కరిష్యే' - అని యథావసరముగా బ్రాకెట్లో నిచ్చిన ఒకపదమును మాత్రమే ఎన్నుకొనుచు సంకల్పించి, గాయత్రీమంత్రముతో మఱియొక అర్ఘ్యమును వదలవలెను. కాలాతీతము కానిచో దీనితో పని లేదు.

[329]అర్ఘ్యప్రదానానంతరం=పైవిధముగా అర్ఘ్య మొసగిన పిమ్మట, హస్తేన జలమాదాయ = కుడి చేతిలో నీటిని పోసికొని, *'ఓం భూర్భువస్సువః। అసావాదిత్యో బ్రహ్మ।'* ఇతి=*'ఓం భూర్భువస్సువః। అసావాదిత్యో బ్రహ్మ।'* అని చెప్పుచు, ప్రదక్షిణం కృత్వా= ప్రదక్షిణముగా తిరిగి, ఆ నీటిని తనచుట్టును త్రిప్పుకొని వదలిపెట్టి, ఉపవిశ్య=కూర్చొని, ఆచమేత్=ఆచమనము చేయవలెను.తతః=పిదప,జలతర్పణం కృత్వా=కేశవాదిద్వాదశనామాలతో పూర్వము అర్ఘ్యమిచ్చినట్లే దోసిటిలో నీరు పోసికొని 'తర్పయామి' అన్నప్పుడల్లా ఆనీటిని వదలుచు 12 జలతర్పణము లొసగి, ఆచమ్య=ఆచమనము చేసి, విరమేత్ =ముగించవలెను.

[330]తర్వాత పూర్వాహ్ణమున తూర్పునకును,మధ్యాహ్నసాయంకాలములందు పడమటికి మళ్ళి పద్మాసనము వేసి కూర్చొని గాయత్రీమంత్రజపమును చేయవలెను. 'అపసర్పన్తు' అను

ఇతి భూతోచ్చాటనం కృత్వా, జపస్థానం పవిత్రీకృత్య, తత్ర దర్భాసనే పీఠే వోపవేశ్య, *'ఓం ఆసనమంత్రస్య పృథివ్యాః మేరుపృష్ఠ ఋషిః'* - ఇతి శీర్షం, *'సుతలం ఛందః'* – ఇతి ముఖం, *'శ్రీకూర్మో దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా, *'ఆసనే వినియోగః'* - ఇత్యుక్త్వా,

*శ్లో॥ పృథ్వీ త్వయా ధృతా లోకా విష్ణునా త్వం పురా ధృతా।*
*త్వం చ ధారయ మాం దేవీ పవిత్రం కురుచాసనమ్॥*

ఇతి భూమిం ప్రార్థ్య, [331] ప్రాణానాయమ్య, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణ ప్రీత్యర్థం (ప్రాతస్సంధ్యాయాం) (మాధ్యాహ్నిక సంధ్యాయాం) (సాయం సంధ్యాయాం) గాయత్రీమహామంత్రజపం కరిష్యే'* –ఇతి సంకల్ప్య,
*'ఓం ప్రణవస్య ఋషిర్బ్రహ్మా'* - ఇతి శీర్షం, *'దేవీ గాయత్రీ ఛందః'* – ఇతి ముఖం, *'పరమాత్మా దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా,
[332] *'ఓం భూరాది సప్తవ్యాహృతీనాం అత్రి భృగు కుత్స వసిష్ఠ గౌతమ కాశ్యపాంగి-రస ఋషయః'*- ఇతి శీర్షం, *'గాయత్ర్యుష్ణిగనుష్టుప్-బృహతీ పంక్తి త్రిష్టుబ్జగత్య*

---

శ్లోకమును చెప్పి ముందుగా భూతోచ్చాటనము చేసి, జపస్థలమును శుద్ధిచేసి, అచ్చట నొక పీటను గాని, దర్భాసనమును గాని వేసికొని కూర్చొని, 'ఓం ఆసనమంత్రస్య పృథివ్యాః మేరు పృష్ఠ ఋషిః' అని చెప్పి తలను, 'సుతలం ఛందః' అని మూతిని, 'శ్రీకూర్మో దేవతా' అని యెదను కుడిచేతితో తాకి, 'ఆసనే వినియోగః' అని పలికి, చేతులు జోడించి 'పృథ్వీ త్వయా' అను శ్లోకమును చెప్పవలెను.

[331]తర్వాత ప్రాణానాయామము చేసి, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం (ప్రాత స్సంధ్యాయాం) (మాధ్యాహ్నికసంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) గాయత్రీమహామంత్ర జపం కరిష్యే'* – అని యథావసరముగా బ్రాకెట్లో నిచ్చిన ఒకపదమును మాత్రమే ఎన్నుకొనుచు సంకల్పించి, *'ఓం ప్రణవస్య ఋషిర్బ్రహ్మా'* - అని తలను, *'దేవీ గాయత్రీ ఛందః'* – అని మూతిని, *'పరమాత్మా దేవతా'* – అని యెదను కుడిచేతితో తాకవలెను.

[332]అట్లే *'ఓం భూరాది సప్తవ్యాహృతీనాం అత్రి భృగు కుత్స వసిష్ఠ గౌతమ కాశ్యపాంగిరస ఋషయః'*- అని తలను, *'గాయత్ర్యుష్ణిగనుష్టుప్-బృహతీ-పంక్తి- త్రిష్టుబ్జగత్యశ్ఛందాంసి'* –

*శ్ఛందాంసి'* – ఇతి ముఖం, '*అగ్ని వాయ్వర్క వాగీశ వరుణేంద్ర విశ్వేదేవా దేవతాః'* – ఇతి హృదయం స్పృష్ట్వా,

[333] '*సావిత్ర్యా ఋషిః విశ్వామిత్రః'* - ఇతి శీర్షం, '*దేవీ గాయత్రీ ఛందః'* – ఇతి ముఖం, '*సవితా దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా,

[334] '*గాయత్రీ శిరసో బ్రహ్మ ఋషిః'* - ఇతి శీర్షం, '*అనుష్టుప్ఛందః'* – ఇతి ముఖం, '*పరమాత్మా దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా, '*సర్వేషాం ప్రాణాయామే విని-యోగః'* – ఇత్యుక్త్వా, అంజలిబద్ధః 'అర్కమండలమధ్యస్థ' మితి ధ్యాత్వా దశవారం ప్రాణాయామమంత్రజపం కుర్యాత్.

*శ్లో॥ అర్క మండలమధ్యస్థం కోటిసూర్యసమప్రభం।*
*బ్రహ్మాది సేవ్య పాదాబ్జం నౌమి బ్రహ్మ రమాసఖమ్॥*

## గాయత్ర్యావాహనమ్

[335]పునః ప్రాణానాయమ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం (ప్రాత స్సంధ్యాయాం) (మాధ్యాహ్నికసంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) గాయత్ర్యా వాహనం కరిష్యే'* –ఇతి సంకల్ప్య,

---

అని మూతిని, '*అగ్ని వాయ్వర్క వాగీశవరుణేంద్రవిశ్వేదేవా దేవతాః'* – అని యెదను మఱల తాక వలెను.

[333]అట్లే '*సావిత్ర్యా ఋషిః విశ్వామిత్రః'*- అని తలను, '*దేవీ గాయత్రీ ఛందః'* – అని మూతిని, '*సవితా దేవతా'* – అని యెదను మఱల తాకవలెను.

[334] మఱల '*గాయత్రీ శిరసో బ్రహ్మ ఋషిః'*- అని తలను, '*అనుష్టుప్ఛందః'* – అని మూతిని, '*పరమాత్మా దేవతా'* – అని యెదను తాకి, '*సర్వేషాం ప్రాణాయామే వినియోగః'* – అని చెప్పి, అంజలిబద్ధుడై,'అర్కమండలమధ్యస్థ' మను శ్లోకమును చెప్పి,పదిసార్లు ప్రాణాయామ మంత్రమును జపించవలెను.

[335]మరల ప్రాణాయామము చేసి, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం (ప్రాత స్సంధ్యాయాం) (మాధ్యాహ్నికసంధ్యాయాం) (సాయంసంధ్యాయాం) గాయత్ర్యావాహనం*

'*ఆయాత్విత్యనువాకస్య వామదేవ ఋషిః*'- ఇతి శీర్షం, '*అనుష్టుప్ ఛందః*' – ఇతి ముఖం, '*గాయత్రీ దేవతా*' – ఇతి హృదయం స్పృష్ట్వా, '*గాయత్ర్యావాహనే విని యోగః*' -ఇత్యుక్త్వా,

'*ఆయాతు వరదా దేవ్యక్షరం బ్రహ్మసమ్మితమ్। గాయత్రీం ఛన్దసాం మాతేదం బ్రహ్మ జుషస్వ నః। ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి దేవానాం ధామ నామాసి విశ్వ-మసి విశ్వాయుస్సర్వమసి సర్వాయురభిభూరోం గాయత్రీమావాహయామి।, సావిత్రీమావాహయామి, సరస్వతీమావాహయామి।*' (తై.ఆ.6.26)

*శ్లో॥ ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై*
*ర్యుక్తా మిన్దు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్।*
*గాయత్రీం వరదాభయాంకుశకశాశ్శుభ్రం కపాలం గదాం*
*శంఖంచక్ర మథారవిన్దయుగళం హస్తైర్వహన్తీం భజే॥*

*శ్లో॥ యో దేవ స్సవితాఽస్మాకం ధియో ధర్మాది గోచరాః।*
*ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే॥*

[336]అథ '*గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః*' – ఇతి శీర్షం, '*దేవీ గాయత్రీ*

---

*కరిష్యే*' –అని సంకల్పించి, '*ఆయాత్విత్యనువాకస్య వామదేవ ఋషిః*'- అని తలను, '*అనుష్టుప్ ఛందః*' – అని మూతిని, '*గాయత్రీ దేవతా*' – అని యెదను తాకి, '*గాయత్ర్యా వాహనే వినియోగః*' – అని చెప్పి, '*ఆయాతు వరదా దేవీ*' అను మంత్రమును '*సర్వమసి సర్వాయుః*' అను వాక్యము వరకు చెప్పుచు దోసిలిని తన హృదయమువైపు పెట్టుకొని, '*అభి భూరోం గాయత్రీమావాహయామి।*' –అనుచు దోసిలిని అఱచేతులు ముందునకు వచ్చు నట్లుగా క్రిందివైపుగా త్రిప్పి గాయత్రీ నావాహనము చేసి, అట్లే దోసిలిని త్రిప్పుచు '*సావిత్రీమావా హయామి*' అని చెప్పుచు సావిత్రిని, '*సరస్వతీమావాహయామి*' అని చెప్పుచు సరస్వతిని ఆవాహనము చేసికొని, అంజలిబద్ధుడై, '*ముక్తావిద్రుమ*', '*యో దేవ స్సవితా*' అను శ్లోకము లతో ధ్యానింపవలెను.

[336]తర్వాత '*గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః*'- అని తలను, '*దేవీ గాయత్రీ ఛందః*' – అని మూతిని, '*పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా*'– అని యెదను తాకి, '*శ్రీభగవదాజ్ఞ*

*ఛందః'* - ఇతి ముఖం, '*పరమాత్మా శ్రీమన్నా రాయణో దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం అష్టావింశతివారం (అష్టోత్తర శతవారం) (అష్టోత్తర సహస్రవారం) గాయత్రీమహామంత్రజపం కరిష్యే'* – ఇత్యుక్త్వా అష్టావింశతివారం వా (అష్టోత్తరశతవారం వా, అష్టోత్తర సహస్రవారం వా) గాయత్రీ మంత్రజపం కుర్యాత్.

గాయత్రీమంత్రః : *ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।"*

## ఉపస్థానమ్

[337]ప్రాణానాయమ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం (ప్రాతః)*

---

*యా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం అష్టావింశతివారం (అష్టోత్తరశతవారం) (అష్టోత్తరసహస్ర వారం) గాయత్రీమహామంత్రజపం కరిష్యే'* – అని చెప్పి, అష్టావింశతి - అనగా 28 సార్లు, లేక అష్టోత్తరశతవారం (108సార్లు,) వీలున్నచో అష్టోత్తరసహస్రవారం (1008సార్లు) గాయత్రీ మంత్రజపము చేయవలెను. మంత్రసంఖ్యను లెక్కించు పద్ధతి: ఉంగరము వ్రేలియొక్క మధ్య కణుపు, క్రింది కణుపు, చిటికినవ్రేలి క్రింది, మధ్య, పై కణుపులు, ఉంగరమువ్రేలియొక్క పై కణుపు, మధ్యవ్రేలి పైకణుపు, చూపుడువ్రేలియొక్క పై, మధ్య, క్రింది కణుపులు – ఈ రీతి లెక్కించినచో 10 సంఖ్య యగును. ఇట్లు లెక్కించిన ప్రతిపదిని, ఎడమచేతి కణుపులపై గుర్తించు కొనుచు లెక్కించుట ఆచారముగా నున్నది. ఇట్లు గాదేని, జపమాల నుపయోగించియు లెక్కింపవచ్చును. కొందరిచ్చట గాయత్రీమంత్రజపమునకు ముందుగా అంగన్యాసకరన్యాస ములను చేయుచున్నారు. కాని నిత్యకర్మగా గాయత్రిని జపించునప్పుడు వీనితో పనిలేదని జీయరుస్వామివారనుచున్నారు. ఇవి శ్రీవైష్ణవపాంచరాత్రోక్తములు గానందున వీనితో పని లేదని పాంచరాత్రపండితుల అభిప్రాయము. న్యాసవిధి వైదికముగాదు కావున ఇది వైకల్పిక మని గృహ్యాపరిశిష్టమునం దున్నది. ధర్మసింధువను ధర్మశాస్త్రముసైతము న్యాసవిధి, ముద్రా ప్రదర్శనాదులు అవైదికము లగుటవలన ఇవి అనావశ్యకము లనుచున్నది. ఇచ్చట ఇవి లేని సులభవిధానమే చెప్పబడినది.

[337]జపానంతరము ప్రాణాయామము చేసి, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం*

*(మాధ్యాహ్నిక) (సాయం) సంధ్యోపస్థానం కరిష్యే'* - ఇతి సంకల్ప్య, ఉత్థాయ, అంజలిం బధ్వా, సూర్యాభిముఖో భూత్వా జపేత్।

*మం॥ ఉత్తమే శిఖరే దేవీ భూమ్యాం పర్వతమూర్ధని/ బ్రాహ్మణేభ్యో హ్యనుజ్ఞానం గచ్ఛ దేవి యథాసుఖమ్॥* (తై.ఆ.6.30)

(ప్రాతస్సంధ్యాయాం): *మిత్రస్య చర్షణీ ధృతశ్శ్రవో దేవస్య సానసిమ్/ సత్యం చిత్రశ్రవస్తమమ్/ మిత్రో జనాన్ యాతయతి ప్రజానన్మిత్రో దాధార పృథివీముత ద్యామ్/ మిత్రః కృష్టీరనిమిషాభి చష్టే సత్యాయ హవ్యం ఘృతవద్విధేమ/ ప్రసమిత్ర మర్తో అస్తు ప్రయస్వాన్ యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన/ న హన్యతే న జీయతే త్వోతో నైనమగ్ంహో అశ్నోత్యన్తితో న దూరాత్॥* (తై.సం.3.4.11)

(మధ్యాహ్నే): *ఆసత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ/ హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనా విపశ్యన్* /(తై.సం.3.4.11)/*ఉద్వయం తమసస్పరి పశ్యన్తో జ్యోతిరుత్తరమ్/ దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్*/(తై.సం. 4.1.7)/*ఉదుత్యం జాతవేదసమ్/ దేవం వహన్తి కేతవః/ దృశే విశ్వాయ సూర్యమ్/ చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః/ ఆప్రా ద్యావాపృథివీ అన్తరిక్షగ్ం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ*/(తై.సం.1.4.43)/ *తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్/ పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం నన్దామ శరదశ్శతం మోదామ శరదశ్శతం భవామ శరదశ్శతగ్ం శృణవామ శరదశ్శతం ప్రబ్రవామ శరదశ్శత-*

---

*(ప్రాతః) (మాధ్యాహ్నిక) (సాయం) సంధ్యోపస్థానం కరిష్యే'* - అని సంకల్పించి, సూర్యాభిముఖముగా నమస్కారముద్రతో నిలుచుండి, 'ఉత్తమే శిఖరే దేవీ' అను మంత్రమును చెప్పి, తర్వాత నిచ్చిన మూడు మంత్రములలో నొకదానిని తాను ప్రస్తుతము చేయు సంధ్యకు వర్తించు దానిని చెప్పవలెను. గమనిక: సూర్యాభిముఖముగా ననుటచేత, ఒకవేళ మాధ్యాహ్నికమును పగలు 12గంటలకంటె ముందుగా చేసినచో తూర్పునకే మళ్లి ఉపస్థానమును చేయవలెననుట స్పష్టము.

*మజీతాస్స్యామ శరదశ్శతం జ్యోక్చ సూర్యం దృశే/ య ఉదగాన్మహతోఽర్ణవా-
ద్విభ్రాజమానస్సరిరస్య మధ్యాథ్సమా వృషభో లోహితాక్షస్సూర్యో విపశ్చిన్మనసా
పునాతు*//(తై.ఆ.7.42)

(సాయంసంధ్యాయాం): *"ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ/ త్వామ-
వస్యురాచకే/ తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః/
అహేడమానో వరుణేహ బోధ్యురుశగంస మా న ఆయుః ప్రమోషీః/* (తై.సం. 2.1.11)/
*యచ్చిద్ధి తే విశో యథా ప్రదేవ వరుణ వ్రతమ్/ మినీమసి ద్యవిద్యవి/ యత్కిం-
చేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యాశ్చరామసి/ అచిత్తీ యత్తవ ధర్మా
యుయోపిమ మా నస్తస్మాదేనసో దేవ రీరిషః/ కితవాసో యద్రిరిపుర్న దీవి యద్వా ఘా
సత్యముత యన్న విద్మ/ సర్వా తా విష్య శిథిరేవ దేవాథా తే స్యామ వరుణ ప్రియాసః/*
(తై.సం.3.4.11)

## ప్రథమదిగ్వన్దనమ్

[338]1. *సంధ్యాయై నమః, 2. సావిత్ర్యై నమః, 3.గాయత్ర్యై నమః, 4. సరస్వత్యై నమః*
ఇతి ప్రదక్షిణేన పరివృత్య దిగ్వన్దనం కృత్వా,
*'సర్వాభ్యో దేవతాభ్యో నమః / కామోఽకార్‍షీన్మన్యురకార్‍షీన్నమో నమః/'*
- ఇత్యుక్త్వా,

---

[338]తరువాత తా నభిముఖుడై యున్న దిశనుండి ప్రదక్షిణముగా తిరుగుచు , '1. *సంధ్యాయై నమః, 2. సావిత్ర్యై నమః, 3.గాయత్ర్యై నమః, 4. సరస్వత్యై నమః'* - అని చెప్పుచు నాల్గు దిక్కులయందును నమస్కారము చేయవలెను. ఆతర్వాత '*సర్వాభ్యో దేవతాభ్యో నమః/ కామోఽకార్‍షీన్మన్యురకార్షీ కార్‍షీన్నమో నమః/'* – అని చెప్పి, సూర్యాభిముఖముగా నిలబడి, కొంచెము వంగుచు, కుడి, ఎడమ చేతులతో కుడి, ఎడమ చెవులను మూసికొని, 'అభివాదయే...' – అను గోత్రనామయుతమైన అభివాదమును చేయవలెను. ఇక్కడ ఆపస్తంబ సూత్రీకుడు, కాశ్యపగోత్రీకుడగు నారాయణశర్మ అను వ్యక్తియొక్క అభివాదనమీయబడినది. అన్యులు వారివారి ఋషి, గోత్రనామములతో దీనిని తగువిధముగా మార్చుకొని చెప్పవలెను.

‘ *అభివాదయే కాశ్యపాసితదైవలత్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రః, ఆపస్తమ్బ సూత్రః, యజుశ్శాఖాధ్యాయీ నారాయణదాసశర్మ అహమస్మి భోః ॥*’

- ఇత్యభివాదం కుర్యాత్।

## ద్వితీయదిగ్వన్దనమ్

[339] *1. ప్రాచ్యై దిశే నమః, 2. దక్షిణాయై దిశే నమః, 3. ప్రతీచ్యైదిశే నమః, 4. ఉదీచ్యై దిశే నమః।* - ఇతి పూర్వాహ్ణే దిగ్వన్దనం కుర్యాత్.

[340] *1. ప్రతీచ్యైదిశే నమః, 2. ఉదీచ్యై దిశే నమః। 3. ప్రాచ్యై దిశే నమః, 4. దక్షిణాయై దిశే నమః* - ఇతి ఇత్యపరాహ్ణే దిగ్వన్దనం కుర్యాత్.

[341]తతః *1.ఊర్ధ్వాయ నమః, 2. అధరాయ నమః, 3.అంతరిక్షాయ నమః, 4.భూమ్యై నమః, 5. విష్ణవే నమః* - ఇత్యంతరిక్షం, భూమిం, విష్ణుం నమస్కుర్యాత్.

---

[339]ప్రాతస్సంధ్యలోను, పగలు 12గంటలకు ముందుగా మాధ్యాహ్నికమును చేయునప్పుడును కర్త తూర్పునకు మళ్లి ఉపస్థానము చేయుచుండును. ఇట్టి స్థితిలో కర్త తూర్పునకు ‘ప్రాచ్యై దిశే నమః’ అని నమస్కరించి, తరువాత వరుసగా దక్షిణమునకు, పశ్చిమమునకు, ఉత్తరమునకు మళ్లి దక్షిణాయై దిశే నమః, ప్రతీచ్యైదిశే నమః,ఉదీచ్యై దిశే నమః అని ఆయా దిశలం దంతర్యామిగా నున్న శ్రీమన్నారాయణునకు నమస్కరించి, పూర్వాభిముఖుడై నిలబడవలెను.

[340] సాయంసంధ్యయందును, మాధ్యాహ్నికమును 12గంటల తర్వాత చేయునప్పుడును, కర్త పశ్చిమాభిముఖుడై ఉపస్థానము చేయుచుండును. ఇట్టి స్థితిలో కర్త పశ్చిమదిశకు ‘ప్రతీచ్యైదిశే నమః’ అని నమస్కరించి, తరువాత వరుసగా ఉత్తరమునకు, తూర్పుకు,దక్షిణమునకు మళ్లి, ఉదీచ్యై దిశే నమః, ప్రాచ్యై దిశే నమః, దక్షిణాయై దిశే నమః, అని ఆయా దిశలం దంతర్యామిగా నున్న శ్రీమన్నారాయణునకు నమస్కరించి, పశ్చిమాభిముఖుడై నిలబడవలెను.

[341] తరువాత సూర్యాభిముఖముగనే నిలబడి, చేతులుజోడించి, *1.ఊర్ధ్వాయనమః, 3. అంతరిక్షాయ నమః*– అని చెప్పుచు ఆజోడించిన చేతులను ఆకసమువైపు చూపించి ప్రణమింపవలెను. *2. అధరాయ నమః, 4.భూమ్యై నమః* -అనుచు ఆజోడించిన చేతులను భూమివైపు చూపించి నమస్కరింపవలెను. తరువాత 5.*విష్ణవే నమః* అని నమస్కరింపవలెను. ఇదియే ద్వితీయ దిగ్వందనము.

## ధ్యానశ్లోకాః

*శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ, నారాయణస్సరసిజాసన సంనివిష్టః।*
*కేయూరవాన్మకరకుండలవాన్కిరీటీ, హారీ హిరణ్మయవపుర్ధృతశఙ్ఖచక్రః॥*
*శ్లో॥ శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత।*
*గోవిన్ద పుణ్డరీకాక్ష రక్ష మాం శరణాగతమ్॥*
*శ్లో॥ నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణ హితాయ చ।*
*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥*

[342]ఇతి ధ్యాత్వా, '*చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు*।' – ఇత్యుక్త్వా, '*అభివాదయే కాశ్యపాసితదైవలత్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపసగోత్రః, ఆపస్తమ్బ సూత్రః, యజుశ్శాఖాధ్యాయీ నారాయణదాసశర్మ అహమస్మి భోః*।'
- ఇత్యభివాదం కృత్వాఽఽచమ్య, దక్షిణహస్తే జలం ధృత్వా,

*శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా*
*బుద్ధ్యాత్మనా వా ప్రకృతేస్స్వభావాత్।*
*కరోమి యద్యత్సకలం పరస్మై*
*నారాయణాయేతి సమర్పయామి॥*
*సర్వం శ్రీకృష్ణార్పణమస్తు।*

---

[342] తరువాత సూర్యాభిముఖముగనే నిలబడి, శిరస్సుపై అంజలిని చేర్చి, 'ధ్యేయస్సదా' ది మూడుశ్లోకములతో ధ్యానించి, '*చతుస్సాగరపర్యన్తం ---శుభం భవతు*।' –అని చెప్పి, '*అభి వాదయే---అహంభో అభివాదయే*' అని చెప్పుచు ఇదివరకు చేసినట్లే అభివాదమును చేసి, కూర్చొని ఆచమింపవలెను. తరువాత కుడిచేతిలోనికి నీటిని తీసికొని, 'కాయేన వాచా' అను శ్లోకమును చదివి, '*సర్వం శ్రీకృష్ణార్పణమస్తు*' అని చెప్పి ఆనీటిని భూమిపై వదలి, 'శ్రీరంగ మంగళ మణిం' అను శ్లోకమును చెప్పుచు దివ్యదేశపు పెరుమాళ్లను ధ్యానించి ముగించవలెను.

- ఇత్యుక్త్వా జలం భూమౌ విసృజ్య,

శ్లో॥ *శ్రీరంగమంగళమణిం కరుణానివాసం,*
*శ్రీవేంకటాద్రిశిఖరాలయకాలమేఘం।*
*శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతం,*
*శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్॥*

- ఇతి ధ్యాత్వా, పెరుమాళ్ వన్దనం కృత్వా సమాపయేత్।



# సమిదాధానవిధిః

(ఈ సమిదాధానమిదివఱకు ఉపనయనమున కంగముగా చెప్పబడినది, కాని అచ్చట ఉపనయనానంతరము మూడురోజులవఱకును ఉపనయనాగ్నినే కాపాడుకొని దాని యందే సమిదాధానము చేయుమని చెప్పుటచే అగ్నిప్రతిష్ఠాపనాదులను విడిగా చెప్ప లేదు. ఆ ఉపనయనదీక్ష ముగిసిన పిమ్మట బ్రహ్మచారి లౌకికాగ్నినే ప్రతిష్ఠించి ప్రతిదిన మును ప్రాతస్సాయంసమిదాధానముల నందులో చేయవలెను. కాని ఈకాలములో నెవ రును ఇట్లు చేయుట లేదు. ఐనను ఉపాకర్మ, పార్వణశ్రాద్ధములయందీ సమిదాధాన మును చేయవలసియుండును. అట్టి సందర్భములం దుపయోగించుటకై అగ్నిప్రతిష్ఠా పనతో గూడిన పరిపూర్ణసమిదాధానవిధాన మిచ్చట చెప్పబడుచున్నది.)

[343] కర్తా స్నాత్వా, ధృతధౌతవస్త్రోర్ధ్వపుండ్రస్సన్, సంధ్యావన్దనం కృత్వా, ఆచమ్య, ద్విః ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాన్తయే॥*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*

---

343 కర్త స్నానము చేసి, మడిబట్టలను, ఊర్ధ్వపుండ్రములను ధరించి, సంధ్యావందనమును ముగించుకొని, ఉదయమునందు, సాయంకాలమునందు సమిదాధానము చేయవలెను. దీనికై కర్త ఆచమించి, రెండుసార్లు ప్రాణాయామము చేసి, 'శుక్లాంబరధరం విష్ణుం' నుండి 'కరిష్యే' వరకు గల సంకల్పమును గీతలుంచినచోట్ల తగిన తిథివారనక్షత్రాదులను చేర్చుచు చెప్ప వలెను. ఈ సంకల్పములో ఉదయము చేయు సమిదాధానమునకు 'ప్రాతస్సమిదాధానం' అనియు, సాయంకాలము చేయు సమిదాధానమునకు 'సాయం సమిదాధానం' అనియు చెప్ప వలెను. ఆపైని 'స్వశేషభూతేన మయా' అను శ్లోకము చెప్పి సాత్త్వికత్యాగము చేయవలెను.

*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*

*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ----మాసే ----పక్షే ----తిథౌ----వాసరే----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం సాయంసమిధమాధాస్యే (అథవా, ప్రాతస్సమిధమాధాస్యే)"* – ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*

*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

- ఇతి సాత్త్వికత్యాగం కృత్వా,

## [344]అగ్నిప్రతిష్ఠా

గోమయేనోపలిప్తే శుచౌ దేశే, శ్వేతతండులచూర్ణేన ప్రాదేశమాత్రం చతురస్రసమం స్థండిలం కల్పయిత్వా, ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్। అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య, "*ఓం భూర్భువస్సువరోమ్*" – ఇత్యగ్నింప్రతిష్ఠాప్య। ఉత్పృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్। అగ్నిమిధ్వా (ప్రజ్వాల్య)।

*"ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య। త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ।(తై.ఆ.6.10)।అగ్నిం ధ్యాయామి"*

---

[344]ఇచ్చట అగ్నిప్రతిష్ఠాపనవిధానములోని వాక్యములకన్నిటికి తెలుగు వివరణ వ్రాయలేదు. ఇక్కడ వ్రాయని వివరణకు 'చతుష్పాత్రప్రయోగ' మను అధ్యాయమును చూచునది.

-ఇతి ధ్యాత్వా।

*"ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః। స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః॥"- ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ। సుముఖో భవ। సుప్రసన్నో భవ। వరదో భవ। యథోక్తజిహ్వయా హవిర్గృహాణ।*

- ఇత్యగ్నిమావాహ్య। ప్రార్థ్య। అగ్నేః పురతోఽక్షతోదకం నినీయ।[345] 'పరిత్వాగ్నే'తి పరిమృజ్య,

*మం॥ పరి త్వాఽగ్నే పరి మృజామ్యాయుషా చ ధనేన చ। సుప్రజాః ప్రజయా భూయాసగ్ం సువీరో వీరైస్సువర్చా వర్చసా సుపోషః పోషైస్సుగృహో గృహైస్సుపతిః పత్యా సుమేధా మేధయా సుబ్రహ్మా బ్రహ్మచారిభిః॥* (తై.మం.పా.2.6)

*1. ఓం అగ్నయే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్య శ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతైరలంకృత్య।

ప్రాగగ్రైర్దర్భై రగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్। అగ్నిం పరిషించతి।

*"అదితేఽనుమన్యస్వ" (*ఇతి దక్షిణతః ప్రాచీనమ్), *"అనుమతేఽనుమన్యస్వ" (*ఇతి పశ్చాదుదీచీనమ్), *"సరస్వతేఽనుమన్యస్వ" (*ఇత్యుత్తరతః ప్రాచీనమ్), *"దేవసవితః ప్రసువ" (*ఇతి సమంతమ్) పరిషిచ్య॥

## సమిద్ధోమాః (తై.మం.పా.2.6)

[346]వా॥ ఉత్తరై ర్ద్వాదశభిర్మంత్రైః ప్రతిమంత్రం సమిధమాదధ్యాత్। తతః 'ఓం భూ'రితి

---

[345] 'పరిత్వాగ్నే' అను మంత్రముతో తడిచేసికొన్న తన కుడిఅరచేతితో అగ్ని చుట్టును ప్రదక్షిణముగా నలుకవలెను.

[346] క్రింది 16 మంత్రములను చెప్పుచు ప్రతిమంత్రము చివర నేతిలో నద్దిన ఒక సమిధను అగ్నిలో

చతుర్భిః మంత్రైశ్చ సమిధమాదధ్యాత్।

1. *అగ్న యే సమిధమాహార్షం బృహతే జాతవేదసే। యథా త్వమగ్నే సమిధా సమిధ్యస ఏవం మామాయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సమేధయ స్వాహా। అగ్న య ఇదం న మమ।*
2. *ఏధోఽస్యేధిషీమహి స్వాహా। అగ్న య ఇదం న మమ।*
3. *సమిదసి సమేధిషీమహి స్వాహా। అగ్న య ఇదం న మమ।*
4. *తేజోఽసి తేజో మయి ధేహి స్వాహా। అగ్న య ఇదం న మమ।*
5. *అపో అద్యాన్వచారిషగ్ం రసేన సమసృక్ష్మహి। పయస్వాగ్ం అగ్న ఆగమం తం మా సగ్ంసృజ వర్చసా స్వాహా। అగ్న య ఇదం న మమ।*
6. *సంమాఽగ్నే వర్చసా సృజ ప్రజయా చ ధనేన చ స్వాహా। అగ్న య ఇదం న మమ।*
7. *విద్యున్మే అస్య దేవా ఇన్ద్రో విద్యాత్సహ ఋషిభిస్స్వాహా। ఇన్ద్రాయేదం న మమ।*
8. *అగ్న యే బృహతే నాకాయ స్వాహా। అగ్న యే బృహతే నాకాయేదం న మమ।*
9. *ద్యావాపృథివీభ్యాగ్ స్వాహా। ద్యావాపృథివీభ్యామిదం న మమ।*
10. *ఏషా తే అగ్నే సమిత్తయా వర్ధస్వ చాఽప్యాయస్వ చ తయాఽహం వర్ధమానో భూయాసమాప్యాయమానశ్చ స్వాహా। అగ్న య ఇదం న మమ।*
11. *యో మాఽగ్నే భాగినగ్ం సన్తమథాభాగం చికీర్షత్యభాగమగ్నే తం కురు మామగ్నే భాగినం కురు స్వాహా। అగ్న య ఇదం న మమ।*
12. *సమిధమాధాయాఽగ్నే సర్వవ్రతో భూయాసగ్ స్వాహా। అగ్న య ఇదం న మమ।*
13. *ఓం భూస్స్వాహా। అగ్న య ఇదం న మమ॥*
14. *ఓం భువస్స్వాహా। వాయవ ఇదం న మమ॥*

---

వేయవలెను. ఇదియే సమిద్హోమము.

*15. ఓగ్ం సువస్స్వాహా॥ సూర్యాయేదం న మమ॥*

*16. ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదం న మమ॥*

## ఉత్తరపరిషేచనమ్

[347]పునః ప్రాణానాయమ్య, *"అదితేఽన్వమగ్గ్ స్థాః"*- ఇతి దక్షిణతః ప్రాచీనమ్, *"అనుమతే ఽన్వమగ్గ్ స్థాః"* - ఇతి పశ్చాదుదీచీనమ్, *"సరస్వతేఽన్వమగ్గ్ స్థాః"*- ఇత్యుత్తరతః ప్రాచీనమ్, *"దేవ సవితః ప్రాసావీః"* - ఇతి సమంతమగ్నిం పరిషిచ్య।

*17. "శ్రీవిష్ణవే స్వాహా॥ విష్ణవే పరమాత్మన ఇదం న మమ॥"*

ఇతి సమిధమగ్నౌ నినీయ, ఉత్థాయ, అంజలిం బధ్వా, అగ్న్యుపస్థానం కుర్యాత్॥

## అగ్న్యుపస్థానమ్

*మం॥ యత్తే అగ్నే తేజస్తేనాహం తేజస్వీ భూయాసం యత్తే అగ్నే వర్చస్తేనాహం వర్చస్వీ భూయాసం యత్తే అగ్నే హరస్తేనాహగ్ం హరస్వీ భూయాసమ్॥౧॥ మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు మయి మేధాం మయి ప్రజాం మయీన్ద్ర ఇన్ద్రియం దధాతు మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు॥౨॥*

---

[347] మరల ప్రాణాయామమును చేసి, ఎడమచేత జలపాత్రను తాకుచు, కుడిచేతిలో జలమును తీసికొని *"అదితేఽన్వమగ్గ్ంస్థాః"*- అని దక్షిణమునందు పడమటినుండి తూర్పునకు, *"అనుమతేఽన్వమగ్గ్ంస్థాః"*- అని పశ్చిమమందు దక్షిణమునుండి ఉత్తరమునకు, *"సరస్వతేఽన్వమగ్గ్ంస్థాః"*- అని ఉత్తరమునందు పశ్చిమమునుండి తూర్పునకు, *"దేవ సవితః ప్రాసావీః"*- అని ఈశాన్యమునుండి ప్రదక్షిణముగా తిరిగి ఈశాన్యమువఱకు, అగ్నిని నీటితో పరిషేచనము చేయవలెను. దీనికే ఉత్తరపరిషేచన మని పేరు. ఆ తర్వాత కర్త దండధారియై లేచి నిలబడి అగ్నికి అంజలించుచు 'యత్తే అగ్నే' ఇత్యాది 3 మంత్రములను, ప్రార్థనాశ్లోకములను చెప్పి, గోత్రనామములతో కూడిన అభివాదమును చేయవలెను (గమనిక: ఇచ్చట ఉదాహరణముగా, శతమర్షణగోత్రీకుడైన నారాయణశర్మ అను కర్తయొక్క అభివాదన మీయబడినది. దీని స్థానములో ప్రస్తుతకర్తకు సరిపడు అభివాదమును చెప్పుకొనవలెను.)

*మానస్తోకే తనయే మాన ఆయుషి మానో గోషు మానో అశ్వేషురీరిషః। వీరాన్మానో రుద్రభామితో వధీర్హవిష్మన్తో నమసా విధేమ తే॥3॥*

## ప్రార్థనశ్లోకాః

*శ్లో॥ శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమ్। ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన॥ శ్రియం దేహి మే హవ్యవాహన ఓం నమ ఇతి।*

*శ్లో॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో హోమక్రియాదిషు। న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వన్దే హుతాశనమ్॥*

*శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన। యద్ధుతన్తు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥*

### అభివాదః

*చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు।*
*అభివాదయే ఆంగీరస పౌరుకుత్స త్రసదస్యుః త్ర్యార్షేయ ప్రవరాన్విత శతమర్షణస గోత్రః, ఆపస్తమ్బ సూత్రః, యజుశ్శాఖాధ్యాయీ నారాయణశర్మా అహమస్మి భోః॥*

[348]వా॥ అనంతరముపవిశ్య, ద్విరాచమ్యోత్తరయా భగవదర్పణం కుర్యాత్.

*"స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః కారితవాన్ స్వయమ్॥"*

*"ప్రీయతా మనేన భగవాన్ వాసుదేవః। సర్వం శ్రీకృష్ణార్పణమస్తు"*



[348] అభివాదానంతరము కూర్చొని, రెండుసార్లు ఆచమించి, తరువాత నిచ్చిన 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును, 'ప్రీయతామనేన భగవాన్ వాసుదేవః। సర్వం శ్రీకృష్ణార్పణమస్తు' అను వాక్యములను చెప్పి భగవంతున కంజలించి ముగించవలెను.

# ఉపాకర్మప్రయోగః

## కామోకార్షీన్మంత్రజపః

[349]శ్రావణ్యాం పౌర్ణమాస్యాం వటుః పూర్వాహ్ణే స్నాత్వా, ధౌతం పరిధాయ, ఊర్ధ్వ పుండ్రం ధృత్వా, ప్రాతస్సంధ్యావన్దనం (ప్రాతస్సమిదాధానం చ కృత్వా), ప్రాఙ్ముఖ ఉపవిశ్య, ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాన్తయే//*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్/*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే//*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్/*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్//*

---

[349] శ్రావణపూర్ణిమనాడు వటువు ఉదయమందే స్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, తిరుమణిని పెట్టుకొని, ప్రాతస్సంధ్యావందనమును, ప్రాతస్సమిదాధానమును కూడ పూర్తిచేసి, తూర్పునకు మళ్లి ప్రాణాయామము చేసి, 'శుక్లాంబరధరం' ఇత్యాదిశ్లోకములను చెప్పి, 'హరిరోం తత్సత్--- తైష్యాం పౌర్ణమాస్యాం అధ్యాయోత్సర్జనాకరణప్రాయశ్చిత్తార్థం అష్టోత్తరశతవారం అష్టోత్తరసహస్రవారంవా కామోఽకార్షీన్మన్యురకార్షీదితి మంత్రజపం కరిష్యే' – అని సంకల్పించి, '*కామోఽకార్షీన్మన్యురకార్షీన్నమో నమః*' అనుమంత్రమును 108 లేక 1008 సార్లు జపించవలెను. అనంతరము లేచి నిలుచుండి, అంజలిబద్ధుడై, 'ఉత్తమే శిఖరే దేవీ' అను మంత్రమును చెప్పి కూర్చొని, రెండుసార్లు ఆచమించి 'కాయేన వాచా–సమర్పయామి। సర్వం శ్రీకృష్ణార్పణమస్తు।' – అని చెప్పి భగవదర్పణము చేయవలెను. సూచన: కామోకార్షీన్మంత్రజపమును అనధ్యయనదినములలో వేదమును చదివినందులకు ప్రాయశ్చిత్తరూపముగా చేయుచున్నారు. కాని క్రొత్తగా ఉపనయనమైన వటువునకు ఉపాకర్మకు పూర్వమే వేదాధ్యయనార్హత లేదు కనుక, ఇట్టి వటువు తొలి ఉపాకర్మనాడు ఈ మంత్రజపము చేయనక్కఱలేదు. తరువాత బ్రహ్మచారులు తిథివారనక్షత్ర దోషములను పరిగణించకుండ వపనము చేయించుకొనవలెను.

*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ శ్రావణమాసే శుక్లపక్షే ----వాసరే శ్రవణానక్షత్ర యుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం తైష్యాం పౌర్ణమాస్యాం అధ్యాయోత్సర్జనాకరణప్రాయశ్చిత్తార్థం అష్టోత్తరశత వారం (అష్టోత్తరసహస్రవారం వా) కామోఽకార్షీన్మన్యురకార్షీదితి మంత్రజపం కరిష్యే"* – ఇతి సంకల్ప్య,

మం॥ కామోఽకార్షీన్మన్యురకార్షీన్నమో నమః।

- ఇత్యష్టోత్తరశతవారం వా అష్టోత్తరసహస్రవారం వా జపిత్వా, ఉత్థాయ, అంజలిం బధ్వా, సూర్యాభిముఖో భూత్వా,

*మం॥ ఉత్తమే శిఖరే దేవీ భూమ్యాం పర్వతమూర్ధని। బ్రాహ్మణేభ్యో హ్యనుజ్ఞానం గచ్ఛ దేవి యథాసుఖమ్॥* (తై.ఆ.6.45)

- ఇతి జపిత్వా, ఉపవిశ్య, ద్విరాచమ్య,

*శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్।*
*కరోమి యద్యత్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి॥*
*సర్వం శ్రీకృష్ణార్పణమస్తు।*

- ఇతి భగవదర్పణం కృత్వా బ్రహ్మచారిణో వపనం కుర్యుః। నాత్ర వారాదిదోషగన్ధః।

## మధ్యాహ్నకార్యమ్

[350]అథాపరాహ్ణే బ్రహ్మచారిణః గృహస్థాశ్చ స్నాత్వా, ధౌతం పరిధాయ, ఊర్ధ్వ పుండ్రాన్ ధృత్వా, మాధ్యాహ్నికం కృత్వా, ప్రాఙ్ముఖ ఉపవిశ్య, ఆచమ్య, పవిత్ర పాణయః, ప్రాణానాయమ్య,

## సంకల్పః

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే॥*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

---

[350] తరువాత మధ్యాహ్నమునందు (నదిలో గాని, చెఱువులో గాని, ఇది అసాధ్యమైన ఇంటిలో గాని) బ్రహ్మచారులు, గృహస్థులూ అందరు స్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, తిరు మణిని పెట్టుకొని, మధ్యాహ్నసంధ్యావందనమును చేసికొని, తూర్పునకు మళ్లి కూర్చొని, ఆచమించి, పవిత్రమును ధరించి, ప్రాణాయామము చేసి, 'శుక్లాంబరధరం' ఇత్యాదిశ్లోకము లను చెప్పి, '*హరిరోం తత్సత్--- శ్రావణ్యాం పౌర్ణమాస్యాం అధ్యాయోపాకర్మ కరిష్యే। తదంగం కాండర్షితర్పణం కరిష్యే। తదంగం నూతనయజ్ఞోపవీతధారణం (మౌంజ్యజినదండ ధారణాని చ) కరిష్యే*" – అని సంకల్పించవలెను. ఉపాకర్మలో గృహస్థులు నూతనయజ్ఞోప వీతములను ధరించి కాండర్షితర్పణము చేయవలెను. బ్రహ్మచారులు నూతనయజ్ఞోపవీతము లనే కాక మౌంజ్యజినదండములను కూడ ధరించి కాండర్షితర్పణము చేయవలెను. అందుచేత బ్రహ్మచారులు బ్రాకెట్లలో నిచ్చిన '*మౌంజ్యజినదండ ధారణాని చ*'- అను పదమును చేర్చి సంకల్పమును చెప్పవలెను. గృహస్థు లీ పదమును చేర్చి చెప్ప నవసరము లేదు.

*'హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయాప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ శ్రావణమాసే శుక్లపక్షే ----వాసరే శ్రవణానక్షత్ర యుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం శ్రావణ్యాం పౌర్ణమాస్యాం అధ్యాయోపాకర్మ కరిష్యే। తదంగం కాండర్షి తర్పణం కరిష్యే। తదంగం నూతనయజ్ఞోపవీతధారణం (మౌంజ్యజినదండధారణాని చ) కరిష్యే।'* – ఇతి సంకల్ప్య,

## నూతన యజ్ఞోపవీతధారణమ్

[351]ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠానయోగ్యతాఫలసిద్ధ్యర్థం నూతనయజ్ఞోపవీతధారణం కరిష్యే।'* – ఇతి సంకల్ప్య, *యజ్ఞోపవీతధారణమంత్రస్య బ్రహ్మా ఋషిః। త్రిష్టుప్ ఛన్దః। వేదాస్త్రయో దేవతాః। యజ్ఞోపవీతధారణే వినియోగః।-*

*మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥*

- ఇతి యజ్ఞోపవీతం ధృత్వాఽఽచమేత్।

---

[351] బ్రహ్మచారులు, గృహస్థులూ అందఱును ప్రాణాయామము చేసి, *'పూర్వోక్త ఏవంగుణ విశేషణవిశిష్టాయామస్యాం ----నూతనయజ్ఞోపవీతధారణం కరిష్యే।'* – అని సంకల్పించి, మొదటి అధ్యాయములో నిచ్చినట్లుగా బ్రహ్మచారు లొక్కటి, వివాహితులు రెండు యజ్ఞోపవీత ములను ధరింపవలెను. కొందరు గృహస్థులు ఉత్తరీయార్థము మూడవ యజ్ఞోపవీతమును కూడ ధరించు పద్ధతి యున్నది.

## గృహస్థానాం ద్వితీయయజ్ఞోపవీతధారణమ్

తతః గృహస్థాః ఆచమ్య, ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టా-యామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం గార్హస్థ్యార్థం ద్వితీయయజ్ఞోపవీతధారణం కరిష్యే।'* – ఇతి సంకల్ప్య, *యజ్ఞోపవీతధారణమంత్రస్య బ్రహ్మా ఋషిః। త్రిష్టుప్ ఛన్దః। వేదాస్త్రయో దేవతాః। యజ్ఞోపవీతధారణే వినియోగః।-*

*మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్। ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥*

-ఇతి ద్వితీయయజ్ఞోపవీతం ధృత్వాఽఽచమేత్। ఏవం కేచిత్ గృహస్థాః ఉత్తరీ-యార్థం తృతీయయజ్ఞోపవీతం చ ధరిష్యన్తి।

## బ్రహ్మచారిణాం మేఖలాఽజినధారణమ్

[352]సూ॥ మౌంజీం మేఖలాం త్రివృతాం త్రిః ప్రదక్షిణ ముత్తరాభ్యాం పరివీయ। నాభిదేశే గ్రంథిం కృత్వా తౌ మన్త్రౌ కుమారం వాచయేత్।

*మం॥ ఇయం దురుక్తాత్పరిబాధమానా శర్మ వరూథం పునతీ న ఆగాత్। ప్రాణాపానాభ్యాం బలమాభరన్తీ ప్రియా దేవానాగ్ం సుభగా మేఖలేయమ్॥౧॥ ఋతస్య గోప్త్రీ తపసః పరస్పీ ఘ్నతీ రక్షస్సహమానా అరాతీః। సానస్సమన్త మను పరీహి భద్రయా భర్తారస్తే మేఖలే మారిషామ॥౨॥* (తై.మం.పా.2.2)

*పదం॥ ఇయం। దురుక్తాత్। పరి।బాధమానా। శర్మ। వరూథమ్। పునతీ। నః। ఆగాత్। ప్రాణాపానాభ్యామ్। బలమ్। ఆభరన్తీ। ప్రియా। దేవానామ్। సుభగా। మేఖలా। ఇయమ్॥౧॥*

---

[352]ఆచార్యుడు తర్వాత నిచ్చిన 'ఇయం దురుక్తాత్' 'ఋతస్య గోప్త్రీ' అను రెండు మంత్రము లను చెప్పి ముప్పిరి వేసిన ముంజగడ్డి లేక దర్భత్రాటిని వటువుయొక్క మొలచుట్టును మూడు చుట్లు ప్రదక్షిణముగా కట్టి, ఆమూడువరుసలకు నాభి దగ్గర ముడి వేసి, తదుపరి ఆ రెండుమంత్ర ములను వటువుచేత చెప్పించవలెను.

ఋతస్య/ గోప్త్రీ/ తపసః/ పరస్పీ/ ఘ్నతీ రక్షః/ సహమానా/ అరాతీః/ సా/నః/ సమన్తమ్/ అను/పరీహి/ భద్రయా/ భర్తారః/ తే/ మేఖలే/ మా/రిషామ// ౨//

[353]వా॥‘ మిత్రస్యచక్షు’ రితి కృష్ణాజినముత్తరలోమకముత్తరీయార్థే ధారయిత్వా తదేవ వాచయీత।

మం// మిత్రస్య చక్షుర్ధరుణం బలీయస్తేజో యశస్వి స్థవిరగ్ం సమిద్ధమ్/ అనాహనస్యం వసనం జరిష్ణు పరీదం వాజ్యజినం దధేఽహమ్//౧// (తై.మం.పా.2.2)

పదం// మిత్రస్య/ చక్షుః/ ధరుణమ్/ బలీయః/ తేజః/ యశస్వి/ స్థవిరమ్/ సమిద్ధమ్/ అనాహనస్యమ్/ వసనమ్/ జరిష్ణు/ పరీదమ్/ వాజి/ అజినమ్/ దధేఽహమ్//౧//

## బ్రహ్మచారిణాం దండగ్రహణమ్

[354]సూ॥ దండ ముత్తరేణాదత్తే। మంత్రాన్తే పాలాశదండమార్యదత్తం వటుర్దక్షిణపాణినా ఽఽదత్తే।

మం// సుశ్రవస్సుశ్రవసం మా కురు యథా త్వగ్ం సుశ్రవస్సుశ్రవా అస్యేవమహగ్ం సుశ్రవస్సుశ్రవా భూయాసం యథాత్వగ్ం సుశ్రవస్సుశ్రవో దేవానాం నిధిగోపోఽస్యేవ-మహం బ్రాహ్మణానాం బ్రహ్మణో నిధిగోపో భూయాసమ్// (తై.మం.పా.2.5)

పదం// సుశ్రవః/ సుశ్రవసమ్/ మా కురు/ యథా త్వమ్/ సుశ్రవః/ సుశ్రవా అసి/ ఏవ మహమ్/ సుశ్రవః/ సుశ్రవా/ భూయాసమ్/ యథా త్వమ్/ సుశ్రవః/ సుశ్రవః/ దేవానామ్/ నిధి గోపోఽసి/ ఏవమహమ్/ బ్రాహ్మణానామ్/ బ్రహ్మణః/ నిధిగోపః/ భూయాసమ్//

---

[353] తరువాత ఆచార్యుడు ‘మిత్రస్య చక్షుః’ అను మంత్రమును చెప్పి ఒక చిన్న కృష్ణాజినపు ముక్కను పైకి రోమములుండునట్లుగా వటువుజందెముయొక్క బ్రహ్మముడికి క్రిందుగా కట్టి, వటువుచే ఆమంత్రమును పలికించవలెను.

354 తర్వాత వటువు తూర్పుముఖముగా లేచి నిలుచుండగా, ఆచార్యుడు ‘సుశ్రవసః’ అను మంత్రమును అతనిచేత చెప్పించి, అతని కుడిచేతికి మోదుగు దండమును పట్టించవలెను.

## కాండర్షితర్పణమ్

[355]వా॥ అనంతరం స్నాత్వా। ఉర్ధ్వపుండ్రాన్ ధృత్వా। తటాక నదీ వా జలే స్థిత్వా। అథవా కుక్కుటాసనే ఉపవిశ్య।ద్విరాచమ్య। ప్రాణానాయమ్య। ' *పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవ త్కైంకర్యరూపం శ్రావణ్యాం పౌర్ణమాస్యాం అధ్యయోపాకర్మణి ప్రాజాపత్యాది నవ కాణ్డర్షితర్పణం కరిష్యే'-* ఇతి సంకల్ప్య। ఉదఙ్ముఖో నివీతినో భూత్వా। తిలాక్షత సహితం నవ కాండర్షితర్పణం ఋషితీర్థేన కుర్యాత్।

1. ప్రజాపతిం కాండర్షిం తర్పయామి। తర్పయామి। తర్పయామి।
2. సోమం కాండర్షిం తర్పయామి। తర్పయామి। తర్పయామి।
3. అగ్నిం కాండర్షిం తర్పయామి। తర్పయామి। తర్పయామి।
4. విశ్వాన్ దేవాన్ కాండర్షీగ్ స్తర్పయామి। తర్పయామి। తర్పయామి।
5. సాగ్ంహితీభ్యో దేవతాభ్య ఉపనిషదస్తర్పయామి। తర్పయామి। తర్పయామి।
6. యాజ్ఞికీర్దేవతా ఉపనిషదస్తర్పయామి। తర్పయామి। తర్పయామి।

---

355 తర్వాత బ్రహ్మచారులు, గృహస్థులూ అందఱును స్నానము చేసి, ఊర్ధ్వపుండ్రములను ధరించి, తటాకజలములో గాని, నదీజలములో గాని ఉత్తరముఖముగా నిలిచి, అది సాధ్యము గాకున్న గృహమందు కుక్కుటాసనముతో ఉత్తరముఖముగా కూర్చొని, రెండుసార్లాచమించి, ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---నవకాణ్డర్షితర్పణం కరిష్యే'*–అని చెప్పి, నివీతిని చేసికొని, పాత, క్రొత్త జందెములను కలిపి బ్రహ్మముడులు దోసిటి లోనికి వచ్చునట్లుగా రెండుబొటనవ్రేళ్లకు చుట్టుకొని, దోసిటిలో నాచార్యుడు బియ్యమును, తిలలను వేసి నీటిని పోయగా క్రింద నిచ్చిన తొమ్మిదిమంత్రములను చెప్పుచు తర్పయామి అన్నపుడెల్ల నీటిని విడుచుచు (మూడేసి సార్లు) తర్పణము చేయవలెను. గమనిక: 8వ తర్పణ మును మాత్రము బ్రహ్మతీర్థముతోను, మిగితా అన్నితర్పణములను ఋషితీర్థముతోను చేయ వలెను. తర్పణానంతర మందఱును (నీటిలో నిలబడి తర్పణము చేసినచో, తడివస్త్రములను విడిచి, ఎండిన మడిబట్టలను కట్టుకొని) జందెములను ఉపవీతిగా చేసికొని ఆచమించి, ఇంటిలో అధ్యయనహోమము చేయవలెను.

7. వారుణీర్దేవతా ఉపనిషదస్తర్పయామి। తర్పయామి। తర్పయామి।
8. (బ్రహ్మతీర్థేన) బ్రహ్మాణగ్గ్ స్వయంభువం తర్పయామి। తర్పయామి। తర్ప-యామి।
9. సదసస్పతిం తర్పయామి। తర్పయామి। తర్పయామి।

తతః శుష్కవస్త్రాణి ధృత్వా ఉపవీతినో భూత్వాఽఽచమ్య అధ్యయనహోమం కుర్యాత్।

## అధ్యయనహోమః

[356]ఆచార్యః ద్విరాచమ్య, ప్రాణానాయమ్య,

'*పూర్వోక్త ఏవంగుణ విశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం శ్రావణ్యాం పౌర్ణమాస్యాం అధ్యయన హోమం కరిష్యే। తదంగత్వేన షట్పాత్ర ప్రయోగప్రకారేణాగ్ని ముఖం కరిష్యే।*' – ఇతిసంకల్ప్య, స్థండిలోల్లేఖనాద్యగ్నిపరిషేచనాంతం షట్పాత్రప్రయోగం కృత్వా, అన్వారబ్ధేష్వంతేవాసిషు దర్వ్యా ఆజ్యాహుతీన్ జుహోతి।

1. *ప్రజాపతయే కాండర్షయే స్వాహా। ప్రజాపతయే కాండర్షయ ఇదం న మమ।*
2. *సోమాయ కాండర్షయే స్వాహా। సోమాయ కాండర్షయ ఇదం న మమ ।*
3. *అగ్నయే కాండర్షయే స్వాహా। అగ్నయే కాండర్షయ ఇదం న మమ ।*
4. *విశ్వేభ్యో దేవేభ్యః కాండర్షిభ్య స్స్వాహా। విశ్వేభ్యో దేవేభ్యః కాండర్షిభ్య ఇదం న మమ।*

---

356 అధ్యయనహోమమునకై ఆచార్యుడు వటువులను ప్రక్కకు కూర్చుండబెట్టుకొని, రెండు సార్లు ఆచమించి,ప్రాణాయామము చేసి,'*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---షట్పాత్ర ప్రయోగప్రకారేణాగ్ని ముఖం కరిష్యే*' అని సంకల్పించి, 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా పరిధులను వేయుచు అగ్ని ముఖమును చక్షుర్హోమాంతము చేసి, వటువులు తనను (దర్భలతో) తాకుచుండగా ప్రధానదర్వీతో క్రింద నిచ్చిన 10 ఆజ్యాహుతులను చేయవలెను.

5. *సాగ్ంహితీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య స్వాహా/ సాగ్ంహితీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య ఇదం న మమ /*
6. *యాజ్ఞికీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య స్వాహా/ యాజ్ఞికీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య ఇదం న మమ /*
7. *వారుణీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య స్వాహా/ వారుణీభ్యో దేవతాభ్య ఉపనిషద్భ్య ఇదం న మమ /*
8. *బ్రహ్మణే స్వయంభువే స్వాహా/బ్రహ్మణే స్వయంభువ ఇదం న మమ /*
9. *సదసస్పతయే స్వాహా/ సదసస్పతయ ఇదం న మమ /*
10. *సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యమ్/సనిం మేధా మయాసిషగ్ స్వాహా/ సదసస్పతయ ఇదం న మమ /*

[357]ఇత్యాచార్యో హుత్వా ప్రణవపూర్వక మిషేత్వేత్యాది చతురోనువాకానేవ శిష్యా నధ్యాపయేత్। (తైసం.1.1.1-4)

1. *హరిః ఓమ్/ ఇషే త్వోర్జే త్వా వాయవస్థోపాయవస్థ దేవో వస్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్నియా దేవభాగమూర్జస్వతీః పయస్వతీః ప్రజావతీరనమీవా అయక్ష్మా మా వస్తేన ఈశత మాఘశగ్ంసో రుద్రస్య హేతిః పరి వో వృణక్తు ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీర్యజమానస్య పశూన్పాహి//*
2. *యజ్ఞస్య ఘోషదసి ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టా అరాతయః ప్రేయమగాద్ధిషణా*

---

357 ఇట్లాచార్యుడు వటువులు తనను తాకుచుండగా 10 ఆజ్యహుతులను చేసి, (గృహస్థులు) వటువులందరిచే, ఓంకార మారంభమునందుగల 'ఇషేత్వోర్జేత్వా' మున్నగు యజుర్వేద సంహితలోని మొదటి నాల్గు అనువాకములను చెప్పించవలెను. ఇట్లు చెప్పించి, ఆచార్యుడు శిష్యులను తాకకుండ, జయాదులను, స్విష్టకృద్ధోమమును, ప్రణీతామోక్షణమును,బ్రహ్మవిసర్జనమును, అగ్న్యుపస్థానమును షట్పాత్రప్రయోగములో చెప్పినట్లుగా చేసి, ఆపైన అభ్యుదయమును, పుణ్యాహవాచనమును చేయవలెను. గమనిక: ఉపాకర్మలో పూర్ణాహుతి లేదు.

బర్హిరచ్ఛ మనునా కృతా స్వధయా వితష్టా త ఆవహన్తి కవయః పురస్తా-
ద్దేవేభ్యో జుష్టమిహ బర్హిరాసదే దేవానాం పరిషూతమసి వర్షవృద్ధమసి
దేవబర్హిర్మా త్వాఽన్వఙ్మా తిర్యక్పర్వ తే రాధ్యాసమాచ్ఛేత్తా తే మా రిషం
దేవబర్హిశ్శతవల్శం విరోహ సహస్రవల్శా వి వయగ్ం రుహేమ పృథివ్యా
స్సంపృచః పాహి సుసంభృతా త్వా సంభరామ్యదిత్యై రాస్నాఽసీన్ద్రాణ్యై
సన్నహనం పూషా తే గ్రన్థిం గ్రథ్నాతు స తే మాస్థాదిన్ద్రస్య త్వా బాహుభ్యా
ముద్యచ్ఛే బృహస్పతేర్మూర్ధ్నా హరామ్యుర్వన్తరిక్షమన్విహి దేవంగమమసి॥

3. శున్ధధ్వం దైవ్యాయ కర్మణే దేవయజ్యాయై మాతరిశ్వనో ఘర్మోఽసి ద్యౌరసి
పృథివ్యసి విశ్వధాయా అసి పరమేణ ధామ్నా దృగ్ంహస్వ మా హ్వార్వసూనాం
పవిత్రమసి శతధారం వసూనాం పవిత్రమసి సహస్రధారగ్ం హుతస్తోకో హుతో
ద్రప్సోఽగ్నయే బృహతే నాకాయ స్వాహా ద్యావాపృథివీభ్యాగ్ం సా విశ్వాయు
స్సా విశ్వవ్యచాస్సా విశ్వకర్మా సంపృచ్యధ్వమృతావరీరూర్మిణీర్మధుమత్తమా
మన్ద్రా ధనస్య సాతయే సోమేన త్వాఽతనచ్మీన్ద్రాయ దధి విష్ణో హవ్యగ్ం రక్షస్వ॥

4. కర్మణే వాం దేవేభ్యశ్శకేయం వేషాయ త్వా ప్రత్యుష్టగ్ం రక్షః ప్రత్యుష్టా
అరాతయో ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వ తం యోఽస్మాన్ ధూర్వతి తం
ధూర్వ యం వయం ధూర్వామస్త్వం దేవానామసి సస్నితమం పప్రితమం జుష్ట-
తమం వహ్నితమం దేవహూతమమహ్రుతమసి హవిర్ధానం దృగ్ంహస్వ
మా హ్వార్మిత్రస్య త్వా చక్షుషా ప్రేక్షే మా భేర్మా సంవిక్థా మా త్వా హిగ్ంసిష
మురువాతాయ దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా
మగ్నయే జుష్టం నిర్వపామ్యగ్నీషోమాభ్యామిదం దేవానామిదము నస్సహ
స్ఫాత్యై త్వా నారాత్యై సువరభి విఖ్యేషం వైశ్వానరం జ్యోతిర్దృగ్ంహన్తాం దుర్యా
ద్యావాపృథివ్యోరుర్వన్తరిక్షమన్విహ్యదిత్యాస్త్వోపస్థే సాదయామ్యగ్నే హవ్యగ్ం
రక్షస్వ॥

ఇత్యధ్యాప్య, అనన్వారబ్ధో జయాది స్విష్టకృదన్తం హుత్వా, ప్రణీతా విమోక్ష్య,

బ్రహ్మోద్వాసనం కృత్వా, అభ్యుదయం పుణ్యాహం చ కుర్యాత్।

## [358]అభ్యుదయమ్

ఆచార్యః ద్విః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం అధ్యయనహోమకర్మాంగ మభ్యుదయకర్మ కరిష్యే। అభ్యుదయార్థ మష్టౌ బ్రాహ్మణాన్ భోజయిష్యే*' – ఇతిసంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ హిరణ్యరూపేణ అభ్యుదయకం కుర్యాత్।

## పుణ్యాహవాచనమ్

ఆచార్యః పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం అధ్యయనహోమకర్మాంగం కర్మణః పుణ్యాహం వాచయిష్యే। తత్కర్మాంగం చతురో బ్రాహ్మణాన్ తోషయిష్యే*' – ఇతిసంకల్ప్య, [359]పూర్వోక్తప్రకారేణ కర్మణః పుణ్యాహ వాచనం కృత్వా ఆత్మానం ప్రోక్ష్య, శిష్యాం చ ప్రోక్ష్య, అనుగ్రహం అశీర్వచనం చ కుర్యాత్। తతః సాయాహ్నే వటవః సాయంసమిదాధానం కుర్యుః।

## పరేద్యుః కర్తవ్యమ్

(ఉపాకర్మ జరిగిననాటి మఱునాడు మిథ్యాధీతప్రాయశ్చిత్తమునకై 1008మారులు

---

358 అభ్యుదయకమునకై ఆచార్యుడు రెండుసార్లు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయాం---బ్రాహ్మణాన్ భోజయిష్యే' అని సంకల్పించి, 'నాందీశ్రాద్ధవిధిః' అను అధ్యాయములో చెప్పినట్లుగ హిరణ్యరూపముగ అభ్యుదయమును చేయవలెను.

359 ఆచార్యుడు రెండుసార్లు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయాం ---బ్రాహ్మణాన్ తోషయిష్యే' అని సంకల్పించి, 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగ పుణ్యాహవాచనము చేసి పుణ్యాహజలముచే తనను ప్రోక్షించుకొని, తరువాత వటువులను ప్రోక్షించి, వారికి మంత్రయుతముగ ఆశీర్వాదములను అనుగ్రహింపవలెను. ఆనాటి సాయంకాలమునందు వటువులు సాయంసమిదాధానమును చేయవలెను.

గాయత్రీమంత్రముతో సమిద్ధోమమును గాని, లేదా 1008మారులు గాయత్రీమంత్రజప మునుగాని చేయవలెను. హోమవిధి కష్టతరమగుటచే పలువురు మంత్రజపమునే చేయు చున్నారు. ఆపద్ధతియే ఇచ్చట చెప్పబడినది.)

[360]పరేద్యుః బ్రహ్మచారిణః స్నాత్వా, ధృతవస్త్రోర్ధ్వపుండ్రస్సన్, సంధ్యావందనం,ప్రాత స్సమిదాధానం చ కృత్వా, ప్రాఙ్ముఖ ఉపవిశ్య, ఆచమ్య, ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే//*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్/*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే//*
*లక్ష్మీ నాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్/*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవ స్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే దక్షిణాయనే వర్షఋతౌ శ్రావణమాసే కృష్ణపక్షే ----వాసరే శుభ నక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం ప్రతిపత్ శుభతిథౌ*

---

360 మఱుసటిరోజు బ్రహ్మచారులు ఉదయముననే స్నానము చేసి, ధౌతవస్త్రములను, ఊర్ధ్వ పుండ్రములను ధరించి, సంధ్యావందనమును, ప్రాతస్సమిదాధానమును చేసి, తూర్పునకు మళ్లి ఆచమనమును, ప్రాణాయామమును చేసి, 'శుక్లాంబరధరం' అను శ్లోకమునుండి మొదలిడి 'మిథ్యాధీతదోషప్రాయశ్చిత్తార్థం అష్టోత్తరశతవారం వా అష్టోత్తరసహస్రవారం వా సవితృ గాయత్రీమంత్రజపం కరిష్యే' వరకు సంకల్పమును చెప్పి, 1008 సార్లుగాని (వసతి లేకున్న కనీసము 108 సార్లుగాని) గాయత్రీమంత్రమును జపించవలెను.

*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం మిథ్యాధీతదోష ప్రాయశ్చిత్తార్థం అష్టోత్తరసహస్రవారం సవితృగాయత్రీమంత్రజపం కరిష్యే'* – ఇతి సంకల్ప్య,

[361] '*గాయత్రీ శిరసో బ్రహ్మ ఋషిః*'- ఇతి శీర్షం, '*అనుష్టుప్ఛందః*' – ఇతి ముఖం, '*పరమాత్మా దేవతా*' – ఇతి హృదయం స్పృష్ట్వా, '*సర్వేషాం ప్రాణాయామే విని-యోగః*' – ఇత్యుక్త్వా, అంజలిబద్ధః 'అర్కమండలమధ్యస్థ' మితి ధ్యాత్వా దశవారం ప్రాణాయామమంత్రజపం కుర్యాత్.

*శ్లో॥ అర్కమండలమధ్యస్థం కోటిసూర్యసమప్రభం/*
*బ్రహ్మాది సేవ్య పాదాబ్జం నౌమి బ్రహ్మ రమాసఖమ్॥*

## గాయత్ర్యావాహనమ్

[362]పునః ప్రాణానాయమ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం గాయత్ర్యావాహనం కరిష్యే*' –ఇతి సంకల్ప్య,

'*ఆయాత్విత్యనువాకస్య వామదేవ ఋషిః*'- ఇతి శీర్షం, '*అనుష్టుప్ ఛందః*' – ఇతి ముఖం, '*గాయత్రీ దేవతా*' – ఇతి హృదయం స్పృష్ట్వా, '*గాయత్ర్యావాహనే విని యోగః*' -ఇత్యుక్త్వా,

---

[361] అందుకు ముందుగా '*గాయత్రీ శిరసో బ్రహ్మ ఋషిః*'- అని తలను, '*అనుష్టుప్ఛందః*' – అని మూతిని, '*పరమాత్మా దేవతా*' – అని యెదను తాకి, '*సర్వేషాం ప్రాణాయామే వినియోగః*' – అని చెప్పి, అంజలిబద్ధుడై, 'అర్కమండలమధ్యస్థ' మను శ్లోకమును చెప్పి, పదిసార్లు ప్రాణాయామమంత్రమును జపించవలెను.

[362]గాయత్ర్యావాహనకై వటువు ప్రాణాయామము చేసి, '*శ్రీభగవదాజ్ఞయా ---గాయత్ర్యావాహనం కరిష్యే*' – అని సంకల్పించి, '*ఆయాత్విత్యనువాకస్య వామదేవ ఋషిః*'- అని తలను, '*అనుష్టుప్ ఛందః*' – అని మూతిని, '*గాయత్రీ దేవతా*' – అని యెదను తాకి, '*గాయత్ర్యావాహనే వినియోగః*' – అని చెప్పి, '*ఆయాతు వరదా దేవీ*' అను మంత్రముతో మొదలిడి '*యో దేవ స్సవితా*' అను శ్లోకమువఱకుచెప్పి 'సంధ్యావన్దన' ప్రయోగములోవలె (పుట 324) చేయవలెను.

*'ఆయాతు వరదా దేవ్యక్షరం బ్రహ్మ సమ్మితమ్। గాయత్రీం ఛన్దసాం మాతేదం బ్రహ్మ జుషస్వ నః। ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి దేవానాం ధామ నామాసి విశ్వ-మసి విశ్వాయుస్సర్వమసి సర్వాయుః। అభిభూరోం గాయత్రీమావాహయామి, సావిత్రీమావాహయామి, సరస్వతీమావాహయామి।'*

*శ్లో॥ ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై*
*ర్యుక్తా మిన్దు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థవర్ణాత్మి కామ్।*
*గాయత్రీం వరదాభయాంకుశకశా శ్శుభ్రం కపాలం గదాం*
*శంఖంచక్ర మథారవిన్దయుగళం హస్తైర్వహన్తీం భజే॥*

*శ్లో॥ యో దేవ స్సవితాఽస్మాకం ధియో ధర్మాది గోచరాః।*
*ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే॥*

## గాయత్రీమంత్రజపః

[363]అథ *'గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః'* – ఇతి శీర్షం, *'దేవీ గాయత్రీ ఛందః'* - ఇతి ముఖం, *'పరమాత్మా శ్రీమన్నా రాయణో దేవతా'* – ఇతి హృదయం స్పృష్ట్వా, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం మిథ్యాధీతదోషప్రాయశ్చిత్తార్థం అష్టోత్తర సహస్రవారం గాయత్రీమహామంత్రజపం కరిష్యే'* – ఇత్యుక్త్వా అష్టోత్తరసహస్ర వారం గాయత్రీమంత్రజపం కుర్యాత్.

గాయత్రీమంత్రః : *ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।"*

## ఉపస్థానమ్

---

[363]తర్వాత *'గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః* - అని తలను, *'దేవీ గాయత్రీ ఛందః'* – అని మూతిని, *'పరమాత్మా శ్రీమన్నా రాయణో దేవతా'* – అని యెదను తాకి, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం మిథ్యాధీతప్రాయశ్చిత్తార్థం అష్టోత్తరసహస్రవారం గాయత్రీ మహామంత్రజపం కరిష్యే'* – అని చెప్పి 1008సార్లు గాయత్రీమంత్రజపము చేయవలెను.

[364]ప్రాణానాయమ్య, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం గాయత్రీ మంత్రోపస్థానం కరిష్యే'* - ఇతి సంకల్ప్య, ఉత్థాయ, అంజలిం బధ్వా, సూర్యాభి ముఖో భూత్వా జపేత్।

*మం॥ఉత్తమే శిఖరే దేవీ భూమ్యాం పర్వతమూర్ధని।బ్రాహ్మణేభ్యో హ్యనుజ్ఞానం గచ్ఛ దేవి యథాసుఖమ్॥'సర్వం శ్రీకృష్ణార్పణమస్తు'* – ఇత్యుక్త్వా, అభివాద్యోపవిశేత్।

## పురాతనయజ్ఞోపవీతవిసర్జనమ్

[365]ఆచమ్య, ప్రాణానాయమ్య,

*శ్లో॥ ఉపవీతం భిన్న తంతుం జీర్ణం కశ్మలదూషితం।*
*విసృజామి యశో బ్రహ్మ వర్చో దీర్ఘాయురస్తు మే॥*

- ఇత్యుక్త్వా పురాతనయజ్ఞోపవీతం త్యక్త్వాఽఽచమేత్.



[364]జపానంతరము ప్రాణాయామము చేసి, *'శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం గాయత్ర్యుపస్థానం కరిష్యే'* - అని సంకల్పము చేసి, అంజలిబద్ధుడై, సూర్యాభిముఖముగా లేచి నిలుచుండి, 'ఉత్తమే శిఖరే దేవీ' అను మంత్రమును చెప్పి, 'సర్వం శ్రీకృష్ణార్పణమస్తు' అని నివేదన చేసి, స్వగోత్రనామయుతముగా అభివాదము చేసి కూర్చొని, పాత యజ్ఞోపవీతమును క్రింద నిచ్చినవిధముగా త్యజింపవలెను.

[365]బ్రహ్మచారులు ఆచమించి, ప్రాణాయామము చేసి, *'ఉపవీతం భిన్న తంతుం'* అను శ్లోకమును చెప్పి, పాతయజ్ఞోపవీతమును త్యజించి ఆచమింపవలెను. గృహస్థులును మొదటి యజ్ఞోపవీతము నిట్లే త్యజించి, మఱల ఆచమించి, ప్రాణాయామము చేసి, *'ఉపవీతం భిన్న తంతుం'* అను శ్లోకమును చెప్పి రెండవయజ్ఞోపవీతమును త్యజించి ఆచమింపవలెను. గమనిక: పాతయజ్ఞోపవీతమును ముందునాడే, అనగా ఉపాకర్మ జరిగిననాడే, త్యజించు ఆచారము గలదు.

# గోదానవ్రతమ్

[366]సూ॥ ఏవం గోదాన మన్యస్మిన్నపి నక్షత్రే షోడశే వర్షే।

(అత్ర కారికాః:

శ్లో॥ గోదానమకృతం యస్య వివాహశ్చే దుపస్థితః।
యామ్యాయనేపి కుర్వీత గోదానం స్నాతకం చ వై॥
గోదానం చౌలవత్కార్యం షోడశేబ్దే తదుచ్యతే।
అంకోపవేశనం నాస్తి, శ్మశ్రూణాం ముండనం భవేత్॥

)

[367]వా॥ కర్తా పత్నీకుమారసహితః మంగళవేదికాం ప్రాప్య, ఆచమ్య, ప్రాణానాయమ్య,

---

[366]షోడశే వర్షే = పదహారవ యేట, అన్యస్మిన్నపి=మరియొకటైనటువంటి, నక్షత్రే=రోహిణ్యాదినక్షత్రములందు, గోదానమ్=గోదానవ్రతమును, ఏవం=చౌలకర్మవలెనే చేయదగినది. గోదానవ్రతమనగా గోవును దానము చేయుట కాదు. గాః=వెంట్రుకలను, దీయతే= ఖండింతురు గనుక దీనికి గోదానవ్రత మని పేరు వచ్చినది. ఇది చౌలకర్మవంటిది. దీనిని 16వ సంవత్సరమున ఉత్తరాయణమున చేసికొనవలెనని శాస్త్రము.పూర్వకాలములో ఎనిమిదేండ్లకు కుమారునికి ఉపనయనము చేసి, ఆ తర్వాత (తరువాతి అధ్యాయములో చెప్పినట్లుగా) 8 సంవత్సరములపాటు ప్రాజాపత్యాది నాల్గువేదవ్రతములను, వాని ఉత్సర్జనలను చేసి, 16వ ఏట గోదానమును, అనగా మొట్టమొదట శ్మశ్రువులతో బాటు కేశవపనమును చేసికొనెడివారు. కాని ఈకాలములో లాంఛనప్రాయముగ నైనను తమ 16వ ఏట ఎవ్వరును ఈవ్రతమును చేసికొనుటలేదు. ఐనను ఇది షోడశకర్మలలో చేరిన సంస్కారము కనుక, దీని విధాన మిచ్చట వ్రాయబడుచున్నది. ఇచ్చట నిచ్చిన కారికాశ్లోకములు, గోదానస్నాతకవ్రతములు చేసికొననిదే వివాహమాసన్నమైనచో ఈవ్రతములను దక్షిణాయనమందును చేసికొనవచ్చునియు, గోదానములో శిరోవపనముతో బాటు శ్మశ్రువపనముకూడ చేసికొనవలె ననియు తెల్పుచున్నవి.

[367]కుమారుని తండ్రి భార్యాకుమారులతో మంగళవేదికను ప్రవేశించి, ఆచమించి, ప్రాణాయామము చేసి, '*శుక్లాంబరధరం..*' నుండి మొదలిడి '*శ్రీవిష్వక్సేనపూజాం కరిష్యే*' వరకు గల

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే॥*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----వాసరే ----నక్షత్ర యుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవంగుణవిశేషణవిశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ---గోత్రస్య ---శర్మణః మమ కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం గోదానవ్రతాఖ్యం కర్మ కరిష్యమాణః తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే। తదంగమాదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీవిష్వక్సేనపూజాం కరిష్యే"* – ఇతి సంకల్ప్య, విష్వక్సేనారాధనం, పుణ్యాహవాచనం చ కుర్యాత్।

[368]పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ*

---

సంకల్పములను, గీతలుంచినచోట తగు సంవత్సర, అయన, ఋతు, మాస,పక్ష, వార,నక్షత్రములను, పిల్లవాని గోత్రమును, పేరును చేర్చుచు చెప్పి, వెనుకటి అధ్యాయములలో నిచ్చినట్లు విష్వక్సేనపూజను, పుణ్యాహవాచనమును చేసి, పుణ్యాహజలముచే ప్రోక్షించుకొనవలెను.

[368]కర్త మరల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---అభ్యుద*

*అస్య గోదానకర్మాంగత్వేన అభ్యుదయికం కరిష్యే'* - ఇతి సంకల్ప్య, పూర్వోక్తవిధినా హిరణ్యరూపేణాభ్యుదయికం కుర్యాత్।

[369]పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అస్య గోదానకర్మాంగత్వేన షట్పాత్రప్రయోగేణాగ్ని ముఖం కృత్వా తదగ్నౌ గోదాన వ్రతహోమం కరిష్యే।*'-ఇతి సంకల్ప్య, చౌలవదాజ్యభాగాంతం కుర్యాత్।

శ్లో॥ పాత్రప్రయోగే ఖలు యోజనీయో గోదానకర్మణ్యపి చౌలవత్తు।
న గ్లప్సు పుంజీలశలల్య ఇష్టా అత్రార్థలుప్తా హి భవన్తి యస్మాత్॥

[370]వా॥ చక్షుర్హోమాంతం కృత్వా। అన్వారబ్ధే ఉత్తరా ఆహుతీర్జుహోతి॥

## ప్రధానహోమమంత్రాః (తై.మం.పా.2.11)

1. *ధాతా దదాతు నో రయి మీశానో జగతస్పతిః। స నః పూర్ణేన వావనత్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥*
2. *ధాతా ప్రజాయా ఉత రాయ ఈశే ధాతేదం విశ్వం భువనం జజాన। ధాతా పుత్రం యజమానాయ దాతా తస్మా ఉ హవ్యం ఘృతవద్విధేమ స్వాహా। ధాత్ర ఇదం*

---

*యికం కరిష్యే*' అని సంకల్పించి, 'నాందీముఖమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా లఘు రూపకముగా అభ్యుదయమును చేయవలెను.

[369]కర్త మరల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం--- తదగ్నౌ గోదానహోమం కరిష్యే*' అని సంకల్పించి, 'చౌలప్రయోగః' అను అధ్యాయములో నిచ్చినట్లుగ షట్పాత్రప్రయోగముతో ఆజ్యభాగాంతము చేయవలెను. కాని, ఇచ్చట నిచ్చిన శ్లోకము ప్రకారము చౌలములో చెప్పబడిన దర్భపుంజీలమును, ఏదుపందిముల్లును, మేడికాయలగుత్తి గల కొమ్మను మినహాయించి ఇతరమనుష్యపాత్రలను మాత్రము పాత్రాసాదన చేయవలెను.

[370]ఇట్లు ఆజ్యభాగములో చక్షుర్హోమాంతము చేసిన తర్వాత, అన్వారబ్ధే=కుమారుడు తండ్రిని తాకుచుండగా, ఉత్తరా ఆహుతీః=తర్వాత చెప్పబడు 'ధాతా దధాతు నో' అనెడి 8 ఆహుతులను, జుహోతి=హోమము చేయుచున్నాడు. అనగా కుమారుడు తండ్రి తొడమీద చేతినుంచి తండ్రిని తాకుచుండగా తండ్రి ఈ ఆహుతులతో హోమము చేయవలె ననుట.

*న మమ॥*

3. *ధాతా దదాతు నో రయిం ప్రాచీం జీవాతుమక్షితామ్। వయం దేవస్య ధీమహి సుమతిగ్ం సత్యరాధసస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥*
4. *ధాతా దదాతు దాశుషే వసూని ప్రజాకామాయ మీఢుషే దురోణే। తస్మై దేవా అమృతాస్సంవ్యయన్తాం విశ్వే దేవాసో అదితిస్సజోషాస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥*
5. *యస్త్వా హృదా కీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యో జోహవీమి। జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యాగ్గ్ స్వాహా। అగ్నయే జాతవేదస ఇదం న మమ॥*
6. *యస్మై త్వగ్ం సుకృతే జాతవేద ఉ లోకమగ్నే కృణవస్స్యోనమ్। అశ్వినగ్ం స పుత్రిణం వీరవన్తం గోమన్తగ్ం రయిం నశతే స్వస్తి స్వాహా। అగ్నయే జాతవేదస ఇదం న మమ॥*
7. *త్వే సుపుత్ర శవసోఽవృత్రన్కామకాతయః। న త్వామింద్రాతిరిచ్యతే స్వాహా। ఇంద్రాయ పుత్రిణ ఇదం న మమ॥*
9. *ఉక్థఉక్థే సోమ ఇంద్రం మమాద నీథేనీథే మఘవానగ్ం సుతాసః। యదీగ్ం సబాధః పితరం న పుత్రాస్సమానదక్షా అవసే హవన్తే స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥* (తై.సం.1.4.46.52 &53)

[371]ఇతి హుత్వా, '*జయాద్యగ్న్యుపస్థానాంత*' మిత్యుక్త్వా, పూర్వోక్తప్రకారేణ (పుట సంఖ్యా: 52-65) జయాద్యగ్న్యుపస్థానాంతం కుర్యాత్.

---

[371]పై ఎనిమిది మంత్రములతో హోమము చేసి, 'జయాద్యగ్న్యుపస్థానాంతం' అని చెప్పి షట్పాత్రప్రయోగములో 52-65 పేజీలలో నిచ్చినట్లుగా జయాదిహోమమునుండి అభివాదాంతము చేయవలెను. ఇట్లు చేయుటలో ఈప్రయోగములో నుపయోగించునవి శమ్యలు గనుక 'శమ్యాః అపోహ్యా' అని చెప్పి వానిని తీసి అగ్నికి ఉత్తరమున పడవేయవలెను.

[372]తతః శిఖామాత్ర మవశిష్య సర్వాన్ కేశాన్ వాపయతి। స్నాత్వాఽఽచమ్య బ్రహ్మణే వరం దదాతి.

## అగ్నిగోదానమ్

[373]పక్షాంతరమాహ – అగ్నిగోదానో వా స్యాత్।

కర్తా ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ ఇమం---శర్మాణం అగ్నిగోదానాఖ్యేన కర్మణా సగ్ంస్కరిష్యే*।'- ఇతి సంకల్ప్య, పూర్వవత్ స్థండిలోల్లేఖనాద్యాజ్యభాగాంతం కుర్యాత్। తతః

*మం॥ అగ్న యే కాండర్షయే స్వాహా। అగ్న యే కాండర్షయ ఇదం నమమ।*

ఇతి హుత్వా। జయాద్యభివాదాంతం కృత్వా। శిఖామాత్ర మవశిష్య సర్వాన్ కేశాన్ వాపయతి। స్నాత్వాఽఽచమ్య బ్రహ్మణే వరం దదాతి.



---

[372] హోమానంతరము శిఖ (జుట్టు) మినహా మిగితా కేశముల నన్నింటిని (అనగా శ్మశ్రువులను, ఇతర వెంట్రుకలను) వపనము చేయించుకొని, తలస్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, బొట్టును పెట్టుకొని, ఆచమించి, చౌలములోవలెనే ఆచార్యునికి గోవునుగాని, తత్తుల్యమగు దక్షిణనుగాని ఈయవలెను.

[373] పక్షాంతరమున అగ్నిగోదానమును చేయవచ్చును. దీనికై '*పూర్వోక్త ఏవం గుణవిశే-షణవిశిష్టాయామస్యాం శుభతిథౌ ఇమం---శర్మాణం అగ్నిగోదానాఖ్యేన కర్మణా సగ్గ్స్కరిష్యే*।'- అని సంకల్పించి, ఆజ్యభాగాంతము చేసి, ప్రధానహోమమును ముందొసగిన 8 మంత్రములతోగాక 'అగ్నయే కాండర్షయే స్వాహా। అగ్నయే కాండర్షయ ఇదం నమమ।' అని ఒక్క మంత్రముతో చేసి, తర్వాత మునుపటివలెనే జయాదుల నభివాదాంతము చేసి, మునుపటి వలెనే కేశవపనము చేయించుకొని, తలస్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, బొట్టును పెట్టుకొని, ఆచమించి, ఆచార్యునికి గోవునుగాని, తత్తుల్యమగు దక్షిణనుగాని ఈయవలెను.

# వేదవ్రతాని- సమానతంత్రప్రయోగః

(యజుర్వేదములో 1. ప్రాజాపత్యకాండ, 2.సౌమ్యకాండ, 3.ఆగ్నేయకాండ,4.వైశ్వదేవకాండ అను నాల్గుకాండలు (భాగములు) ఉన్నవి. 8వ ఏట ఉపనీతుడై, శ్రావణపూర్ణిమనాడు ఉపాకర్మ చేసికొని వటువు వేదాధ్యయనము నారంభింపవలెను. ఇట్లు వేదమునందలి కాండముల నభ్యసించుటకు ముందుగా కాండోపాకరణము చేసికొని ఒకసంవత్సరము తర్వాత దానిని ఉత్సర్జనము చేయవలెను. ఇట్లు చేసికొను కాండోపాకరణములకే వరుసగా 1.ప్రాజాపత్య వ్రతము, 2.సౌమ్యవ్రతము, 3.ఆగ్నేయవ్రతము, 4.వైశ్వదేవవ్రతము లని పేర్లు. ఒకవ్రతోపక్రమణము చేసిన తర్వాత సంవత్సరమునకు దానిని ఉత్సర్జనము చేయవలెను (ఉత్సర్జనము చేసిన తర్వాత గూడ ఆకాండము నభ్యసింపవచ్చును). ఇట్లు నాల్గుకాండల ఉపక్రమణోత్సర్జనములకు 8 సంవత్సరములు పట్టును. అప్పటికి వటువునకు 16 సంవత్సరములు వచ్చును. ఆ వయస్సులో వటువు గోదానవ్రతమును చేసికొనవలెను. గోదానమనగా ఆవును దానమిచ్చుట కాదు 16 సంవ త్సరములకు ముఖమునందు మొలిచిన శ్మశ్రువులను మొదటిసారిగా వపనము చేయించు కొనుట అని దీని కర్థము. ఈ గోదానవ్రతవిధి వెనుకటి అధ్యాయములోచెప్పబడినది. పూర్వకాలమున వేదవ్రతములను సకాలములో శాస్త్రోక్తముగా చేసికొనుచుండిరో ఏమో కాని, ఇప్పుడు సామాన్యముగ ఇట్లు చేసికొనుట లేదు. కాని ఈవ్రతములు షోడశకర్మలలో చేరినవి గనుక, ఉపనయనము తర్వాత వీనిని చేసికొననిదే వివాహమును చేసికొనగూడదు కనుక, ఈవ్రతముల నన్నిటిని వివాహమున కొకరోజు ముందుగనో, వివాహము చేసికొనునాటి ఉదయ మందో లాంఛనముగా పూర్తిచేసికొని, వెనువెంటనే తదుత్సర్జనమును కూడ చేసికొని, తదుపరి సమావర్తనమును చేసికొని, అటుపైని వివాహమును చేసికొనుచున్నారు. ఇట్లు విడివిడిగా ఈ వ్రతములను చేసికొనుటకు అధికకాలము పట్టును. ప్రతివ్రతోపక్రమణమునకు షట్పాత్రప్రయోగముతో అగ్నిముఖమును చేసి, అందులో ప్రధానహోమములను, జయాదులను అభివాదాంతముగా చేసి, ఆ తర్వాత అభ్యుదయమును, పుణ్యాహమును చేయవలసియుండును. ఇట్లే ప్రతి వ్రతోత్సర్జనమునకు చేయవలసియుండును. ఇవన్నియు చేయుటకు సమయమును, శ్రమయు అధికముగా పట్టును. అందుచేత మనపెద్దలువీటన్నిటిని కలిపి సులభముగా చేసికొను పద్ధతి నేర్పరచినారు. దీని ప్రకారము ఒకేసారి అగ్నిముఖమును చేసి, అన్ని వ్రతములకు చెందిన హోమముల నందులో చేసి, అన్నిటికి కలిపి చివరికి ఒకేసారి అభ్యుదయ, పుణ్యాహవాచనములను చేయుచున్నారు. ఈపద్ధతికి 'సమానతంత్ర' మని పేరు. ఈ పద్ధతి ప్రకారమే వేదవ్రతముల

ఆచరణ మిచ్చుట చెప్పబడినది. ఈవ్రతముల నాచరించుటలో ఆచార్యుడు చేయవలసిన భాగ మధికముగాను, వటువు చేయవలసినది తక్కువగాను ఉన్నది. వటువు చేయవలసిన భాగ మును వటువుచే మంత్రములను చెప్పించుచు ఆచార్యుడు చేయింపవలెను.)

## పరిషదనుజ్ఞా

[374]యజమానః తాంబూల ఫల దక్షిణా సమేత హరిద్రాక్షతపాత్రం హస్తే గృహీత్వా, భార్యా మాణవకసమేతః వేదికాయాః పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ,

*'ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై। సప్రథ సభాం మే గోపాయ। యే చ సభ్యాస్సభాసదః। తానిన్ద్రి-యావతః కురు। సర్వమాయురుపాసతామ్। సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః।'*

- ఇతి సదస్యాన్ ప్రణమ్య, దక్షిణాం దత్వా. "*అశేషే హే పరిషత్। స్వామినః భవత్పాద మూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య మదీయాం విజ్ఞాపనం సమాకర్ణ్య ---గోత్రస్య ---శర్మణః మాణవకస్య ఉపనయనప్రభృత్యేతత్క్షణపర్యంతం మేఖలాజినదండకమండలధారణ గురుకులవాస శౌచ స్నాన సంధ్యావన్దన భైక్షాచర్య సమిదాధానాదీనాం బ్రహ్మచర్యవ్రతానాం బహు విధాని వైకల్యాని సమభవన్నే తద్వైకల్యదోషనిర్హరణద్వారా వ్రతానుష్ఠానయోగ్యతా సిద్ధిం కామయమానస్య శక్త్యనుగుణ్యేన స్నానాన్నాదికృచ్ఛ్రరూపప్రాయశ్చిత్తం నిర్ణీయ। అస్య మాణవకస్య ప్రాజాపత్యాదివ్రతానుష్ఠానం కర్తుం యోగ్యతాసిద్ధిరస్త్వితి, ప్రాజాపత్యాదివ్రతానుష్ఠానముహూర్తస్సుముహూర్తోస్త్వితి భవన్తోబ్రువన్తు।'* – ఇతి

---

374 యజమాను డొక తట్టలో ఫలపుష్పాక్షతాదక్షిణలను పెట్టుకొని భార్యాకుమారునితో సహ వేదికకు పశ్చిమమున (తాము కూర్చుండు పీటలకు వెనుక) తూర్పుముఖముగా లేచి నిలబడి, 'ఓం నమస్సదసే' నుండి మొదలిడి 'మహాన్తోఽనుగృహ్ణన్తు' వరకు చెప్పుచు సభను ప్రార్థించి, భార్యాకుమారులతో సహ ప్రణమించి పరిషత్తునకు దక్షిణ నిచ్చి, '---గోత్రస్య', '---శర్మణః' అని ఉన్నచోట గీతలకు బదులు కుమారుని గోత్రమును, పేరును చెప్పుచు ' *అశేషే హే పరిషత్ ---బ్రువన్తు'* వరకు చెప్పి పరిషత్తును ప్రార్థించవలెను. అప్పుడు పరిషత్తు 'తథాస్తు, యోగ్యతా సిద్ధిరస్తు,ప్రాజాపత్యాదివ్రతానుష్ఠాన ముహూర్తస్సుముహూర్తోస్తు।' - అని అనుగ్రహింపవలెను.

[413]వా॥ అన్నద్యాయేతి ఔదుమ్బరేణకాష్ఠేన దన్తో ధావతే।

*మం// అన్నాద్యాయ వ్యూహధ్వం దీర్ఘాయురహమన్నాదో భూయాసమ్/ సోమో రాజా యమాగమత్స మే ముఖం ప్రవేక్ష్యతి భగేన సహ వర్చసా//* (తై.మం.పా.2.7)

[414] వా॥ నైర్ఋుత్యాం దిశి నిరస్య। అప ఉపస్పృశ్య। ఆచమ్య। స్నానీయేన చూర్ణేనో-ద్వర్త్య స్నాత్వా।ఉత్తరేణ యజుషాఽఽహత మంతరం వాసః పరిధాయ। ద్విరాచమ్య।

*మం// సోమస్య తనూరసి తనువం మే పాహి స్వాహా తనూరావిశ//* (తై.మం.పా.2.7)

[415]వా॥ ఊర్ధ్వపుండ్రాన్ ధృత్వా।ఉపవీతద్వయం ధృత్వా। సార్వ సురభిణా చన్దనేన ఉత్తరైర్దేవతాభ్యః ప్రదాయ। ప్రదానం నమశ్శబ్దేన।

*మం// నమో గ్రహాయ చాభిగ్రహాయ చ/ ౧/ నమశ్శాకజఞ్జభాభ్యామ్/ ౨/ నమస్తాభ్యో దేవతాభ్యో యా అభిగ్రాహిణీః/3//* (తై.మం.పా.2.7)

---

[413]అన్నద్యాయేతి=తరువాతి 'అన్నాద్యాయ' అను మంత్రముతో, ఔదుమ్బరేణ కాష్ఠేన = మేడిపుల్లతో, దన్తః=దంతములను, ధావతే= (స్నాతకుడు) తోముకొనుచున్నాడు (మేడి పుల్లతో, అది లేకున్న వేఱొకపుల్లతో లాంఛనముగా తోముకొని నోటిని కడుగుకొనుచున్నాడు.)

[414] ఆపుల్లను నైఋుతికి పడవేసి, చేయి కడుగుకొని, ఆచమించి, పాత్రాసాదన చేసినప్పుడు మనుష్యపాత్రలలో నుంచిన నలుగుపిండిని తీసికొని రుద్దుకొని స్నానము చేసి, తర్వాత గల 'సోమస్య తనూరసి' అను మంత్రముతో తడిపి ఆరవేసిన క్రొత్త అధోవస్త్రమును (పంచెను) ధరించి, రెండుసారు లాచమించవలెను.

[415] తర్వాత ఊర్ధ్వపుండ్రములను పెట్టుకొని, మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా రెండు యజ్ఞోపవీతములను ధరించి, తరువాత నిచ్చిన 'నమోగ్రహాయ' అను మంత్రముతో కుడిచేతి వ్రేళ్లకొనలతో గంధపుగిన్నెలోని గంధమును తీసికొని మంత్రాదిలో నున్న నమశ్శబ్దము పల్కినపుడెల్ల (3సార్లు) ఆగంధము నగ్నిపై చిలికించుచు, అగ్నిద్వారా దేవత లకు సమర్పించవలెను. (గంధమునగ్నిలో వేయుటకు బదులు పైకి చిమ్మవలెనని కొందఱి మతము. వివాహారంభాత్పూర్వము జరుగు స్నాతకమందే గార్హస్థ్యార్థము రెండవయజ్ఞోపవీతమును ధరించుట కొందరికి (వైష్ణవాదులకు) ఆచారముగా నున్నది. కాని వివాహారంభములో ధరించుట మఱి కొందరి కాచారముగా నున్నది.)

[416]వా॥ అప్సరస్స్విత్యాత్మానం గంధేనానులిప్య।

*మం॥ అప్సరస్సు యో గంధో గంధర్వేషు చ యద్యశః।దైవో యో మానుషో గంధ స్స మా గంధస్సురభిర్జుషతామ్॥* (తై.మం.పా.2.7)

[417]సూ॥ మణిగ్ం సౌవర్ణగ్ం సోపధానగ్ం సూత్రప్రోతమియమోషధీత్యుదకపాత్రే త్రిః ప్రదక్షిణం పరిప్లావ్య।

*మం॥ ఇయమోషధి త్రాయమాణా సహమానా సహస్వతీ। సా మా హిరణ్యవర్చసం బ్రహ్మవర్చసినం మా కరోతు॥* (తై.మం.పా.2.7)

[418]వా॥ అపాశోఽసీతి గ్రీవస్వాబధ్య।

*మం॥ అపాశోఽస్యరోమే మా సగ్ం శారీ శ్శివో మోపతిష్ఠస్వ దీర్ఘాయుత్వాయ శత శారదాయ। శతగ్ం శరద్భ్య ఆయుషే వర్చసే జీవాత్వై పుణ్యాయ॥*(తై.మం.పా.2.7)

[419]సూ॥ ఏవమేవ బాదరమణిం మంత్రవర్జగ్ం సవ్యేపాణావాబధ్య। అహత ముత్తరం వాసో రేవతీస్త్వేతి సమానమ్। (అత్ర తూష్ణీం శిరస్యుష్ణీషం బధ్నీయాత్)

---

[416] తర్వాత 'అప్సరస్సు యో గంధో' అను మంత్రమును చెప్పుచు స్నాతకుడు మిగిలిన గంధమును తన ముఖమునకును, శరీరమునకు పూసికొనవలెను.

[417]సౌవర్ణగ్ం=సువర్ణవికారమైనట్టిదియు, సోపధానగ్ం=వజ్రవైడూర్యాదులతో గూడుకొన్నదియు, సూత్రప్రోతమ్=దారమందు గుచ్చబడినట్టిదియు నగు, మణిగ్ం=మణిని, ఇయమోషధీతి= తరువాత నిచ్చిన 'ఇయమోషధి' అను మంత్రముతో, ఉదకపాత్రే=నీటిపాత్రలో, త్రిః = మూడు సార్లు, ప్రదక్షిణం=కుడినుండి ఎడమకు, పరిప్లావ్య=త్రిప్పి (ఇచట చెప్పిన వజ్రవైడూర్యాదులు దొరుకుట కష్టము కనుక, ఒక బంగారుగొలుసును ఈమంత్రమును చదివి మూడు సార్లు నీటిపాత్రలో త్రిప్పుచున్నారు.)

[418] ఆ గొలుసును 'అపాశోఽస్యరోమే' అనుమంత్రముతో మెడలో ధరించుచున్నాడు.

[419] ఏవమేవ=పైప్రకారమే నీటిపాత్రలో మూడుసార్లు త్రిప్పి, సూత్రోతం=దారమునకు గ్రుచ్చబడిన, బాదరం మణిం= రేగుగింజ మణిని, సవ్యేపాణౌ=ఎడమచేయి మణికట్టునందు, మంత్ర

## ఉత్తరవస్త్రధారణమ్

[420]సూ॥ వాసస్సద్యః కృత్తోత ముత్తరాభ్యామభిమన్త్ర్య

*మం॥ రేవతీస్త్వా వ్యక్ష్ణన్కృత్తికాశ్చాకృన్తగ్ స్త్వా। ధియోఽవయన్న వగ్నా అవృఞ్జ-న్త్సహస్రమన్తాగ్ం అభితో అయచ్ఛన్న్ ॥౧॥ దేవీర్దేవాయ పరిధీ సవిత్రే మహత్తదాసా-మభవన్మహిత్వనమ్॥౨॥* (తై.మం.పా.2.2)

[421]సూ॥ ఉత్తరాభి స్తిసృభిః పరిధాప్య।

*మం॥ యా అకృన్తన్నవయన్ యా అతన్వత యాశ్చ దేవీరన్తానభితోఽదదన్త। తాస్త్వా దేవీర్జరసే సంవ్యయన్త్వాయుష్మానిదం పరిధత్స్వ వాసః॥౧॥ పరిధత్త ధత్త వాససైనగ్ం శతాయుషం కృణుత దీర్ఘమాయుః। బృహస్పతిః ప్రాయచ్ఛద్వాస ఏత-త్సోమాయ రాజ్ఞే పరిధాతవా ఉ ॥౨॥ జరాం గచ్ఛాసి పరిధత్స్వ వాసో భవా కృష్టీ-నామభిశస్తిపావా। శతంచ జీవ శరదస్సువర్చా రాయశ్చ పోషముపసంవ్యయస్వ॥3॥* (తై.మం.పా.2.2)

[422]వా॥ఇతి పరిధాప్య, ఆచమయ్య, పరిహిత ముత్తరానుమన్త్రయతే।

---

వర్జగ్ం=మంత్రరహితముగా, ఆబధ్య=కట్టుకొని, అహతం=తడిపి ఆరవేసిన క్రొత్త వస్త్రమును, ఉత్తరం వాసః=ఉత్తరీయముగా, 'రేవతీస్త్వా' ఇత్యాదిమంత్రములతో, సమానమ్= ఉపనయన ములోవలెనే (ధరించుచున్నాడు). ఇచ్చట స్నాతకుడు మంత్రరహితముగా తలపాగను కూడ ధరించుట ఆచారము.

[420] ఆచార్యుడు వటువున కుత్తరీయముగా కట్టించుటకు తడిపి ఆరవేసిన క్రొత్తవస్త్రమును ఎడమ చేతిలో నుంచుకొని, దానిపై కుడిచేతిని కప్పియుంచి, తరువాత నొసగిన 'రేవతీస్త్వా', 'దేవీ ర్దేవాయ' అను రెండుమంత్రములతో అభిమంత్రింపవలెను.

[421] తరువాత ఆచార్యుడు '*యా అకృన్తన్నవయన్*' ఇత్యాది మూడు మంత్రములను చెప్పుచు ప్రాఙ్ముఖుడైన స్నాతకునికి ఆవస్త్రము నుత్తరీయముగా నడుముకు కట్టవలెను.

[422] ఆతర్వాత వటువుచే ఆచమయ్య=ఆచమనము చేయించి, పరిహితం=ఇట్లు వస్త్రమును కట్టు కొన్న కుమారుని, ఉత్తరానుమంత్రయతే= తర్వాతి '*పరీదం వాసో*' అను మంత్రమును చెప్పుచు

*మం॥ పరీదం వాసో అధిధాస్స్వస్తయేఽభూరాపీనామభిశస్తిపావా। శతంచ జీవ శరదః పురూచీర్వసూని చార్యో విభజాసి జీవన్॥* (తై.మం.పా.2.2)

## ప్రధానహోమాః (తై.మం.పా.2.8)

[423]సూ॥ తస్య దశాయాం ప్రవర్తౌ ప్రబధ్య దర్వ్యామాధాయాజ్యేనాభ్యానయన్నుత్తరాహుతీర్హుత్వా జయాది ప్రతిపద్యతే।

1. *ఆయుష్యం వర్చస్యగ్ం సువీర్యగ్ం రాయస్పోషమౌద్భిద్యమ్। ఇదగ్ం హిరణ్యం జైత్ర్యాయావిశతాం మాగ్ స్వాహా। హిరణ్యాయేదం నమమ।*
2. *ఉచ్చైర్వాది పృతనాజి సత్రాసాహం ధనంజయమ్। సర్వాస్సమృద్ధీర్ ఋద్ధయో హిరణ్యేఽస్మిన్సమాహితాస్స్వాహా। హిరణ్యాయేదం నమమ।*
3. *శునమహగ్ం హిరణ్యస్య పితురివ నామాగ్రభైషమ్। తం మా హిరణ్యవర్చసం పూరుషు ప్రియం కురు స్వాహా। హిరణ్యాయేదం నమమ।*
4. *ప్రియం మా దేవేషు కురు ప్రియం మా బ్రహ్మణే కురు। ప్రియం విశ్యేషు శూద్రేషు ప్రియగ్ం రాజసు మా కురు స్వాహా। హిరణ్యాయేదం నమమ।*
5. *యా తిరశ్చీ నిపద్యసేఽహం విధరణీ ఇతి। తాం త్వా ఘృతస్య ధారయా యజే సగ్ంరాధనీ మహగ్ం స్వాహా। సగ్ంరాధన్యా ఇదం నమమ।*
6. *సగ్ంరాధన్యై దేవ్యై స్వాహా। సగ్ంరాధన్యై దేవ్యా ఇదం నమమ।*
7. *ప్రసాధన్యై దేవ్యై స్వాహా। ప్రసాధన్యై దేవ్యా ఇదం నమమ।*
8. *సమ్రాజం చ విరాజం చాభిశ్రీర్యా చ నో గృహే। లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా*

---

(ఆచార్యుడు మాణవకుని తలను కుడిఅరచేతితో తాకి) అభిమంత్రించుచున్నాడు.

[423] తస్య=ఆ ఉత్తరీయముయొక్క, దశాయాం=కొనయందు, ప్రవర్తౌ=మనుష్యపాత్రలయం దాసాదనచేసిన కర్ణకుండలములను, ప్రబధ్య=కట్టి, దర్వ్యాం=ప్రధానదర్వీయందు, ఆధాయ=(జాగ్రత్తగా) ఉంచి, ఆభ్యానయన్=ఆకుండలములమీదుగా నేయిని కార్చుచు, ఆజ్యేన=నేతితో,ఉత్తరాః=పైవియగు,ఆహుతీః='ఆయుష్యంవర్చస్యం' ఇత్యాదిమంత్రములతో అష్టాహుతులను,హుత్వా=హోమముచేసి,జయాది ప్రతిపద్యతే=జయాదులను చేయుచున్నాడు.

*మా సగ్ంసృజామసి స్వాహా/ లక్ష్మ్యై ఇదం నమమ/*

[424]ఇత్యష్టాహుతీర్హుత్వా। జయాదిప్రతిపద్యతే। శమ్యా అపోహ్యా। సంస్రావం చ కృత్వా। ప్రాణాయామం ప్రణీతావోక్షణం బ్రహ్మోద్వాసనం అభివాదనాన్తం కుర్యాత్।

## కుణ్డలధారణమ్

[425]సూ॥ ఏతాభిరేవ దక్షిణే కర్ణే అబధ్నీత। ఏతాభి స్సవ్యే। న స్వాహాకారః।

*మం॥ ఆయుష్యం వర్చస్యగ్ం సువీర్యగ్ం రాయస్పోషమౌద్భిద్యమ్/ ఇదగ్ం హిరణ్యం జైత్ర్యాయావిశతాం మామ్ / ఉచ్చైర్వాది పృతనాజి సత్రాసాహం ధనం-జయమ్/ సర్వాస్సమృద్ధీర్ ఋద్ధయో హిరణ్యే౽స్మిన్త్సమాహితాః / శునమహగ్ం హిరణ్యస్య పితురివ నామాగ్రభైషమ్/ తం మా హిరణ్యవర్చసం పూరుషు ప్రియం కురు/ ప్రియం మా దేవేషు కురు ప్రియం మా బ్రహ్మణే కురు/ ప్రియం విశ్యేషు శూద్రేషు ప్రియగ్ం రాజసు మా కురు/ యా తిరశ్చీ నిపద్యసే౽హం విధరణీ ఇతి/ తాం త్వా ఘృతస్య ధారయా యజే సగ్ంరాధనీమహమ్/ సగ్ంరాధన్యై దేవ్యై స్వాహా ప్రసాధన్యై దేవ్యై స్వాహా/ సమ్రాజం చ విరాజం చాభిశ్రీర్యా చ నో గృహే/ లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ంసృజామసి//* (తై.మం.పా.2.8)

[426]ఏవ ముత్తరై ర్యథా లింగమ్। స్రజశ్శిరసి। అంజన మాదర్శావేక్షణ ముపానహౌ ఛత్రం

---

[424] పై ఎనిమిది హోమములను చేసి, ఆ తరువాత షట్పాత్రప్రయోగము 52-65 పుటలలో నిచ్చి నట్లుగా జయాదిహోమములను చేసి, శమ్యలను తీసివేసి, సంస్రావహోమమును, ప్రాణాయామమును, ప్రణీతామోక్షణమును, బ్రహ్మోద్వాసనమును, అభివాదాన్తముగా చేసి, ఉత్తరీయపు టంచున కట్టిన కుండలములను విడుదల చేయవలెను.

[425] ఆకుండలములో నొకదానిని, ఏతాభిరేవ=ప్రధానహోమమునందలి ఎనిమిది మంత్రముల తోనే, దక్షిణే కర్ణే=కుడిచెవియందు, అబధ్నీత=కట్టుకొనవలెను (ధరింపవలెను); ఏతాభిః =అదే మంత్రములతో, సవ్యే=ఎడమచెవియందు (ధరింపవలెను); న స్వాహాకారః= ఈమంత్రములలో స్వాహాకారము లేదు. ఇట్టి స్వాహాకార రహితమంత్రములు క్రింద నొసంగబడినవి.

[426] ఏవం=ఈ చెప్పబోవు ప్రకారము, ఉత్తరైః=ముందు చెప్పబోవు మంత్రములతో, యథాలింగం

దండమితి।

## స్రజమ్ (పూలదండను ధరించుట)

*మం॥ శుభికే శిర ఆరోహ శోభయన్తీ ముఖం మమ। ముఖగ్ం హి మమ శోభయ భూయాగ్ంసం చ భగం కురు। యామాహరజ్జమదగ్నిశ్శ్రద్ధాయై కామాయాన్యై। ఇమాం తామపి నహ్యేఽహం భగేన సహ వర్చసా॥* (త్రై.మం.పా.2.8)/*(స్రజం బధ్నాతి)*

## అంజనమ్ (కాటుక పెట్టుకొనుట)

*మం॥ యదాఞ్జనం త్రైకకుదం జాతగ్ం హిమవత ఉపరి। తేన వామాంజే తేజసే వర్చసే భగాయ చ। మఱు పర్వత పూరుషం మఱు పర్వతవర్చసం మఱు పర్వతభేషజం మఱు పర్వతాయుషమ్॥॥* (త్రై.మం.పా.2.8,9)/

## ఆదర్శావేక్షణమ్ (అద్దములో చూచికొనుట)

*మం॥ యన్మే వర్చః పరాగతమాత్మానముపతిష్ఠతి। ఇదం తత్పునరాదదే దీర్ఘాయు-త్వాయ వర్చసే॥॥* (త్రై.మం.పా.2.9)

## [427]ఉపానహౌ (చెప్పులజోడు వేసికొనుట)

*మం॥ ప్రతిష్ఠే స్థో దేవతానాం మా మా సంతాప్తమ్॥॥* (త్రై.మం.పా.2.9)

---

=మంత్రలింగమతిక్రమించకుండ, శిరసి=తలపై (లేక మెడలో), స్రజః=పూలదండను, అంజనం =కాటుకను ధరించుటను,ఆదర్శావేక్షణం=అద్దములో చూచికొనుటను, ఉపానహౌ=పాద రక్షలను, ఛత్రం=గొడుగును, దండం=చేతికఱ్ఱనుధరించుటను చేయవలెను. కొన్ని పద్ధతులు: పూలదండను వేయుట, గంధమును, కాటుకను పెట్టుట తల్లిగాని, చెల్లెలు/అక్కగాని లేదా కాబోయే అత్తగారుగాని స్నాతకునకు చేయుట ఆచారము. చెప్పులను రెండింటిని ఏకకాలము లోనే ధరింపవలెను. గొడుగును అమంత్రకముగా తీసికొని, తనపై కప్పుకొని మంత్రమును చెప్ప వలెను. మంత్రమును చెప్పి వెదురుకఱ్ఱను (దండమును) పట్టుకొనవలెను.

[427] గమనిక: పాదరక్షలు, ఛత్రము, దండములకు గావలసిన మంత్రముల మాత్ర మిప్పుడు చెప్పి, వాని నిప్పుడు ధరింపక, కాశీయాత్రకై పోవునప్పుడు ధరించుట ఆచారముగా నున్నది.

## ఛత్రం

(గొడుగును మంత్రరహితముగాతీసికొని, తనపై కప్పుకొని మంత్రమును చెప్పవలెను):

*మం// ప్రజాపతేశ్శరణమసి బ్రహ్మణశ్ఛదిర్విశ్వజనస్య ఛాయాఽసి సర్వతో మా పాహి//* (తై.మం.పా.2.9)

## దండం (వెదురు చేతికఱ్ఱను పట్టుకొనుట; తై.మం.పా.2.9)

*మం// దేవస్య త్వా సవితుః ప్రసవే/ అశ్వినోర్బాహుభ్యామ్/ పూష్ణో హస్తాభ్యామాదదే ద్విషతో వధాయేంద్రస్య వజ్రోఽసి వార్త్రఘ్న శ్శర్మ మే భవ యత్పాపం తన్ని వారయ//*

## ఉపనిష్క్రమణమ్

[428]సూ|| వాచం యచ్ఛత్యానక్షత్రేభ్యః | ఉదితేషు నక్షత్రేషు ప్రాచీ ముదీచీం వా దిశ ముప నిష్క్రమ్య| ఉత్తరేణార్ధర్చేన దిశ ముపస్థాయోత్తరేణ నక్షత్రాణి చంద్రమసమితి|

*మం//దేవీష్షడుర్వీరురుణః కృణోత విశ్వేదేవాస ఇహ వీరయధ్వమ్//*(తై.సం.4.7.14)

- ఇతి దిశముపస్థాయ,

---

[428] ఆనక్షత్రేభ్యః=నక్షత్రోదయపర్యంతము,వాచం=మాటలను, యచ్ఛతి=నిలువరించుకొను చున్నాడు – అనగా వాఙ్నియమమును (మౌనమును) పాటించి, ఉదితేషు నక్షత్రేషు=నక్షత్రో దయమైన తర్వాత, ప్రాచీముదీచీం వా దిశం= తూర్పు లేక ఉత్తరదిశకు, ఉపనిష్క్రమ్య = బయల్వెడలి, ఉత్తరేణార్ధర్చేన=తర్వాత నిచ్చిన 'దేవీష్షడుర్వీః' అను మంత్రముతో దిశం= తూర్పు, దక్షిణము,పశ్చిమము, ఉత్తరము, ఊర్ధ్వము, అధరము– ఇట్లన్ని దిశలకు, ఉపస్థాయ =నమస్కరించి, ఉత్తరేణ= తర్వాతి 'మాహాస్మహి' అను మంత్రముతో, నక్షత్రాణి=నక్షత్రము లను, చంద్రమసమ్=చంద్రుని, ఉపస్థాయ=నమస్కరించి; పూర్వము స్నాతకుడు గోశాలలో సూర్యరశ్మి తగులకుండా దినమంతా గడిపి, సూర్యాస్తమయానంతరము బయటికి వచ్చి ఇట్లు చేసెడివాడేమో కాని ఈకాలమున ఇట్లు జరుగుట లేదు. అందుచేత గృహమందీ కర్మను చేసి నపుడే నక్షత్రములను, చంద్రుని చూచుచున్నట్లు భావించి ఈ ఉపస్థానములను చేయవలెను. వస్తుతః నక్షత్రములు, చంద్రుడు ఆకాశములో పగలుకూడ ఉండును. కాని అవి సూర్యరశ్మిచే మఱుగయియుండును. అందుచే ఇట్లు భావించుటలో దోషమేమీ లేదు.

*మం॥ మాహాఽస్మహి ప్రజయా మా తనూభిర్మా రధామ ద్విషతే సోమరాజన్న్॥*
(తై.సం.4.7.14) - ఇతి నక్షత్రాణాం చంద్రమసముపస్థాయ।
[429]సూ॥ రాతినా సంభాష్య యథార్థం గచ్ఛతి। మిత్రేణ గార్హస్థ్యగ్ంం సంభాష్యతి।

## అభ్యుదయమ్

[430]మాణవకః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం స్నాన కర్మాంగమభ్యుదయం కరిష్యే। అభ్యుదయార్థమష్టౌ బ్రాహ్మణాన్ భోజయిష్యే*' – ఇతి సంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ హిరణ్యరూపేణాభ్యుదయం కుర్యాత్।

## పుణ్యాహవాచనమ్

[431] పునః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభ తిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం స్నాన కర్మాంగం కర్మణః పుణ్యాహం వాచయిష్యే।*' – ఇతిసంకల్ప్య, పూర్వోక్తప్రకారేణ కర్మణః పుణ్యాహవాచనం కృత్వా ఆత్మానం ప్రోక్షయేత్।

---

[429]రాతినా=మిత్రునితో,సంభాష్య=మాట్లాడి(విచారించి) యథార్థం=తనకు తగిన ఆశ్రమమును గుఱించి,గచ్ఛతి=వెళ్లుచున్నాడు;మిత్రేణ=మిత్రునితో,గార్హస్థ్యం=గృహస్థాశ్రమమును గూర్చి, సంభాష్యతి=మాట్లాడుచున్నాడు. (సూచన: ఇట్టి సంభాషణ మీకాలములో ఎవరును చేయుట లేదు. వటువు స్నాతకానంతరమే సంన్యాసాశ్రమమునో గృహస్థాశ్రమమునో స్వీకరింపవలెను గాని, స్నాతకము చేసికొననిదే ఏ ఆశ్రమమును స్వీకరింపగూడ దనుటయే దీని సారాంశము.)

430 అభ్యుదయమునకై మాణవకుడు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---బ్రాహ్మణాన్ భోజయిష్యే' అని సంకల్పించి, 'నాందీశ్రాద్ధవిధిః' అను అధ్యాయములో చెప్పినట్లుగ హిరణ్యరూపముగ అభ్యుదయమును చేయవలెను.

431 మాణవకుడు మఱల ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయాం---కర్మణః పుణ్యాహం వాచయిష్యే' అని సంకల్పించి, 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగ పుణ్యాహవాచనము చేసి పుణ్యాహజలముచే తనను ప్రోక్షించుకొనవలెను.

## ఆశీర్వచనాదీని

[432]వా॥ తతః ఆచార్యః సదస్యాశ్చ మాణవకాయ ఆశీర్వచనం కుర్యుః।

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా। బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్।
కరోమి యద్యత్సకలం పరస్మై। నారాయణాయేతి సమర్పయామి'

ఇత్యాచార్యః కృతం కర్మ భగవత్సమర్పణం కృత్వా, ఏవమేవ మాణవకేన కారయేత్। సుమంగళీభిః మంగళగానం కారయేత్।

## కాశీయాత్ర

స్నాతకుడు ఆచార్యునితో అనుజ్ఞార్థ మీక్రింది శ్లోకమును చెప్పవలెను.

శ్లో॥ చరితబ్రహ్మచర్యో ఽహం కృతవ్రతచతుష్టయః।
కాశీయాత్రాం గమిష్యామి అనుజ్ఞాం దేహి మే శుభామ్॥

'బ్రహ్మచర్యము నాచరించి నాల్గు వేదవ్రతములను చేసికొన్న నేను కాశీయాత్రకు పోవు చున్నాను. దీనికై అనుజ్ఞ నీయవలసినది' – అని స్నాతకుడు ఆచార్యుని కోరి 'తథా ఽస్తు' అని ఆచార్యుని అనుజ్ఞను పొంది, స్నాతకములో ఏర్పాటు చేసిన చెప్పులను ధరించి, గొడుగును, దండమును, విసనకఱ్ఱను పట్టుకొని, తలపాగను ధరించి, ఒక మూటలో బియ్యమును కట్టుకొని తనవారు వెంట రాగా, మంగళవాద్యములు ముందు నడచుచుండగా తూర్పునకుగాని ఉత్తరమునకుగాని పోవలెను. అప్పుడు కన్యయొక్క సోదరుడుగాని, తండ్రిగాని– అనగా కాబోయే బావమఱదిగాని, మామగారుగాని– ఒక పళ్లెములో పన్నీరు, ఫలములు, బెల్లము, తాంబూలము, గంధము, టెంకాయ, నూతన వస్త్రములు పెట్టుకొని అతనికి ఎదురుగా వచ్చి

శ్లో॥ సాలంకారాం మమసుతాం కన్యాం దాస్యామి తే ద్విజ।

---

432 తర్వాత ఆచార్యుడు, సదస్యులు మాణవకుని కాశీర్వాదము చేయవలెను. ఆచార్యుడు ముందుగా 'కాయేన వాచా' శ్లోకమును చెప్పి, అదే శ్లోకమును మాణవకునిచేతను చెప్పించి, చేసిన కర్మను భగవన్నివేదనము చేయవలెను. ముత్తైదువలచే మంగళహారతి నిప్పించవలెను.

పాణిం గృహీత్వా సాగ్నిస్త్వం గచ్ఛస్వాఽఽగచ్ఛ మద్గృహమ్॥

'సాలంకృతయైన నా కూతురును నీకిత్తును. నాయింటికి రమ్ము. ఆమెను పెండ్లాడి, ఆమెతోడను, వివాహాగ్నితోడను మరలి పొమ్ము' – అని కోరవలెను. ఇట్లు స్నాతకుని ప్రార్థించి పరిమళద్రవ్యములచే పూజించి, నూతనవస్త్రతాంబూలాదుల నీయవలెను. బెల్లమును స్నాతకుని నోటిలో నుంచి, ఒక టెంకాయను చేతిలోపెట్టి, కన్యకను వరింపు మని కోరవలెను. ఇదంతయు కాబోయే బావమరిది చేయుట ఆచారము.కన్యాజనకుడు గాక కన్యాభ్రాతయే స్నాతకుని వివాహము చేసికొనుమని ప్రార్థించినచో పైశ్లోకము నీ క్రిందిరీతిగా మార్చి చెప్పుట యుక్తమనిపించుచున్నది.

శ్లో॥ 'సాలంకారాం ద్విజశ్రేష్ఠ! దాస్యామి మమ సోదరీం।
పాణిం గృహీత్వా సాగ్నిస్త్వం గచ్ఛస్వాఽఽగచ్ఛ మద్గృహమ్॥

అట్టి కన్యాపక్షమువారి ప్రార్థనను మన్నించి, వారికి నూతనవస్త్రములను, గంధాదుల నొసంగి వారిని సత్కరించుట ఆచారము. ఇదియే 'కాశీయాత్ర'.

అనంతరము స్నాతకుడు మంగళవాద్యములు ముందు నడచుచుండ తనవారితో హోమస్థానమునకు తిరిగి వచ్చి వాకిటి బయట నిలుచుండగా ముత్తైదువలు వసంత నీరాజనము నొసంగి అతనిని ఇంటిలోనికి ఆహ్వానింపవలెను. గమనిక: హోమానంత రము పైవిధముగా కాశీయాత్రను చేసి తిరిగివచ్చిన తర్వాత అభ్యుదయపుణ్యాహము లను, ఆశీర్వాదులను పూర్తిచేసికొనుట సైతము ఆచారముగా నున్నది.



# తూష్ణీం సమావర్తనమ్

(సమయాభావముచే గాని, ద్రవ్యాభావముచే గాని, మంత్రములు తెలిసిన ఆచార్యుడు లేకుండుటచే గాని అవసతిగా నున్నప్పుడు మంత్రరహితముగా సమావర్తనమును చేసి కొనవలెను. దీనికి తూష్ణీం సమావర్తన మని పేరు. దీనిని చాలా అరుదుగా చేసికొనుట జరుగుచున్నది. దీని పద్ధతి క్రిందివిధముగా నున్నది.)

[433]ప్రయోగః

మాణవకః దర్భేష్వసీనః దర్భాన్ ధారయమాణః పవిత్రపాణిః ద్విః ప్రాణానాయమ్య, '*శ్రీగోవింద గోవింద*' ఇత్యారభ్య, '*శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం తూష్ణీం స్నానకర్మ కరిష్యే*'– ఇతి సంకల్ప్య, సర్వాంగవపనం కారయిత్వా, తూష్ణీమేవ తీర్థే స్నాత్వా, ధౌతవస్త్రోర్ధ్వపుండ్రధారణానంతరం మౌంజీ దండాజిన బ్రహ్మచారిలిఙ్గాని బ్రహ్మచారిణే ప్రయచ్ఛేత్।స చ తాని తూష్ణీం దర్భస్తంబే ఉదుంబరమూలే వా నిక్షిపేత్।

---

433 మాణవకుడు దర్భలపై కూర్చుండి, రెండుదర్భలను మొలలో దోపికొని, పవిత్రపాణియై రెండుసార్లు ప్రాణాయామము చేసి, 'శ్రీగోవింద గోవింద... శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం తూష్ణీం స్నానకర్మ కరిష్యే' – అని సంకల్పించి, సర్వాంగ వపనం చేయించుకొని, స్నానము చేసి, ధౌతవస్త్రోర్ధ్వపుండ్రధారణానంతరం మౌంజీదండాజిన ములను త్యజించి వాని నొక బ్రహ్మచారి కీయగా నతడు వానిని మేడిచెట్టుమొదటనో, దర్భల దుబ్బులోనో అమంత్రకముగా నుంచవలెను. తర్వాత ధంతధావనమును, అంతరీయోత్తరీయా ర్థము నూతనవస్త్రముల ధరించుట అమంత్రకముగనే చేసి, సమంత్రకముగా నూతనయజ్ఞోపవీత ద్వయమును ధరించి, ప్రాతయజ్ఞోపవీతమును త్యజించి, శ్రోత్రియగృహమునుండి అగ్నిని తెచ్చి, స్థండిలముపై ప్రతిష్ఠించి, పరిస్తరణ,పరిషేచనాంతము చేసి, ప్రజాపతిని మనసులో ధ్యానిం చుచు మంత్రరహితముగా నొక మోదుగు సమిధ నగ్నిలో వేసి, ప్రాయశ్చిత్తహోమములను, ఉత్తరపరిషేచనాంతముగా చేసి, అమంత్రకముగనే చందనకుండలదండచ్ఛత్రాదులను ధరించి, అభ్యుదయం, పుణ్యాహములను చేసి ముగించవలెను.

దంతధావనాద్యంతరీయోత్తరీయధారణాన్యమంత్రకం కృత్వా। సమంత్రకం నవ్య యజ్ఞోపవీతద్వయం ధృత్వా, పురాతనయజ్ఞోపవీతం త్యక్త్వా, శ్రోత్రియాగారాదగ్ని మాహృత్య, ప్రతిష్ఠాప్య, పరిస్తీర్య, పరిషిచ్య, ప్రజాపతిం మనసా ధ్యాయన్ తూష్ణీం పాలాశీగ్ంసమిధ మగ్నా వాధాయ, ప్రాయశ్చిత్తహోమం, ఉత్తరపరిషేచనం కృత్వా, చందన కుండల దండ చ్ఛత్రాదిధారణ మమంత్రకం కృత్వా, అభ్యుదయం, పుణ్యాహ వాచనం చ కుర్యాత్।

## వ్యాహృతిహోమము

ఈకాలములో సమావర్తనము చేసికొనిననాడో, దానికి మఱునాడో స్నాతకుడు వివాహము చేసికొనుట జరుగుచున్నది. అట్లుగాక స్నాతకానంతరము వివాహమునకు కొన్నిరోజుల వ్యవధి యున్నచో, ఆరోజులలో స్నాతకుడు ఉదయసాయంకాలము లందు చతుష్పాత్రప్రయోగమును పూర్వపరిషేచనాంతముగ చేసి, ప్రధానదర్విలోనికి ఆజ్యమును తీసికొని

1. *ఓం భూస్స్వాహా। అగ్న య ఇదం నమమ॥*
2. *ఓం భువస్స్వాహా। వాయవ ఇదం నమమ॥*
3. *ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం నమమ॥*
4. *ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।*

అను ప్రత్యేకవ్యాహృతులు గల మొదటి మూడుమంత్రములతోను, అన్ని వ్యాహృతులతో కూడిన నాల్గవమంత్రముతోను హోమమును చేసి, అనాజ్ఞాతాదిహోమమును, ఉత్తరపరిషేచనమును, అగ్న్యుపస్థానమును చేసి ముగించవలెను.



# వాగ్దానవిధిః

(వివాహమునకు ముందుగా కన్యాకుటుంబమునకును, వరకుటుంబమునకును కన్యాదాన, వరవరణార్థము ఒప్పందము జరుగును. అట్లు జరిగిన తర్వాత ఉభయకుటుంబముల అంగీకారముతో ముహూర్తనిర్ణయము, లగ్నపత్రికను వ్రాసికొనుట జరుగును. ఆతర్వాత ఈ అంగీకారమును స్థిరపఱచుకొనుటకు లాంఛనముగా 'వాగ్దానక్రియ' జరుగును. దీనికే 'నిశ్చితార్థ' మనియు, 'తాంబూలములు పుచ్చుకొనుట' అనియు పేర్లు. ఆపస్తంబసూత్రములో దీనినిగుఱించిన వివరములు లేవు. ఐనను ఈక్రియ సర్వసాధారణముగా జరుగుచున్నది. 'కాశ్యపసంహితలో' నీ వాగ్దానవిధి తెల్పబడినది. తదనుసారముగా 'సంస్కారరత్నమాల' అను గ్రంథములోను, 'బోధాయనవేంకటేశీయము' లోను నీవిధి వ్రాయబడినది. తత్ప్రకారమే ఈప్రయోగము వ్రాయబడినది.)

## ప్రయోగః

[434] జ్యోతిర్విదాదిష్టే ముహూర్తే వరః పిత్రాదిరిష్టబంధువృద్ధమాన్యపురంధ్రీభిః మంగళవాద్యఘోషైశ్చ సహితః కన్యాగృహం ప్రతి గచ్ఛతి। కన్యాపితా తేషాం సగౌరవహ్వానం కరోతి। తత శ్శుభవేదికాసమీపే కన్యాపితా జాయాసహితః ప్రాఙ్ముఖః ఉపవిశన్తి।
తయోః పురతః వరపితా, మాతా, వరశ్చ ఉపవిశన్తి।

[435] తతో వరపితా 'అముకప్రవరాన్విత అముకగోత్రోత్పన్నాయ అముకశర్మణః ప్రపౌత్రాయ అముకశర్మణః పౌత్రాయ అముకనామధేయస్య మమపుత్రాయ అముక

---

[434] జ్యోతిర్విదులచేత నిర్ణయింపబడిన శుభముహూర్తమున (ముహూర్తమునకు ముందు గానే) వరుడు, అతని తల్లిదండ్రులు, తత్సంబంధీకులు, ఇతరపెద్దలు, సుమంగళులతో సహ (ఉన్నచో మంగళవాద్యయుతముగా) కన్యాదాతగృహమున కేగుదురు. కన్యాపిత వారి నప్పుడు సగౌరవముగా నాహ్వానించును. తరువాత కన్యాదాత, అతనిభార్య శుభవేదికకడ పీటలపై తూర్పు ముఖముగా కూర్చొందురు. వారి కెదురుగా వరునితండ్రి, తల్లి, పిత, వరుడు పశ్చిమముఖముగా పీటలపైకూర్చొందురు.

[435] అట్లు కూర్చున్న తర్వాత వరునితండ్రి 'ఫలానా ప్రవరాన్వితమగు ఫలనాగోత్రమునందు

శర్మణే వరాయ అముకప్రవరాన్విత అముకగోత్రోత్పన్నాం అముకశర్మణః ప్రపౌత్రీం అముకశర్మణః పౌత్రీం అముకనామధేయస్య భవత్పుత్రీం అముకనామ్నీం కన్యాం భార్యాత్వాయ వృణీమహే' – ఇతి కన్యాపితరం ప్రతి వదేత్। తతః కన్యాపితా 'వృణీధ్వమ్', 'వృణీధ్వమ్', 'వృణీధ్వమ్', 'ప్రదాస్యామి', 'ప్రదాస్యామి', 'ప్రదాస్యామి'– ఇతి త్రివారం ప్రతి బ్రూయాత్।

[436]తతః పురోహితోక్తేన 'అనృక్షరా', 'దేవీం వాచమజయన్త' ఇతి మంత్రాభ్యాం శుభ్ర వస్త్రాం సాలంకృతాం సుమంగళీభిః పరివృతాం కన్యా మాహూయ శుభవేదికాయాం తస్యాః మాతస్య దక్షిణే పీఠే ప్రాఙ్ముఖీ ముపవిశేత్।

మం॥ ఓం అనృక్షరా ఋజవస్సన్తు పన్థా యేభిస్సఖాయో యన్తి నో వరేయమ్। సమర్యమా సంభగో నో నినీయాథ్సంజాస్పత్యగ్ం సుయమమస్తు దేవాః॥౧॥ (తై.మం.పా.1.1)।

మం॥ దేవీం వాచమజయన్త దేవాః। తాం విశ్వరూపాః పశవో వదన్తి। సా నోమన్ద్రేష మూర్జ్దుహానా। ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు॥౨॥(తై.బ్రా.2.4.6)।

---

పుట్టినవాడును, ఫలానాశర్మయొక్క ప్రపౌత్రుడును, ఫలానాశర్మయొక్క పౌత్రుడును, ఫలనా నామధేయముగల నాయొక్క పుత్రుడును, ఫలానాపేరుగల ఈ వరునికి, ఫలానా ప్రవరాన్విత మగు ఫలనాగోత్రమునందు బుట్టినదియు, ఫలానాశర్మయొక్క ప్రపౌత్రియును, ఫలానాశర్మ యొక్క పౌత్రియును, ఫలనానామధేయముగల మీయొక్క పుత్రికయు నగు ఫలానాపేరు గల ఈకన్యను భార్యాత్వమునకై కోరుచున్నాము' అని కన్యాపితను ప్రార్థించవలెను. ఇచ్చట 'ఫలానా' అన్నచోట ఆయా ఋషులపేర్లుగల ప్రవరలయొక్కయు, గోత్రములయొక్కయు, వ్యక్తులయొక్కయు పేర్లు చెప్పవలెను. అట్లు పలుకగా కన్యాపిత 'వృణీధ్వమ్=కోరుకొనండి' అని మూడుసార్లును, 'ప్రదాస్యామి=ఇచ్చుచున్నాను' అని మూడుసార్లును పలికి తన అంగీ కారమును తెలియజేయవలెను.

[436] తర్వాత పురోహితుడు 'అనృక్షరాం', 'దేవీ వాచమయజన్త' అను మంత్రములను చదువు చుండగా శుభ్రవస్త్రాన్వితయు, సాలంకారయు నైన కన్యకను శుభవేదికకడకు కొందరు సుమం గళులు తీసికొని రాగా, ఆమెను తల్లికి కుడివైపుపీటపై ప్రాఙ్ముఖముగా కూర్చుండబెట్టవలెను.

**వాగ్దానసంకల్పః** [437]కన్యాదాతా ఆచమ్య, దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే//*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్/*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే//*
*లక్ష్మీ నాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్/*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే----అయనే----ఋతౌ----మాసే----పక్షే--తిథౌ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం ఉత్తరే కరిష్యమాణ కన్యామహాదానకర్మణః పూర్వాంగత్వేన వాగ్దానమహం*

---

[437] తర్వాత మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా కన్యాదాత ఆచమనము చేసి, ప్రాణాయామము చేసి, 'శుక్లామ్బరధరం విష్ణుం' నుండి మొదలిడి 'యస్య ద్విరదవక్త్రాద్యాః' వరకు గల శ్లోకములను చెప్పి, 'హరిరోం తత్సత్' నుండి మొదలిడి 'కరిష్యే' వరకు సంకల్పమును చెప్పి, మఱల '*తత్కర్మనిర్విఘ్న పరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే*' అని సంకల్పించి, '*స్వశేషభూతేన మయా....*' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధన చేయవలెను. ఈఆరాధనయందు ఉభయపక్షములును పాల్గొనవచ్చును.

*కరిష్యే। తత్కర్మనిర్విఘ్నపరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే'* - ఇతి సంకల్ప్య,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా విష్వక్సేనారాధనం కుర్యాత్।

[438]తతః పురోహితః లగ్నపత్రికాం పఠతి। తతః కన్యాదాతా వరపితా చ లగ్నపత్రికా వినిమయం కురుతః।

**వరాయ కట్నప్రదానమ్:** [439]వధ్వాః మాతాపితరౌ వరం సంపూజ్య ఫలపుష్పగంధ తాంబూలసహితాని నవవస్త్రాణి దదేతే।

మం॥ అర్చత ప్రార్చత। అర్చత ప్రార్చత। యువం వస్త్రాణి పీవసా వసాథే। యువో రచ్ఛిద్రామన్తవో హ సర్గాః। అవాతిరతమనృతాని విశ్వా। ఋతేన మిత్రావరుణా సచేథే। (తై.బ్రా.2.8.6)।

(శ్రీమద్వేదమార్గప్రవర్తకులైన శ్రీమాన్ ----వారు తమ కాబోయే అల్లునకు శ్రీమాన్ ---- శర్మకు నిశ్చితార్థసందర్భముగా సమర్పించు నూతనవస్త్రాదికములు)

**వధ్వై కట్నప్రదానమ్:** [440]వరస్య మాతాపితరౌ వధూం సంపూజ్య ఫలపుష్పగంధ

---

[438] లగ్నపత్రికలు వ్రాసికొనియుండినచో, వానిని ఫలపుష్పములతోబాటు ఒక వెండి లేక బెత్తపు తట్టలో నుంచి, పురోహితున కీయగా నతడా లగ్నపత్రికలను చదువును. ఆతర్వాత ఇరుపక్షములవారు ఒకరి లగ్నపత్రికను ఇంకొకరి కిచ్చుకొనుట చేసికొందురు.

[439] వధువు తల్లిదండ్రులు వరుని నుదుట బొట్టును పెట్టి, 'యువం వస్త్రాణి' అను మంత్రమును వాధ్యారు చదువుచుండగా, ఫలపుష్పగంధాదులతో నవవస్త్రములను వరున కిత్తురు. అప్పుడు వాధ్యారు 'శ్రీవేదమార్గప్రవర్తకులైన..' అను వాక్యమును వధువుతండ్రిపేరును, వరుని పేరును గీతలుగలచోట చెప్పుచు చదువును. ఆవస్త్రములు ధరించి వచ్చివరుడు పీటపై కూర్చొనును.

[440] వరుని తల్లిదండ్రులు వధువు నుదుట బొట్టును పెట్టి, 'సుమంగలీరియం' అను మంత్రమును వాధ్యారు చదువుచుండగా, ఫలపుష్పగంధములతో బాటు నూతనవస్త్రములను ఆభరణము

కుంకుమతాంబూలసహితాని నవవస్త్రాభరణాని దదేతే|

మం|| అర్చత్త ప్రార్చత| సుమంగలీరియం వధూరిమాగ్ం సమేతపశ్యత| సౌభాగ్య మస్యై దత్వా యాథాస్తం విపరేతన| హిరణ్యరూపస్సహిరణ్య సందృగపాన్నప్తా త్సేదు హిరణ్యవర్ణః| హిరణ్యయాత్పరియోనేర్నిషద్యా హిరణ్యదా దదత్యన్న మస్మై||

(శ్రీమద్వేదమార్గప్రవర్తకులైన శ్రీమాన్ ----వారు తమ కాబోయే కోడలికి సౌభాగ్యవతి ---- కుమారికి నిశ్చితార్థసందర్భముగా సమర్పించు నూతనవస్త్రాభరణాదులు)

[441]తాని వస్త్రాణి, ఆభరణాని చ ధృత్వా వధూవరౌ ప్రత్యాగచ్ఛతః| తతస్తౌ పుష్పమా లాలంకృతౌ భవతః|

**వాగ్దానమ్:** [442]కన్యాదాతా వరపితరౌ ప్రాఙ్ముఖముపవేశ్య, స్వయం ప్రత్యఙ్ముఖో భూత్వా, ఫలపుష్పతాంబూలాక్షతహరిద్రాఖండ, పంచాఖండపూగీఫలాని గృహీ త్వోత్థాయ,

---

లను వధువున కిత్తురు. తర్వాత చెప్పు వాక్యములో వరునితండ్రిపేరును, వధువుపేరును గీత లుంచిన చోట చెప్పవలెను. ఆవస్త్రభూషణములు ధరించి వచ్చి వధువు పీటపై కూర్చుండును.

[441] అప్పుడు వరపక్షమువారు వధువును, వధూపక్షమువారు వరుని పుష్పమాలలచే నలంక రింతురు.

[442] తర్వాత వరమాతాపితరులను ప్రాఙ్ముఖముగా కూర్చుండబెట్టి, వధువుతండ్రి వారి కెదురుగ పడమటికి మళ్లి ఫలపుష్పతాంబూలాక్షతలను, పసుపుకొమ్మును ఐదు గుండుపోకల నొక తట్టలో పెట్టుకొని నిలబడి, ‘ఓం అముక గోత్రోత్పన్నః=ఫలానాగోత్రమునందు జన్మించిన, అముక నామధేయోఽహం=ఫలానా పేరుగల నేను, అముకగోత్రోత్పన్నస్య=ఫలానాగోత్రము నందు జనించిన, అముక నామధేయస్య=ఫలానాపేరుగలవానియొక్క,అముకనామ= ఫలానా పేరుగల ,పుత్రాయ=పుత్రుడైన, విష్ణుస్వరూపిణే=విష్ణురూపుడైన, వధ్వర్థినే=వధువునుకోరు కొనుచున్న, వరాయ= వరునికొఱకు, మమ సుతాం=నాకూతురైన, అముక నామ్నీం=ఫలానా పేరు గల, శ్రీరూపిణీం=లక్ష్మీస్వరూపిణియైన, వరార్థినీం=వరుని కోరుకొనుచున్న, ఇమాం క

‘ఓం అముకగోత్రోత్పన్నః అముకనామధేయోఽహం అముకగోత్రోత్పన్నస్య అముకనామధేయస్య పుత్రాయ అముకనామ విష్ణుస్వరూపిణే వధ్వర్థినే వరాయ, మమ సుతాం అముకనామ్నీం శ్రీరూపిణీం వరార్థినీమిమాం కన్యాం జ్యోతిర్విద సునిశ్చితాం ముహూర్తే దాస్యే’

శ్లో॥ జన్మప్రభృతీయం సుతాఽఽత్మవత్పాలితా మయా।
త్వత్పుత్రాయ ప్రదాస్యామి స్నేహేన పరిపాలయతామ్॥౧॥

శ్లో॥ అవ్యఙ్గేఽపతితేఽక్లీబే దశదోషవివర్జితే।
ఇమాం కన్యాం ప్రదాస్యామి దేవాగ్నిద్విజసన్నిధౌ॥౨॥

శ్లో॥ వాచా దత్తా మయా కన్యా వరార్థం స్వీకృతా త్వయా।

---

న్యాం =ఈ కన్యను, జ్యోతిర్విదసునిశ్చితాం ముహూర్తే=జ్యోతిర్విదులచే నిశ్చయింపబడిన మంచి ముహూర్తమున, దాస్యే=ఇచ్చుచున్నాను’ – అని చెప్పవలెను. ‘అముక’ అనగా ‘ఫలానా’ అని అర్థము. ఇది యున్నచోట సందర్భానుసారముగా ఆయా గోత్రములయొక్క, వ్యక్తులయొక్కయు పేర్లను చెప్పుచు పైవాక్యమును చదువవలెను. ఆతర్వాత ‘జన్మప్రభృతి’, ‘అవ్యఙ్గే’, ‘వాచా దత్తా’ అను మూడు శ్లోకములను చెప్పి, ఆఫలపుష్పతాంబూలమును వరుని తల్లి దండ్రుల కిచ్చి, ఆపసుపుకొమ్మును, ఐదు గుండువక్కలను అక్షతలతో సహ వరునితండ్రి యొక్క ఉత్తరీయపుకొనకు కట్టి అట్లుకట్టిన ముడిని గంధములో నద్దవలెను. ఈశ్లోకముల అర్థములివి: ౧:పుట్టినదిమొదలు, ఈకూతురు నా ఆత్మవలెనే, నాచేత పెంచబడినది. అట్టి ఈమెను నీపుత్రున కిచ్చుచున్నాను. ఈమె మీచే స్నేహముతో నేలబడుగాత!; ౨: ‘అంగ లోపము లేని వాడును, పతితుడు కాని వాడును, నపుంసకుడును కానివాడును, దశదోషములు లేనివాడును నగు వరునికి దైవము, అగ్ని, ద్విజుల సమక్షములో ఈకన్య నిచ్చెదను (అనగా వివాహమునకు ముందుగా వరునిలో నిట్టి దోషములు కన్పించినయెడల ఈ ఒప్పందమునుండి విరమించుకొను అవకాశమును కన్యాదాత కల్పించుకొనుచున్నాడు.) 3: నాచే వాగ్దానపూర్వకముగా నీయబడిన ఈకన్య నీచే స్వీకరింపబడినది. ఇక కన్యావలోకనవిధియందు నీవు నిశ్చింతుడవై సుఖుడవై యుండుము.

కన్యావలోకనవిధౌ నిశ్చిన్తస్త్వం సుఖీభవ॥3॥

ఇత్యుక్త్వా ఫలపుష్పతాంబూలాని వరపితృభ్యాం దద్యాత్। హరిద్రాఖండపూగీఫలాని సాక్షతాని వరపితృవస్త్రాంచలే బధ్వా, గ్రన్థిం చన్దనేన చర్చయేత్।

తతో వరపితా వధూపితరౌ ప్రాఙ్ముఖముపవేశ్య, స్వయం ప్రత్యఙ్ముఖో భూత్వా, ఫలపుష్పతాంబూలాక్షతహరిద్రాఖండ, పంచాఖండపూగీఫలాని గృహీత్వోత్థాయ,

శ్లో॥ వాచా దత్తా త్వయా కన్యా వరార్థం స్వీకృతా మయా।

వరావలోకనవిధౌ నిశ్చిన్తస్త్వం సుఖీభవ॥4॥

[443]ఇత్యుక్త్వా ఫలపుష్పతాంబూలాని వధూపితృభ్యాం దద్యాత్। హరిద్రాఖండపూగీఫలాని సాక్షతాని వధూపితృవస్త్రాంచలే బధ్వా, గ్రన్థిం చన్దనేన చర్చయేత్।

[444]తత స్సదస్యాః 'వాగ్దానముహుర్త స్సుముహూర్తోఽస్తు' అత్యక్షతైరనుగ్రహం కుర్యుః। బ్రాహ్మణాః 'శివా ఆపస్సన్తు', 'సౌమనస్యమస్తు', 'అక్షతాచారిష్టంచాస్తు', 'దీర్ఘమాయుశ్శ్రియశ్శాన్తిః పుష్టిస్తుష్టిశ్చాఽస్తు', 'ఏతద్వస్సత్యమస్తు' ఇతి వదేయుః।

---

[443] పిదప వరునితండ్రి వధువు తల్లితండ్రులను ప్రాఙ్ముఖముగా కూర్చుండబెట్టి, తానొక తట్టలో ఫలపుష్పతాంబూలములను పెట్టుకొని వారి కెదురుగా లేచి నిలబడి 'వాచా దత్తా త్వయా కన్యా' అను నాల్గవశ్లోకమును చదివి ఆఫలాదులను వారి కిచ్చి, పుసుపుకొమ్మును,గుండుపోకలను అక్షతలతోసహ వధువుతండ్రియొక్క ఉత్తరీయపుకొనకు కట్టి, అట్లు కట్టిన ముడిని చందనలో నద్దును. ఇట్లు ఇరుపక్షములు తాంబూలముల నిచ్చి పుచ్చుకొందురు. ఈశ్లోకమున కర్థము: నీచే వాగ్దత్తము చేయబడిన కన్య నాచే స్వీకరింపబడినది. వరావలోకనవిధియందు నిశ్చింతుడవై, సుఖుడవై యుండుము.

[444] అప్పుడు సదస్యులలోని పెద్దవారు 'వాగ్దానముహూర్తస్సుముహూర్తోఽస్తు' అని వారిపై అక్షతలు వేసి అనుగ్రహింపవలెను. బ్రాహ్మణులు 'శివా ఆపస్సన్తు' నుండి మొదలిడి 'ఏతద్వస్సత్యమస్తు' అను వాక్యమువఱకు పలికి దీవించవలెను.

**శచీపూజా:** [445]తతః కన్యాదాతా వివాహసౌభాగ్యాద్యభివృద్ధ్యర్థం వధ్వా శచీపూజనం కారయేత్।
వధూ 'అస్యాం శుభతిథౌ వివాహసౌభాగ్యాద్యభివృద్ధ్యర్థం శచీపూజాం కరిష్యే' – ఇతి సంకల్ప్య,

'సువర్ణాం పద్మపత్రాక్షీం దివ్యస్రగ్వస్త్రశోభితామ్,
సర్వలక్షణసంయుక్తాం సర్వాభరణభూషితామ్,
అనర్ఘ్యమణిమాలాభి ర్భాసయన్తీం దిగన్తరమ్,
విలాసినీసహస్రౌఘైః సేవ్యమానామహర్నిశమ్॥'

ఓం శచీదేవ్యై నమః, ఆవాహయామి,ఆసనం సమర్పయామి---సర్వోపచారాన్ సమర్పయామి' – ఇత్యన్తం విష్వక్సేనారాధనవత్ షోడశోపచారపూజాం కృత్వా,

'దేవేన్ద్రాణి నమస్తుభ్యం దేవేన్ద్రప్రియభామిని।
వివాహం భాగ్యమారోగ్యం పుత్రలాభం చ దేహి మే॥
ధాన్యాన్దేహి ధనం దేహి పశూన్దేహీంద్రభామిని।

[445] తరువాత వధూపిత కన్యకచే వివాహసౌభాగ్యాభివృద్ధికై శచీపూజనము చేయింపవలెను. దీనికై వధువు తూర్పుముఖముగా కూర్చుండి, ఒక వెండితట్టలో బియ్యమును బోసి సమముగా నెఱపి, పూర్వాగ్రముగా నందులో నొక తమలపాకును వేసి, దానిపై శచీదేవిప్రతిమను, అది లేకున్న తత్ప్రతినిధిగా నొక పసుపుకొమ్మును ఉంచి, 'అస్యాం శుభతిథౌ ---శచీపూజాం కరిష్యే' అని సంకల్పించి, 'సువర్ణాం పద్మపత్రాక్షీం' అను శ్లోకముతో ధ్యానించి, విష్వక్సేనారాధనలో చేసినట్లుగా షోడశోపచారపూజను చేసి, 'దేవేన్ద్రాణి' అను శ్లోకముతో ప్రార్థింపవలెను. తర్వాత బ్రాహ్మణులను, ముత్తైదువులను గంధపుష్పఫలతాంబూలముచే పూజించి, వధూవరులకు బ్రాహ్మణాశీర్వాదము చేయించి, సుమంగళులచేత మంగళహారతి నిప్పించవలెను. ఇచ్చట పసుపుకొమ్ముపై శచీదేవి నావాహన చేసి పూజింపు మని సులభమార్గము చెప్పబడినది. దీనికి బదులు కలశస్థాపనము చేసి, కలశములో శచీదేవి నావాహనము చేసి షోడశోపచారపూజ చేయు దీర్ఘపద్ధతిని గూడ నాచరింపవచ్చును. ఈసందర్భములో క్రింద నిచ్చిన ఋగ్వేదమంత్రములతో వధూవరుల నాశీర్వదించుచున్నారు.

యశో దేహి సుఖం దేహి సర్వకార్యకరీ భవ॥'

ఇతి ప్రార్థయేత్। తతో బ్రాహ్మణాదీన్, సుమంగళీశ్చ ఫలపుష్పగంధతాంబూలాదిభి స్సంపూజ్య, బ్రాహ్మణాశీర్వాదం, సుమంగళీభి ర్నీరాజనం కారయేత్॥

## అత్ర బ్రహ్మకర్మచముచ్చయగ్రంథోక్త ఋగ్వేదాశీర్వాదమంత్రాః

మం॥ ఓం హిం కృణ్వతీ వసుపత్నీ వసూనాం వత్సమిచ్ఛంతీ మనసాభ్యాగాత్।
దుహామశ్విభ్యాం పయో అఘ్న్యేయం సా వర్ధతాం మహతే సౌభగాయ॥
సమిద్ధస్య శ్రయమాణః పురస్తాద్బ్రహ్మవన్వానో అజరస్సువీరః।
ఆరే అస్మదమతిం బాధమాన ఉచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ॥
వనస్పతే శతవల్శో విరోహ సహస్రవల్శా వి వయం రుహేమ।
యం త్వామయం స్వధితిస్తేజమానః ప్రణినాయ మహతే సౌభగాయ॥
ఇందుర్దేవానాముపసఖ్యమాయన్త్సహస్రధారః పవతే మదాయ।
నృభిస్తవా నో అనుధామ పూర్వమగన్నింద్ర మహతే సౌభగాయ॥
అస్య పిబ క్షుమతః ప్రస్థితస్యేంద్రసోమస్య వరమాసుతస్య।
స్వస్తిదా మనసా మాదయస్వార్వాచీనో రేవతే సౌభగాయ॥
ఘృతాదుల్లుప్తం మధుమత్సువర్ణ ధనంజయం ధరుణం ధారయిష్ణు।
ఋణక్సపత్నా దధరాంశ్చ కృణ్వదారోహ మాం మహతే సౌభగాయ॥
తదస్తు మిత్రావరుణా తదగ్నే శం యోరస్మభ్యమిదమస్తు శస్తమ్।
అశీమహి గాధ ముత ప్రతిష్ఠాం నమో దివే బృహతే సాదనాయ॥



# వివాహప్రయోగః

(షోడశసంస్కారములలో వివాహ మత్యంతప్రధానమైనది. దీనివలన గార్హస్థ్యసిద్ధి గల్గి, కులవృద్ధి కవకాశము కలుగును. అందుచే నిది అతిముఖ్యమైన సంస్కారము. శాస్త్ర కారులు 8 విధములైన వివాహములను నిర్దేశించినారు. అవి యివి:

1. బ్రాహ్మము: యోగ్యుడైన వరుని పిలిచి సాలంకృతకన్యాదానము చేయుట.
2. దైవము: యజ్ఞమందు ఋత్విజుడై కర్మ చేయుచున్న వానికి దన కన్యక నిచ్చుట.
3. ఆర్షము: వరునివలన నొక గోమిథునము నైనను గ్రహించి కన్యక నిచ్చుట.
4. ప్రాజాపత్యము: ఈమె జీవించియున్నంతవఱ కితరవివాహమును గాని, సన్న్యాసమును గాని స్వీకరింపక కలసియుండుమని ఒప్పించి కన్యక నిచ్చుట.
5. గాంధర్వము: వధూవరులు పరస్పరము మోహించుకొని సంభోగించుట.
6. ఆసురము: జ్ఞాతులకు, కన్యకును యథేష్టముగా ధనము నిచ్చి కన్యాదానము చేసికొనుట.
7. రాక్షసము: యుద్ధమందు బంధువుల జయించి బలాత్కారముగా కన్యను గొని పోయి వివాహమాడుట.
8. పైశాచము: దొంగతనమున కన్యను ఎత్తుకొని పోయి వివాహమాడుట.

ఇందు పైశాచికము సర్వదా నింద్యము. గాంధర్వము, రాక్షసము క్షత్రియులకు విహితమైనదే కాని ఇతరులకు విహితమైనది కాదు. అన్నింటికంటెను బ్రాహ్మ, దైవ వివాహము లుత్తమములు. ఈకాలమున సాధారణముగా వధూవరులయొక్కయు, వారి కుటుంబములయొక్కయు పరస్పరాంగీకారముతోనే వివాహములు జరుగు చుండుటచేత అవి బ్రాహ్మవివాహము లనియే చెప్పవచ్చును. కొందఱు గాంధర్వ వివాహమును కూడ చేసికొనుచున్నారు. ఇతరమైన వివాహము లీకాలములో లేవనియే చెప్పవచ్చును.

ఒకే తల్లికి జనించినట్టి సోదరులలో జ్యేష్ఠునికి వివాహము కానిది కనిష్ఠునకు చేయ రాదు. కాని జ్యేష్ఠుని అనుమతితో కనిష్ఠునికి చేయవచ్చును. కన్యాదానము చేయుటకు కన్యకయొక్క పితృవంశస్థులకే ప్రథమాధికారము. వీరెవరు లేకున్న మాతృవంశస్థులు

చేయవచ్చును. ఇట్లు క్రమముగా, కన్యకయొక్క తండ్రి, తాత, సోదరుడు, పినతండ్రి ఇత్యాది పితృవంశస్థులకు ప్రథమాధికారము. వీరెవ్వరును లేకున్న మాతామహుడు, మేనమామ, తల్లి మున్నగువారి కధికారము. వీరెవ్వరును లేకున్న కన్య స్వయముగనే వరుని వరింపవలెను. ఇంకను విశేషమైన ధర్మశాస్త్రవిషయములు 'ధర్మసింధు' వంటి గ్రంథములనుండి గ్రహించునది.

వివాహమునకు ముందుగా వరపక్షమువారు కన్యాగృహప్రాంతమునకు విచ్చేయగా అప్పుడు కన్యాపిత్రాదిబంధువులు వారిని మంగళవాద్యములతో నెదుర్కొని, చందన ఫలపుష్పమాలికాదులతో సత్కరించి,వారికై ఏర్పరచిన విడిదియింటిలో వివాహపూర్తి యగువఱకు వారిని నివసింపజేయుట ఆచారము. ఈకాలమునందు జరుగుచున్న 'ఫంక్షనుహాలు' వివాహములందైనను, వరపక్షమువారి నెదుర్కొని, వారికై ఆభవన ములో కొంత భాగమును ప్రత్యేకించుట పద్ధతిగా నున్నది.)

## అంకురార్పణప్రతిసరబంధనాదీని

### పరిషదనుజ్ఞా

[446]కర్తా భార్యావధూవర సమేతః కర్మోపయోగి సమస్తసంభారసంయుతం, రంగ వల్ల్యాద్యలంకృతం వివాహవేదికాం ప్రాప్య, తాంబూలఫలదక్షిణాసమేతహరిద్రాక్షత పాత్రం హస్తే గృహీత్వా, వేదికాయాః పశ్చాత్ ప్రాఙ్ముఖః ఉత్థాయ, బ్రూయాత్।

---

446 కర్త (సామాన్యముగా వరుని తండ్రి) ఒక తట్టలో ఫలపుష్పాక్షతాదక్షిణలను పెట్టుకొని కర్మార్థమైన సమస్తసంభారములు కలిగి, రంగవల్లులచేత అలంకరింపబడిన వివాహవేదిక కడకు భార్యావధూవరులతో సహ చేరి, వేదికకు పశ్చిమమున (తాను కూర్చుండు పీటలకు వెనుక) తూర్పుముఖముగా లేచి నిలబడి, 'ఓం నమస్సదసే' నుండి మొదలిడి 'మహాన్తోఽను గృహ్ణన్తు' వరకు చెప్పుచు సభను ప్రార్థించి, భార్యావధూవరులతో సహ ప్రణమింపవలెను. అట్లు ప్రార్థింపగా, "ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు!"- అని పరిషత్తు అనుగ్రహింపవలెను.

(గమనిక:ఇచ్చట దక్షిణదేశవైష్ణవాచారముప్రకారము, అంకురార్పణప్రతిసరబంధనాదులు కాబోయే వధూవరులు కలిసి చేయుచున్నట్లు వ్రాయబడినది. ఇట్లు వివాహముహూర్తమునకు ముందుగానే వధూవరులు కలసి ఈకార్యములను చేయుచుండుటచేత, ఈపద్ధతిలో గుడ

*"ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై/* (తై.సం.3-2-4-14)/ *సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యా స్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్/* (తై.బ్రా.1-2-1-26)

*సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః/ స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితా మిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే ఉద్వాహకర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్త్వితి భవన్తోమహాన్తోఽనుగృహ్ణన్తు/ లగ్నస్య సర్వేగ్రహా శ్శుభైకాదశస్థానఫలదా స్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/ ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తో మహాన్తోఽను గృహ్ణన్తు/"* - ఇతి ప్రార్థ్య నమస్కుర్యాత్. "*ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు/*" - ఇతి ప్రతి వచనమ్.

**ప్రధానసంకల్పః, విష్వక్సేనారాధనం చ:** [447]కర్తా దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయ మాణః, ద్విరాచమ్య, త్రిః ప్రాణానాయమ్య,

---

జీరకనిక్షేపసుముహూర్తపర్యంతము వధూవరులకుమధ్య తెర నుంచు అవసరము కల్గకున్నది. ఈపద్ధతి ఆంధ్రదేశపద్ధతికి భిన్నముగా నున్నది. ఆంధ్రదేశపద్ధతిలో చేయునప్పుడు, వివాహ మునకు ముందురోజే, అంకురార్పణము, ప్రతిసరబంధము, ఉదకశాన్తి మున్నగు పూర్వాంగ ములను ఎవరి ఇంటిలో వారు ముగించుకొని రావచ్చును.)

[447] తర్వాత ప్రధానసంకల్పమును చేయవలెను. దీనికై తాను కూర్చొను పీటపై కర్త రెండు ఉత్త రాగ్రపు దర్భలను వేసి, రెండుదర్భలను కుడి వైపు మొలలో దోపికొని, భార్య, వరుడు, వధువు వరుసగా తనకుడివైపుండునట్లు పీటలపై తూర్పుముఖముగా పీటలపై కూర్చొని రెండుసార్లు ఆచమించి, మూడుసార్లు ప్రాణాయామము చేసి, 'శుక్లామ్బరధరం విష్ణుం' నుండి మొదలిడి 'యస్య ద్విరదవక్త్రాద్యాః' వరకు గల శ్లోకములను చెప్పి, మొదటి అధ్యాయములో నిచ్చి నట్లుగా 'హరిరోం తత్సత్' నుండి మొదలిడి 'కరిష్యే' వరకు సంకల్పమును చెప్పవలెను. గీతలుంచినచోట ఆయా సంవత్సర, అయన, ఋతు, మాస, పక్ష, తిథి, వార, నక్షత్రనామము లను చెప్పుకొనవలెను. ----గోత్రాయాః, ---- నామ్న్యాః అనుచోట్ల గీతలకు బదులు వధువు యొక్క గోత్రమును, పేరును, ---గోత్రస్య, ----శర్మణః అని ఉన్నచోట్ల గీతలకు బదులుగా

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాన్తయే॥*
*జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।*
*ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥*
*లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్।*
*అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ---గోత్రాయాః ---నామ్న్యాః కన్యాయాః ---గోత్రస్య -----శర్మణో వరస్య చ ఉభయోః ఉద్వాహకర్మాంగం అంకురార్పణకర్మ కరిష్యే। ఆదౌ తత్కర్మాంగం విష్వక్సేనారాధనం కరిష్యే - ఇతి సంకల్ప్య,*

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

---

వరునియొక్క గోత్రమును, పేరును చెప్ప వలెను. అనంతరము 'స్వశేషభూతేన మయా' అను శ్లోకమును చెప్పి సాత్త్వికత్యాగమును చేసి వెనుకటి అధ్యాయములో చెప్పినట్లుగ విష్వక్సేన పూజను చేయవలెను. ఇచ్చట వరునితండ్రి ఈకార్యక్రమములను చేయునట్లుగా చెప్పబడినది. కాని, 'స్వయం వా అన్యో వా' అని ఉండుటచే వరుడును స్వయముగా వీటిని చేయవచ్చును.

-ఇతి సాత్త్వికత్యాగం కృత్వా పూర్వోక్తవిధినా విష్వక్సేనారాధనం కుర్యాత్.

**అంకురారోపణమ్:** [448]పునః ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టా-యామస్యాం శుభతిథౌ---గోత్రాయాః ---నామ్న్యాః కన్యాయాః ---గోత్రస్య -----శర్మణో వరస్య చ ఉభయోః ఉద్వాహకర్మాంగ మంకురారోపణం కరిష్యే'* – ఇతి సంకల్ప్య పూర్వోక్తవిధినా అంకురారోపణం కుర్యాత్|

**ప్రతిసరబన్ధః:** [449]పునః ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ---గోత్రాయాః ---నామ్న్యాః కన్యాయాః ---గోత్రస్య -----శర్మణో వరస్య చ ఉభయోః ఉద్వాహకర్మాంగం ప్రతిసరబన్ధకర్మ కరిష్యే'* – ఇతి

---

[448] కర్త మఱల ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---అంకురార్పణం కరిష్యే' అని సంకల్పించి 'అఙ్కురార్పణప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగ అంకురార్పణమును చేయవలెను.

[449] కర్త మఱల ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---ప్రతిసర బంధకర్మ కరిష్యే' అని సంకల్పించి 'ప్రతిసరబన్ధః' అను అధ్యాయములో చెప్పినట్లుగ ప్రతిసర బన్ధకర్మను చేయవలెను. కాని ఇచ్చట వధువుకొఱకై ఒకటి, వరునికొఱకై ఒకటి– రెండు సూత్రములను ఉంచి, ప్రయోగమునంతయు పూర్వమువలెనే చేసి, సూత్రమును ముందుగా వధువునకును, తరువాత వరునకును కట్టవలెను. ఈవిషయమున క్రింద నిచ్చిన 'రక్షాబన్ధనకాలే తు' అను కారిక యున్నది. అనగా మంగళవాద్యములు మ్రోగుచుండగా వరుడు 'ప్రతిసరబన్ధః' అను అధ్యాయములో చెప్పినట్లుగా వధువు దోసిటిలో తండులముల నుంచి, తూర్పువైపు కొనలుండునట్లు తాంబూలమును పెట్టి, దానిపై యథాశక్తి దక్షిణ నుంచి, ఆ తండులములపై నొక కొబ్బెరిబొండమును గాని, జట్టు తూర్పునకు గల టెంకాయను గాని పెట్టి, ఆమె దోసిలిని తన కుడిచేతతో తాకుచు, 'అగ్నిరాయుష్మాన్' అను మంత్రమును చెప్పి, ఆపైని 'బృహత్సామ క్షత్రభృత్' అనుమంత్రముతో ఆమె ఎడమ చేతికి రక్షాబంధనమును కట్టవలెను. ఆతర్వాత మంగళవాద్యములు మ్రోగుచుండగా ఆచార్యుడు వరుని దోసిటిలో పైరీతిగానే బియ్యమును పోసి, తాంబూలదక్షిణాదుల నుంచి, 'అగ్నిరాయుష్మాన్' అను మంత్రమును చెప్పి, ఆపైని 'విశ్వేత్తాతే' అనుమంత్రముతో అతని కుడిచేతికి రక్షాబంధనమును కట్టవలెను. ఆతర్వాత వధూవరుల తండులపూర్ణహస్తములను ప్రక్కప్రక్కగా చేర్చి, వానిపై ఉత్తరాగ్రముగ నొక కూర్చ

సంకల్ప్య, పూర్వోక్తవిధినా ప్రతిసరబన్ధకర్మ కృత్వా, వధూపూర్వకం రక్షాబన్ధనం కుర్యాత్।

శ్లో॥ రక్షాబన్ధనకాలే తు వధూపూర్వం ప్రకల్పయేత్।
హస్తే తండులసంపూర్ణే సవ్యే స్త్రీణాం తు బన్ధనమ్॥

శ్లో॥ ప్రాణసంయమనం ప్రథమం భవేత్,
ప్రేషణం సుహృదామభిమంత్రణమ్।
సంగతాయ వరాయ సమర్ప్యతే
స్వామినా తు వధూర్జలపూర్వకమ్॥

## వరప్రేషణమ్

[450]వరః ప్రాణానాయమ్య, 'పూర్వోక్త ఏవంగుణవిశేషాయామస్యాం శుభతిథౌ వివాహ కర్మాంగం వరాన్ ప్రేషయిష్య' – ఇతి సంకల్ప్య, సుహృద స్సమవేతాం శ్చతురాన్ మంత్రవతో వరాన్ప్రహిణుయాత్। తాన్ 'ప్రసుగ్మన్తా' ఇతి ద్వాభ్యా మభిమంత్ర్య,

---

నుంచి 'యో బ్రహ్మా బ్రహ్మణః' నుండి మొదలిడి 'ఉత్సం దుహ్రతే అక్షితమ్' వఱకు గల ఆయుష్యసూక్తములను చెప్పవలెను. అది ముగిసిన పిదప సదస్యులు 'రక్షాబన్ధనముహూర్త స్సుముహూర్తోఽస్తు' అని వారిపై అక్షతలు వేయవలెను. అటు పిమ్మట వారు దోసిటిలో నున్న వాటిని త్యజించవలెను. కన్య అచ్చటినుండి కన్యాశాలకు (తనవైపువారు గల వివాహగృహ భాగమునకు) పోవలెను.

[450] తర్వాత 'ప్రాణసంయమనం ప్రథమం' అనుకారికను చదువవలెను. దీని యర్థము: ప్రాణ సంయమనం ప్రథమం =మొదట ప్రాణాయామమున్ను, పిదప, సుహృత్=మిత్రులను, ప్రేషణం =కన్యాన్వేషణకై పంపుటయున్ను, అభిమంత్రణమ్='ప్రసుగ్మన్తా','అనృక్షరా' అను మంత్ర ములతో వారి నభిమంత్రించుటయున్ను, భవేత్=జరుగును; ఆతర్వాత, సంగతాయ వరాయ =వరించుటకు వచ్చిన వరునకు,స్వామినా తు=కన్యాదాతచేత, వధూః=కన్య, జలపూర్వకమ్ =సువర్ణోదకములతో, సమర్ప్యతే=సమర్పింపబడును; ఇట్లు వరుడు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం---వరాన్ ప్రేషయిష్య' అని సంకల్పించి, కన్యకను తనకై అర్థించుటకై కన్యాదాత దగ్గరికి, వరాన్=అట్లు అర్థించుపెద్దలను, ప్రేషయిష్య=పంపు

‘యూయం కన్యాం వృణీధ్వమ్’ ఇతి। ‘తథా కుర్మః’ ఇతి ప్రత్యుత్తరమ్।

మం॥ ప్రసుగ్మన్తా ధియసానస్య సక్షణి వరేభిర్వరాగ్ం అభిషు ప్రసీదత। అస్మాక-
మిన్ద్రః ఉభయం జుజోషతి యథ్సోమ్యస్యాన్ధసో బుబోధతి॥ అనృక్షరా ఋజవ-
స్సన్తు పన్థా యేభిస్సఖాయో యన్తి నో వరేయమ్। సమర్యమా సంభగో నో
నినీయాథ్సంజాస్పత్యగ్ం సుయమమస్తు దేవాః॥ (తై.మం.పా.1.1)

[451]వా॥ తత స్తే కన్యావన్తం గత్వా, (ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ త్ర్యార్షేయ ప్రవరా

---

చున్నాడు. సుహృదాన్=తనకు మిత్రులైనట్టియు, సమవేతాన్=తనకార్యమునందాసక్తులైనట్టియు, మంత్రవతః=వేదమంత్రముల నెరిగినట్టియు, చతురాన్ వరయిత్వాన్=తనకై కన్యక నన్వేషించునట్టియు నల్గురు బ్రాహ్మణులను, వరాన్=శ్రేష్ఠులను, ప్రహిణుయాత్=పంపవలెను. తాన్=వారిని, ‘ప్రసుగ్మన్తా’ ఇతి ద్వాభ్యాం=‘ప్రసుగ్మన్తా’ మరియు ‘ అనృక్షరా’ అను రెండు మంత్రములతో, యూయం=మీరు, కన్యాం= కన్యకను, వృణీధ్వమ్=కోరి తీసుకరండి, ఇతి= అని, ప్రేషయేత్=పంపవలెను. ఇచ్చట వరుడు ఈరెండుమంత్రములను చెప్పి, తనకు దగ్గరి బంధువులలో నల్గురికి గాని సరిసంఖ్యగలవారికి గాని తాంబూలముల నిచ్చి, ‘యూయం కన్యాం వృణీధ్వమ్’ అని కోరి, వారిచే ‘తథా కుర్మః=అట్లే చేయుదుము’ అని చెప్పించుకొని, వారిని వివాహస్థానమున కన్య యుండు తావునకు బంపుట యాచారముగా నున్నది. (సూచన:నృసింహపండితుడు తన ‘స్మార్తకారికావళి’ యను గ్రంథమునందు బ్రాహ్మ, ప్రాజాపత్య, దైవవివాహములందు ముందుగనే వరునకు కన్య నిచ్చుటకు ఒప్పందము జరుగుటచే ఈ వరప్రేషణముతో పనిలేదని తెల్పుచున్నాడు. ఆపస్తంబసూత్రములను వ్యాఖ్యానించు పండితులును దీనినే సమర్థించుచున్నారు. అందుచే వివాహవేదికోపాంతమున జరుగు నీ వరప్రేషణ, కన్యావరణకార్యములను ఏదో యొక అలవాటుప్రకారము చేయుచున్నారే కాని ఈ కాలములో సర్వత్రముగా జరుగు బ్రాహ్మవివాహములలో వీటి అవసరము లేదనిపించున్నది. పైగా వివాహమునకు ముందుగా సర్వసామాన్యముగా జరుగు నిశ్చితార్థమే వరప్రేషణకు తుల్యమగుటచేతను, వైష్ణవపద్ధతిలో మొదటినుండియు వధూవరులు కలసియే వివాహాంగకర్మలను చేయుచుండుటచేతను, ఈవరప్రేషణము నిప్పుడు చేయుట అర్థవంతముగా లేదు.)

[451] అట్లు పంపబడిన పెద్దలు కన్యాదాతదగ్గరకు పోయి, ఫలానా ఋషులతో గూడిన ప్రవర గల

న్వితభారద్వాజ) గోత్రోద్భవస్య ----శర్మణో నప్త్రే, ----శర్మణః పౌత్రాయ, ----శర్మణః పుత్రాయ, ---శర్మణే వరాయ, (కాశ్యపావత్సారాసిత త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస)గోత్రోద్భవస్య -----శర్మణో నప్త్రీం, -----శర్మణః పౌత్రీం, -----శర్మణః పుత్రీం, ---గోత్రజాం---నామధేయాయాం త్వదీయాం(ఇమాం) కన్యాం ప్రజాసహత్వ కర్మభ్యో వృణీమహే।(‘ధర్మ ప్రజార్థం వృణీమహే’ –ఇతి చ పాఠాన్తరమ్)।’ – ఇతి వృణీయుః।

[452]వా॥ దాస్యామి। దాస్యామి। దాస్యామి। - ఇతి కన్యాదాతా వదేత్। తే వరసమీపం ప్రత్యేత్య। ‘సిద్ధార్థా వయమి’ త్యావేదయేయుః। తైస్సహ వరః కన్యాదాతారం గత్వా।

---

గలయట్టి ఫలానా గోత్రమునందు బుట్టిన ఫలనా వ్యక్తికి నప్తయు (మునిమనుమడును), ఫలనా వ్యక్తికి పౌత్రుడును (మనుమడును), ఫలనా వ్యక్తికి పుత్రుడు నగు ఫలనా నామము గల వ్యక్తికి, ఫలానా ఋషులతో గూడిన ప్రవర గలయట్టి ఫలానా గోత్రమునందు బుట్టిన ఫలనా వ్యక్తికి నప్త్రియు (మునిమనుమరాలును), ఫలనా వ్యక్తికి పౌత్రియు (మనుమరాలును), ఫలనా వ్యక్తికి పుత్రియు, ఫలానా పేరుగలదియు నగు, త్వదీయ=నీయొక్క, కన్యాం=కన్యకను, ప్రజా సహత్వకర్మభ్యః=సంతానమును పొందుటకున్ను, కలిసి సత్కర్మ లాచరించుటకున్ను, వృణీ మహే=కోరుచున్నాము- ఇతి=అనుచు, వృణీయుః=(కన్యక నిమ్మని) కోరవలెను. ఇచ్చట ఉదాహరణమునకు వరపక్షమున భారద్వాజగోత్రికుల ప్రవర, కన్యాపక్షమున కాశ్యపగోత్రికుల ప్రవరయు చెప్పబడినవి. వీనికి బదులు ప్రస్తుతము వర్తించు ఉభయపక్షములవారి ప్రవరలను చెప్పుకొనవలెను. గీతలుంచిన స్థానములో, ‘వరణే, దానే చ త్రి పూరుషం బ్రూయాత్’ అను వాక్యము చొప్పున, వరునికి పైమూడుతరముల తండ్రివైపువారి పేర్లను, వరుని పేరును చెప్ప వలెను. అట్లే కన్యాపక్షమునందును కన్యక తండ్రివైపు పైమూడుతరములవారి పేర్లను, కన్యక యొక్క పేరును చెప్పవలెను. కన్యయొక్క తండ్రి గాక ఇతరులు (తాత, అన్న, పినతండ్రి - ఇత్యాదులు) కన్యాదాతలైనచో ‘త్వదీయాం’ అను పదమునకు బదులు ‘ఇమాం’ అని చెప్ప వలెను.

[452] అప్పుడు కన్యాదాత ‘దాస్యామి (ఇచ్చుచున్నాను)’ అని ముమ్మారు చెప్పవలెను. అప్పుడు తే=ఆపెద్దలు, వరసమీపం=వరునివద్దకు, ప్రత్యేత్య=తిరిగి వచ్చి, సిద్ధార్థా వయమ్= పోయిన కార్యము సిద్ధించినవార మైనాము, ఇతి=అని, ఆవేదయేయుః=(వరునకు) విన్నవించవలెను.

తత్ర సుస్నాతామహతవాససం గంధానులిప్తాం స్రగ్విణీం సర్వాభరణభూషితాం భుక్త వతీం కన్యాం స్వయం చైవభూతో వరః పశ్యేత్।

## కన్యాదానమ్

**సంకల్పః:** [453]అథోపోషితః కన్యాదాతా ప్రాణానాయమ్య,

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే॥*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*

---

అప్పుడు, తైస్సహ=వారితోడ (ఇతరబంధువర్గముతోడను), వరః=వరుడు, కన్యాదాతారం= కన్యాదాతకడకు, గత్వా = పోయి, తత్ర=అచ్చట, సుస్నాతాం=మంగళస్నానము చేసిన దియు, అహతవాససం = క్రొత్త వస్త్రముల ధరించినదియు, గంధానులిప్తాం=సుగంధ మలందిన దేహము గలదియు, స్రగ్విణీం = పూలమాలను ధరించినదియు, సర్వాభరణభూషితాం= అన్ని సొమ్ములు ధరించినదియు, భుక్తవతీం= భుజించియున్న దియు నగు, కన్యాం =కన్యను, స్వయం చైవభూతః = తానును అట్లే సన్నద్ధుడై, వరః=వరుడు, పశ్యేత్= చూడవలెను.

[453] అట్లు వచ్చిన వరుని మెడలో పూలమాలను వేసి, హారతి నిచ్చి, పూర్ణకుంభముతో లోనికి ఆహ్వానించి, కన్యాదాత అతనిని పడమటిముఖముగా ఒక పీటపై కూర్చుండబెట్టి, కన్యా దాతయు, అతని భార్యయు, కన్యయు వరుని కెదురుగా, కన్యాదాతయొక్క కుడికి అతని భార్యయు, ఆమె కుడికి కన్యయు నుండునట్లు తూర్పుముఖముగా కూర్చొని వరునకు కన్యా దానమును చేయవలెను. ఈసందర్భములో కన్యకయొక్క మేనమామ ఒకవెదురుబుట్టలో బియ్యమును పోసి, దానిపై నొక క్రొత్తవస్త్రమును వేసి, ఆవస్త్రముపై కన్యను కూర్చుండ బెట్టుకొని మోసికొనివచ్చి అచట దింపుట ఆచారము. అట్టి మేనమామకు వరుడు ముందుగానే నూతన వస్త్రము లీయగా నతడు వానిని ధరించి ఈకార్యమును చేయుట పద్ధతి. ఇట్లు కన్యాదానకాల ములో కన్య ఆ వెదురుబుట్టలోనే కూర్చొని యుండును. కన్యాదానపర్యంతము కన్యాదాత ఉప వాసముండవలెను (ఫలములను, పాలను సేవించవచ్చును). కన్యాదానమునకై కన్యాదాత ప్రాణాయా మము చేసి, 'శుక్లాంబరధరం', 'యస్య ద్విరదవక్త్రాద్యాః' అను శ్లోకములను చెప్పి, 'హరిరోం తత్సత్ --- కన్యాదానాఖ్యమహాదానం కరిష్యే, తదర్థం వరపూజాం కరిష్యే' అనుచు కన్యాదానసంకల్పమును చేసి, ముందుగా వరపూజను చేయవలెను.

*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥"*

*"హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీలక్ష్మీనారాయణప్రీత్యర్థం దశానాం పూర్వేషాం దశానాం పరేషాం ఆత్మనశ్చ ఏకవింశతి కులోత్తారణద్వారా శాశ్వతవిష్ణులోకావాప్త్యర్థం బ్రాహ్మవివాహవిధినా సాలంకృతకన్యాదానాఖ్యమహాదానం కరిష్యే/తదర్థం వరపూజాం కరిష్యే - ఇతి సంకల్ప్య,*

## వరపూజా

[454] *'శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూప వర ఇదమావాహనమ్'* – ఇత్యావాహ్య, *'ఇదమాసనమ్'* – ఇత్యాసనం దత్వా, *'ఉభాభ్యామిదం వాం పాద్యమ్'* –

*శ్లో॥ నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే/సహస్రపాదాక్షిశిరోరుబాహవే/*
*సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే/సహస్రకోటి యుగధారిణే నమః॥*

---

[454] కన్యాదాత 'శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూప వర ఇదమావాహనమ్' – అని చెప్పి వరుని ఆహ్వానించి, 'ఇద మాసనమ్' – అని వరుని ప్రత్యఙ్ముఖముగా పీటపై కూర్చుండబెట్టి, 'ఉభాభ్యామిదం వాం పాద్యమ్' – అనుచు అతని ముందొక ఇత్తడిపళ్లెరమును బెట్టి, 'నమోస్త్వనంతాయ---యుగధారిణే నమః' అను శ్లోకమును చెప్పుచు, భార్యతన కుడివైపునుండి ఒక క్రొత్త రాగి (వెండి) చెంబుతో తీర్థమును పోయుచుండగా, ముందుగా వరుడు తనయొక్క కుడికాలును పళ్లెరములో నుంచగా దానిని ముమ్మారు బాగుగా కడిగి, తరువాత వరుడు తన ఎడమకాలును పళ్లెరములో నుంచగా దాని నట్లే ముమ్మారు కడుగవలెను. తర్వాత కన్యాదాత ముందుగా తా నాచమనము చేసి, పిదప వరునిచే ఆచమనము చేయింపవలెను.

ఇతి భార్యావర్జితజలేన పూర్వం వరస్య దక్షిణపాదం ప్రక్షాళ్య, అనంతరం వామపాదం ప్రక్షాళయేత్। తతః స్వయమాచమ్య, వరమాచామయేత్।

[455] *'శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూప వర భాగశః అమీ వో గంధాః'* – ఇతి గంధాన్దత్వా, వస్త్రభూషణగంధపుష్పాణి గాం భూమిం చ యథాశక్తి దత్వా, *'అలంకారార్థే ఇమే అక్షతాః। సకలారాధనైః శ్శోభనమస్తు'*- ఇత్యక్షతైః స్సంపూజ్య, కన్యా ముదకపూర్వం దద్యాత్।

## కన్యాదానశ్లోకాః

శ్లో॥ *కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతామ్।*
*దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా॥ ౧॥*
*కన్యే మమాగ్రతో భూయాః కన్యే మే దేవి పార్శ్వయోః।*
*కన్యే మే పృష్ఠతో భూయాస్త్వద్దానాన్మోక్షమాప్నుయామ్॥ ౨॥*
*విశ్వంభర స్సర్వభూతా స్సాక్షిణ్య స్సర్వదేవతాః।*
*ఇమాం కన్యాం ప్రదాస్యామి పితౄణాం తారణాయ వై॥ 3॥*
*కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే।*
*ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థసిద్ధయే॥౪॥*

## గోత్రప్రవరోచ్చారణమ్

[456] *'చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు। (కాశ్యపావత్సారాసిత త్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస)గోత్రోద్భవస్య ----శర్మణో నప్త్రీం, ----శర్మణః*

---

[455] తర్వాత 'శ్రీలక్ష్మీనారాయణస్య స్వరూప వర యథాభాగశః అమీ వో గన్ధాః' - అనుచు వరునికి గంధము నొసగి, యథాశక్తి వస్త్రములు, గోవులు, భూమి, ఆభరణములు, పుష్పములు – ఇత్యాదులాయా దానశ్లోకములను చెప్పుచు నిచ్చి, 'అలంకారార్థే ఇమే అక్షతాః। సకలారాధనైః శ్శోభనమస్తు' అని అతనిపై అక్షతలు వేసి, తర్వాత కన్యాదానశ్లోకములను చెప్పవలెను.

[456] తర్వాత కన్యాదాత కన్యకయొక్క గోత్రప్రవరలను ముందుగను, వరునియొక్క గోత్రప్రవరలను వెన్కను చెప్పి, చివరకు 'తుభ్యం ప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి' అను వాక్య

*పౌత్రీం, ----శర్మణః పుత్రీం, ---గోత్రజాం----నామ్నీం శ్రీరూపిణీ మిమాం కన్యాం/ (ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ త్ర్యార్షేయ ప్రవరాన్విత భారద్వాజ) గోత్రోద్భవస్య ----శర్మణో నప్త్రే, ----శర్మణః పౌత్రాయ, --- శర్మణః పుత్రాయ, ----శర్మణే నారాయణస్వరూపాయ వరాయ తుభ్యం ప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామి/'*
– ఇతి సహిరణ్యోదకం కన్యాయాః దక్షిణహస్తం వరస్య దక్షిణహస్తే దద్యాత్। *'స్వస్తి'*
– ఇతి వరస్య ప్రతివచనమ్।

*మం॥దేవస్య త్వా సవితుః ప్రసవే/ అశ్వినోర్బాహుభ్యామ్/ పూష్ణో హస్తాభ్యాం ప్రతి గృహ్ణామి/ రాజా త్వా వరుణో నయతు దేవి దక్షిణే/ ప్రజాపతయే కన్యామ్/ తేనామృ- తత్వ మశీయ/ వయో దాత్రే/ మయో మహ్యమస్తు ప్రతిగ్రహీత్రే/ క ఇదం కస్మా అదాత్/ కామః కామాయ/ కామో దాతా/ కామః ప్రతిగ్రహీతా/ కామగ్ం సముద్రమావిశ/ కామేన త్వా ప్రతిగృహ్ణామి/ కామైతత్తే/ ఏషా తే కామ దక్షిణా/ ఉత్తానస్త్వాఽఽఙ్గీరసః ప్రతి గృహ్ణాతు॥* (తై.ఆ.3.10)

ఇతి కన్యాం ప్రతిగృహ్ణీయాత్। అథ సదస్యాః *'అయం కన్యాదానముహూర్తస్సుము- హూర్తోఽస్తు'* – ఇతి దంపత్యుపరి మంగళాక్షతాన్ క్షిపేయుః।

---

మును కూడ చెప్పి, స్వర్ణచందనతాంబూలఫలాదులతో గూడిన కన్యకయొక్క దోసిలిని వరుని యొక్క దోసిలిలో నుంచి, తన భార్య కుడివైపునుండి ఉదకమును ధారగా పోయుచుండగా కన్య కను వరునికి ధారాదత్తము చేయవలెను. ఇచ్చట కన్యాదాత తాను బియ్యపుబుట్టలో కూర్చొని, కన్యకను తనఒడిలో కూర్చుండ బెట్టుకొని ధారాదత్తము చేయు ఆచారముగూడ కలదు. అప్పుడు వరుడు 'స్వస్తి' అని పలికి, 'దేవస్యత్వా—ప్రతిగృహ్ణాతు' అను మంత్రమును పఠించి కన్యకను పరిగ్రహించవలెను. అప్పుడు సదస్యులు 'అయం కన్యాదానముహూర్త స్సుముహూ ర్తోఽస్తు' అని ఆనవదంపతులపై మంగళాక్షతలు వేయవలెను. తర్వాత కన్యాదాత 'కన్యాదాన సాద్గుణ్యార్థం మనస్సంకల్పదక్షిణాం తుభ్యమహం సంప్రదదే న మమ' - అని చెప్పి యథాశక్తి వరునకు దక్షిణ నీయవలెను. 'ప్రాఙ్ముఖాః ప్రయచ్ఛన్తి, ప్రత్యఙ్ముఖాః పరిగృహ్ణతే' – అని ఉన్నందున–కన్యాదాత తూర్పునకు మళ్ళి దానమీయవలెను. గ్రహీత (వరుడు) కూర్చొనియే యుండి పడమటికి మళ్ళి తీసికొనవలెను.

తతో దాతా *'కన్యాదానసాద్గుణ్యార్థం మనస్సంకల్పదక్షిణాం తుభ్యమహం సంప్రదదే న మమ'* - ఇత్యుక్త్వా యథాశక్తి వరాయ దక్షిణాం దద్యాత్।

[457] దాతా, *'ధర్మే చ, అర్థే చ, కామే చ, త్వయైషా నాతిచరితవ్యా'* – ఇతి వదేత్।

*'నాతిచరితవ్యా', 'నాతి చరామి'* – ఇతి వరస్య ప్రతివచనమ్। ఏవం త్రిః।

[458]శ్లో॥ స్థాప్యతే చ వివాహమహీతలే పావకో విధివన్మధుపర్కకః।
సోఽత్ర గో సహితోఽసహితోపి వా దీయతే వరవృత్త సమీక్షయా।

## [459]గృహ్యాగ్నిప్రతిష్ఠాపనమ్

అథో వర స్తయాసహ వివాహవేదికాం ప్రాప్య। ప్రాఙ్ముఖ ఉపవిశ్య। ప్రాణానాయమ్య,

---

[457]తదుపరి 'ధర్మే చ, అర్థే చ, కామే చ , త్వయైషా నాతిచరితవ్యా' – అనగా ధర్మార్థకామము లందు నీతోడ విడువబడి ఈమె చరింపరాదు – అని కన్యాదాత అనగా, వరుడు 'నాతి చరితవ్యా =(ఆమె అట్లు) చరింపదు', 'నాతి చరామి=(నేనట్లు చరింపను)' – అని చెప్పవలెను. ఇట్లు ప్రశ్నోత్తరములు మూడుసార్లు పల్కవలెను.

[458]ఆతర్వాత, 'స్థాప్యతే చ' అను కారికను చదువవలెను. దీని యర్థము: వివాహమహీతలే = వివాహవేదికయందు, విధివత్=శాస్త్రోక్తముగా, పావకః=అగ్నిహోత్రమును, స్థాప్యతే చ = ప్రతిష్ఠించుటయున్ను, మధుపర్కకః=వరునికి మధుపర్కప్రదానమున్ను, భవేత్= అగును; అత్ర =ఇచ్చట, సః=ఆమధుపర్కము, వరవృత్త సమీక్షయా=వరుని అభిప్రాయప్రకారము, గో సహితః =గోవుతోనైన, అసహితోపి వా=గోవు లేకుండగనైన, దీయతే=ఈయబడుచున్నది. గమనిక: కొందఱు అగ్నిస్థాపనము నిప్పుడు గాక, బ్రహ్మగ్రంథి తర్వాత చేయుచున్నారు.

[459]తదుపరి వధువుతోసహ వరుడు వివాహవేదిక కడకు వచ్చి, ఇర్వురచ్చట తూర్పుముఖ ముగా కూర్చొని, వరుడు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ ఉద్వాహకర్మ కరిష్య। తదంగం గృహ్యాగ్నిప్రతిష్ఠాపనం కరిష్య'–అని సంక ల్పించి, లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, ప్రజ్వలించి, పరిస్తరణాంతము చేసి, ఆ అగ్నిని రక్షించుట కేర్పాటు చేసి, కన్యాదాత గల స్థలమునకు పోవలెను. (ఇచ్చట పరిస్తరణాంతము గల అగ్నిప్రతి ష్ఠాపనము ప్రయోగవివరణ లేకుండ ఈయబడినది. వివరణకై 'షట్పాత్రప్రయోగః' అను అధ్యా యమును చూచునది.)

*'పూర్వోక్త ఏవం గుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ ఉద్వాహకర్మ కరిష్య/ తదంగం గృహ్యాగ్ని ప్రతిష్ఠాపనం కరిష్య'* – ఇతి సంకల్ప్య। స్థండిలం కల్పయిత్వా। ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్। అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్। అవాక్కరోభ్యుక్ష్య। తృణం నైఋత్యాం నిరస్య। అప ఉపస్పృశ్య, "*ఓం భూర్భువస్సువరోమ్"*– ఇత్యగ్నిం ప్రతిష్ఠాప్య। ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్। ప్రాక్తోయమన్యం నిదధాత్యుదగ్వా యథా బహిస్స్యాచ్చ పరిస్తరాణామ్। అగ్నిమిధ్వా।
*" ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య/ త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ/(తై.ఆ.6.10)/అగ్నిం ధ్యాయామి"*
-ఇతి ధ్యాత్వా,
*"ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అన్తః/ స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః/"-ప్రాఙ్ముఖాగ్నే మమాభిముఖో భవ/ సుముఖో భవ/ సుప్రసన్నో భవ/ వరదో భవ/ యథోక్తజిహ్వయా హవిర్గృహాణ/*
- ఇత్యగ్నిమావాహ్య, ప్రార్థ్య, అగ్నేః పురతోఽక్షతోదకం నినీయ, పరిసమూహ్య,
*1. ఓం అగ్నయే నమః, 2. ఓం జాతవేదసే నమః, 3. ఓం సహోజసే నమః, 4. ఓం అజిరాప్రభవే నమః, 5. ఓం వైశ్వానరాయ నమః, 6. ఓం నర్యాపసే నమః, 7. ఓం పఙ్క్తిరాధసే నమః, 8. ఓం విసర్పిణే నమః, 9. శ్రీయజ్ఞపురుషాయ నమః, (10.సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః)*– ఇత్యక్షతైరలంకృత్య, ప్రాగగ్రైర్దర్భైరగ్నిం పరిస్తృణాతి। ప్రాగుదగ్రైర్వా। దక్షిణానుత్తరాన్। ఉత్తరానధరాన్। ఇత్యంతం కృత్వా కన్యాశాలాం గచ్ఛేత్। తతో మధుపర్కః।

## మధుపర్కః

[460] వా॥దాతా భార్యాసహితః పూర్వాభిముఖస్సన్నుపవిశ్య, పవిత్రపాణిః, ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ ఆగతాయ వరం*

---

[460]కన్యాదాత తన కుడికి భార్య కూర్చొనియుండగా తాను పవిత్రపాణియై, పూర్వాభిముఖుడై కూర్చొని, ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ

*మధుపర్కేణ పూజయిష్యే'* – ఇతి సంకల్ప్య, ఆగతాయ వరాయ *'ఆసనార్థమయం కూర్చ'* –ఇతి కూర్చ ముదగగ్రం నిక్షిపేత్। *'సుకూర్చః'* – ఇతి గృహీత్వా, తస్మిన్ 'రాష్ట్రభృదసీ'తి వరః ప్రాఙ్ముఖ ఉపవిశేత్।

*మం॥ రాష్ట్రభృదసి ఆచార్యాసన్దీ మా త్వద్యోషమ్॥* (తై.మం.పా.2.4)

[461]వా॥అథ దాతా ఉదపాత్ర మాదాయ, *'ఆపః పాద్యా'* ఇతి బ్రూయాత్। వర స్తా ఆపః 'ఆపః పాదావనే జనీః' ఇతి యజుషాఽభిమన్త్రయేత్।

మం॥ ఆపః పాదావనేజనీర్ద్విషన్తం నాశయన్తు మే। అస్మిన్కులే బ్రహ్మవర్చస్యసాని॥ (తై.మం.పా.2.9)

[462]వా॥దాతా వరస్య దక్షిణం పాదం సవ్యంచ తాభిరద్భిః ప్రక్షాళయేత్। అప ఉపస్పృశ్య, వరః ప్రక్షాళయితారం దక్షిణపాణా వుపస్పృశ్య, 'మయి మహః' ఇతి యజుషా స్వస్య హృదయదేశం ప్రత్యభిమృశ్య, అప ఉపస్పృశ్యాచమేత్।

---

ఆగతాయ వరం మధుపర్కేణ పూజయిష్యే' – అని సంకల్పించి, 'ఆసనార్థమయం కూర్చ' – అని ఒక కూర్చను వరునికి ఆసనార్థమీయవలెను. 'సుకూర్చః' అని చెప్పి, వరుడు దానిని ఉత్తరాగ్రముగా వేసికొని, 'రాష్ట్రభృదస్యాచార్యాసన్దీ' అను మంత్రముతో ప్రాఙ్ముఖముగా దానిపై కూర్చొనవలెను. అట్లు కూర్చున్న వరునికి ఎదురుగానుండి కన్యాదాత అతనికి మధుపర్కపూజ చేయవలెను.

[461]కన్యాదాత తన ఎడమచేతితో ఉత్తరాగ్రముగా నొక కూర్చను వేసికొని, దానిపై నొక క్రొత్త రాగి (లేక ఇత్తడి, వెండి,మట్టి) నీటిచెంబును పెట్టుకొని, ఆచెంబుపై మఱియొక ఉత్తరాగ్రపు కూర్చను వేసికొని, చెంబును కుడిచేత మూసి 'ఆపః పాద్యా (కాళ్లు కడుగుకొనుటకు నీళ్లు)' అని పల్కవలెను. అప్పుడు వరు డా చెంబును తన కుడిచేత తాకి 'ఆపః పాదావనే జనీః' అను మంత్రముతో నభిమంత్రింపవలెను.

[462] పిదప ఒక క్రొత్త ఇత్తడి పళ్ళెమును వరుని ముందర నుంచి, భార్య ఆ చెంబునందలి నీటిని తన కుడి ప్రక్కనుండి పోయుచుండగా, దాత ముందుగా నా పళ్ళెములో నుంచిన వరునియొక్క కుడికాలును, ఆతర్వాత పళ్లెములో నుంచిన వరుని ఎడమకాలును ముమ్మారు కడుగవలెను. అట్లు కడిగిన పిదప వరుడు మఱియొక చెంబులో నుంచిన జలమును స్పృశించి,తన కుడిచేత

మం॥ మయి మహో మయి యశో మయ్యాన్ద్రియం వీర్యమ్॥ (తై.మం.పా.2.9)

[463]వా॥ దాతా మృణ్మయే పాత్రే పుష్పాక్షతసంయుక్తమర్హణార్థం జలమానీయ సకూర్చాభ్యాం సవ్యదక్షిణపాణిభ్యా మధస్తాదుపరిష్టాచ్చ పరిగృహ్య,'అర్హణీయా ఆపః' ఇతి బ్రూయాత్। వర స్తజ్జలమ్ 'ఆమాగన్ని'త్యేతయాభిమన్త్రయేత్।

మం॥ ఆమాగన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసా చ। తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్॥ (తై.మం.పా.2.9)

[464] వా॥తదేకదేశే దాత్రా స్వాంజలౌ దీయమానే 'విరాజో దోహోసీ'తి జపేత్।

మం॥ విరాజో దోహోఽసి విరాజో దోహమసీయ మమ పద్యాయ విరాజ॥ (తై.మం.పా.2.9)

[465]వా॥ వరః అపః అపాస్య, దాత్రా తచ్ఛేషం పురస్తాన్నినీయమానమ్, 'సముద్రం వః ప్రహిణోమీ'త్యనుమంత్రయేత్।

---

దాతయొక్క కుడిభుజమును తాకి, 'మయి మహో' అను మంత్రము చదివి అదేచేత తన ఎదను తాకి, మరల మునుపటివలెనే జలమును స్పృశించి, ఆచమింపవలెను.

[463] తర్వాత దాత వరపూజార్థమై పుష్పాతలువేసిన జలముగల ఒక మట్టిపాత్రను మునుపటి వలెనే కూర్చలమధ్య ఎడమ,కుడిచేతులలో పట్టుకొని, 'అర్హణీయా ఆప (పూజార్థమైన జలము)' అని చెప్పవలెను. వరు డాజలమును 'ఆమాగన్' అను మంత్రముతో నభిమంత్రింప వలెను. (ఇచ్చట మట్టిపాత్ర లేకున్న వేరొకపాత్రను వాడవచ్చును.)

[464] దాత్రా=కన్యాదాతచేత, స్వాంజలౌ=తనయొక్క దోసిటిలో, దీయమానే = ఈయబడు చున్న, తదేకదేశే=ఆకొంతజలమునుగూర్చి, 'విరాజో దోహోసీ'తి = 'విరాజో దోహోసి' అను మంత్రమును, జపేత్=(వరుడు)జపించవలెను. అనగా కన్యాదాత వరుని దోసిటిలో ఆ పాత్రలోని జలమునుంచుచుండగా, వరుడు 'విరాజో దోహోసి' అను మంత్రము జపించవలెను.

[465] తదుపరి వరు డాజలమును వదలిపెట్టి, తచ్ఛేషం=అట్లు దోసిటిలో నుంచగా నెక్కువై, దాత్రా=కన్యాదాతచేత, పురస్తాత్=తన యెదుట (నేలపై), నీయమానమ్ =పోయబడుచున్న జలమును, 'సముద్రం వః ప్రహిణోమి' ఇతి = 'సముద్రం వః ప్రహిణోమి' అను మంత్రముతో,

మం॥సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమపిగచ్ఛత। అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మా పరాసేచి మత్పయః॥ (తై.మం.పా.2.9)

[466] వా॥కన్యాదాతా తాంబూలఫలసమేతనూతనవస్త్రాణి, సువర్ణాభరణాని చ హస్తే గృహీత్వా 'యువం వస్త్రాణీ'తి వస్త్రాణి, 'హిరణ్యరూపస్సహిరణ్య' ఇతి సువర్ణాభరాణి చ దాతృనామచోచ్చైరుక్త్వా ప్రయచ్ఛేత్।

మం॥ అర్చత ప్రార్చత। యువం వస్త్రాణి పీవసా వసాథే। యువోరచ్ఛిద్రామన్తవో హ సర్గాః। అవాతిరత మనృతాని విశ్వా। ఋతేన మిత్రావరుణా సచేథే।(బ్రా.2.8.6)। హిరణ్యరూపస్సహిరణ్య సందృగపాన్నపాత్సేదు హిరణ్యవర్ణః। హిరణ్యయాత్పరియోనేర్నిషద్యా హిరణ్యదా దదత్యన్నమస్మై॥(ఋ.సం.2.35)

వా॥ శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనచార్యోభయవేదాంతమార్గప్రవర్తకులైనట్టి శ్రీమదిత్యాది శ్రీమాన్ (శేషాచార్యులవారు) తమ కుమార్తె పాణిగ్రహణోత్సవసమయమున అల్లునికి మధుపర్కద్వయమున్ను, సర్వాభరణములున్ను ఇచ్చి సత్కరించడమైనది.

---

అనుమంత్రయేత్ =(వరుడు) అనుమంత్రించవలెను.

[466] తర్వాత కన్యాదాత ఒకతట్టలో తాంబూలఫలములను, (పసుపులో దడిపి ఎండగట్టిన) నూతనవస్త్రములను (ఇవియే మధుపర్కములు), కుండలాది సువర్ణాభరణములను పెట్టుకొని, వరుని కెదుట నిలిచి, పురోహితుడు క్రింద నిచ్చిన 'యువం వస్త్రాణి' అను మంత్రమును, 'హిరణ్యరూపస్స హిరణ్య' అను మంత్రమును, దాతృగృహీతృనామములు గల వాక్యములను చదివిన తర్వాత ఆ తట్టను వరునిచేతిలో నుంచవలెను. కొందఱీ సమయములో వరునికి గోదానాంగుళీయకాదులను కూడ నిచ్చెదరు. ఈసందర్భములో వధూవరుల మధుపర్కములు రెండును వరునకే ఇచ్చుట ఆచారము. ఈనూత్నవస్త్రాదులను మధుపర్కకర్మాంతమున నీయవలెనని కొన్ని ప్రయోగములలో నున్నది. అట్టిపక్షములో ఇదేమంత్రములను చెప్పుచు కర్మాంతమున వానిని ఈయవలసియుండును. ఈ నూతనవస్త్రములను ధరించియే తర్వాతి కార్యక్రమమును చేయవలసియుండుటచే ఈపద్ధతియు అనుకూలముగనే యుండును.

[467]వా॥దాతా కాంస్యపాత్రే దధిమధుఘృతంచ సంసృజ్య, బృహతా కాంస్యపాత్రేణాపి-ధాయ, సకూర్చాభ్యాం పాణిభ్యాం పూర్వవత్పరిగృహ్య, సముద్ధృత్య, 'మధుపర్క' ఇతి ప్రాహ। అయం మధుపర్కో మధుపర్కో మధుపర్కః। వరః పాణిభ్యాం తం మధు-పర్కం పరిగృహ్య, అపిధానపాత్ర మపనీయ, ఉత్తరయా ద్వాభ్యామభిమన్త్ర్య,

మం॥ త్రయ్యై విద్యాయై యశోఽసి యశసో యశోఽసి బ్రహ్మణో దీప్తిరసి। తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్। ఆమాగన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసా చ। తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూ-నామ్॥ (తై.మం.పా.2.9.10)

[468] వా॥'అమృతోపస్తరణమసి'-ఇత్యాపోశనం కృత్వా, ఆచమ్య,

---

[467] దాతా=కన్యాదాత, కాంస్యపాత్రే =ఒక కంచుపాత్రలో, దధిమధుఘృతంచ =పెరుగు, తేనె, ఘృతములను, సంసృజ్య=మిశ్రణముచేసి, బృహతా కాంస్యపాత్రేణ=ఒకపెద్ద కంచుపాత్రచేత అపిధాయ= దానిని కప్పియుంచి, పూర్వవత్=మునుపటివలెనే, సకూర్చాభ్యాం=కూర్చలచే నాచ్ఛాదనము చేసి, పాణిభ్యాం=రెండుచేతులతో, పరిగృహ్య=పట్టుకొని,సముద్ధృత్య= పైకి యెత్తి, 'మధుపర్క' ఇతి= ఇది మధుపర్కమని, అయం మధుపర్కో మధుపర్కో మధుపర్కః =ఇది మధుపర్కం, మధుపర్కం, మధుపర్కం అని ముమ్మారు గట్టిగా, ప్రాహ=పల్కును. వరః =వరుడు, పాణిభ్యాం=తన చేతులతో, తం మధుపర్కం=ఆమధుపర్కముపాత్రను, పరి గృహ్య=తీసికొని, అపిధానపాత్రమ్=కప్పియుంచిన కాంస్యపాత్రను, అపనీయ=తొలగించి, ఉత్తరయా='త్రయ్యై విద్యాయై', 'ఆమాగన్' అను, ద్వాభ్యామ్= రెండుమంత్రములతో, అభి మన్త్ర్య=ఆమధుపర్కము నభిమంత్రించి,

[468] 'అమృతోపస్తరణమసి' అను మంత్రముతో నీటిని ఆపోశనము చేసి, ఆచమించి, తరువాతి 'యన్మధునో మధవ్యం' అను మంత్రముతో నొకసారి, అమంత్రకముగా రెండుసార్లు ఆ మధు పర్కమును తీర్థమువలె లోనికి తీసికొని, 'అమృతాపిధానమసి' అని ఉత్తరాపోశనము చేసి, చేయి కడిగికొని మఱల ఆచమించి, మిగిలిన మధుపర్కమును వరుడు తనకిష్టమైన మిత్రాదుల కీయవలెను. వరుని కుడిఅఱచేతిలో దాత ఆపోశనార్థము, ఆచమనార్థము నీటిని పోయుటయు, ప్రాశనార్థము మధుపర్కమును ఉంచుటయు ఆచారము.

మం॥ యన్మధునో మధవ్యం పరమమన్నాద్యం వీర్యమ్। తేనాహం మధునో మధవ్యేన పరమేణాన్నాద్యేన వీర్యేణ పరమోఽన్నాదో మధవ్యోఽసాని॥

వా॥ ఇతి సకృన్మంత్రేణ, ద్విః తూష్ణీం ప్రాశ్య, 'అమృతాపిధానమసి' – ఇత్యుత్తరాపోశనం కృత్వా, హస్తం ప్రక్షాళ్య, ఆచమ్య, శేష మనుకంప్యాయ దద్యాత్।

[469] వా॥ తతో దాతా గాం నిర్దిశ్య 'గౌ' రితి ప్రాహ। తతో వర ఉత్తరాన్ మంత్రానుపాంశు జపిత్వా, 'ఓముత్సృజత' ఇత్యుచ్చైరుక్త్వా, గా ముత్సృజేత్।

మం॥ గౌః।యజ్ఞో వర్ధతాం యజ్ఞస్య వృద్ధిమనువర్ధాఽపచితిరస్యపచితిం మా కుర్వపచితోఽహం మనుష్యేషు భూయాసమ్।గౌర్ధేనుభవ్యా మాతా రుద్రాణాం దుహితా వసూనాగ్ స్వసాదిత్యానామమృతస్య నాభిః॥ ప్రణువోచం చికితుషే జనాయ మా గామనాగామదితిం వధిష్ట। పిబతూదకం తృణాన్యత్తు॥

(మం.పా.2.10)।ఇత్యుపాంశు జపిత్వా, 'ఓముత్సృజత।'-ఇత్యుచ్చైర్వదేత్।

[470] వా॥ తతో దాతా సిద్ధమన్నం 'భూతమ్' – ఇతి వరాయ నివేదయేత్।

---

[469] తతః=తదుపరి, దాతా=కన్యాదాత, గాం=ఆవును, నిర్దిశ్య=చూపి, 'గౌ' రితి= నీకొరకైన గోవని, ప్రాహ=అనును.తతః= అప్పుడు, వరః=వరుడు, ఉత్తరాన్ మంత్రాన్=తరువాతి 'యజ్ఞో వర్ధతాం' అను మంత్రములను ఉపాంశు=మెల్లగా, జపిత్వా=జపించి, 'ఓముత్సృజత' ఇతి= 'దీనిని విడిచిపెట్టండి' అని, ఉచ్చైరుక్త్వా=బిగ్గరగా పలికి, గాం=గోవును, ఉత్సృజేత్=విడిచి పెట్టవలెను. వస్తుతః వివాహ ప్రదేశమునకు గోవును తెచ్చుట పడదు. ఐనను అచ్చట గోవున్నదని భావించి, దానిని విడిచి పెట్టుటకు చిహ్నముగా నొక పోకచెక్కను ఎగురవేసి ఈతంత్రమును నడిపించుచున్నారు. (ఇట్టి గోవును ఉంచుకొనుట కలిలో నిషిద్ధము. అందుచేత ఉంచుకొన దలచినచో చెప్పవలసిన 'గౌరస్యపహత' అను మంత్రమును విడిచిపెట్టి, గోవును విడిచిపెట్టుట కుద్దేశించిన 'యజ్ఞో వర్ధతామ్' అనుమంత్రముమాత్రము చెప్పబడినది.)

[470] తతః=తదుపరి, దాతా=కన్యాదాత, సిద్ధ మన్నం భూతం ఇతి= 'భూతం'-'అన్నము సిద్ధముగా నున్నది' అని, వరాయ=వరునికి, నివేదయేత్=తెలుపవలెను.

[471] వా॥ వరః సావిరాడిత్యేతై రుపాగ్ శ్వన్న మభిమంత్ర్య, 'ఓం కల్పయత'-ఇత్యుచ్చైర్వదేత్।

మం॥ భూతమ్। సా వి॒రాట్। తన్మా॒ క్షా॑యి। త॒స్య తేఽశీ॒య। తన్మ ఊర్జం ధాః।

మం॥ ఓం క॒ల్పయత

తతో వధూవరౌ నూతన(మధుపర్క)వస్త్రాణి ధృత్వా ఉత్తరకార్యాణి కుర్యాతామ్।

## గుడజీరకనిక్షేపణమ్- ఆంధ్రదేశాచారపద్ధతిః

(వివాహమందు గుడజీరకములు (జిలకరబెల్లముల మిశ్రణము) వధూవరులు పరస్పరశిర స్సులం దుంచుకొనుట ఒక ప్రధానఘట్టమై యున్నది. ఆంధ్రదేశాచారమును పాటించు శ్రీవైష్ణ వులు ఈసందర్భములో పురోహితాదులు మంగళాష్టకములను, చూర్ణికను చదువుచుండగా దీనిని చేసికొనుచున్నారు. కేవలము దక్షిణదేశసంప్రదాయస్థులైన శ్రీవైష్ణవులు దీనిని చేసికొనుట లేదు. ఇంకను కొందరు మధ్యేమర్గంగా చూర్ణికాదులు లేకుండనే అమంత్రకముగా, కేవల లౌకిక లాంఛనముగా దీనిని చేసికొనుచున్నారు. ఎవరి పద్ధతి ప్రకారము వారు చేసికొనవచ్చును. కాని ఇచ్చట పరిపూర్ణాంధ్రదేశపద్ధతి ఈయబడినది. ఈపద్ధతిని పాటించని శ్రీవైష్ణవులుదీనిని మంత్ర రహితముగానో, అసలే చేసికొనకుండగనే ఉండవచ్చును. శ్రీవైష్ణవేతరులు వధూవరులకు మధ్య ఒక తెరను పట్టి, గుడజీరకనిక్షేపణము చేసిన తర్వాత సుముహూర్తసమయమున తెరను తొల గించుచున్నారు. అప్పుడు వరుడు వధువును చూచుచున్నాడు. ఇదియే వారికి వివాహసుము హూర్తసమయము. కాని శ్రీవైష్ణవులకు తెరను పట్టు పద్ధతి లేదు. వారు లాంఛనముగా గుడజీరక నిక్షేపము చేసి, ఆతర్వాత వచ్చు మంగళసూత్రధారణకాలమును సుముహూర్తముగ నెంతురు.)

---

[471] గోవును విడిచిపెట్టినను అతిథికి భోజనము పెట్టవలెనని మధుపర్కనియమ మున్నందువల్ల, కన్యాదాత అన్నము సిద్ధముగా నున్నదని తెల్పుచున్నాడు. అప్పు డతని భార్యగాని, తత్సమా నీకులుగాని ఒక పళ్లెములో అన్నమును తీసికొని రాగా వరుడా అన్నమును 'భూతమ్ స...తన్మ ఊర్జంధాః' ఇత్యాది 5 మంత్రములను మెల్లగా పలికి దాని నభిమంత్రించి, 'ఓం కల్పయత' అను మంత్రమును బిగ్గరగా పలుకుచున్నాడు. తదుపరి వధూవరులు లోగడ వరునికిచ్చిన మధు పర్కములను (పసుపువస్త్రములను) ధరించి గుడజీరకనిక్షేపణాద్యుత్తరకార్యములను చేయ వలెను. ఇంతవరకే కన్యాదాత చేయవలసినది. ఇకపై కార్యక్రమమును వరుడే చేసికొనవలెను.

[472]**ప్రయోగః**: అథ పూర్వస్మిన్ ధాన్యరాశౌ ప్రత్యఙ్ముఖం వరం, పశ్చిమరాశౌ చ ప్రాఙ్ముఖీం కన్యాం ప్రత్యేకం ధృతగుడజీరకపాణౌ స్థాపయేయుః। తౌ వధూవరౌ మనసీష్టదేవతాం ధ్యాయన్తౌ సమాహితౌ తిష్ఠేతామ్। అథ బ్రాహ్మణాః 'సత్యేనోత్త-భితే'తి సూక్తం, మంగళాష్టకాని చూర్ణికాం చ పఠేయుః। పురన్ధ్ర్యో మంగళగానం కుర్యుః। అన్తే వధూవరౌ పరస్పరం శిరసి గుడజీరకాన్ క్షిపేతామ్।

## లగ్నాష్టకాని

శ్లో॥ లక్ష్మీశో భువనత్రయే నివసతో దేవాన్ మనుష్యోరగాన్
సంస్థాతుం కరుణానిధిః కరుణయా మార్తాండవంశే యయౌ।
కౌసల్యా నిజగర్భసంభవభృతే జన్మన్యసాధారణే।
జాతే శ్రీరఘునాయకస్య జననం దేయాదిదం మంగళమ్॥

---

[472] అథ=పిమ్మట, పూర్వస్మిన్ ధాన్యరాశౌ=తూర్పువైపున ధాన్యమునుంచినబుట్టలో, వరం =వరుని, ప్రత్యఙ్ముఖం=పశ్చిమముఖునిగాను, పశ్చిమరాశౌ చ =(వరుని కెదురుగా) పడమటి కుంచిన ధాన్యపుబుట్టలో, కన్యాం=కన్యను, ప్రాఙ్ముఖీం=తూర్పుముఖముగాను, ప్రత్యేకం= వేర్వేరుగా, ధృతగుడజీరకపాణౌ=జిల్కరబెల్లములు (ఒకతమలపాకులో నుంచి) చేతబట్టుకొని యున్నవారిని, స్థాపయేయుః=ఉంచవలెను. తౌ వధూవరౌ=ఆవధూవరులు, మనసీష్టదేవతాం =ఇష్టదేవతలను, ధ్యాయన్తౌ=ధ్యానించుచు, సమాహితౌ=అంగీకృతమనస్కులై, తిష్ఠేతామ్= ఉండవలెను. అథ=అప్పుడు, బ్రాహ్మణాః=పురోహితాదులు, 'సత్యేనోత్తభితే' తి సూక్తం=సత్యే నోత్తభితా అను వేదసూక్తమును, మంగళాష్టకాన్ చూర్ణికాం చ=మంగళాష్టకచూర్ణికలను, పఠేయుః=పఠింతురు. పురన్ధ్ర్యః=ముత్తైదువలు,మంగళగానం=మంగళగానములను, కుర్యుః =చేతురు. అన్తే=చివరికి, వధూవరౌ=వధూవరులు, పరస్పరం శిరసి = ఒకరి తలపై నింకొకరు, గుడజీరకాన్=(తమలపాకులలో పట్టుకొన్న) జిల్కరబెల్లములను, క్షిపేతామ్=ఉంచుదురు. అట్లుంచిన పిదప బ్రాహ్మణులు 'ధ్రువంతే రాజా', 'సా నో దేవీ సుహవా' అను మంత్రములను చదువుదురు. అవి చదివిన వెంటనే వధూవరుల కడ్డముగ నున్న తెరను తొలగింతురు. అప్పుడు సదస్యులు 'అయం ముహూర్తస్సుముహూ ర్తోఽస్తు...' అని వధూవరులపై మంగళాక్షతలు వేతురు. ఇదియే గుడజీరకనిక్షేపణకార్యక్రమము.

శ్లో॥ వైదేహీవదనాభిలాషణయుతం కామం సకామం కృతం
విఖ్యాతం భువనత్రయం హరధనుర్భగ్నీకృతం లీలయా।
విశ్వామిత్రపరాశరాదిమునిభి స్తత్సన్నిధానాంచితం
సీతారాఘవయో ర్వివాహసమయే దేయాదిదం మంగళమ్॥

శ్లో॥ ఉత్ఫుల్లామలనీలనీరజదళశ్యామోన్నతం కోమలం
పార్వత్యా చ మహేశ్వరేణ చ శిరస్ శ్లాఘీకృతం సర్వదా।
శాపాప్తిర్వరగౌతమస్య వనితాశైలా సుశీలాకృతా
దంపత్యోరిహ వామభాగవనితం దేయాదిదం మంగళమ్॥

శ్లో॥ శ్రీరామం జనకాత్మజా సురగురుం ప్రత్యఙ్ముఖం ప్రాఙ్ముఖం
దోర్భ్యామంజలి మంచితైశ్చ వనితా మాపూర్య ముక్తాఫలైః।
నానారత్నవిరాజమానకలశై రానీయతం సాగరాత్।
సీతారాఘవయోర్వివాహసమయే దేయాదిదం మంగళమ్॥

శ్లో॥ కల్యాణం కమనీయ కోమలకరై రార్ద్రాక్షతారోపణం
కన్యాదానపురస్సరం సురగురో ర్విప్రాశిషానుగ్రహమ్।
బాహ్వోః కంకణబంధనం దశగుణం మాంగల్యసూత్రాన్వితం
సీతారాఘవయో ర్వివాహసమయే దేయాదిదం మంగళమ్॥

శ్లో॥ జానక్యాః కమలాంజలిపుటే యాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకే చ విలసత్కుందప్రసూనాయితాః।
స్రస్తా శ్యామలకాయకాన్తికలితా యా ఇంద్రనీలాయితాః
ముక్తా స్తాశ్శుభదా భవన్తు భవతాం శ్రీరామవైవాహికాః॥

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥

శ్లో॥ శ్రీరామపత్నీ జనకస్య పుత్రీ సీతాంగనా సుందరకోమలాంగీ।
శ్రీవిష్ణుపత్నీ భువనైకమాతా వధూవరాభ్యాం వరదా భవన్తు॥

సుముహూర్తస్సావధాన। శుభలగ్నస్సావధాన। శ్రీలక్ష్మీనారాయణస్సావధాన।

## మంగళాష్టకాని

శ్లో॥ వైదేహీ వరరామచంద్రరమణీ ఫుల్లారవిందేక్షణా
సాధ్వీ శీలవతీ సులక్షణయుతా సర్వంసహాసంభవా।
పూర్ణాచారవిచార చారుసుమతిః పూర్ణేందుబింబాననా।
సీతా భవ్యగుణా సుఖేన భవతాం కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ ధీరస్తోమమనశ్చకోరరజనీనాథః కవేరాత్మజా
ద్వీపాభ్యంతర శేషభోగశయన స్పందర్శకాభీష్టదః।
కారుణ్యాలయహృ త్సురాసురవరైస్సేవ్యోఽనిశం శ్రీధర
శ్శ్రీరంగాధిపతి శ్శ్రియా సహ సదా కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ హైమాకారవిమానమధ్యవిలస న్మంగాపతి శ్శ్రీకర
శ్శ్యామాంగః కరదర్శితాత్మవిభవ శ్శేషాచలాధీశ్వరః।
సోమోఽహస్కరలోచన స్సురవరైస్సంపూజితాంఘ్రిద్వయ
శ్శ్రీమద్వేంకటనాయక స్స భవతాం కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ ప్రహ్లాదం దురవాప దుఃఖజలధే రుత్తారయ న్నైగమాం
బాహ్యాంతః పరిపూర్ణతాం ప్రకటయన్ స్తంభం విభిందన్ బలాత్।
హేమాక్షాగ్రజ మాజఘాన నఖరై ర్యో మంగళానాం నిధి
శ్శ్రీమాన్ శ్రీవిభు రీశ్వరో నరహరిః కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ శ్రీభద్రాచలదివ్యభవ్యశిఖరః ప్రోత్తుంగసౌధాంతరే
నిత్యశ్రీమతిసుందరే మణిమయే సింహాసనే భాసురే।
స్వాసీనస్సహసీతయా ముదితయా వామాంకవిశ్రాన్తయా
శ్రీరామస్సకలాగమాదివినుతః కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ మీనః కచ్ఛప సూకరో నరమృగః కుబ్జో మహాన్ భార్గవో
రామో యాదవనాయకో రతిసఖః కృష్ణశ్చ కల్క్యాదయః।
లోకానాం పరిపాలనాయ జనితో దేవో జగద్రక్షకః
పాయాద్వో భగవాన్ పురాణపురుషః కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ క్షీరాంభోనిధికన్యకా సుమనసస్సంఘైస్సమారాధితా
భక్తాభీష్టఫలప్రదానవిభవా లోకైకమాతా రమా।
పద్మా పద్మనికేతనా కరలసత్పద్మా సుపద్మాననా
పద్మాక్షీ సుగుణా సుఖేన భవతాం కుర్యాత్సదా మంగళమ్॥

శ్లో॥ ఆదిత్యశ్చ సుధాకరశ్చ ధరణీపుత్రశ్చ చంద్రాత్మజో
దేవార్యశ్చ బృహస్పతి ర్భృగుసుతో ఛాయాసతీనందనః।
రాహుః కేతు నవగ్రహా నవశుభా ఏకాదశస్థా స్సదా
నక్షత్రాణి చ లగ్న యోగ తిథయః కుర్వన్తు వాం మంగళమ్॥

సుముహూర్తస్సావధాన। శుభలగ్నస్సావధాన। శ్రీలక్ష్మీనారాయణస్సావధాన।

## చూర్ణికా

స్వస్త్యష్టాశీతి సహస్రాణామ్। ద్విజగురుదైవత్యానామ్। ఇంద్ర వైశ్వానర దండధర రక్షో గణేశ్వర వరుణ వాయుభట్టారక యక్షేశ సోమశేఖరాణామ్। యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగయోగనిరతానాం వశిష్ఠ వాల ఖిల్య వైశంపాయన విశ్వామిత్ర దక్ష కాత్యాయన కౌండిన్య గౌతమాంగీరస పారాశర వ్యాస వాల్మీకి శుక శౌనక సనక సనందన సనత్కుమారాది ముఖ్యమునీనామ్। స్వస్తి సమస్త మంగళాలంకృత సకల కల్యాణలక్షణ విలక్షణ లక్ష్మీ సమేతస్య। శంఖ చక్ర శార్ఙ్గ వనమాలాది శోభితస్య। శ్రీవత్స కౌస్తుభ సుషమా విశేషణముద్రా ముద్రితోరఃస్థలస్య। వసుమతీ జాంబవతీ రుక్మిణీ సత్యభామాధిపతేః। అనేకకోటి గీర్వాణ పండితస్య। శ్రీ లక్ష్మీనారాయణస్యప్రసాదేన దంపత్యోర్వివాహకాలే హరిద్ర జీరకేక్షు క్షీర ఘృత గుడ గోరోచనాది మంగళద్రవ్యాని మంగళకరాని భవేయుః। తిథి వార నక్షత్ర యోగ కరణ ముహూర్త లగ్న హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశ త్రింశదంశకానాం నిరంతర మనుకూలాశ్శోభనకరా స్స్వస్తి సర్వే గ్రహా స్సనక్షత్రా శ్శుభైకాదశస్థాన ఫలదా స్సుప్రసన్నా వరదా భవన్తు

వా॥ తతో గుడజీరకాన్ ధృవన్త ఇతి మంత్రేణ వధూవరౌ పరస్పరం శిరసి నిక్షిపేత్।

మం॥ ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః। ధ్రువం త ఇన్ద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్॥౧॥

సా నో దేవీ సుహవా శర్మ యచ్ఛతు। ఆత్వాఽహార్షమన్తరభూః। ధ్రువ స్తిష్ఠాఽవిచాచలిః। విశస్త్వా సర్వా వాఞ్ఛన్తు। మా త్వద్రాష్ట్ర మధిభ్రశత్। ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ। ధ్రువం విశ్వమిదం జగత్। ధ్రువా హ పర్వతా ఇమే। ధ్రువో రాజా విశామయమ్। ఇహైవైధి మా వ్యథిష్ఠాః। పర్వత ఇవాఽ విచాచలిః। ఇన్ద్ర ఇవేహ ధ్రువస్తిష్ఠ। ఇహ రాష్ట్ర ముధారయ। అభితిష్ఠ పృతన్యతః। అధరే సన్తు శత్రవః। ఇన్ద్ర ఇవ వృత్రహా తిష్ఠ। అపః క్షేత్రాణి సంజయన్న్। ఇన్ద్ర ఏణ మదీధరత్। ధ్రువం ధ్రువేణ హవిషా। తస్మై దేవా అధిబ్రవన్న్। అయం చ బ్రహ్మణస్పతిః॥౨॥
(బ్రా.2.4.19 & 20)

తతస్సదస్యాః '*అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు/ అస్మిన్ ముహూర్తకాలే సూర్యాదీనాం నవానాం గ్రహాణా మానుకూల్యఫలసిద్ధిరస్తు/*' ఇత్యక్షతాన్ క్షిపేయుః।

## అన్యోన్యసమీక్షణమ్

[473] తత (ఆవరణవస్త్ర ముత్తరతో అపాస్య) వరస్తండులరాశిస్థాం ధాన్యరాశిస్థాం వా కన్యాం స్వయం దృష్ట్వా తృతీయాం (అభ్రాతృఘ్నీమిత్యేతాం) జపేత్।

మం॥అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం బృహస్పతే। ఇన్ద్రాపుత్రఘ్నీం లక్ష్మ్యం తామస్యై సవితస్సువ॥ (తై.మం.పా.1.1.3)

---

[473] తతః=జిల్కరబెల్లములను పరస్పరశిరములం దుంచుకొనిన పిమ్మట, ఆవరణవస్త్రం = వధూవరుల కడ్డముగా తెరను బట్టియున్న చో నట్టి తెరను తీసి, ఉత్తరతః=ఉత్తరదిశకు, అపాస్య =పడవేసి, వరః=వరుడు, తండులరాశిస్థాం ధాన్యరాశిస్థాం వా=బియ్యము లేక యవలు గల బుట్టలో తూర్పుముఖముగా కూర్చున్న, కన్యాం=కన్యను, దృష్ట్వా=చూచి, తృతీయాం = ఏకాగ్నికాండ తొలిప్రశ్నలో 3వదగు 'అభ్రాతృఘ్నీం' అను మంత్రమును, జపేత్=జపించవలెను.

[474]‘అఘోరచక్షురిత్యేతయా కన్యాదృష్టౌ స్వదృష్టిం నిపాత్య అవయవశః ప్రతీక్షేత।
మం॥అఘోరచక్షురపతిఘ్న్యేధి శివా పతిభ్యస్సుమనాస్సువర్చాః। జీవసూ
ర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదే శం చతుష్పదే॥ (తై.మం.పా.1.1.4)

## వధూవరసంకల్పః-భ్రువోంతరమార్జనమ్

[475]అథ వరో వధ్వాసహ దర్భేష్వాసీనః ప్రాఙ్ముఖః ప్రాణానాయమ్య, ‘*అస్యాం శుభ తిథౌ ఆవయోర్దంపత్యోః ఆయుర్వర్చోయశోబలాభివృద్ధ్యర్థం ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయితవ్యాః*’- ఇతి సంకల్ప్య, పత్న్యర్థం పునః ప్రాణానా-యమ్య, ‘*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ ఆవయో ర్దంపత్యోః ఆయుర్వర్చోయశోబలాభివృద్ధ్యర్థం ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని ప్రజా శ్చోత్పాదయితవ్యాః*’- ఇతి పత్నీం వాచయిత్వా, అంగుష్ఠోపమధ్యయా చాఙ్గుళ్యా

---

[474] అఘోరచక్షురిత్యేతయా =’అఘోరచక్షుః’ అను నాల్గవమంత్రముతో, కన్యాదృష్టౌ=వధూ దృష్టియందు, స్వదృష్టిం= తనదృష్టిని, నిపాత్య= ఉంచి (అనగా ఆమెచూపులో వరుడు తన చూపును కలుపుచు), అవయవశః= ఆమెను ప్రత్యంగముగా, ప్రతీక్షేత=చూడవలెను.

[475] అథ=పిదప, వరః=వరుడు, వధ్వాసహ దర్భేష్వాసీనః=వధువు తన కుడికి నుండగా ఆమె ప్రక్కకు దర్భాసనముపై కూర్చొని, ప్రాఙ్ముఖః=తూర్పుముఖముగా నుండి, ప్రాణానాయమ్య =ప్రాణాయామము చేసి, ‘పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం---ప్రజాశ్చోత్పాద యితవ్యాః’- అనిసంకల్పించి, పత్న్యర్థం=భార్యకొరకై, పునః ప్రాణానాయమ్య=మరల ప్రాణాయామము చేసి, తాను చేసిన సంకల్పమును ఆమెచేతను పల్కించి, అంగుష్ఠోపమధ్య యాచాఙ్గుళ్యా=బొటనవ్రేలు, ఉంగరపువ్రేళ్లతో, దర్భాగ్రం=ఒకదర్భను, సంగృహ్య=కొనలు పైకి చేసి పట్టుకొని, వధువుకభిముఖుడై, ‘ఇదమహ’ మితి యజుషా=‘ఇదమహం’ అను మంత్ర ముతో, తస్యాః=వధువుయొక్క, భ్రువోరన్తరగ్ం= కనుబొమల మధ్యప్రదేశమును, సంమృజ్య =కుడినుండి ఎడమవైపు తుడిచి, ప్రతీచీనం=పడమటికి, నిరస్య=(ఆదర్భను) పడవేసి, అప ఉప స్పృశేత్=నీటిని తాకవలెను. ఇక్కడ వధూవరు లిర్వురు ‘దంపతులమగు మేము సత్కర్మ లను చేతుము, సత్సంతానమును గందుము’ అని సంకల్పము చేయుచున్నారు గావున, ప్రాణా యామములు, సంకల్పములు ముందుగా వరునికి, తర్వాత వధువుకు చెప్పబడినవి.

దర్భగ్ం సంగృహ్య, 'ఇదమహ' మితి యజుషా తస్యా భ్రువోరన్తరగ్ం సంమృజ్య ప్రతీచీనం నిరస్యాప ఉపస్పృశేత్।

మం॥ ఇదమహం యా త్వయి పతిఘ్న్యలక్ష్మిస్తాం నిర్దిశామి॥ (తై.మం.పా.1.1.5)

[476]అథ తయా వా తన్మాత్రాదిభిర్వా అన్యోన్యవియోగచిన్తయా రోదనే కృతే 'జీవాగ్ం రుదన్తి'త్యేతాం జపేత్।

మం॥ జీవాగ్ం రుదన్తి విమయన్తే అధ్వరే దీర్ఘామను ప్రసితిం దీధియుర్నరః।
వామం పితృభ్యో య ఇదగ్ం సమేరిరే మయః పతిభ్యో జనయః పరిష్వజే॥

[477]యుగ్మా న్సమవేతాన్ బ్రాహ్మణాన్ 'వ్యక్షత్క్రూర' మిత్యద్భ్యః ప్రహిణుయాత్।

మం॥ వ్యక్షత్క్రూరముదచన్త్వాప ఆఽస్యై బ్రాహ్మణాస్స్నపనగ్ం హరన్తు।
అవీరఘ్నీరుదచన్త్వాపః॥ (తై.మం.పా.1.1.7)

[478]'అర్యమ్ణ' ఇతి యజుషా తస్యాశ్శిరసి దర్భేణ్వం నిధాయ।

---

[476] అథ=పిదప, తయా వా =వధువుచేతగాని, తన్మాత్రాదిభిర్వా=ఆమెయొక్క తల్లి మున్నగు వారిచేతగాని, అన్యోన్యవియోగచిన్తయా=పరస్పరవియోగము కలుగుచున్నదను చింతచే, రోదనే కృతే =రోదనము చేయబడినట్లైతే, 'జీవాగ్ం రుదన్తి'త్యేతాం= 'జీవాగ్ం రుదన్తి' అను మంత్రమును, జపేత్=జపించవలెను. ఇట్లు రోదించినను, రోదింపకున్నను ఈ మంత్రమును లాంఛనప్రాయముగా చదువుట ప్రస్తుతకాలములో జరుగుచున్నది.

[477] పిదప వరుడు తరువాత గల 'వ్యక్షత్క్రూర' మను మంత్రమును పఠించి సరిసంఖ్యగల (ఇద్దరు లేక నల్గురు) బ్రాహ్మణులను వధువును స్నానము చేయించుటకు (అభిషేకము చేయుటకు) కావలసిన నీరు తెమ్మని (పాత్ర లిచ్చి) పంపవలెను.

[478] 'అర్యమ్ణ' ఇతి యజుషా='అర్యమ్ణో అగ్నిం' అను మంత్రముతో, తస్యాః=ఆవధువు యొక్క, శిరసి=తలపైని, దర్భేణ్వం=దర్భచుట్టను, నిధాయ=ఉంచి; దర్భేణ్వలక్షణ మిట్లు చెప్పబడినది. 'శ్లో॥ పంచభిర్వలయం దర్భైః వింశత్యావేష్టనం తతః। అన్తర్దశాఙ్గుళం ప్రోక్తం దర్భేణ్వస్య లక్షణమ్॥' అనగా, 5 దర్భలను వలయాకారముగా మడచి, 20 దర్భలను వాని చుట్టును చుట్టవలెను. ఈవలయముయొక్క వ్యాసము 10 అంగుళములుండవలెను.

మం॥ అర్యమ్ణో అగ్నిం పరియన్తు క్షిప్రం ప్రతీక్షన్తాగ్ం శ్వశ్ర్వో దేవరాశ్చ।
[479] 'ఖేనసః' ఇతి తస్మిన్దక్షిణం బహిర్యుగచ్ఛిద్రం ప్రతిష్ఠాప్య।
మం॥ ఖేఽనసః ఖే రథః ఖే యుగస్య శచీపతే। అపాలామిన్ద్ర త్రిః పూర్త్వ్యకర-త్సూర్యవర్చసమ్॥(తై.మం.పా.1.1.9)
[480]'శం తే హిరణ్య' మితి తస్మిన్ఛిద్రే సువర్ణ మన్తర్ధాయ।(తై.మం.పా.1.1.10)
మం॥ శం తే హిరణ్యగ్ంశము సన్త్వాపశ్శం తే మేధీ భవతు శం యుగస్య తృద్మ। శం త ఆపశ్శతపవిత్రా భవన్త్వథా పత్యా తన్వగ్ం సగ్ంసృజస్వ॥
[481] 'హిరణ్య వర్ణా' ఇతి పంచభిస్సకృత్ స్నాపయిత్వా। (తై.మం.పా.1.2)

---

[479] 'ఖేనసః' ఇతి ='ఖేనసః' అను మంత్రముతో, తస్మిన్=ఆచుట్టపై, దక్షిణం బహిర్యుగ ఛిద్రం ప్రతిష్ఠాప్య=బండికాడి కుడికొనకున్న వెలుపలి ఛిద్రము దర్భచుట్టమధ్యకు వచ్చునట్లు బండి కాడి నామె తలపై పట్టుకొని; (పూర్వము అపాలా యను కుష్ఠరోగముగల కన్యక తనకు పెండ్లి గాకుండుటచే ఇంద్రుని ప్రార్థించెను. అప్పుడింద్రుడు తన రథముయొక్క కాడిరంధ్రమునుండి ఆమెతలపై సోమరసము ధారగా కట్టగా నామె కావ్యాధి హరించి, ఆమె సూర్యప్రకాశముతో వెలుగొంది, వరణీయమై వివాహిత యయ్యెను. ఇట్లు వధువుశిరస్సుపైనుంచిన దర్భవలయ ముపై నుంచిన కాడిరంధ్రమునుండి జలమును ప్రోక్షించిన, వధువుసైత మట్లే ప్రకాశించునను నమ్మకమే ఈక్రియకు మూలము.)

[480] తస్మిన్ఛిద్రే=ఆకాడి రంధ్రమునందు, సువర్ణమ్=(కొత్తజందెపు ముడిని విప్పి, దానికి గట్టిన) మంగళసూత్రములను (లేదా బంగారును), 'శంతే హిరణ్యగ్ం' అను మంత్రముతో, అంతర్ధాయ = ఉంచి; (కాడికి ఒక పసుపుకొమ్మును కట్టుట, కాడియొక్క ఎడమరంధ్రములో నొక మామిడి కొమ్మను పెట్టుట ఆచారము. కాడిరంధ్రములో నుంచిన మంగళసూత్రములు/బంగారు కాడికిని, ఇణ్వమునకు మధ్యనుండునట్లును, తర్వాత ప్రోక్షించు జలము అట్లుంచిన మంగళసూత్రసువర్ణా దుల ద్వారా ఇణ్వముపై పడునట్లును కాడి రంధ్రములో వాని నుంచవలెను.)

[481] హిరణ్యవర్ణాది 5 మంత్రములను చదివి అంతమున నొకసారి ఆకాడిరంధ్రములో నుంచిన మంగళసూత్రములమీదుగా ఇణ్వములో పడునట్లు మునుపు విప్రుల నంపి తెప్పించిన నీటిని

మం॥ హిర॑ణ్యవర్ణాశ్శుచ॑యః పావ॒కాః ప్రచ॑క్రముర్హి॒త్వాఽవ॒ద్యమా॒పః।
శ॒తం ప॒విత్రా॒ విత॑తా॒ హ్య్యాసు తాభిష్ట్వా దే॒వస్స॑వి॒తా పు॑నాతు॥౧॥
హిర॑ణ్యవర్ణాశ్శుచ॑యః పావ॒కా యాసు॑ జా॒తః క॒శ్యపో॒ యాస్వ॒గ్నిః।
యా అ॒గ్నిం గర్భం॑ దధి॒రే సు॒వర్ణా॒స్తాస్త॒ ఆప॒శ్శగ్గ్ స్యో॒నా భ॑వన్తు॥౨॥
యాసా॒గ్ం రాజా॒ వరు॑ణో॒ యాతి॒ మధ్యే॑ సత్యానృ॒తే అ॑వ॒పశ్యం॒జనా॑నామ్।
యా అ॒గ్నిం గర్భం॑ దధి॒రే సు॒వర్ణా॒స్తాస్త॒ ఆప॒శ్శగ్గ్ స్యో॒నా భ॑వన్తు॥౩॥
యాసాం᳚ దే॒వా ది॒వి కృ॒ణ్వన్తి॑ భ॒క్షం యా అ॒న్తరి॑క్షే బహు॒ధా నివి॑ష్టాః।
యా అ॒గ్నిం గర్భం॑ దధి॒రే సు॒వర్ణా॒స్తాస్త॒ ఆప॒శ్శగ్గ్ స్యో॒నా భ॑వన్తు॥౪॥
శి॒వేన॑ త్వా॒ చక్షు॑షా పశ్యన్త్వాపశ్శి॒వయా॑ త॒నువోప॑స్పృశన్తు॒ త్వచం॑ తే।
ఘృ॒త॒శ్చుత॒శ్శుచ॑యో॒ యాః పా॑వ॒కాస్తాస్త॒ ఆప॒శ్శగ్గ్ స్యో॒నా భ॑వన్తు॥౫॥

## వధ్వాః నూతనవస్త్రధారణమ్

[482]వా॥తతః వధ్వాః నూతనవస్త్రం, మంగళసూత్రంచ సదస్యైరనుగ్రహం కారయిత్వా,

---

కూర్చతో ప్రోక్షించి, ఆతర్వాత ఆకాడిని, మంగళసూత్రములను, దర్భేణ్వమును తీసి ప్రక్క కుంచవలెను.

[482] తరువాత మంగళసూత్రధారణసుముహూర్తమునందు కన్యక ధరించు మధుపర్కములను (అనగా పసుపులోతడిపి ఆరవేసిన క్రొత్తవస్త్రములను), మంగళసూత్రములను,వధువునకు కట్టు దర్భయోక్త్రమును, మెట్టెలను ఫలతాంబూలములతో సహ ఒక తట్టలోపెట్టుకొని వరపక్షము లేక వధూపక్షమువారు సభలోని పెద్దవారికి చూపింపగా వారలా తట్టను రెండుచేతులతో తాకి తమ అనుగ్రహమును తెలియజేయవలెను. అట్లు చేసిన తర్వాత వరుడు 'పరిత్వా గిర్వణో గిర' అను మంత్రమును పఠించి, ఆతట్టను వధువు చేతి కీయవలెను. అప్పుడు వధువును వేదిక నుండి గొని పోయి సామాన్యముగా నామె ఆడపడచులు గాని, తన్ని మిత్రము నిర్దేశింపబడిన ఇతర సుమంగళులుగాని ఆతట్టలోనున్న నూతనవస్త్రములను వధువుకు కట్టించి, ఆమెను తిరిగి వేదిక కడకు తీసికొనిరావలెను. ఇట్లు చీర కట్టించిన ముత్తైదువలకు వధూపక్షమువారు తగు పారితోషికమును

‘పరీత్వే’ త్యహతేన వస్త్రేణ వధూ మాచ్ఛాదయ్య।
మం॥ పరి త్వా గిర్వణో గిర ఇమా భవన్తు విశ్వతః। వృద్ధాయుమను వృద్ధయో జుష్టా భవన్తు జుష్టయః॥ (తై.మం.పా.1.2)
[483]వా॥ఇతి సకంచుకేనాహతేన వాససాఽఽచ్ఛాద్య, ద్విరాచమయ్య, మాంగల్య యోక్త్రపూజాం కుర్యాత్।

## యోక్త్రమంగళసూత్రపూజా

[484] తతో వరః ప్రాణానాయమ్య, ‘*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం ఆయు*

---

(క్రొత్త చీర,రవికెలను) ఇచ్చుట కొందఱి కాచారముగా నున్నది. ‘శ్లో॥త్రింశద్దర్భైః కృతం యోక్త్రం ద్వాత్రింశదంగుళాయతమ్। అష్టావింశతిదర్భైర్వా జ్ఞేయం యోక్త్రస్య లక్షణమ్॥’ - అనగా, 30 లేక 28 దర్భలను 32 అంగుళముల పొడవుండునట్లుపేనిన యోక్త్రమును కట్టవలెనని ఈశ్లోకము తెల్పుచున్నది.

[483] ఇట్లు చీర,రవికలను ధరించి వచ్చిన వధువు వరునికి కుడివైపు పెండ్లిపీటపై తూర్పుముఖ ముగా కూర్చొనవలెను. అప్పుడామె కుడిచేతిలో వరుడుతీర్థమును పోసి ఆమెచే రెండుసార్లు ఆచమనము చేయింపవలెను. తదుపరి వధూవరు లిర్వురు కలసి యోక్త్రమంగళసూత్రముల పూజను చేయవలెను.

[484] ప్రాఙ్ముఖులై పీటలపై కూర్చున్న వధూవరులకు ముందుగా రెండు ఇత్తడి (లేక కంచు) తట్టలలో తలంబ్రాల బియ్యమును నిండుగా పోసి, ఆతట్టలలో తమలపాకులను తూర్పునకు కొనలుండునట్లుగా నుంచి, వానిపై వరునివైపు, వధువువైపు మంగళసూత్రముల నుంచవలెను. వధువునకు కట్టవలసిన యోక్త్రమును(దర్భత్రాటిని) కూడ ఆ బియ్యముపై నుంచవలెను. అట్లుం చిన యోక్త్రమంగళసూత్రములకు షోడశోపచారపూజ చేయవలెను. దీనికై వరుడు ప్రాణాయా మము చేసి, ‘పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం --- యోక్త్రమాంగల్యపూజాం కరిష్యే’ – అని సంకల్పము చేసి, ‘యోక్త్రమాంగల్యసూత్రాధిష్ఠానదేవతాభ్యో నమః’ అని ధ్యానించి, విష్వ క్సేనపూజలో చెప్పినట్లుగా షోడశోపచారపూజను చేయవలెను.ఇచ్చట నైవేద్యమునకై కొబ్బెరి కుడుకలలో పాల నుంచుట పద్ధతి. పూజావిధానమున కిచ్చట తెలుగు వివరణ ఈయబడలేదు.

*ర్వరోప్చబలాభివృద్ధ్యర్థం సంపూర్ణశతవర్షపర్యన్తం సుఖేన జీవనసిద్ధ్యర్థం యోక్త్ర మాంగల్యధారణం కరిష్యే, తదంగం షోడశోపచారపూజాం కరిష్యే'* – ఇతి సంకల్ప్య, *'యోక్త్రమాంగల్యసూత్రదేవతాభ్యో నమః' ధ్యాయామి/ ఆవాహయామి/ ఆసనం సమర్పయామి/ పాదయోః పాద్యం సమర్పయామి/ హస్తయోరర్ఘ్యం సమర్పయామి/ ఆచమనీయం సమర్పయామి/ ఔపచారికస్నానం సమర్పయామి/*

"*ఓం ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/ మహే రణాయ చక్షసే/ యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః/ ఉశతీరివ మాతరః/ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ ఆపో జనయథా చ నః/*" - *స్నాపయామి/ స్నానానంతరమాచమనీయం సమర్పయామి/ వస్త్రం సమర్పయామి/ ఉపవీతం సమర్పయామి/ గన్ధం సమర్పయామి/ పుష్పం సమర్పయామి/ ధూపమాఘ్రాపయామి/ దీపం దర్శయామి/ ఏతే గన్ధాక్షతపుష్పధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాస్సర్వోపచారాః-* ఇత్యభ్యర్చ్య,

క్షీరనైవేద్యం - *"ఓం భూర్భువస్సువః/"*- ఇతి క్షీరం ప్రోక్ష్య, *"సత్యం త్వర్తేన పరిషిఞ్చామి (ఋతం త్వా సత్యేన పరిషిఞ్చామి* - ఇతి రాత్రౌ*)"*- ఇతి పరిషిచ్య, *"అమృతమస్తు, అమృతోపస్తరణమసి* - ఇత్యాపోశనం దత్వా, *"ఓంప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే స్వాహా/ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి/"*- ఇతి నివేద్య, "*అమృతాపిధానమసి*" - ఇత్యుత్తరాపోశనం దత్వా, *హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/ తామ్బూలం సమర్పయామి/ సువర్ణ మన్త్రపుష్పం సమర్పయామి/ యోక్త్రమాంగల్యదేవతాప్రసాదం శిరసా గృహ్ణామి/*

---

కొందరిచ్చట 'పుష్పం సమర్పయామి' అని చెప్పిన తర్వాత 'యోక్త్రమాంగల్యసూత్రాధిష్ఠాన దేవతాభ్యో నమః। కుంకుమార్చనం సమర్పయామి।' అని చెప్పి లక్ష్మ్యష్టోత్తరశతనామములతో మంగళసూత్రమునకు కుంకుమార్చన చేయుచున్నారు. అట్లే 'వస్త్రం సమర్పయామి' అని చెప్పినప్పుడు రెండు రవిక బట్టల నచ్చట పెట్టుచున్నారు.

## మంగళసూత్రధారణమ్

[485]వా॥తత స్సుముహూర్తే సదస్యేభ్యః మంగళసూత్రం ప్రదర్శ్య, మంగళాక్షతాన్దత్వా, తేషా మనుగ్రహం ప్రాప్య, ఉచ్చైర్మంగళవాద్యఘోషాయుతస్సన్ వరః 'మాంగల్యం తంతు నానేనే' తి వధూకంఠే మంగళసూత్రం బధ్నీయాత్।

*శ్లో॥ మాంగల్యం తంతునాఽనేన మమ జీవనహేతునా।*

*కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్॥*

[486]వా॥ఇత్యాసీనాయాః ప్రాఙ్ముఖ్యాః వధ్వాః కంఠే వరో మాంగల్యసూత్రం బధ్నాతి। తత స్సదస్యాః 'మాంగల్యధారణముహూర్త స్సుముహూర్తోఽస్తు' ఇత్యక్షతాన్ క్షిప్త్వాఽఽశీర్వాదం కుర్యుః। తతో వధూం పతికులప్రాప్తభూషణై ర్భూషయేత్।

---

[485] తతః=తరువాత, సుముహూర్తే=వివాహసుముహూర్తకాలమున, సదస్యేభ్యః =సదస్సులో నున్న పెద్దవారికి మాత్రము, మంగళసూత్రం= మంగళసూత్రము నొకతట్టలో తమలపాకులపై నుంచుకొని, ప్రదర్శ్య=(వారికి) చూపించి, మంగళాక్షతాన్ =హరిద్రాక్షతలను, దత్వా=ఇచ్చి, తేషాం=వారియొక్క, అనుగ్రహం=అనుగ్రహమును, ప్రాప్య=పొంది, ఉచ్చైర్మంగళవాద్య ఘోషాయుతస్సన్= మంగళవాద్యములు పెద్దగా మ్రోగుచుండగా, వరః=వరుడు, వధూకంఠే = వధువుయొక్క కంఠమునందు, 'మాంగళ్యం తంతునానేనే'తి= 'మాంగల్యం తంతునానేన' అను శ్లోకమును చెప్పుచు, మంగళసూత్రం=మంగళసూత్రమును, బధ్నీయాత్=కట్టవలెను.

[486] ఇతి=ఇట్లు, ఆసీనాయాః ప్రాఙ్ముఖ్యాః వధ్వాః=తూర్పుముఖముగా కూర్చొనియున్న వధువుయొక్క, కంఠే=కంఠమునందు, వరః= వరుడు (లేచి పశ్చిమాభిముఖుడై,'మాంగల్యం తంతునా' అను శ్లోకమును మూడుసార్లు చెప్పుచు, మూడుముళ్లను వేసి), మంగళసూత్రం= మంగళసూత్రమును, బధ్నాతి=కట్టుచున్నాడు. తతః=అప్పుడు, సదస్యాః=సదస్యులు, 'మాంగల్యధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు' ఇతి='మాంగల్యధారణముహూర్తస్సుము హూర్తోఽస్తు' అనుచు, అక్షతాన్=(మునుపు వారికిచ్చిన) అక్షతలను, క్షిప్త్వా= వధూవరులపై వేసి, ఆశీర్వాదం=ఆశీర్వాదమును, కుర్యుః=చేయుదురు. తతః=అటుపైని, వధూం=వధు

## యోక్త్రధారణమ్

[487]వా॥ 'ఆశాసానే' త్యాసీనాం వధూం యోక్త్రేణ సన్నహ్యతి।

మం॥ ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూమ్। అగ్నేరనువ్రతా భూత్వా సం నహ్యే సుకృతాయ కమ్॥ (తై.సం.1.1.10)

వా॥ ఉత్తరేణ నాభిం నిష్టర్క్యం గ్రన్థిం బధ్వా, ప్రదక్షిణం పర్యూహ్య, దక్షిణేన నాభి మవస్థాపయతి।

## అక్షతారోపణమ్

[488]వా॥వరః స్వపయసా వధ్వంజలౌ ద్విరుపస్తీర్య ద్విస్తండులానోప్య ద్విరభిఘార యతి। తతః పురోధా స్తాభ్యామేవ తండులపయోభ్యాం వరాంజలౌ పూర్వవత్కృత్వా।

---

వును,పతికులప్రాప్తభూషణైః=వరునిపక్షమువారామె కిచ్చు సొమ్ములతో, భూషయేత్=అలం కరింపవలెను.

[487] ఆశాసానా ఇతి='ఆశాసానా' అను మంత్రముతో, ఆసీనాం వధూం=కూర్చొనియున్న వధువును, యోక్త్రేణ=దర్భత్రాటితో, సన్నహ్యతి=(వధువునడుముచుట్టును) కట్టుచున్నాడు. ఉత్తరేణ నాభిం=యోక్త్రమును నాభికి ఉత్తరమునుండి ప్రదక్షిణముగా మొలచుట్టును చుట్టి, నిష్టర్క్య గ్రన్థిం బధ్వా=పీటముడివేసి కట్టి, ప్రదక్షిణం పర్యూహ్య=ఆముడిని ప్రదక్షిణముగా నాభిపైనుండి దాటించి,దక్షిణేన నాభిమ్=నాభికి దక్షిణమున,అవస్థాపయతి=నిల్పుచున్నాడు. మంగళసూత్రమును కట్టువిధముగనే తూర్పుముఖముగా కూర్చున్న వధువున కెదురుగా వరుడు నిలబడి ఆమె నడుమునకు యోక్త్రము నొకచుట్టు మాత్రమే కట్టవలెను.

[488] తర్వాత వధూవరులు అక్షతారోపణము (తలంబ్రాలు పోసికొనుట) చేసికొనవలెను. దీనికై వధువు తూర్పుముఖముగాను, వరుడు ఆమె కెదురుగా పశ్చిమముఖముగాను కూర్చుండ వలెను. వారిమధ్య రెండు ఇత్తడి లేక కంచుపాత్రలలో తలంబ్రాలను నింపి యుంచవలెను. వధువు వైపొక వెండిపాత్రలోను, వరునివైపింకొక వెండిపాత్రలోను పాలను పోసి ఆ బియ్యపుతట్టల ప్రక్క కుంచవలెను. ఒక ఉదకుంభమును, మామిడికొమ్మను అచ్చట నుంచుకొనవలెను. అప్పుడు, వరః=వరుడు, స్వపయసా=(మామిడికొమ్మతో నద్దుకొనిన) తనవైపుపాలతో, వధ్వంజలౌ= వధువుదోసిటిని, ద్విః=రెండుసార్లు, ఉపస్తీర్య=ప్రోక్షించి, ద్విః=రెండుసార్లు, తండులాన్=

వధ్వంజలేరుపరిస్థాప్య, బ్రాహ్మణైస్సహ వరః కపిలాగ్ం వాచయిష్య ఇత్యుక్త్వే, తే వాచ్యతామితి బ్రూయుః। తతః పురోధస్సోదకం కలశమాదాయ సంతతముదకధారాన్ స్రావయన్ వదేత్।

మం॥ కపిలాగ్ స్మారయన్తు। దక్షిణాః పాన్తు। బహుదేయంచాస్తు। యజ్ఞాః పాన్తు। నక్షత్రదేవతాః పాన్తు। పుణ్యాహం వర్ధతామ్। శాన్తిరస్తు। తుష్టిరస్తు। పుష్టిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు। ఆయుష్యమస్తు। ఆరోగ్యమస్తు। స్వస్తి శివం కర్మాస్తు। పుత్రసమృద్ధిరస్తు। వేదసమృద్ధిరస్తు।శాస్త్రసమృద్ధిరస్తు। ధనధాన్యసమృద్ధిరస్తు।దంపత్యోర్జన్మనక్షత్రే సగ్రహే సదైవతే సహసోమేన క్రియేతామ్। శాన్తిరస్తు। తుష్టిరస్తు। పుష్టిరస్తు। వృద్ధిరస్తు। అవిఘ్నమస్తు। ఆయుష్యమస్తు। ఆరోగ్యమస్తు।

మం॥ ప్రజాపతి స్త్రియాం యశః। ముష్కయో రదధాత్సపమ్। కామస్య తృప్తి

---

తనముందుంచిన తట్టలోనితలంబ్రాలను, ఓప్య=ఉంచి, ద్విరభిఘారయతి=(ఆమె దోసిటిని) రెండుసార్లు మఱల తనవైపుపాలతో అభిఘరించును. తతః=తరువాత, పురోధాః=పురోహితుడు, వరాంజలౌ=వరునిదోసిటిలో, తండులపయోభ్యాం=పాలతో అభిఘరించుటను, తలంబ్రాల నుంచుటను, తాభ్యామేవ=ఆ వధువుకు చేసినట్లే, పూర్వవత్కృత్వా=ఇదివరకు వలెనే చేసి, వధ్వంజలేరుపరిస్థాప్య= వరుని దోసిటిని వధువు దోసిటిపై నుంచవలెను.అప్పుడు వరుడు, 'బ్రాహ్మణైస్సహ వరః కపిలాగ్ం వాచయిష్య' అని పలుకవలెను. అట్లు పలుకగా బ్రాహ్మణులు 'వాచ్యతామ్' అని చెప్పవలెను. తతః=అప్పుడు, పురోధః=పురోహితుడు, సోదకం కలశమ్ =ఉదకుంభమును, ఆదాయ=తీసికొని, అంజలౌ= వరుని దోసిటిలో, సంతత ముదకధారాన్ స్రావయన్=ధారగా ఆనీటిని పోయుచు (ఇట్లు ధారగా పోయుటకు వీలులేనిచో ఉదకుంభములోని జలమును మామిడికొమ్మతో దోసిటిలోని బియ్యముపై ప్రోక్షింపవలసి యుండును. ఆచరణలో బియ్యముతో నిండిన పైదోసిలిపై ఉదకుంభమును క్షణకాలముంచి, తర్వాత దానిని తీసివేసి, ఈ 'సంతతధారాన్ స్రావయన్' అను లాంఛనమును నడుపుచున్నారు. ), వదేత్ = క్రింద నిచ్చిన కపిలావాచనమును పఠించవలెను.

మానన్దమ్। తస్యాగ్నే భాజయేహ మా। మోదః ప్రమోద ఆనన్దః। ముష్కయో ర్నిహితస్సపః। సృత్వేవ కామస్య తృప్యాణి। దక్షిణానాం ప్రతిగ్రహే। మనసశ్చిత్త మాకూతిమ్। వాచస్సత్యమశీమహి। పశూనాగ్ం రూపమన్నస్య। యశశ్శ్రీ శ్శ్రియతాం మయి। యథాఽహమస్యా అతృపగ్గ్ స్త్రియై పుమాన్। యథా స్త్రీ తృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియా। ఏవం భగస్య తృప్యాణి। యజ్ఞస్య కామ్యః ప్రియః। దదామీత్యగ్నిర్వదతి।తథేతి వాయురాహ తత్।హన్తేతి సత్యంచన్ద్రమాః। ఆదిత్యస్సత్యమోమితి। ఆపస్తత్సత్యమాభరన్। యశో యజ్ఞస్య దక్షిణామ్॥ (తై.బ్రా.2.4.6)

[489]వా॥ 'ప్రజా మే కామ స్సమృధ్యతామ్' – ఇతి వరో వధ్వాశ్శిరసి తండులాని ప్రాపయేత్। తతో వధూ వరస్య శిరసి।

[490]వా॥ తతః కన్యా స్వపయసా వరాంజలిం ద్విరుపస్తీర్య, ద్విస్తండులై రాపూర్య, ద్విరభిఘార్య, స్వాంజలిం పురోధేన పూరయిత్వా, స్వాంజలిం వరాంజల్యుపరి

---

[489] పైమంత్రములను పురోహితుడు చదివిన పిదప వధూవరులు తమ చేతులలో నున్న బియ్యమును ఒకరితలపై నింకొకరు పోసికొనవలెను. ఈ పోయుటలో ఎవరిదోసిలి పైనుండునో వారు ముందుగా ఎదుటివ్యక్తి తలపై పోయవలెను. ఇప్పుడు వరుని దోసిలి పైనున్నది గనుక వరుడు ముందుగా 'ప్రజా మే కామస్సమృధ్యతామ్(నేను కోరుచున్నట్టి సంతానము వృద్ధి యగుగాక)' అను మంత్రమును చదివి తన దోసిటిలో నున్న బియ్యమును వధువుతలపై నుంచవలెను. ఆమె వెంటనే తనదోసిటిలోని బియ్యమును వరుని తలపై పోయవలెను. ఇట్లు పరస్పర మక్షతారోపణ చేసికొనవలెను.

[490] తర్వాత వధువు వరునిదోసిలిని రెండుసార్లు తనవైపుపాలతో ప్రోక్షించి, తన ముందున్న తట్టలోని బియ్యమును రెండుసార్లు వరునిదోసిలిలో పోసి మఱల రెండుసార్లు అదేపాలతో నభిఘరించవలెను. తర్వాత పురోహితుడు వధువు దోసిలి నట్లే ప్రోక్షించి, బియ్యమును పోసి ప్రోక్షింపవలెను. అప్పుడామె దోసిలి వరునిదోసిలికి మీదుగా పట్టుకొని యుండగా పురోహితుడు

నినయేత్। పురోధః పూర్వవత్ 'ప్రజాపతి స్త్రియాం---యజ్ఞస్య దక్షిణామ్' ఇత్యంతం బ్రువన్ సంతత ధారయా వధ్వంజలిం స్రావయతి। తతో వధూ

'ప॒శవో॒ మే॒ కామ॒ స్సమృ॑ద్ధ్యతామ్।'

ఇతి వరస్య శిరసి తండులాన్ ప్రాపయతి। తతో వరః వధ్వాశ్శిరసి।

[491]వా॥ తతో వరః పూర్వవత్ వధ్వంజలిం స్వతండులేనాపూర్య, పురోధేన స్వాంజలిం పూరయిత్వా తదంజలిం వధ్వంజల్యుపరి నినయేత్। పురోధః పూర్వవత్ 'ప్రజాపతి స్త్రియాం---యజ్ఞస్య దక్షిణామ్' ఇత్యంతం బ్రువన్ సంతతధారయా వరాంజలిం స్రావయతి। తతో వరః 'య॒జ్ఞో॒ మే॒ కామ॒ స్సమృ॑ద్ధ్యతామ్।' ఇతి బ్రువన్ వధ్వాశ్శిరసి తండులాన్ ప్రాపయతి। తతో వధూ వరస్య శిరసి।

[492]వా॥ చతుర్థే తూష్ణీం తండులాన్ గృహీత్వా 'శ్రి॒యో॒ మే॒ కామ॒ స్సమృ॑ద్ధ్యతామ్।'

---

'ప్రజాపతి స్త్రియా --- యజ్ఞస్య దక్షిణామ్' అను మంత్రమునుచదివి ఆమె చేతిలో ఉదకధారను పట్టవలెను. పిమ్మట వధువు ముందుగా 'ప॒శవో॒ మే॒ కామ॒స్సమృ॑ద్ధ్యతామ్ (నాకిష్టమైన పశు సంపద వృద్ధియగుగాక)' అను మంత్రమును చదివి తన దోసిటిలో నున్న బియ్యమును వరుని తలపై పోయవలెను. అతడు వెంటనే తనదోసిటిలోని బియ్యమును ఆమె తలపై పోయవలెను.

[491] ఇక మూడవసారి వరుడు వధువు దోసిటిలో బియ్యమును పోయుట, అభిఘరించుట, పురోహితుడు వరుని దోసిటిలో బియ్యముపోయుట, అభిఘరించుట అంతయు మొదటిసారివలెనే చేసి, వరుడు తన దోసిలిని వధువుదోసిలిపై నుంచవలెను. అప్పుడు పురోహితుడు 'ప్రజాపతి స్త్రియా --- యజ్ఞస్య దక్షిణామ్' అను మంత్రమును మఱల చదివి అతనిచేతిలో ఉదకధారను పట్టవలెను. పిమ్మట వరుడు ముందుగా 'య॒జ్ఞో॒ మే॒ కామ॒ స్సమృ॑ద్ధ్యతామ్ (నాకిష్టమైన యజ్ఞములు వృద్ధియగుగాక)' అను మంత్రమును చదివి తన దోసిటిలో నున్న బియ్యమును వధువు తలపై పోయవలెను. ఆమె వెంటనే తనదోసిటిలోని బియ్యమును వరుని తలపై పోయవలెను.

[492] ఇక నాల్గవసారి మొదటిసారివలెనే దోసిటిలో బియ్యమును పోయుట, అభిఘరించుట, పురోహితుడు వరుని దోసిటిలో బియ్యముపోయుట, అభిఘరించుట అంతయు చేసికొని, నీటిధార లేకుండ, వధూవరు లేకకాలమున 'యశో॒ మే॒ కామ॒ స్సమృ॑ద్ధ్యతామ్ (నాకిష్టమైన ధనసమృద్ధి

ఇతి బ్రువన్ యుగపదన్యోన్యశిరసి ప్రాపయేత్। అధికం యథోత్సాహం కుర్యాత్।

([493]పూర్వం వరో వధ్వాశ్శిరసి ప్రాపయేత్। ద్వితీయపర్యాయే వరస్య శిరసి పూర్వం ప్రాపయేత్। తృతీయపర్యాయే వధ్వాశ్శిరసి పూర్వం। చతుర్థపర్యాయే అన్యోన్యం యుగపత్। అధికం యథోత్సాహం కుర్యాత్।)

## బ్రహ్మగ్రన్థిః

[494]వా॥ తతో వధూవరచేలాంచలయోః సువర్ణఫలసహితం 'అగ్నే విశ్వేభి' రితి బ్రహ్మ-గ్రన్థిం కుర్యాత్।

మం॥ అగ్నే విశ్వేభిస్స్వనీక దేవై రూర్ణావన్తం ప్రథమస్సీద యోనిమ్। కులాయి-నం ఘృతవన్తగ్ం సవిత్రే యజ్ఞం నయ యజమానాయ సాధు। (తై.సం.3.5.11.33)।

---

యగు గాక)' అను మంత్రమును చదువుచు ఏకకాలమున తమ దోసిళ్లలోని బియ్యమును పరస్పరము శిరస్సులపై పోసికొనవలెను. ఆతర్వాత మిగిలిన బియ్యమునంతయు యథోత్సాహముగా అమంత్రకముగా ఒకరిపై నొకరు పోసికొనవలెను. దీనికే అక్షతారోపణమని పేరు.

[493] అక్షతారోపణవిధానము నీవాక్యములు సంగ్రహించుచున్నవి: తలంబ్రాలను, పూర్వం=ముందుగా, వరః= వరుడు, వధ్వా శ్శిరసి=వధువుశిరస్సునందు, ప్రాపయేత్=ఉంచవలెను; ద్వితీయపర్యాయే=రెండవసారి, పూర్వం=ముందుగా(వధువు), వరస్య శిరసి=వరునిశిరస్సునందు, ప్రాపయేత్=ఉంచవలెను; తృతీయపర్యాయే=మూడవసారి, పూర్వం=ముందుగా (వరుడు), వధ్వాశ్శిరసి=వధువుశిరస్సునందు (ఉంచవలెను); చతుర్థపర్యాయే=నాల్గవసారి అన్యోన్యం=పరస్పరం, యుగపత్=ఏకకాలమున (ఉంచుకొనవలెను); అధికం=మిగిలిన తలంబ్రాలను, యథోత్సాహం=వేడుకగా, కుర్యాత్=పరస్పరము పోసికొనవలెను.

[494] సభలోపెద్దవారికి అక్షతలిచ్చి, పురోహితుడు వధూవరుల ఉత్తరీయపుకొనలకు కర్జూరఫల దక్షిణాతాంబూలమును కట్టి, 'అగ్నే విశ్వేభి' అను మంత్రమును చెప్పి ఆరెండు ఉత్తరీయముల కొనలను కలిపి ముడివేయవలెను. సదస్యులప్పుడు 'బ్రహ్మగ్రంథిముహూర్త స్సుముహూర్తోఽస్తు' అని వారిపై అక్షతలు వేసి ఆశీర్వదించవలెను. ఇచ్చట బ్రహ్మ యనగా పురోహితుడని అర్థము. పురోహితుడు వేయు ముడి (గ్రంథి) కావున దీనికి బ్రహ్మగ్రంథి యనిపేరు.

యో వై తాం బ్రహ్మణో వేద। అమృతేనావృతాం పురీమ్। తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ। ఆయుః కీర్తిం ప్రజాం దదుః॥ (అథర్వ.సం.10.1.29)

'బ్రహ్మగ్రన్థిముహూర్తస్సుముహూర్తోఽస్తు' – ఇత్యాశీర్వాదః।

## వధూ మగ్నిప్రత్యానయనమ్(వధువు నగ్నికడకు తీసికొనివచ్చుట)

[495]వా॥ వధూం తూష్ణీం దక్షిణే హస్తే గృహీత్వా। 'పూషా త్వేతో నయత్వి' త్యగ్నేరభిముఖమానీయ।

'గృహ్యతే ఖలు పాణి రమంత్రకం,గమ్యతే జ్వలనస్తు సమంత్రకమ్' – ఇతి కపర్దిః।

మం॥ పూషా త్వేతో నయతు హస్తగృహ్యాశ్వినౌ త్వా ప్రవహతాగ్ం రథేన।

గృహాన్గచ్ఛ గృహపత్నీ యథాఽసో వశినీ త్వం విదథమావదాసి॥ (మం.పా.1.2)

[496]వా॥ అపరేణాగ్నిం ఉదగగ్రం కటమాస్తీర్య। తస్మి న్వధూవరౌ ప్రాఙ్ముఖౌ దక్షిణో-త్తరౌ యుగపదుపవిశ్య।

### వివాహప్రధానహోమః

[497]వా॥ తతో వర ఆచమ్య, ప్రాణానాయమ్య। *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ అనయా నవోఢయా వధ్వాసహ వివాహప్రధానహోమం కరిష్య'* –

---

[495] వరుడు అమంత్రకముగా తన కుడిచేత వధువుయొక్క కుడిచేతిని పట్టుకొని, 'పూషా త్వేతో నయతు' అను మంత్రమును చెప్పుచు ఆమెను తా నిదివరలో ప్రతిష్ఠించిన అగ్నిసమీపమునకు కొనిపోవలెను. ఇచ్చట గల 'గృహ్యతే ఖలు' అను కపర్దికారిక వధూహస్తము నమంత్రకముగ గ్రహించి, సమంత్రకముగా, అనగా 'పూషా త్వేతో నయతు' అను మంత్రముతో, ఆమెను అగ్ని కడకు నడిపించుకొని వెళ్లవలెనని, ఈవిషయమునే తెలుపుచున్నది.

[496] అగ్నికి పడమట ఉత్తరాంతముగా నొక(దర్భ)చాపను పఱచి, దానిపై వరుడు ఉత్తరమునకు, అతనికి దక్షిణమున వధువు ప్రాఙ్ముఖముగా ఏకకాలమున కూర్చొనవలెను.

[497] అట్లు కూర్చొని, వరుడు ఆచమనమును, ప్రాణాయామమును చేసి, 'పూర్వోక్త ఏవంగుణ---వివాహప్రధానహోమం కరిష్య' అని సంకల్పించవలెను.

ఇతి సంకల్ప్య| [498]ఉత్తరేణాగ్నిం దర్భాన్ సగ్గ్స్తీర్య| ద్వంద్వం న్యఞ్చిపాత్రాణి ప్రయునక్తి (అత్ర పాత్రప్రయోగకాలే ఏవం విధం కుర్యాత్:

[498] ఇదివరకే పరిస్తరణాంతము చేసినాము కనుక, ఇప్పుడు 'ఉత్తరేణాగ్నిం దర్భాన్ సగ్గ్స్తీర్య' నుండి చేయవలెను. అనగా, అగ్నికి ఉత్తరమున తూర్పునకు కొనలు చేసి రెండు వరుసలలో 6-6 దర్భలను పరచి, ఆదర్భలపై రెండువరుసలుగా పడమటినుండి తూర్పునకు హోమపాత్రలను బోర్లించి పెట్టవలెను. కాని ఇచ్చట సామాన్యముగా షట్పాత్రప్రయోగములో వచ్చు 6 పాత్రలే కాక, వధూహస్తము(ఇది గూడ ఒకపాత్రగ పరిగణింపబడుచున్నది!), వరిపేలాలుంచిన క్రొత్త చేట, సన్నెకల్లు – అను 3 అదనపు పాత్రల నుంచవలెను. అందుచేత, 'వధ్వంజలిం' అని చెప్పి వరుడు తన రెండుచేతులతో వధువుయొక్క దోసిలిని పట్టుకొని దానిని తలక్రిందుగా అగ్ని కుత్తరమున వేసిన మొదటి దర్భలవరుస మొదట నుంచి వెంటనే తీసివేసి, 'హోమవిధానదర్వీం' అని చెప్పి, దాని ప్రక్కకు రెండవదర్భలవరుస మొదట ప్రధానదర్వీని బోర్లించి ఉంచవలెను. పిదప 'ద్వితీయ దర్వీం సహచాజ్యధాన్యా' అని చెప్పి కుడిఎడమచేతులలో స్రువమును, ఆజ్య పాత్రను ఒకేసారి తీసికొని మునుపుంచిన పాత్రలకు తూర్పున కుడిఎడమ వరుస దర్భలపై బోర్లించి యుంచవలెను. తర్వాత 'ప్రోక్షార్థపాత్రేణ సహ ప్రణీతా' అని చెప్పుచు, ప్రోక్షణిని, ప్రణీతిపాత్రను ఒకేసారి కుడి ఎడమచేతులలో పట్టుకొని వానిని ఇదివరకుంచిన పాత్రలకు తూర్పున కుడి ఎడమ వరుస దర్భలపై బోర్లించి ఉంచవలెను. తర్వాత 'ఇధ్మం చ శమ్యా' అని చెప్పుచు, 15 సమిధలు గల ఇధ్మకట్టను, 5 సమిధలు గల శమ్యలకట్టను కుడి ఎడమచేతులలో గ్రహించి, ఇదివరకుంచిన పాత్రలకు తూర్పున కుడిఎడమ వరుసల దర్భలపై నుంచ వలెను. చివరిగా, 'సహ లాజమశ్మ' అని చెప్పుచు కుడి ఎడమచేతులలో వరిపేలా లుంచిన చేటను, సన్నెకల్లును తీసికొని మునుపుంచిన పాత్రలకు తూర్పున కుడి, ఎడమ వరుసదర్భలపై నుంచవలెను. చివరి రెండుపాత్రలను మొదట నుంచిన 6 పాత్రలకుత్తర మున మూడవవరుసలో నుంచవలెనని కొందఱి మతము. కాని, 'కల్యాణేష్వేవోద గన్తాని, తేషాంనైవ త్రేధాసాదనం పంక్తిషు స్యాత్=శుభకార్యములందు ఉత్తరాంతముగా

శ్లో॥ వధ్వంజలిం హోమవిధానదర్వీం, ద్వితీయదర్వీం సహ చాజ్యధాన్యా।
ప్రోక్షార్థపాత్రేణ సహ ప్రణీతా, మిధ్మం చ శమ్యా, సహ లాజమశ్మ॥)

[499]వధూహస్తయో స్సాదన ప్రోక్షణ తపన సంమర్జనాని కరోతి। శమ్యాః పరిధ్యర్థే। పాత్రాసాదనాద్యాజ్యభాగాన్తం కృత్వా। వర ఉత్థాయ।

**అభిమంత్రణమ్ :** [500] 'సోమః ప్రథమ' ఇతి ద్వాభ్యా మాసీనవధూహృదయ మభిమంత్ర యేత।

('శ్లో॥సోమః ప్రథమ మన్త్రాభ్యాం స్వయముత్థాయ వై వరః।
హృదయం సంస్పృశన్ వధ్వాః కుర్యాదేవాభిమ్త్రణమ్॥' - ఇత్యత్ర కారికా)

మం॥ సోమః ప్రథమో వివిదే గన్ధర్వో వివిద ఉత్తరః। తృతీయో అగ్నిష్టే పతి-స్తురీయస్తే మనుష్యజాః॥౧॥ సోమోఽదదద్గన్ధర్వాయ గన్ధర్వోఽదదదగ్నయే। రయిం చ పుత్రాగ్ శ్చాదాదగ్నిర్మహ్యమథో ఇమామ్॥౨॥ (తై.మం.పా.1.3)

**పాణిగ్రహణమ్:**[501]అథాస్యై దక్షిణేన నీచా హస్తేన దక్షిణ ముత్తానగ్ం హస్తం

---

పాత్రాసాదన చేయవలెను, అదియు మూడువరుసలుగా చేయకూడదు' అను నృసింహకారికవల్ల,ఇట్లు 3వవరుసలో నీరెండుపాత్రల నుంచుట శాస్త్రసమ్మతము కాదు.

[499] వధూహస్తము నిక్కడ దర్వీగా పరిగణించుటచే, దర్వులకు చేయు ఆసాదన (ఇదివరకే చెప్పినట్లుగా అగ్నికి ఉత్తరమున వేసిన దర్భలపై నుంచుట), ప్రోక్షణము, తపనము (దోసిలిని అగ్నిపై చూపెట్టి కాచినట్లు చేయుట), సంమార్జనము (దర్భలతో తుడుచుట) – ఇవన్నియు ప్రధానదర్వీకి చేసినట్లుగా చేయవలెను. పర్యగ్నికరణమును ఆజ్యపాత్రకే గాక లాజపాత్రకును చేయవలెను. ఇట్లు ఆజ్యభాగాంతము చేయవలెను (వివరణకై షట్పాత్రప్రయోగాధ్యాయమును చూచునది). ఇది ఆజ్యభాగము గనుక ఇందులో పరిధ్యర్థము శమ్యల నుపయోగింపవలెను.

[500] ఆజ్యభాగాంతము చేసిన తర్వాత వరుడు లేచి నిలబడి, 'సోమః ప్రథమో', 'సోమో దద ద్గంధర్వాయ' అను రెండుమంత్రములతో తనకుడిచేత కూర్చొనియే యుండిన వధువుయొక్క హృదయమును స్పృశించవలెను.

[501] అథ=పిమ్మట, 'గృభ్ణామి తే' ఇతి చతసృభిః ఋగ్భిరన్తే = వరుడు 'గృభ్ణామి తే' అను

సాఙ్గుష్ఠమ్ 'గృభ్ణామి తే' ఇతి చతసృభిః ఋగ్భిరన్తే గృహీత్వోత్థాప్య।(తై.మం.పా.1.3)
మం॥ గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాఽసః।
భగో అర్యమా సవితా పురన్ధిర్మహ్యం త్వాఽదుర్గార్హపత్యాయ దేవాః॥౧॥
తే హ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః। మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః
పూర్వో దేవేభ్య ఆతపత్॥౨॥ సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి। తాం త్వా
విశ్వస్య భూతస్య ప్రగాయామస్యగ్రతః॥3॥ య ఏతి ప్రదిశస్సర్వా దిశోఽను
పవమానః। హిరణ్యహస్త ఐరంమస్స త్వా మన్మనసం కృణోతు॥౪॥
**సప్తపది:** [502]అథైనా ముత్తరేణాగ్నిం దక్షిణేన పదా ప్రాచీముదీచీం వా ప్రక్రమయత్యేక-
మిష ఇతి। సఖేతి సప్తమే పదే జపతి।

---

నాల్గుమంత్రములను పఠించిన పిదప, అస్యై=ఈవధువుయొక్క, ఉత్తానగ్ం దక్షిణం హస్తం= వెల్లకిల చాచిన కుడిచేతిని, దక్షిణేన నీచా హస్తేన= తన బోర్లించిన కుడిచేతితో, సాఙ్గుష్ఠమ్= బొటనవ్రేలితోసహ, గృహీత్వా=పట్టుకొని, ఉత్థాప్య=(ఆమెను) లేపి,

[502]అథ=పిమ్మట, ఏనామ్=ఈవధువును, ఉత్తరేణాగ్నిం=అగ్నికుత్తర భాగమందు, దక్షిణేన పదా=కుడిపాదముతో, ప్రాచీముదీచీం వా=తూర్పువైపునకుగాని, ఉత్తరమువైపునకుగాని, ఏక మిష ఇతి= 'ఏకమిష' అను మంత్రమునుండి 'సప్త సప్తభ్యః' అను మంత్రమువరకు చెప్పుచు, అభిప్రక్రమయతి=తనతోగూడ (వరుడు) నడిపించుచున్నాడు. సప్తమే పదే ='సప్త సప్తభ్యః' అని ఏడవ అడుగు వేసినపు డచట తాను నిలుచుండి, తనతో సమానముగా వధువును నిలు చుండబెట్టి, సఖేతి='సఖా సప్తపదా భవ' అను మంత్రమును, జపతి=జపించుచున్నాడు.
సాప్తపదికపద్ధతి: సుదర్శనాచార్యుల ఆపస్తంబసూత్రవ్యాఖ్యానము ననుసరించి బ్రహ్మశ్రీ అగ్ని ష్టోమం బ్రహ్మావధానులు చెప్పిన సప్తపదివిధాన మిట్లున్నది: అగ్నికి ఉత్తరమున పూర్వాగ్రము గా గాని, ఉత్తరాగ్రముగా గాని వస్త్రమును పరచి, దానిపై బియ్యమును పోసి, ఆబియ్యముపై తూర్పునకు కొనలుండునట్లు తమలపాకులను, వక్కలను, పసుపుకొమ్ములను, కర్జూరఫల మును ఉంచి, వరుడు తన కుడిపాదమును ముందుగా ఆతమలపాకులపైనుంచి అడుగులు వేయుచు, తన హస్తమును పట్టుకున్న వధువును తనవెనుకనే ఆమె కుడిపాదము నదే తమల పాకులపై పెట్టించుచు, ఆమె అడుగును పెట్టునప్పుడు 'ఏకమిషే' ఇత్యాది ఏడు మంత్రములను

మం॥ ఏకమిషే విష్ణుస్త్వాఽన్వేతు॥౧॥ ద్వే ఊర్జే విష్ణుస్త్వాఽన్వేతు॥౨॥ త్రీణి వ్రతాయ విష్ణుస్త్వాఽన్వేతు॥౩॥ చత్వారి మాయోభవాయ విష్ణుస్త్వాఽన్వేతు ॥౪॥ పంచ పశుభ్యో విష్ణుస్త్వాఽన్వేతు॥౫॥ షడృతుభ్యో విష్ణుస్త్వాఽన్వేతు॥౬॥ సప్త సప్తభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వాఽన్వేతు॥౭॥ (తై.మం.పా.1.3)

మం॥ సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ సఖ్యం తే గమేయగ్ం సఖ్యాత్తే మా యోషగ్ం సఖ్యాన్మే మా యోష్ఠాస్సమయావ సంకల్పావహై సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ। ఇషమూర్జమభి సంవసానౌ సం నౌ మనాగ్ంసి సంవ్రతా సము చిత్తాన్యాకరమ్। సా త్వమస్యమూహమమూహ-మస్మి సా త్వం ద్యౌరహం పృథివీ త్వగ్ం రేతోఽహగ్ం రేతోభృత్త్వం మనోఽహమస్మి వాక్త్వగ్ం సామాహమస్మ్యృక్త్వగ్ం సా మామనువ్రతా భవ పుగ్ంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే॥ (తై.మం.పా.1.3)

(అత్రకారికా:

---

చెప్పుచు, ఏడు అడుగుల నామెచే వేయించుచు తనవెంట నడిపించవలెను. ఏడవస్థానములో తనతో వధువును సమానముగా నిలుచుండబెట్టి, 'సఖా సప్తపదా భవ' నుండి 'సాత్వమసి' వరకు గల మంత్రములను చెప్పి, ఆ తర్వాత ఆమె తనవెంట నడచుచుండగా అగ్నిచుట్టును ప్రదక్షిణము చేసి, అగ్నికి పడమట మునుపటివలెనే కూర్చొని ప్రధానహోమమును చేయవలెను. ఇచ్చట 'సోమాయాజ్యాహుతేః' అను నొకకారిక యున్నది. అనగా సప్తపది తర్వాత, 'సోమాయ జనివిదే స్వాహా' అను హోమమును చేయుటకు ముందుగా చేయు ప్రదక్షిణమును బ్రహ్మస్థానమందలి విప్రుడు లోపలికుండునట్లును, ఆతర్వాత (లాజహోమానంతరము) చేయు ప్రదక్షిణము నతడు వెలుపలికుండునట్లును (అనగా బ్రహ్మకు, అగ్నికి మధ్యనుండి నడచుచు) చేయవలెనని దీని కర్థము. గమనిక: పాణిగ్రహణము, సప్తపది అత్యంత ప్రధానమైన ఘట్టములు. వీనితో వధూవరుల దాంపత్యారంభము పరిపూర్ణమై, ఇప్పటినుండి వధువునకు వరునియొక్క గోత్రప్రవరలు అనువర్తించును. ఇవి పూర్తి కానిదే పెండ్లి పూర్తి కాదు.

శ్లో॥ సోమాయాజ్యాహుతేః పూర్వం సబ్రహ్మాగ్నేః ప్రదక్షిణమ్।
మాహుతేః పశ్చా ద్బ్రహ్మాప్యేకో బహిర్భవేత్॥)

[503]సూ॥ ప్రాగ్ఘోమా త్సబ్రహ్మాణం ప్రదక్షిణీకృత్య, యథాస్థాన ముపవిశ్యాన్వారబ్ధాయా చతుర్గృహీత ముత్తరా ఆహుతీర్జుహోతి సోమాయ జనివిదే స్వాహేత్యేతైః ప్రతి మన్త్రమ్।

ప్రధానాహుతయః(త్రై.మం.పా.1.4)

1. సోమాయ జనివిదే స్వాహా। సోమాయ జనివిద ఇదం న మమ॥
2. గన్ధర్వాయ జనివిదే స్వాహా। గన్ధర్వాయ జనివిద ఇదం న మమ॥
3. అగ్నయే జనివిదే స్వాహా। అగ్నయే జనివిద ఇదం న మమ॥
4. కన్యలా పితృభ్యో యతీ పతిలోకమవ దీక్షామదాస్థ స్వాహా। వధ్వై సూర్యాయేదం న మమ॥
5. ప్రేతో ముఞ్చాతి నాముతస్సుబద్ధామముతస్కరత్। యథేయమిన్ద్ర మీఢ్వ-స్సుపుత్రా సుభగాఽసతి స్వాహా। ఇంద్రాయ మీఢుష ఇదం న మమ॥
6. ఇమాం త్వమిన్ద్ర మీఢ్వస్సుపుత్రాగ్ం సుభగాం కృణు।దశాస్యాం పుత్రానా-ధేహి పతిమేకాదశం కృధి స్వాహా। ఇంద్రాయ మీఢుష ఇదం న మమ॥
7. అగ్నిరైతు ప్రథమో దేవతానాగ్ం సోఽస్యై ప్రజాం ముఞ్చతు మృత్యు-పాశాత్। తదయగ్ం రాజా వరుణోఽనుమన్యతాం యథేయగ్ స్త్రీ పౌత్ర-

---

[503] ప్రాగ్ఘోమాత్=ప్రధానహోమమునకు ముందు, సబ్రహ్మాణం=బ్రహ్మసహితముగ, అగ్నిం= అగ్నిని, ప్రదక్షిణం కృత్వా=(వధువుతో గూడి) ప్రదక్షిణము చేసి – ఇది ఇదివరకే సప్తపదిలో చెప్పబడినది; యథాస్థానముపవిశ్య=యథాస్థానములో కూర్చొని, అన్వారబ్ధాయా=వధువు తనను తాకుచుండగా, చతుర్గృహీతమ్= స్రుక్కుతో చతుర్గృహీతాజ్యముతో, ఉత్తరా=తరువాతి, సోమాయ జనివిదే స్వాహేత్యేతైః =సోమాయ జనివిదే స్వాహా మున్నగు 16 మంత్రములతో, ప్రతిమన్త్రమ్=ప్రతిమంత్రమునకు, ఆహుతీర్జుహోతి=ఆజ్యాహుతు లిచ్చుచున్నాడు.

మ్ఘం న రోద్రాత్స్వాహా॥ అగ్నీవరుణాభ్యామిదం న మమ॥

8. ఇమామగ్నిస్త్రాయతాం గార్హపత్యః ప్రజామస్యై నయతు దీర్ఘమాయుః। అశూన్యోపస్థా జీవతామస్తు మాతా పౌత్రమానన్దమభి ప్రబుధ్యతా-మియగ్గ్ం స్వాహా॥ అగ్న యే గార్హపత్యాయేదం నమమ॥

9. మా తే గృహే నిశి ఘోష ఉత్థాదన్యత్ర త్వద్రుదత్యస్సంవిశన్తు। మా త్వం వికేశ్యుర ఆవధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యన్తీ ప్రజాగ్ం సుమనస్య-మానాగ్ స్వాహా॥ అగ్న యే గార్హపత్యాయేదం న మమ॥

10. ద్యౌస్తే పృష్ఠగ్ం రక్షతు వాయురూరూ అశ్వినౌచ స్తనం ధయన్తగ్ం సవి-తాఽభి రక్షతు। ఆవాససః పరిధానాద్బృహస్పతిర్విశ్వేదేవా అభి రక్షన్తు పశ్చాత్స్వాహా॥ ద్యువాయ్వశ్విసవితృబృహస్పతివిశ్వేభ్యోదేవేభ్య ఇదం న మమ॥

11. అప్రజస్తాం పౌత్రమృత్యుం పాప్మానముత వాఽఘమ్। శీర్ష్ణస్స్రజమివో-న్ముచ్య ద్విషద్భ్యః ప్రతి ముఞ్చామి పాశగ్గ్ స్వాహా॥ వహ్ని సూర్యా-యేదం న మమ॥

12. ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే స్వాహా॥ వరుణాయేదం న మమ॥ (తై.సం.2.1.11)

13. తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీ స్వాహా॥ వరుణాయేదం న మమ॥ (తై.సం.2.1.11)

14. త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా॥

అగ్నీవరుణాభ్యామిదం న మమ॥ (తై.సం.2.5.12)

15. స త్వం నో అగ్నే ఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం న మమ॥ (తై.సం.2.5.12)

16. త్వమగ్నే అయాఽస్యయా సన్మనసా హితః। అయా సన్ హవ్యమూహి-షే ఽయా నో ధేహి భేషజగ్గ్ స్వాహా। అగ్నయే అయస ఇదం న మమ॥

## అశ్మారోహణమాస్థాపనమ్- లాజహోమః – అగ్నిప్రదక్షిణాని చ

(సంగ్రహముగా అశ్మాస్థాపన, లాజహోమ, ప్రదక్షిణములు చేయవలసిన విధానము: ప్రధానహోమానంతరము 1. మొదట వధువుతో సన్నెకల్లును త్రొక్కించవలెను.

2. తర్వాత వరుడు వధువు దోసిటిని ఆజ్యముతో అభిఘరించి అందులో వరుడు (లేక వధువు సోదరుడు) రెండు(పంచావత్తులు మూడు)సార్లు పేలాలనుంచి, మరల నేతితో అభిఘరించి, ఆమె చేతిని వరుడు పట్టుకొని, ఆమె దోసిటిలో గల లాజలను హోమము చేయించవలెను. ఇది ప్రథమహోమము .

3. పిదప దంపతులు కలిసి అగ్నిని ప్రదక్షిణము చేయవలెను. తర్వాత దంపతులు మొదటివలెనే 1,2,3 కార్యములను చేయవలెను. ఇది ద్వితీయహోమము. మూడవ సారిగా మరల 1,2,3 కార్యములు చేయవలెను. ఇది తృతీయహోమము. ఇట్లు మూడవ ప్రదక్షిణము తర్వాత దంపతులు అగ్నికి పశ్చిమమున యథాస్థానములో కూర్చొన వలెను. వరుడు జయాదిహోమములను అగ్న్యుపస్థానాంతముగ చేయవలెను. ఇట్లు సన్నెకల్లును త్రొక్కుట మూడుసార్లు, హోమము మూడుసార్లు, ప్రదక్షిణము మూడు సార్లు చేయవలెను. ప్రదక్షిణమును వధూవరు లిర్వురూ చేయవలెను. సన్నెకల్లును వధువు మాత్రమే త్రొక్కవలెను. మొదటిసారి త్రొక్కినప్పుడు వరుడు (లేకున్న అతని సోదరి) ఆమె కాలివ్రేళ్లకు మెట్టెలను తొడుగవలెను. వరుడు గాక వధువుసోదరుడు ఆమె చేతిలో లాజల నుంచినచో వరుడతనికి క్రొత్తబట్టలు కట్నముగ నిచ్చుట ఆచారము.

మూడు సార్లు సన్నెకల్లును త్రొక్కించునప్పుడు చెప్పవలసిన మంత్ర మొక్కటే. అట్లే మూడు సార్లు ప్రదక్షిణము చేయునప్పుడు చెప్పవలసిన మంత్రములును ఒక్కటే. కాని మూడు హోమములకును మంత్రములు వేర్వేరుగా నున్నవి. 'శమీపల్లవమిశ్రాన్ లాజా నంజలినావపతతి' అను కాత్యాయనవాక్యముండుటచే, లాజలనుశమీపల్లవయుత ముగ హోమము చేయవలెనని కొన్ని ప్రయోగములలో చెప్పబడినది.)

[504]సూ॥ అథైనా ముత్తరేణాగ్నిం దక్షిణేన పదాఽశ్మాన మాస్థాపయత్యాతిష్ఠేతి।

మం॥ఆతి॑ష్ఠే॒మమశ్మా॑న॒మశ్మే॑వ॒ త్వగ్గ్ స్థి॒రా భ॑వ। అ॒భితి॑ష్ఠ పృతన్య॒తస్సహ॑స్వ పృతనా॒య॒తః॥ (తై.మం.పా.1.5)

(పిదప వరుడు వధువు పాదముల రెండవవ్రేళ్లకు మెట్టెలను తొడుగవలెను)

[505]వా॥ యథాస్థానముపవిశ్య। వధ్వాంజలావుపస్తీర్య। ద్విర్లాజానోప్య (పంచావత్తినః త్రిః)। అభిఘార్య। 'ఇయం నారీ' తి జుహోతి। తస్యాస్సోదర్యో లాజానావపతీత్యేకే।

---

[504]అథ=తర్వాత, ఉత్తరేణాగ్నిం=అగ్నికి ఉత్తరమున, ఆతిష్ఠేతి= 'ఆతిష్ఠేమమశ్మాన' మను మంత్రముతో, ఏనాం=ఈవధువును, దక్షిణేన పదా=కుడిపాదముచేత, అశ్మానమ్=సన్నె కల్లును, ఆస్థాపయతి=త్రొక్కించుచున్నాడు. అనగా ప్రధానహోమానంతరము వరుడు వధువు కుడిచేతిని తనకుడిచేతితో పట్టుకొని తీసికొని వచ్చి, పాత్రాసాదనకాలములో అగ్నికి ఉత్తరమం దుంచిన సన్నెకల్లు వద్ద ఆమెను తూర్పుముఖముగ నిలబెట్టి, 'ఆతిష్ఠేమమశ్మాన' మను మంత్ర మును పఠించి ఆమె కుడిపాదముచే నా సన్నెకల్లును త్రొక్కించి, ఆమెపాదములయొక్క రెండవవ్రేళ్లకు మెట్టెలను తొడుగవలెను. మెట్టెలను వరుడు కాక అతని అక్కయో, చెల్లెలో తొడు గుట కొందరి సంప్రదాయము. ఇది మొదటిసారి సన్నెకల్లును త్రొక్కించుట.

[505]తర్వాత అగ్నికి పడమట యథాస్థానమున పీటలపై కూర్చొని, వరుడు స్రువముతో నేతిని తీసికొని వధువు దోసిటి నభిఘరించి, పాత్రాసాదన చేసినప్పుడు అగ్నికి ఉత్తరమున నుంచిన లాజలను రెండుసార్లు ఆమె చేతిలో నుంచి, వానిని మరల నేతితో అభిఘరించి, 'ఇయం నారీ' అను మంత్రమును చెప్పి, ఆమె హస్తమును పట్టుకొని దైవతీర్థముతో ఆలాజలను అగ్నిలో వేయించవలెను. ఇది ప్రథమలాజహోమము. వరుని ప్రవరలో ఐదుగురు ఋషులపేర్లుండినచో (ఉదా: శ్రీవత్సగోత్రికులు) రెంటికి బదులు మూడుసార్లు వధువుచేతిలో లాజల నుంచవలెను.

మం॥ ఇ॒యం నా॒ర్యుప॑ బ్రూ॒తే కుల్పా॒న్యావపన్తి॒కా। దీ॒ర్ఘాయుర॑స్తు మే॒ పతి॒ర్జీవా॑తు శ॒రద॑శ్శతగ్గ్ స్వాహా॑। అగ్నయ ఇదం న మమ॥ (తై.మం.పా.1.5)

[506] వా॥ వధూహస్తం గృహీత్వా। 'తుభ్యమగ్నే' ఇతి త్రీన్మంత్రాన్ జపిత్వా। అన్తే వధ్వా స్సహ ప్రదక్షిణమగ్నిం కృత్వా।

మం॥తుభ్య॒మగ్రే॒ పర్య॑వహన్థ్సూ॒ర్యాం వ॑హ॒తునా॑ స॒హ।పున॒: పతి॑భ్యో జా॒యాం దా అ॑గ్నే ప్ర॒జయా॑ సహ॥౧॥ పున॒: పత్నీ॑మ॒గ్నిర॑దా॒దాయు॑షా స॒హ వర్చ॑సా। దీ॒ర్ఘాయుర॑స్యా॒ యః పతి॒స్స ఏ॑తు శ॒రద॑శ్శ॒తమ్॥౨॥విశ్వా॑ ఉ॒త త్వయా॑వ॒యం ధారా॑ ఉ॒ద॒న్యా॑ ఇవ। అతి॑గాహేమహి॒ ద్విషః॥3॥ (తై.మం.పా.1.5)

[507] వా॥ 'ఆతిష్ఠేమమ్' ఇత్యశ్మానమాస్థాప్య। పూర్వవదుపవిశ్య। హస్తం విముచ్య।

మం॥ఆతి॑ష్ఠే॒మమశ్మా॑న॒మశ్మే॑వ॒ త్వగ్గ్ స్థి॒రా భ॑వ। అ॒భితి॑ష్ఠ పృతన్య॒తస్సహ॑స్వ పృతనా॒య॒తః।

---

వధువుయొక్క సోదరుడుగాని తత్సమానీకుడుగాని ఆమె చేతిలో లాజలనుంచగా వానితో వరుడామెచేత హోమము చేయింపవలెనని ఒక మతము. ఇట్లు జరిగినచో వరుడు వధువు సోదరునకు తగు కట్నమును (నూతనవస్త్రములు) ఇచ్చుట ఆచారము. ఆపస్తంబుడు సోదరు డామె చేతిలో లాజల నుంచుట వికల్పపక్షముగా చెప్పినాడు. పారస్కర, ఆశ్వలాయనాదులు దీనిని ప్రధానపక్షముగానే తెల్పినారు. ఆచరణలో నీపక్షమునే పలువురు పాటించుచున్నారు.

[506] తర్వాత, వధూహస్తం గృహీత్వా=వధూహస్తమును పట్టుకొని, 'తుభ్యమగ్నే' ఇతి త్రీన్ మంత్రాన్ జపిత్వా='తుభ్యమగ్రే' అను మూడుమంత్రములను జపించి, ప్రదక్షిణమగ్నిం కృత్వా = అమెచేతి నట్లే పట్టుకొని బ్రహ్మ వెలుపలికుండునట్లుగా అగ్నిచుట్టను ప్రదక్షిణము చేసి (ఇది ప్రథమప్రదక్షిణము), ఆమెను సన్నెకల్లు కడకు తీసికొని వచ్చి,

[507] 'ఆతిష్ఠేమమ్' అను మంత్రమును చెప్పి, ఆమెచే రెండవసారి సన్నెకల్లును త్రొక్కించి, మరల మునుపటివలెనే అగ్నికి పశ్చిమమున కూర్చొని, ఆమె చేతిని విడిచి,

[508]వా॥ పూర్వవల్లాజానోప్య। 'అర్యమణన్నుదేవమ్' ఇతి పూర్వవల్లాజాన్ హుత్వా।

మం॥అర్యమణం ను దేవం కన్యా అగ్నిమయక్షత। స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముఞ్చాతి నాముతస్సుబద్ధామముతస్కరత్స్వాహా। అర్యమ్ణ ఇదం న మమ॥

[509]వా॥ పునశ్చ పూర్వవ 'తుభ్యమగ్రే' ఇతి ప్రదక్షిణమ్।

మం॥తుభ్యమగ్రే పర్యవహన్థ్సూర్యాం వహతునా సహ।పునః పతిభ్యో జాయాం దా అగ్నే ప్రజయా సహ॥౧॥ పునః పత్నీమగ్నిరదాదాయుషా సహ వర్చసా। దీర్ఘాయురస్యా యః పతిస్స ఏతు శరదశ్శతమ్॥౨॥విశ్వా ఉత త్వయావయం ధారా ఉదన్యా ఇవ। అతిగాహేమహి ద్విషః॥3॥ (తై.మం.పా.1.5)

[510] వా॥ 'ఆతిష్ఠేమమ్' ఇత్యశ్మానమాస్థాప్య। పూర్వవదుపవిశ్య। హస్తం విముచ్య।

మం॥ఆతిష్ఠేమమశ్మానమశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ। అభితిష్ఠ పృతన్యతస్సహస్వ పృతనాయతః॥

[511]వా॥ యథాస్థానముపవిశ్య, పూర్వవ 'త్వమర్యమా' ఇతి లాజహోమం కుర్యాత్।

---

[508] పూర్వవల్లాజానోప్య=మునుపటివలెనే వధువుహస్తములో లాజల నుంచి, 'అర్యమణన్ను దేవమ్' ఇతి = 'అర్యమణన్నుదేవమ్' అను మంత్రముతో, పూర్వవత్ =మునుపటివలెనే, లాజాన్ హుత్వా=ఆమెచే లాజలను హోమము చేయించి (ఇది ద్వితీయహోమము),

[509]పునశ్చ=మరల, పూర్వవత్=తొల్లిటివలెనే, తుభ్యమగ్రే ఇతి='తుభ్యమగ్రే' ఇత్యాది మూడు మంత్రములతో, ప్రదక్షిణమ్=ప్రదక్షిణమును చేసి (ఇది ద్వితీయప్రదక్షిణము)

[510] 'ఆతిష్ఠేమమ్' అను మంత్రమును చెప్పి, ఆమెచే మూడవసారి సన్నెకల్లును త్రొక్కించి, మరల మునుపటివలెనే అగ్నికి పశ్చిమమున కూర్చొని, ఆమె చేతిని విడిచి,

[511] అగ్నికి పడమట కూర్చొని, క్రింద నిచ్చిన 'త్వమర్యమా' అను మంత్రముతో మునుపటి వలెనే వధువుచేతిలోని లాజలను హోమము చేయింపవలెను. ఇది తృతీయహోమము.

మం॥ త్వమ॑ర్య॒మా భ॑వసి॒ యత్క॒నీనా॒ం నామ॑ స్వ॒ధావ॒థ్స్వర్యం॑ బి॒భర్షి॑। అ॒ంజన్తి॒ వృ॒షగ్ం సుధి॑త॒ం న గోభి॒ర్యద్దమ్పతీ॒ సమ॑నసా కృ॒ణోషి॒ స్వాహా᳚। అగ్నయే అర్యమ్ణ ఇదం న మమ॥

[512]వా॥ పునశ్చ పూర్వవ‘త్తుభ్యమగ్రే’ ఇతి వధ్వా సహ అగ్నిప్రదక్షిణం కృత్వా।

మం॥తుభ్య॒మగ్రే॒ పర్య॑వహన్థ్సూ॒ర్యాం వ॑హ॒తునా॑ స॒హ।పున॑ః పతి॑భ్యో జా॒యాం దా అ॑గ్నే ప్ర॒జయా॑ సహ॥౧॥ పున॑ః పత్నీ॒మగ్నిర॑దా॒దాయు॑షా స॒హ వర్చ॑సా। దీ॒ర్ఘాయుర॑స్యా॒ యః పతి॒స్స ఏ॑తు శ॒రద॑శ్శ॒తమ్॥౨॥విశ్వా॑ ఉ॒త త్వయా॑వ॒యం ధారా॑ ఉ॒దన్యా॑ ఇవ। అతి॑గాహేమహి॒ ద్విష॑ః॥3॥ (తై.మం.పా.1.5)

**జయాదయః:** [513]వా॥ యథాస్థానముపవిశ్య। అనన్వారభ్య। (స్రువేణ)జయాది ప్రతి పద్యతే। శమ్యా అపోహ్య। సగ్ం స్రావం హుత్వా। ప్రాణాయామం, సర్వప్రాయశ్చిత్త హోమం, ఉత్తరపరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం కృత్వా।

## యోక్త్రవిమోచనమ్

[514]వా॥ ‘ప్రత్వాముంచామి’ ఇతి ద్వాభ్యాం యోక్త్రం విముచ్య ప్రత్యక్పూర్వస్యాప ఉప

---

[512] పునశ్చ=మరల,పూర్వవత్=తొల్లిటివలెనే, తుభ్యమగ్రే ఇతి=‘తుభ్యమగ్రే’ ఇత్యాది మూడు మంత్రములతో, వధ్వాస్సహ=వధువుతోగూడి, ప్రదక్షిణమ్=ప్రదక్షిణము చేసి (ఇది తృతీయ ప్రదక్షిణము)

[513] యథాస్థాన ముపవిశ్య=యథాస్థానమున కూర్చొని, అనన్వారభ్య= వధువును తాకకుండ, స్రువేణ=స్రువముతో, జయాది=జయాదిహోమములు, ప్రతిపద్యతే=చేయబడుచున్నవి. ఇట్లు ‘షట్పాత్రప్రయోగః’ అను అధ్యాయములో చెప్పినట్లుగా, జయాదిహోమములను, శమ్యలను తీసివేయుట, సంస్రావహోమమును, ప్రాణాయామమును, సర్వప్రాయశ్చిత్తహోమమును, ఉత్తరపరిషేచనమును, బ్రహ్మోద్వాసనాంతముగ చేసి,

[514] అగ్నికి పడమట వధూవరులు నిలబడి, వరుడు వధువు కెదురుగా పశ్చిమముఖముగా నుండి, మంగళసూత్రానంతరము వధువు నడుమునకు కట్టిన దర్భత్రాటిని ‘ప్రత్వాముంచామి’

స్పృశ్య| ‘అగ్నే నయ’ ఇత్యగ్న్యుపస్థానం కుర్యాత్|

మం|| ప్ర త్వా ముంచామి వరుణస్య పాశాద్యేన త్వాఽబధ్నాథ్సవితా సుకేతః|
ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం తే సహ పత్యా కరోమి||౧||
ఇమం విష్యామి వరుణస్య పాశం యమబధ్నీత సవితా సుశేవః| ధాతుశ్చ
యోనౌ సుకృతస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా కృణోమి||౨||

[515]వా|| ఏతస్మిన్నగ్నౌ యదృతాదితహోమ, ప్రవిశ్యహోమ, స్థాలీపాక,శేషహోమ, పుంసువన, సీమన్త గృహప్రవేశ పార్వణపిండపితృయజ్ఞౌపాసన వైశ్వదేవ పంచమహా యజ్ఞాన్ కుర్యాత్|

**ఆశీర్వచనాదీని:**[516]వా||అనంతరం ఆశీర్వచనం కారయిత్వా| సదస్యేభ్యః యథాశక్తి ఫలదక్షిణాసమేత తాంబూలసత్కారం కారయిత్వా| సుమంగళీభిః హారతిపూర్వకం మంగళగానం కారయేత్|

---

అను రెండు మంత్రములు జపించి విడిచివైచి, దానిని ఆమె వెన్కకు పడవేసి, నీటిని తాకి, ‘అగ్నే నయ సుపథా రాయే’ అను మంత్రముతో అగ్న్యుపస్థానమును చేయవలెను.

[515] ఇంతవరకే వధుపక్షమువారు వారి ఖర్చుతో చేయుటకు బాధ్యులు. ఇకపైని జరుగున వన్నియు వరుడే స్వయముగా ఖర్చుచేసి చేసికొనవలెను. ఇట్లు వివాహహోమము చేసిన అగ్నిని వరుడు రక్షించుకొని, వధువును ఆఅగ్నితోబాటు స్వగృహమునకు తీసికొనిపోయి గృహప్రవేశము చేయవలెనని శాస్త్రము. ఈఅగ్నికే గార్హ్యాగ్ని, ధార్యాగ్ని, స్మార్తాగ్ని - అని పేరులు. ఈ అగ్నిని జీవితాంతము రక్షించుకొని, అందులోనే యదృతాది, వివాహానంతర వరగృహప్రవిశ్యహోమములు, స్థాలీపాకము, శేషహోమము, పుంసువనహోమము, సీమన్త హోమము, గృహప్రవేశహోమము, పార్వణపిండపితృయజ్ఞములు, ఔపాసనము, వైశ్వ దేవము, పంచమహాయజ్ఞములు చేయవలెను. (కాని ఈకాలములో ఎవ్వరును ఇట్లు వివాహా గ్నిని జీవితాంతము రక్షించుకొనుట లేదు.)

[516] తర్వాత సదస్యులలోపెద్దవారికి, బ్రాహ్మణోత్తములకు వధూపక్షమువారు మంగళాక్షతలను లను పంచి, వారిచే ఆశీర్వాదయుక్తముగా వధూవరులపై ఆ అక్షతలను వేయించి, సదస్యు

## ఉత్తంభనాదిమంత్రజపః(త్రై.మం.పా.1.6,7)

(ఆపస్తంబసూత్రములో ప్రధానహోమానంతరము, వరు డాహోమాగ్నిని ఆరిపోకుండ కుంపటిలోగాని, కుండలోగాని భద్రపరచుకొని, ఆఅగ్నిని, వధువును తనయింటికి గొని పోయి, ఆఅగ్నినే తనగృహములో ప్రతిష్ఠించి, ప్రవిశ్యహోమాదులను చేయవలెనని యున్నది. వధువును గుఱ్ఱములు, లేక ఎద్దుల బండిపై గాని, ఏనుగు లేక గుఱ్ఱముపై నెక్కించుకొనిగాని తీసుకపోవలెననియు, ఇట్లు తీసుకపోవునప్పుడు ఎదురగు వివిధపరి స్థితులలో వాటికి తగిన మంత్రములు పఠించుచు పోవలెననియు ఉన్నది. ఈమంత్రముల కన్నిటికి కలిసికట్టుగా 'ఉత్తంభనాదిమంత్రము' లని పేరు. ఈమంత్రము లన్నియు తైత్తిరీయమంత్రపాఠమునందలి ప్రథమప్రపాఠకములోని 6,7 ఖండములలో నున్నవి. కాని ఏకదినములో వివాహములు జరుగు నీకాలములో నట్టిపరిస్థితుల నెదుర్కొనుట కును, వానికి సంబంధించిన మంత్రములు చెప్పుటకును వీలు కలుగకున్నది. అందుచేత చాలామంది పురోహితులు ఈమంత్రములను వదలివేసి, వరుని యింటిలోనే ఉన్నట్లు భావించుచు, వివాహముచేసిన వేదికమీదనే వరునియింటిలో చేయవలసిన ప్రవిశ్యహో మాదులను చేయుచున్నారు. కొందరు లాంఛనమునకై క్రియారహితముగ ఉత్తంభ నాదిమంత్రములను పఠించి, ఆవల ప్రవిశ్యహోమాదులను చేయుచున్నారు. ఇట్టివారి కొఱకై ఇచ్చట ఆమంత్రము లీయబడినవి. వీనిలో వేర్వేరు మంత్రములను వేర్వేరు సంద ర్భములలో చెప్పవలసియుండును. ఈ సందర్భము లధోజ్ఞాపికలలో గుర్తింపబడినవి.)

[517]వా॥ తతో వరః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం*

---

లందరికి ఫలదక్షిణాతాంబూలసత్కారములను చేసి, ముత్తైదువులచే మంగళహారతి నిప్పించ వలెను. కాని అదే వేదికపై స్థాలీపాకమువరకు, లేదా శేషహోమమువరకు జరిగినచో, లాజహో మానంతరము జరుగు కార్యములకు వరపక్షమువారు బాధ్యులు గనుక, ఇవన్నియు ముగి సిన పిదప వధూవరపక్షములవారిర్వురును కలిసి తాంబూలాదిసత్కారములను చేసి దంపతులకు మంగళహారతి నిప్పించవలెను.

[517]పిదప వరుడు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణ----ఉత్తంభనాదిమంత్రజపం కరిష్య' అని సంకల్పించి, క్రింద నిచ్చిన ఉత్తంభనాదిమంత్రములను పఠించవలెను.

*శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం వివాహ కర్మాంగం ఉత్తంభనాదిమంత్రజపం కరిష్య'* ఇతి సంకల్ప్య, తన్మంత్రజపం కుర్యాత్।

మం॥ [518]సత్యేనోత్తభితా భూమిస్సూర్యేణోత్తభితా ద్యౌః।ఋతేనాదిత్యాస్తిష్ఠన్తి దివి సోమో అధిశ్రితః॥ [519]యుఞ్జన్తి బ్రధ్నమరుషం చరన్తం పరితస్థుషః। రోచన్తే రోచనా దివి॥ యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే। సఖాయ ఇన్ద్రమూతయే॥ [520]సుకిగ్ంం శుకగ్ంం శల్మలిం విశ్వరూపగ్ంం హిరణ్యవర్ణగ్ంం సువృతగ్ంం సుచక్రమ్। ఆరోహ వధ్వమృతస్య లోకగ్గ్ స్యోనం పత్యే వహతుం కృణుష్వ।ఉదుత్తర మారోహన్తీ వ్యస్యన్తీ పృతన్యతః।మూర్ధానం పత్యురారోహ ప్రజయా చ విరాడ్భవ। సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్రువాం భవ। ననాన్దరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధి దేవృషు। స్నుషాణాగ్ శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్య చ। పతీనాం చ దేవృాణాం చ సజాతానాం విరాడ్భవ॥

[521] నీలలోహితే భవతః కృత్యా సక్తిర్వ్యజ్యతే। ఏధన్తేఽస్యా జ్ఞాతయః పతిర్బన్ధేషు బధ్యతే॥

---

[518] 'సత్యేనోత్తభితా' అను మంత్రముతో వరుడు శకటమును సిద్ధపరచుచున్నాడు.

[519] 'యుఞ్జన్తి బ్రధ్నం---' అను మంత్రమును జపించి ఎద్దును (గుఱ్ఱమును) బండికి కుడి వైపునను, 'యోగేయోగే---' అను మంత్రమును జపించి ఎడమ వైపునను కట్టుచున్నాడు.

[520] 'సుకిగ్ంం శుకగ్ంం', 'ఉదుత్తరం', 'సమ్రాజ్ఞీ', 'స్నుషాణాం' అను నాల్గు మంత్రములచేత బండి నెక్కుచున్న వధువు నభిమంత్రించుచున్నాడు.

[521] 'నీలలోహితే---బధ్యతే' అను మంత్రమును జపించి నల్లదారమును బండియొక్క కుడి చక్రము పోవు గాడిలోను, ఎఱ్ఱదారమును ఎడమచక్రము పోవు గాడిలోను అడ్డముగా వేయుచున్నాడు. (ఇట్టి దారములపై చక్రములు నడచినచో బండికి శత్రువులచే బాధలు కల్గవని నమ్మకము. ఈదారములకు దిగదుడుపు త్రాళ్లనిపేరు.)

[522]యే వధ్వశ్చన్ద్రం వహతుం యక్ష్మా యన్తి జనాగ్ం అను। పునస్తాన్ యజ్ఞియా దేవా నయన్తు యత ఆగతాః। మా విదన్పరిపన్థినో య ఆసీదన్తి దమ్పతీ। సుగేభిర్దుర్గమతీతామపద్రాన్త్వరాతయః। సుగం పన్థానమారుక్ష మరిష్టగ్గ్ స్వస్తివాహనమ్। యస్మిన్వీరో న రిష్యత్యన్యేషాం విన్దతే వసు॥ [523]తా మన్దసానా మనుషో దురోణ ఆధత్తగ్ం రయిం దశవీరం వచస్యవే। కృతం తీర్థగ్ం సుప్రపాణగ్ం శుభస్పతీ స్థాణుం పథేష్ఠామప దుర్మతిగ్ం హతమ్॥ [524]అయం నో మహ్యాః పారగ్గ్ స్వస్తి నేషద్వనస్పతిః। సీరా నస్సుతరా భవ దీర్ఘాయుత్వాయ వర్చసే॥ అస్య పారే నిర్‌ఋతస్య జీవా జ్యోతిరశీమహి। మహ్యా ఇన్ద్రస్స్వస్తయే॥

## యదృతాదిహోమః (తై.మం.పా.1.7)

[525]ఇతి జపిత్వా, వరః ప్రాణానాయమ్య, '*హరిరోం తత్సత్। శ్రీగోవింద గోవింద గోవింద। శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య ----శుభతిథౌ। శ్రీభగవదాజ్ఞయా భగవత్కైంకర్య రూపం అనయా నవోఢయా వధ్వాసహ యదృతాదిహోమం కరిష్య*' ఇతి సంకల్ప్య।

---

[522] 'యే వధ్వశ్చన్ద్రం', 'మావిదన్', 'సుగం పన్థానమ్' అను మంత్రములతో ఆ దారముల మీదుగా బండిని తోలుకొని పోవుచున్నాడు.

[523] కృష్ణాగోదావర్యాదిమహానదులను, గోవులు గోకికొనుటకు పాతిన గోవురాళ్లను, చతుష్పథములను దాటిపోవునప్పుడు 'తా మన్దసానా' అను మంత్రమును చదువుచున్నాడు.

[524] మహానదులను నావచే దాటవలసినప్పుడు, ఆనావను 'అయం నో' అను మంత్రముచే నభిమంత్రించుచున్నాడు. నావలో నదిని దాటునప్పుడు వధువు నావనడుపరిని చూడకూడదు. అట్లు నది ఆవలితీరమునకు చేరుకొన్న తర్వాత 'అస్య పారే' అను మంత్రమును జపించుచున్నాడు.

[525] బండి శ్మశానమును దాటిపోవలసి వచ్చినను, బండి భగ్నమైనను, వధువుయొక్క ఆభరణాదులు నష్టమైనను, దారిలోనే వధూవరులు స్నానము చేసి, 'వివాహాగ్నిప్రతిష్ఠాపనం కరిష్యే' అని సంకల్పించి, చక్షూర్హోమాంతము చేసి, ఆ తర్వాత 'యదృతే చిదభిశ్రిషః' ఇత్యాది ఏడు

[526]అగ్నే రుపసమాధా నాద్యాజ్యభాగాంతే। అన్వారబ్ధాయాముత్తరా ఆహుతీర్జుహోతి।

1. యద్దృతే చిదభి శ్రిషః పురా జర్తృభ్య ఆతృదః। సంధాతా సన్ధిం మఘవా పురోవసుర్నిష్కర్తా విహృతం పునస్స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥
2. ఇడామగ్నే పురుదగ్ంసగ్ంసనిం గోశ్శశ్వత్తమగ్ం హవమానాయ సాధ। స్యాన్నస్సూను స్తనయో విజావాఽగ్నే సా తే సుమతిర్భూత్వస్మే స్వాహా। అగ్నయ ఇదం న మమ॥
3. ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురాచకే స్వాహా। వరుణాయేదం న మమ॥

---

మంత్రములతో 'యద్దృతాదిహోమము' చేయవలెనని ఆపస్తంబసూత్రము తెల్పుచున్నది. కాని, ఈకాలములో ఈహోమమున కవసరమైన పరిస్థితులే కల్గకుండుటవల్ల, ఈహోమముతో పనిలేదని పలువురి అభిప్రాయము. ఐనను 'వివాహే యద్దృతాదీని న త్యజేత్కదాచన = వివాహములో నెప్పుడును యద్దృతాదిహోమమును విడిచిపెట్టకూడదు' అను కారికయు, 'వివాహే యద్దృతాదీని కుర్యాదుద్వాహసిద్ధయే। ఏకగ్రామేఽపి వాప్యేకగృహే వా న త్యజేద్బుధః', అనగా 'వివాహపరిపూర్తికై యద్దృతాదిహోమమును చేయవలెను. వధూవరు లొకే ఊరిలో నున్నను, ఒకే యింటిలో నున్నను విజ్ఞులు దీనిని త్యజింపరాదు' – అను గౌతమమహర్షి నిర్దేశ మును ఉన్నందువలన, ఆపస్తంబుడు చెప్పిన పరిస్థితులు కల్గకున్నను వివాహపరిపూర్తికై ఈ హోమమును చేయవలెనని కొందరి మతము. క్రియ చేయకుండ హోమమంత్రములను జపించిన చాలునని కొందఱి అభిప్రాయము. హోమార్థమై వరుడు తన కుడికి వధువును కూర్చుండబెట్టు కొని పీటలపై కూర్చొని, ప్రాణాయామము చేసి, '*హరిరోం తత్సత్--- యద్దృతాది హోమం కరిష్య*' అని సంకల్పము చేసి,

[526] 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా శమ్యల నుపయోగించి చక్షుర్హోమాంతము చేసి, వధువు తనను తాకుచుండగా తరువాతి ఏడు మంత్రములతో చతుర్గృహీతాజ్యముతో ప్రధానదర్వీతో ప్రధానహోమము చేయవలెను.

4. తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదా శాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీ స్వాహా। వరుణాయేదం న మమ॥
5. త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం న మమ॥
6. స త్వం నో అగ్నేఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా। అగ్నీ వరుణాభ్యామిదం న మమ॥
7. త్వమగ్నే అయాఽస్యయా సన్మనసా హితః। అయా సన్ హవ్యమూహిషేఽయా నో ధేహి భేషజగ్ం స్వాహా। అగ్నయే అయస ఇదం న మమ॥

[527]వా॥ అనన్వారభ్య। (స్రువేణ) జయాది ప్రతిపద్యతే। సగ్ం స్రావం, ప్రాణాయామం, ప్రాయశ్చిత్తం, పరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనాభివాదనాన్తం కృత్వా।

పరిశిష్టోత్తంభనాదిమన్త్రాః (తై.మం.పా.1.7)

ఈః[528]యే గన్ధర్వా అప్సరసశ్చ దేవీరేషు వృక్షేషు వానస్పత్యేష్వాసతే। శివాస్తే అస్యై వధ్వై భవన్తు మా హిగ్ంసిషుర్వహతుమూహ్యమానామ్॥ యా

[527] అనన్వారభ్య= వధువును తాకకుండ, స్రువేణ=స్రువముతో, జయాది=జయాదిహోమములు, ప్రతిపద్యతే= చేయబడుచున్నవి. ఇట్లు 'షట్పాత్రప్రయోగః' అను ఆధ్యాయములో చెప్పినట్లుగా, జయాదిహోమములను, సంస్రావహోమమును, ప్రాణాయామము, ప్రాయశ్చిత్త హోమము, ఉత్తరపరిషేచనము, బ్రహ్మోద్వాసనము, అభివాదనాంతముగా చేసి, శేషించిన ఉత్తంభనాదిమంత్రభాగములను పఠించవలెను.

[528](శేషించిన ఈ ఉత్తంభనమంత్రములు పఠించుట కవసరమైన పరిస్థితు లీకాలములో కల్గుట

ఓషధయో యా నద్యో యాని ధన్వాని యే వనా।తే త్వా వధు ప్రజావతీం ప్ర త్వే ముఞ్చన్త్వగ్ంహసః॥

[529]సంకాశయామి వహతుం బ్రహ్మణా గృహైరఘోరేణ చక్షుషా మైత్రేణ।
పర్యాణద్ధం విశ్వరూపం యదస్యాగ్ స్యోనం పతిభ్యస్సవితా కృణోతు తత్॥

[530]ఆ వామాగ న్థ్సుమతిర్వాజినీవసూ న్యశ్వినా హృత్సు కామాగ్ం అయగ్ంసత। అభూతం గోపా మిథునా శుభస్పతీ ప్రియా అర్యమ్ణో దుర్యాగ్ం అశీమహి॥ అయం నో దేవస్సవితా బృహస్పతిరిన్ద్రాగ్నీ మిత్రావరుణా స్వస్తయే। త్వష్టా విష్ణుః ప్రజయా సగ్ం రరాణః కామ ఆయాతం కామాయ త్వా విముఞ్చతు॥

## వధూగృహప్రవేశః

[531]వా॥ వరః పూర్వం వివాహాగ్నినా సహ గృహం ప్రవిశ్య। ‘శర్మ వర్మేద’ మితి లోహితం చర్మానడుహం ప్రాచీనగ్రీవ ముత్తరలోమ మధ్యేఽగారస్యాఽఽస్తీర్య।

---

కవకాశము లేకుండుటచే నివి అప్రస్తుతమని కొందరు వీనిని పఠించుట లేదు.) దారిలో జువ్వి, రావి, మఱ్ఱి మొదలగు పాలుగల వృక్షములను గాని, గ్రామాదులకు హద్దులుగ పరిగణింపబడు ఇతరవృక్షములనుగాని దాటినపుడు ‘యే గన్ధర్వా’ అను మంత్రమును, నదులను, నిర్జలములగు దీర్ఘారణ్యములను దాటినపుడు ‘యా ఓషధయో’ అనుమంత్రమును జపించవలెను.

[529] ‘సంకాశయామి’ అను మంత్రముతో వధువునకు వరుడు తన యింటిని చూపించవలెను.

[530]ఇంటికి చేరిన తర్వాత ‘ఆవామాగన్’ అను మంత్రముతో కుడివైపు కట్టిన ఎద్దును (గుఱ్ఱమును), ‘అయం నో దేవః’ అను మంత్రముతో ఎడమవైపు కట్టిన ఎద్దును (గుఱ్ఱమును) బండినుండి విడిపించుచున్నాడు.

[531]వధువును బండిలోనే ఉంచి, వరుడు ముందుగా తనవెంట దెచ్చుకొన్న వివాహాగ్నితో సహ ఇంటిలోనికి పోయి ‘శర్మ వర్మేదమ్’ అను మంత్రముతో ఇంటిమధ్యన ఒక ఎఱ్ఱని ఎద్దుచర్మమును ముఖము తూర్పున కుండునట్లును, రోమములు పైకుండునట్లును పఱచవలెను. దీనిపై వధూ

మం॥ శర్మ వర్మేదమాహరాస్యై నార్యా ఉపస్తిరే। సినీవాలి ప్రజాయతామియం భగస్య సుమతా అసత్॥ (తై.మం.పా.1.8)

[532] గృహాన్ ప్రపాదయన్నుత్తరాం వాచయతి దక్షిణేన పదా। సా చ ప్రవిశన్తీ సతీ దేహళీం నాభితిష్ఠతి।

మం॥ గృహాన్భద్రాన్థ్సుమనసః ప్రపద్యేఽవీరఘ్నీ వీరవతస్సువీరాన్। ఇరాం వహతో ఘృతముక్షమాణా స్తేష్వహగ్ం సుమనాస్సంవిశామి॥ (తై.మం.పా.1.8)

## ప్రవిశ్యహోమః (తై.మం.పా.1.8)

[533]వా॥ఆగారస్యైశానదేశే వధ్వాసహ కటే పూర్వవదుపవిశ్య। పవిత్రపాణిః ప్రాణానాయమ్య। *'హరిరోం తత్సత్। శ్రీగోవింద గోవింద గోవింద। శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త*

---

వరు లిర్వురు కూర్చుండి తరువాత కొంత కార్యక్రమమును చేయవలసియున్నది. కాని ఈకాలములో ఎద్దుచర్మమును పఱచుట లేదు. ఐనను మంత్రమును మాత్రము చెప్పుచున్నారు.

[532]తర్వాత వరుడు వధువు కుడిచేతిని తనకుడిచేత గ్రహించి, 'గృహాన్భద్రా' అను మంత్రమును చెప్పుచు ఆమెతోబాటు తానును కుడిపాదమును మొదట ఇంటిలోనికి పెట్టుచు కడపను త్రొక్కకుండ దాటి ఆమె నింటిలోనికి కొనిరావలెను. (ఈకాలములో ప్రవిశ్యహోమము వివాహవేదికయందే చేయుచుండుటచే నిదియు సాధ్యము కాదు. ఐనను మంత్రము మాత్రము చెప్పవలెను.)

[533] అట్లు ప్రవేశించి, ఇంటిలో ఈశాన్యప్రదేశమున తుంగచాపపై వివాహములోవలెనే వధువు తనకు కుడివైపుండునట్లుగా తూర్పుముఖముగా కూర్చొని, వరుడు పవిత్రపాణియై ప్రాణాయామము చేసి 'హరిరోం తత్సత్---వధ్వాసహ వివాహప్రవిశ్యహోమం కరిష్యే' – అని సంకల్పించి, తనవెంట తీసికొని వచ్చిన వివాహాగ్ని నచ్చట ప్రతిష్ఠించి, 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా శమ్యల నుపయోగించి చక్షుర్హోమాంతము చేసి, వధువు తనను తాకుచుండగ తరువాతి 13 మంత్రములతో చతుర్గృహీతాజ్యముతో ప్రధానదర్వీతో ప్రధానహోమము చేయవలెను. (ఈకాలములో వివాహవేదికయందే వివాహాగ్నిలోనే ప్రవిశ్యహోమము చేయుచుండుటచే ఈఅగ్నిప్రతిష్ఠతో అక్కఱ లేదు. సంకల్పము మాత్రము చేసి తరువాతి 13మంత్రములతో ప్రవిశ్యహోమము చేయవలెను.)

*మానస్య ---- శుభతిథౌ/శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్య రూపం అనయా నవోఢయా వధ్వాసహ వివాహప్రవిశ్యహోమం కరిష్య'* ఇతి సంకల్ప్య। అగ్నే రుపసమాధానాద్యాజ్యభాగాంతే। అన్వారబ్ధాయా ఆహుతీర్జుహోతి।

1. ఆగన్గోష్ఠం మహిష్ఠి గోభిరశ్వైరాయుష్మత్పత్నీ ప్రజయా స్వర్విత్।బహ్వీం ప్రజాం జనయన్తీ సురత్నే మమగ్నిగ్ం శతహిమాస్సపర్యాత్స్వాహా।
   అగ్నయ ఇదం న మమ॥
2. అయమగ్నిర్గృహపతిస్సుసగ్ం సత్పుష్టివర్ధనః।యథా భగస్యాభ్యాం దదద్రయిం పుష్టిమథో ప్రజాగ్ స్వాహా।అగ్నయే గృహపతయ ఇదం న మమ॥
3. ప్రజాయా ఆభ్యాం ప్రజాపత ఇన్ద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్। యథైనయో ర్న-ప్రమీయాతా ఉభయోర్జీవతోః ప్రజాస్వాహా।ఇన్ద్రాగ్నిభ్యామిదం న మమ॥
4. తేన భూతేన హవిషాఽయమాప్యాయతాం పునః। జాయాం యామస్మా ఆవాక్షుస్తాగ్ం రసేనాభివర్ధతాగ్ స్వాహా। ఇన్ద్రాగ్నిభ్యామిదం న మమ॥
5. అభివర్ధతాం పయసాఽభి రాష్ట్రేణ వర్ధతామ్। రయ్యా సహస్రపోషసేమౌ స్తామనపేక్షితౌ స్వాహా। ఇన్ద్రాగ్నిభ్యామిదం న మమ॥
6. ఇహైవ స్తం మా వియోష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్।మహ్యా ఇన్ద్రస్స్వస్తయే స్వాహా। ఇన్ద్రాయేదం న మమ॥
7. ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వాఽదాద్బృహస్పతిః। మయా పత్యా ప్రజావతీ సంజీవ శరదశ్శతగ్గ్ స్వాహా। బృహస్పతయ ఇదం న మమ॥
8. త్వష్టా జాయామజనయత్త్వష్టాఽస్యై త్వాం పతిమ్। త్వష్టా సహస్రమా-యూగ్ంషి దీర్ఘమాయుః కృణోతువాగ్ స్వాహా। త్వష్ట్ర ఇదం న మమ॥
9. ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ।త్వామవస్యురా చకే స్వాహా।

వరుణాయేదం న మమ॥ (తై.సం.2.1.11)

10. తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదా శాస్తే యజమానో హవిర్భిః।అహేడ మానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీ స్వాహా।
   వరుణాయేదం న మమ॥ (తై.సం.2.1.11)
11. త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్దేవస్య హేడోఽవయాసిసీష్ఠాః। యజిష్ఠో వహ్నితమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్స్వాహా।
   అగ్నీవరుణాభ్యామిదం న మమ॥ (తై.సం.2.5.12)
12. స త్వం నో అగ్నేఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా। అగ్నీ
   వరుణాభ్యామిదం న మమ॥ (తై.సం.2.5.12)
13. త్వమగ్నే అయాఽస్యయా సన్మనసా హితః। అయా సన్ హవ్యమూహి-షేఽయా నో ధేహి భేషజగ్గ్ స్వాహా। అగ్నయే అయస ఇదం న మమ॥
   (తై.మం.పా.1.4)

[534]**జయాదయః**:ఇధ్మసన్నహనాన్యద్భిః సంస్పృశ్యాగ్నౌ ప్రహృత్యాపః స్పృశ్య। అనన్వారభ్య।(స్రువేణ)జయాది ప్రతిపద్యతే। శమ్యా అపోహ్య। సగ్గ్ స్రావం, ప్రాణా

---

[534] ఇధ్మసన్నహనాని=ఇదివరలో ఇధ్మములకట్టకు కట్టిన దర్భత్రాటిని, అద్భిః సగ్ం స్పృశ్య=నీటిలో కడిగి, అగ్నౌ=అగ్నిలో, ప్రహృత్య=పడవేసి, అపః స్పృశ్య=ప్రోక్షణి లోని నీటిని తాకి, అనన్వారభ్య=వధువును తాకకుండ, స్రువేణ=స్రువముతో, జయాది= జయాదిహోమములు, ప్రతిపద్యతే= చేయబడుచున్నవి. ఇట్లు 'షట్పాత్రప్రయోగః' అను ఆధ్యాయములో చెప్పినట్లుగా జయాదిహోమములను చేసి, శమ్యలను తీసివేసి, సంస్రావ హోమమును, ప్రాణాయామమును, అనాజ్ఞాతసర్వప్రాయశ్చిత్తహోమములను, ఉత్తరపరిషేచ నమును, బ్రహ్మోద్వాసనమును అభివాదాంతముగా చేసి,

యామం, అనాజ్ఞాతాదిహోమం, సర్వప్రాయశ్చిత్తం, పరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం, అభివాదనాన్తం కృత్వా|

[535]వా|| పూర్వమాస్తీర్ణే చర్మణి 'ఇహ గావః' ఇతి వధూవరౌ ఉపవిశతః| పూర్వవదుత్తర ఏవ వరః|

మం||ఇహ గావః ప్రజాయధ్వమిహాశ్వా ఇహ పూరుషాః| ఇహో సహస్రదక్షిణో రాయస్పోషో నిషీదతు|| (తై.మం.పా.1.9)

[536]వా|| అథ యస్యాః పుత్రా ఏవ జాయన్తే, జాతాస్సర్వేఽపి జీవన్తి, తస్యాః పుత్రం 'సోమేనాదిత్యా' ఇతి పత్న్యఙ్కే ఉపవేశ్య|

మం|| సోమేనాదిత్యా బలినస్సోమేన పృథివీ దృఢా| అథో నక్షత్రాణామేషా-ముపస్థే సోమ ఆధితః|| (తై.మం.పా.1.9)

[537]వా|| తస్మై 'ప్రస్వస్థః ప్రేయమ్' ఇతి యజుషా కదళ్యాదిఫలాని దత్వా|

మం|| ప్రస్వస్థః ప్రేయం ప్రజయా భువనే శోచేష్ట|| (తై.మం.పా.1.9)

[538]వా|| 'ఇహప్రియమ్' ఇతి ద్వే జపిత్వా నక్షత్రోదయపర్యంతముభౌ వాచం యచ్ఛతః|

---

[535] 'ఇహ గావః' అను మంత్రము పఠించుచు ఇదివరకు పరచిన ఎద్దుచర్మముపై వధూవరులు పూర్వాభిముఖముగా వధువు వరునియొక్క కుడివైపుండునట్లు కూర్చొని (ఈకాలములో ఎద్దుచర్మము పరచుటకు వీలు లేకుండుటచే, అగ్నికి పడమట ముందు కూర్చున్నచోటనో లేక ఇంటిమధ్య వేసిన చాపమీదనో కూర్చొని తరువాతి కార్యక్రమమును చేయవలసి యుండును.)

[536] 'సోమేనాదిత్యా' అను మంత్రమును పఠించుచు అందఱు జీవించియేయున్న పుత్రులు గల దియు, పుత్రులనే కవినట్టిదియు నగు నొక సుమంగళియొక్క బాలకుని వధువుయొక్క కుడి తొడపై కూర్చుండబెట్టి,

[537] 'ప్రస్వస్థః ప్రేయమ్' అను మంత్రము పఠించుచు ఆబాలకునికి అరటిమొదలగు పండ్ల నొసగి,

[538]వరుడు 'ఇహ ప్రియమ్' అను రెండుమంత్రములను పఠించి, వధూవరు లిర్వురు నక్షత్రో దయ మగువరకు మౌనముతో నుండవలెను (ఈకాలములో మౌనము పాటించుట లేదు.)

మం॥ ఇహ ప్రియం ప్రజయా తే సమృధ్యతామస్మిన్గృహే గార్హపత్యాయ జాగృహి। ఏనా పత్యా తన్వగ్ం సగ్ంస్పృజస్వాథా జీవ్రీ విదథమావదాసి॥౧॥ సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత। సౌభాగ్యమస్యై దత్వాయాథాస్తం విపరేతన॥౨॥ (తై.మం.పా.1.9)

[539]వా॥ ఉదితేషు నక్షత్రేషు ప్రాచీముదీచీం వా దిశ ముపనిష్క్రమ్య। వరో 'ధ్రువక్షితి' రితి ధ్రువం, 'సప్తర్షయః ప్రథమామి' ఇత్యరున్ధతీం చ వధూం దర్శయతి।

## ధ్రువనక్షత్రదర్శనమంత్రః

మం॥ ధ్రువక్షితిర్ధ్రువయోనిర్ధ్రువమసి ధ్రువతస్థితమ్। త్వం నక్షత్రాణాం మేథ్యసి స మా పాహి పృతన్యతః॥(తై.మం.పా.1.9)

(ఇతి ధ్రువం దర్శయతి)

## అరున్ధతీనక్షత్రదర్శనమంత్రః

మం॥సప్తర్ షయః ప్రథమాం కృత్తికానామరున్ధతీమ్। యద్ధ్రువతాగ్ం హ నిన్యుః। షట్కృత్తికా ముఖ్యయోగం వహన్తీయమస్మాకమేధత్వష్టమీ॥ (తై.మం.పా.1.9)

(ఇత్యరున్ధతీం దర్శయతి)

## అర్ఘ్యప్రదానమ్

[540]వా॥ వధూవరౌ ఉత్తరయా సాక్షతోదకేన సప్తఋషిభ్యః అరున్ధత్యై చార్ఘ్యం దదతుః।

---

[539] నక్షత్రోదయమైన తర్వాత మంగళవాద్యయుతముగా గృహమునుండి తూర్పునకుగాని ఉత్తరమునకుగాని పోయి, 'ధ్రువక్షితిర్ధ్రువయోనిః' అను మంత్రముతో ధ్రువనక్షత్రమును, 'సప్త ఋషయః' అను మంత్రముతో అరుంధతిని వరుడు వధువునకు చూపించవలెను.

[540]తర్వాత, వధూవరౌ=వధూవరులు, ఉత్తరయా=తర్వాత నిచ్చిన శ్లోకములతో, సాక్షతోదకేన=అక్షతోదకమును దోసిళ్లలో పోసికొని, సప్తఋషిభ్యః=సప్తర్షులకును,అరున్ధత్యై చ=అరుం

*శ్లో॥ కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః।*

*వశిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయస్తథా॥*

*పత్నీ సహిత సప్త ఋషిభ్యో నమః। నమస్కారార్ఘ్యాణి సమర్పయామి॥౧॥*

*శ్లో॥ అరుంధతి మహాదేవి వసిష్ఠప్రియభామిని।*

*దంపత్యో రక్షణార్థాయ ఇదమర్ఘ్యం దదామ్యహమ్॥*

*అరుంధతీ దేవ్యై నమః। నమస్కారార్ఘ్యాణి సమర్పయామి॥౨॥*

## ఆగ్నేయస్థాలీపాకహోమః

[541] (స్థాలీపాకవిహితకాలః: రాత్రిం త్రేధా విభజ్య, పూర్వభాగే స్థాలీపాక మౌపాసనం చ కుర్యాత్। ద్వితీయభాగే స్థాలీపాక ఏవ కార్యః, నత్వౌపాసనమ్। తృతీయభాగే స్థాలీ పాక మపి న కుర్యాత్।)

[542]సూ॥ అథైనా మాగ్నేయేన స్థాలీపాకేన యాజయతి।

---

థతికిని, అర్ఘ్యం దదతుః=అర్ఘ్య మిచ్చుచున్నారు. (సూచన: ఆపస్తంబసూత్రములో ఈఅర్ఘ్యప్ర దానము చెప్పబడలేదు. ఐనను కొందఱిది చేయుచున్నారు. కావున ఎవరి సంప్రదాయము ప్రకారము వారు చేసికొనవచ్చును.)

[541] స్థాలీపాకము నారోజు రాత్రి చేసికొనవలెనో, లేక మఱునాటి రాత్రి చేసి కొనవలెనో ఇట్లు నిర్ణయించుకొనవలెను: రాత్రిని మూడు సమానభాగములు చేసి, అందులో మొదటిభాగములో స్థాలీపాకమును, ఔపాసనమును రెంటిని చేసికొనవచ్చును. రెండవభాగములో స్థాలీపాకమును మాత్రమే చేసికొనవచ్చును. ఔపాసనమును చేయగూడదు. మూడవభాగములో ఈరెంటినీ చేయగూడదు. అందుచేత రాత్రి రెండవయామము దాటినచో, ఆనాటి రాత్రిలో గాక, మఱునటి రోజు రాత్రిప్రథమయామములో స్థాలీపాకమును, ఔపాసనమును చేసికొనవలెనని దీనికర్థము.

[542] అథ=తర్వాత, ఏనామ్=ఈవధువుచేత, ఆగ్నేయేన=అగ్నిదేవతగాగల, స్థాలీపాకేన= స్థాలీపాకముతో, యాజయతి=యాగము చేయించుచున్నాడు. అనగా అరుంధతీదర్శనానంతరము మంగళవాద్యసహితముగా ఇంటిలోనికి వచ్చి, వధువు తనను తాకుచుండగా వరుడు స్థాలీపాకహోమమును చేయవలెనని అర్థము. స్థాలీపాకమును వివాహములోనేగాక, ప్రతిదర్శ

[543]పత్న్యవహన్తివ్రీహ్యాదికం।[544] వర ఏవ వివాహాగ్నౌ చరుం శ్రపయిత్వా। అభిఘార్య। ఉదగుద్వాస్య।ప్రతిష్ఠిత మభిఘార్య। కటతల్పే వివాహవద్వరో వధ్వాసహాసీనః। పవిత్రపాణిః। ప్రాణానాయమ్య।

---

పూర్ణిమలకు జీవితాంతము చేయవలసియున్నది. ఎప్పుడు స్థాలీపాకమును చేసినను, భార్య తనను తాకుచుండగనే చేయవలెనని దీనికి విశేషార్థము.

[543] పత్ని=వధువు, వ్రీహ్యాదికం=స్థాలీపాకార్థమైన ధాన్యమును (వడ్లను), అవహన్తి=దంచు చున్నది. స్థాలీపాకమనగా ఒక స్థాలీలో (చిన్న పాత్రలో)అగ్నిపై చరువును (అన్నమును) వండి ఆ చరువుతో హోమముచేయుట. వధువు వడ్లను దంచి, దీనికి కావలసిన బియ్యమును సిద్ధము చేయవలెనని పైసూత్రార్థము. కాని ఇపు డెచ్చటను ఇట్లు జరుగుట లేదు. సిద్ధముగా నున్న బియ్యమునే అప్పు డగ్నిలో వండుటను గాని, లేక తిరువారాధన అనంతరము అన్నము నొక పాత్రలో తీసికొని దానితో హోమము చేయుటగాని జరుగుచున్నది. అగ్నిపై చరువును వరుడే వండవలెనుగాని, వధువుచేత వండింపగూడదని శాస్త్రనిర్దేశము. హోమాంతమున మిగిలిన అన్నము నొక బ్రాహ్మణునకు పెట్టవలెను గనుక బ్రాహ్మణభోజనమునకు సరిపోవునట్లుగా అన్నమును వండవలెను.

[544] వర ఏవ=వరుడే, వివాహాగ్నౌ=వివాహాగ్నిలో, చరుం=చరువును, శ్రపయిత్వా=వండి, అభిఘార్య=అగ్నిపై నున్నపుడే దానిని లౌకికాజ్యముతో నభిఘరించి,ఉదగుద్వాస్య= అగ్నికి ఉత్తరదిశయందు ప్రాగగ్రముగాగాని ఉదగగ్రముగాగాని దర్భలను పఱచి, వానిపై నా చరు పాత్రను దించి, ప్రతిష్ఠిత మభిఘార్య=దించిన చరువును మరల నేతితో నభిఘరించి, దానిని దర్భలతో కప్పి, కటతల్పే= తుంగచాపపై, వివాహవత్=వివాహములోవలెనే వధువు తన కుడికి ఉండునట్లు, వరః=వరుడు, వధ్వాసహ=వధువుతోగూడ, ఆసీనః= కూర్చుండి, పవిత్రపాణిః = పవిత్రమును ధరించినవాడై, ప్రాణానాయమ్య=ప్రాణాయామము చేసి, 'హరిరోం తత్సత్--- యాజయిష్య' అనుచు సంకల్పించి, అగ్నేరుపసమాధానాది=అగ్నిప్రతిష్ఠాపన మొదలుకొని, ఆజ్యభాగాంతే=ఆజ్యభాగాంతము (చక్షుర్హోమాంతము) చేయవలెను. అత్ర=ఇచ్చట, షట్పాత్ర ప్రయోగక్రమేణ='షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా, ఆజ్యభాగం కుర్వన్=ఆజ్యభాగమును చేయుచు, పరిధీన్ పరిదధాతి= శమ్యలనుగాక పరిధులను వేయ వలెను. పాత్రప్రయోగకాలే=అగ్నికి ఉత్తరమున పాత్రల నుంచునప్పుడు, హవిః పాత్రం=చరు

**సంకల్పః:** *'హరిరోం తత్సత్। శ్రీగోవింద గోవింద గోవింద। శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య ---- శుభతిథౌ।శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం అనయా నవోఢయా వధ్వాసహ ఆగ్నే యస్థాలీపాకేన యాజయిష్య'* - ఇతి సంకల్ప్య। అగ్నే రుపసమాధానాద్యాజ్యభాగాంతే। అత్ర షట్పాత్రప్రయోగక్రమేణ ఆజ్య భాగం కుర్వన్ పరిధీన్ పరిదధాతి। పాత్రప్రయోగకాలే హవిఃపాత్రం, మేక్షణం చ సాదయతి। వధ్వామన్వారబ్ధాయాం స్థాలీపాకాజ్జుహోతి।

## చరుహోమః

[545]వా॥ దర్వ్యాం సకృదుపస్తీర్య। హవిర్మధ్యాదంగుష్ఠపర్వమాత్ర మవదానం తిరశ్చీన మవద్యతి। పూర్వార్ధాద్ద్వితీయ మనూచీనం।పశ్చార్ధాత్తృతీయం పంచావత్తినః। సకృదభిఘార్య। హవిః ప్రత్యభిఘారయతి। అగ్నయే స్వాహేత్యగ్ని మధ్యే జుహోతి।

---

పాత్రను, మేక్షణం చ=దర్వీని తుడుచుట కొరకు సమిధను, సాదయతి=ఉంచుచున్నాడు. వధ్వామన్వారబ్ధాయాం=వధువు తనను తాకుచుండగా, స్థాలీపాకాజ్జుహోతి=చరుహోమమును చేయుచున్నాడు.

[545]స్థాలీపాకములో అగ్నియే ప్రధానదేవత. అగ్నికై ఇందులో రెండు అన్నాహుతులున్నవి. మొదటిది 'అగ్నయే స్వాహా' అను మంత్రముతో చేసెడు ఆహుతి. రెండవది 'ఆగ్నయే స్విష్టకృతే స్వాహా' అను మంత్రముతో చేసెడి ఆహుతి. మొదటిఆహుతిని చేయు పద్ధతి నీ వాక్యము చెప్పుచున్నది. దీని వివరణము: దర్వ్యాం = ప్రధానదర్వి నెడమచేతిలో పట్టుకొని దానియందు, సకృత్=ఒకసారి, ఉపస్తీర్య=స్రువముతో సంస్కృతాజ్యము నుంచి,హవిర్మధ్యాత్=చరుమధ్యనుండి, అంగుష్ఠపర్వమాత్రం=బొటనవ్రేలిగణుపంత, అవదానం=అన్నమును, తిరశ్చీనం=అడ్డముగానుండునట్లు పట్టుకొన్న కుడిచేతి బొటనవ్రేలు,ఉంగరపువ్రేలు,మధ్యవ్రేళ్లతో, అవద్యతి =ప్రధానదర్విలోనికి వేసికొనుచున్నాడు; పూర్వార్ధాత్=చరువుయొక్క తూర్పుసగమునుండి, ద్వితీయం=రెండవసారి, అనూచీనం=వ్రేళ్లకొనలు తూర్పునకుండునట్లుగ, అవద్యతి=చరువును తీసికొని ప్రధానదర్విలో వేసికొనుచున్నాడు;పంచావత్తినః=పంచార్షేయులు, పశ్చార్ధాత్=చరువుయొక్క పశ్చిమార్ధమునుండి, తృతీయం=మూడవసారి, అనూచీనం=వ్రేళ్లకొనలు తూర్పున కుండునట్లుగ, చరువును తీసికొని ప్రధానదర్విలో వేసికొనుచున్నారు; సకృదభి

మం॥ ఓం అగ్నయే స్వాహా॥ అగ్నయ ఇదం న మమ॥

[546]వా॥ మేక్షణేన సంమృజ్య। పునర్దర్వ్యాముపస్తీర్య। అనూచీనముత్తరార్ధాత్సకృత్స్విష్ట కృతేఽవదాయ। ద్విః పంచావత్తినః।ద్విరభిఘార్య।'అగ్నయే స్విష్టకృతే స్వాహా'- ఇతీశాన్యే పూర్వాహుత్యసంయుక్తం హుత్వా।పునస్సంమృజ్య।

---

ఘార్య= అట్లు వేసికొన్న చరువుపై స్రువముతో నొకసారి సంస్కృతాజ్యము నభిఘరించి, హవిః =చరుపాత్రలోని అన్నమును, ప్రత్యభిఘారయతి=మరల స్రువముతో సంస్కృతాజ్యముతో నభి ఘరించి, ప్రధానదర్విని కుడిచేతిలోనికి తీసికొని, అగ్నయే స్వాహా ఇతి= 'అగ్నయే స్వాహా' అను మంత్రముతో, అగ్నిమధ్యే=అగ్నిమధ్యమున, జుహోతి= హోమము చేయుచున్నాడు. అనగా ప్రధానదర్విని ఎడమచేతిలో పట్టుకొని, దానిలో నొకసారి స్రువముతో సంస్కృతాజ్య మును వేసికొని, అంగుష్ఠమధ్యమానామికల కొనలడ్డముగా చేసి అంగుష్ఠపర్వప్రమాణముగ చరుపాత్రమధ్యనుండి చరువును తీసికొని ప్రధానదర్వీలో వేసికొని, ఆవ్రేళ్లకొనలు తూర్పున కుండునట్లు చేసి, చరువుయొక్క పూర్వార్ధమునుండి మఱొకసారి చరువును తీసికొని ప్రధాన దర్వీలో వేసికొనవలెను. ప్రవరలో ఐదుగురు ఋషులున్నవారు (పంచావత్తులు) వ్రేళ్లకొనలు తూర్పునకుండునట్లు చేసి పశ్చిమార్ధమునుండి మూడవసారి చరువును తీసికొని ప్రధాన దర్విలో వేసికొని, స్రువములోని నేతితో దాని నభిఘరించి, చరుపాత్రలోని అన్నమును కూడ అట్లే అభిఘరించి, స్రువమును క్రింద పెట్టి, ప్రధానదర్విని కుడిచేతిలోనికి తీసికొని, 'అగ్నయే స్వాహా' అనుమంత్రముతో చరుహోమము చేయవలెను. గమనిక: ఆపస్తంబుడు పై అవదానవిధానమును చెప్పిన తర్వాత 'అపి వా సకృదుపహృత్య జుహుయాత్।నాత్రోపస్తరణావదానాది ధర్మః।' అని వికల్పమును చెప్పినాడు. దీని అర్థము: అపివా=పైవిధముగా గానియెడల, సకృత్=ఒకసారి మాత్రమే, ఉపహృత్య=చరువును తీసికొని, జుహుయాత్=హోమము చేయవలెను – అని. అనగా పూర్వమువలె ఉపస్తరణాభిఘారములు లేకుండ (పంచావత్తులు సహితము) ఒకేసారి దర్విలోనికి చరువును తీసికొని హోమము చేయునది– అని దీని కర్థము. కాని మొదటి పద్ధతియే యాజ్ఞికులు తఱచుగా పాటించుచున్నారు.

[546]రెండవదగు 'అగ్నయే స్విష్టకృతే స్వాహా' అను మంత్రముతో చేయు హోమపద్ధతి నీ వాక్యము చెప్పుచున్నది. దీని వివరణము: మేక్షణేన సంమృజ్య= ప్రధానదర్విని మేక్షణముతో అన్నశేషము లేకుండ తుడిచి, పునః=పూర్వమువలెనే, దర్వ్యాం=ప్రధానదర్విని నేతితో నొక

మం॥ ఓం అ॒గ్నయే స్విష్టకృతే॒ స్వాహా॑। అగ్నయే స్విష్టకృత ఇదం న మమ॥
**పరిధ్యంజనమ్,లేపకార్యమ్:**[547]వా॥ నిధానక్రమేణ పరిధీనభ్యజ్య। ప్రధానదర్వీం దక్షి-ణతః। ఆజ్యస్థాలీ ముత్తరతః। ఇతరదర్వీం మధ్యే నిధాయ। పాత్రాసాదనదర్భానాదాయ।

---

సారి అభిఘరించి, అనూచీనమ్=వ్రేళ్లకొనలు తూర్పునకుండునట్లుగ, ఉత్తరార్ధాత్=చరుపాత్ర ఉత్తరార్ధమునుండి, సకృత్=ఒకసారి, స్విష్టకృతే=స్విష్టకృదాహుతికై మునుపటికంటె అధికముగా (ఉసిరికాయంత) చరువును, అవదాయ=ప్రధానదర్వీలో వేసికొని, (పంచావత్తినః=పంచార్షేయులు, ద్విః=రెండుసార్లు వేసికొని), ద్విరభిఘార్య=రెండుసార్లు స్రువముతో దానిపై నేతినభిఘరించి, 'అగ్నయే స్విష్టకృతే స్వాహా' అను మంత్రముతో, ఈశాన్యే=అగ్నియొక్క ఈశాన్యభాగమున, పూర్వాహుత్యసంయుక్తం=లోగడ వేసిన చర్వాహుతితో కలియకుండ వేసి, హుత్వా= హోమము చేసి, పునస్సంమృజ్య=మఱల ప్రధానదర్వీని అన్నశేషములేకుండ మేక్షణముతో తుడువవలెను.

[547] 'నిధానక్రమేణ పరిధీనభ్యజ్య' అని చెప్పుచు, మునుపు పరిధుల నుంచిన క్రమముగా, అనగా మధ్యమ,దక్షిణ,ఉత్తర పరిధులపై క్రమముగా ప్రధానదర్వీలో నున్న ఆజ్యమును కొంచెము వేసి తడుపవలెను. ఇట్లు చేయుటకే 'పరిధ్యంజన' మని పేరు. తరువాత లేపకార్యము నిట్లు చేయవలెను: అగ్నికి పడమట ప్రధానదర్వి దక్షిణమునకు, దాని కుత్తరమున ఇతరదర్వి, ఇతరదర్వికి ఉత్తరమున ఆజ్యస్థాలి ఉండునట్లు వానిని సవరించి పెట్టవలెను. తర్వాత అగ్నికి ఉత్తరమున పాత్రాసాదన చేసినపుడు వేసిన దర్భలను వాని కొన లుత్తరమునకుండునట్లు రెండుచేతులలో పట్టుకొని, 'దర్వ్యా మనక్త్యగ్రమ్' అని చెప్పుచు వాని కొనలతో ప్రధానదర్వీని తుడిచి, 'అథేతరస్యాం మధ్యమ్' అని చెప్పుచు, ఆదర్భల మధ్యభాగముతో ఇతరదర్విని తుడిచి, 'ఆజ్యస్థాల్యాం మూలమ్' అని చెప్పుచు ఆదర్భల మొదళ్లతో ఆజ్యస్థాలీని తుడువవలెను. ఇట్లు మూడుసార్లు ఇదేవాక్యములను చెప్పుచు, మూడుసార్లు ఇదే క్రమములో ప్రధానదర్వీని, ఇతరదర్వీని, ఆజ్యస్థాలీని తుడువవలెను. దర్భలమొదళ్లను తుడుచునప్పుడు కుడిచేతిని క్రిందుగను, ఎడమచేయి పైకిని ఉండునట్లు దర్భలను పట్టుకొనవలెను. ఇట్లు తుడుచుటకే లేపకార్యమని పేరు. గమనిక: ఆజ్యస్థాలీలో గాక, మొదళ్లను కూడ ఇతరదర్వీలోనే తుడుచుటగూడ శాస్త్రసమ్మతమైన పద్ధతియే. అప్పు డుభయదర్వీలే ఈ కార్యమున కుపయోగింపబడును. ఆజ్యస్థాలీతో పని యుండదు.

దర్వ్యా మనక్త్యగ్రమ్। అథేతరస్యాం మధ్యమ్। ఆజ్యస్థాల్యాం మూలమ్। మూలాంజనే దక్షిణం పాణిమధః కుర్యాత్।ఏవం త్రిః।

[548]ఏకం ప్రజ్ఞాతం నిధాయ। పాణిభ్యాం దర్వ్యం ప్రతిష్ఠాప్య। *'ప్రజాపతయ ఇదం న మమ, ఇంద్రాయేదం న మమ, అగ్న యే ఇదం న మమ, సోమాయేదం న మమ, అగ్న యే ఇదం న మమ, అగ్న యే స్విష్టకృత ఇదం న మమ'* – ఇతి హుతదేవతానుద్దిశ్య। త్రిరుద్యుత్య। అగ్నౌ ప్రహృత్య। తృణం ప్రహరతి।

**పరిధిప్రహరణమ్:**[549]ఏతత్, ఏతత్, ఏతత్ – ఇతి త్రిరంగుళ్యా నిర్దిశ్య। అగ్ని మభిమన్త్ర్య। భూమిముపస్పృశేత్। మధ్యమపరిధిం ప్రహృత్య। ఇతరౌ యుగపత్ ప్రహరన్। పరిధీ నభిమంత్ర్య। ఆఘారసమిధౌ ప్రహరతి।

**సంస్రావహోమః:** [550]దర్వ్యా మితరదర్వ్యగ్రమవధాయ సంస్రావేణాభిజుహోతి।

---

[548] ఏకం ప్రజ్ఞాతం నిధాయ=ఆదర్భలలో నొకదానిని జొండిలో చెక్కుకొని, పాణిభ్యాం దర్వ్యం ప్రతిష్ఠాప్య=చేతిలోనున్న ఇతరదర్భలను పూర్వాగ్రముగా ప్రధానదర్వీలో నుంచి, ఆదర్వీని చేతిలోనికి తీసికొని, హుతదేవతా ఉద్దిశ్య = ఇంతవఱకు హోమము చేసిన దేవతలనుగుఱించి – అనగా 'ప్రజాపతయ ఇదం న మమ' నుండి 'అగ్న యే స్విష్టకృత ఇదం న మమ' పర్యంతము ఆఘారచక్షుస్త్యాగములు, ప్రధానహోమత్యాగములు చెప్పుచు, త్రిరుద్యుత్య=ఆదర్భలను మూడుసార్లు చేతితో పైకి యెత్తి, అగ్నౌ ప్రహృత్య= వాని నగ్నిలోనికి నెట్టి, దర్వీని క్రింద పెట్టి, తృణం ప్రహరతి=జొండిలో చెక్కుకొన్న దర్భ నగ్నిలో వేయవలెను.

[549] ఏతత్, ఏతత్, ఏతత్ – ఇతి త్రిరంగుళ్యా నిర్దిశ్య=(తర్వాత) ఏతత్, ఏతత్, ఏతత్ అని చెప్పుచు మూడుసార్లు చూపుడువ్రేలుతో అగ్నిని చూపించి, అగ్ని మభిమన్త్ర్య=అగ్నిపై కుడిచేతిని బోరగిలించి తటాలున తీసి, భూమిముపస్పృశేత్=కుడిఅరచేతిని భూమిపై మోపుచు భూమిని తాకి, మధ్యమపరిధిం ప్రహృత్య=మధ్యమపరిధిని అగ్నిలోనుంచి, ఇతరౌ యుగపత్ ప్రహరన్=ఏకకాలమున కుడిచేత దక్షిణపరిధిని, ఎడమచేత నుత్తరపరిధిని తీసికొని వాని నగ్నిలో వేయుచు ఉత్తరపరిధికొనను అగ్నిలో గ్రుచ్చవలెను. పరిధీనభిమంత్ర్య=పరిధుల నభిమంత్రించి, ఆఘారసమిధౌ ప్రహరతి =ఆఘారసమిధలను అగ్నిలో పడవేయవలెను.

[550] ప్రధానదర్విలో నితరదర్వితో నొకసారి ఆజ్యమును పోసికొని, ఇతరదర్విలోను నేతిని తీసికొని, రెండుదర్వులను కుడిచేతిలో పట్టుకొని, ఏకధారగా అగ్నిలో నుంచి హోమము చేసి,

'వసుభ్యో రుద్రేభ్య ఆదిత్యేభ్యస్సర్గ్ప్రావభాగేభ్య ఇదం న మమ' ఇతి త్యాగముక్త్వా, అప ఉపస్పృశేత్।

[551] చరుహోమే జయాదిర్న। తతః ప్రాణానాయమ్య, '*అస్మిన్ ఆగ్నే యస్థాలీపాక కర్మణి అవిజ్ఞాతదోషప్రాయశ్చిత్తార్థం అనాజ్ఞాతాదిహోమం కరిష్యే*' – ఇతి సంకల్ప్య అనాజ్ఞాతాదిహోమం, సర్వప్రాయశ్చిత్తహోమం, ప్రాణాయామం, ఉత్తరపరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం, అభివాదనాన్తం కుర్యాత్।

[552]బహ్వాజ్యసిక్తేన హుతశేషేణ చరుణా దక్షిణతో నిషాదితం బ్రాహ్మణం భోజయేత్। తతః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ*

---

'వసుభ్యో రుద్రేభ్యస్సర్గ్ంప్రావభాగేభ్య ఇదం న మమ' అని త్యాగము పలికి, నీటిని తాకవలెను.

[551]చరుహోమములందు జయాదులు లేవు. అందుచే ఈహోమానంతరము ప్రాణాయామము చేసి, 'అస్మిన్ స్థాలీపాకహోమకర్మణి అవిజ్ఞాతదోషప్రాయశ్చిత్తార్థం అనాజ్ఞాతాదిహోమం కరిష్యే' అని సంకల్పించి, 'షట్ప్రాత్ర ప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా అనాజ్ఞాతాదిహోమము, పిదప సర్వప్రాయశ్చిత్తహోమము, ప్రాణాయామము, ఉత్తరపరిషేచనము, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనము, అభివాదాంతముగా చేయవలెను.

[552]బహ్వాజ్యసిక్తేన=అధికమైన నేతితో తడిసిన, హుతశేషేణ చరుణా=హోమము చేయగా మిగిలిన అన్నముతో, దక్షిణతో నిషాదితం బ్రాహ్మణం=అగ్నికి దక్షిణమున బ్రహ్మస్థానమందున్న బ్రాహ్మణుని, భోజయేత్=భుజింపజేయవలెను; తతః=తరువాత, ప్రాణానాయమ్య= ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయాం ---వృషభదానం కరిష్యే' – అని సంకల్పించి, పూజ్యాయ బ్రాహ్మణాయ=పూజ్యుడగు విప్రునికి (బ్రహ్మస్థానమందలి విప్రునికి), దద్యాత్=ఎద్దును గాని తత్సమానమైన ధనమునుగాని ఈయవలెను; ఏవమత ఊర్ధ్వం=ఇట్లే ఇటుపైని, పర్వసు=పూర్ణిమా అమావాస్యలయందు, ఉపోష్య=ఉపవాసముండి, శ్వః ప్రాతః= మఱునాటి ఉదయమందు, స్థాలీపాకం, కుర్యాత్=చేయవలెను; అత్ర=ఇట్లు చేయునపుడు, అన్వారంభః =భార్యను తాకుట గాని, ఋషభదానమ్=వృషభదక్షిణగాని, న=లేదు; కాని, ఏకే=కొందరిమతములో నీసందర్భములందు, పూర్ణపాత్రస్తు దక్షిణా ఇతి = దక్షిణార్థము పూర్ణపాత్ర మీయ వలెనని. పూర్ణపాత్ర మనగా 16 మానికల బియ్యము. 32 పిడికళ్ల బియ్యమునకు ఒక మానిక యగును. అట్టి 16 మానికలు దానమీయవలె ననుట; వివాహశేషహోమయోర్మధ్యే

*ఆగ్నేయస్థాలీపాకకర్మాంగం వృషభదానం కరిష్యే'* ఇతి సంకల్ప్య, పూజ్యాయ బ్రాహ్మణాయ దద్యాత్ । ఏవమత ఊర్ధ్వం పర్వసూపోష్య శ్వః ప్రాతః స్థాలీపాకం కుర్యాత్। నాత్ర అన్వారమ్భో న ఋషభదానమ్। పూర్ణపాత్రస్తు దక్షిణేత్యేకే। వివాహశేష హోమయోర్మధ్యే యది పౌర్ణమాసీ స్యాత్, తస్యాం స్థాలీపాకం కుర్యాత్। దర్శశ్చే న్న కుర్యాత్।

## ఔపాసనారంభః

[553]స్థాలీపాకానంతరం రాత్రౌ నవసు ఘటికాసు ఔపాసన మారభేత। నవఘటికా అతీతా శ్చేత్ శ్వస్సాయం సంధ్యానంతర మారభేత్। అథోవరః పత్నీ సమేతః దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః, ప్రాణానాయమ్య,

**సంకల్పః:**[554] *"అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వాసహ ఔపాసనమారప్స్యే/ తేన యావజ్జీవం యావదా-*

---

యది పౌర్ణమాసీ స్యాత్=వివాహశేషహోమములకు మధ్యలో పున్నమ వచ్చినచో, తస్యాం= ఆ పున్నమయందు, స్థాలీపాకం కుర్యాత్=స్థాలీపాకము చేయవలెను; దర్శశ్చే న్న కుర్యాత్= కాని అమావాస్య వచ్చినచో స్థాలీపాకము చేయనవసరము లేదు.

553 స్థాలీపాకానంతరము రాత్రి 9 గడియలలోగా ఔపాసనహోమము నారంభించి, ఈహోమ మును జీవితాంతము ప్రాతస్సంధ్యలయం దాచరించుచుండవలెను. ఒకవేళ ఇట్లు చేయుటకు కాలాతీతమైనచో మఱునాటి సాయంకాలం సాయంసంధ్యావందనానంతరము దీని నారంభించ వలెను. దీనికై వరుడు భార్యాసమేతముగా అగ్నికి పశ్చిమమున పీటలపై ఉత్తరాగ్రముగా దర్భ లను వేసికొని కూర్చుండి, పవిత్రపాణియై, ప్రాణాయామము చేసి,

554 *"అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వాసహ ఔపాసనహోమమారప్స్యే/ తేన యావజ్జీవం యావదాధానం వా తండులైర్యవైర్వా సాయంప్రాతర్హోష్యామి/"* – అనగా, 'ఈ నూతనవధువుతోగూడి నేను జీవితాంతం బియ్యముచే గాని, యవలచే గాని సాయంప్రాతఃకాలములందు ఔపాసన చేయుదును' అని సంకల్పించి , మఱల ప్రాణాయామము చేసి, *"అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వాసహాద్య సాయమౌపాసనం తండులైర్హోష్యామి"*– అనగా, 'నవ

*ధానం వా తండులైర్యవైర్వా సాయంప్రాతర్హోష్యామి।''* –ఇతి సంకల్ప్య, పునః ప్రాణా-నాయమ్య, *"అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వా సహ సాయమౌపాసనం తండులైర్హోష్యామి"*- ఇతి సంకల్ప్య, ధార్యాగ్నిం ప్రతిష్ఠాప్య, ''*ఓం చత్వారి శృంగా*'' -ఇత్యారభ్య అభివాదనాంతం పూర్వోక్తవిధానేన సాయమౌపాసనమేవ కుర్యాత్। న ప్రాతరౌపాసనమ్।

## త్రిదినవివాహదీక్షా

వా॥[555]యస్మిన్నహని గృహప్రవేశహోమాది స్థాలీపాకాన్తం కర్మ కరోతి, తతః స్థాలీపాకాదారభ్య దంపత్యోర్వివాహదీక్షాఽనుష్ఠేయమ్। తదేతదహః అవధిత్వేన

---

వధువుతోగూడి ఈనాటి సాయమౌపాసమును బియ్యముతో చేయుచున్నాను' అని మరల సంకల్పించి, స్థండిలకల్పనాగ్నిప్రతిష్ఠాపనాదులు చతుష్పాత్రప్రయోగములోవలె వివాహాగ్నిని ప్రతిష్ఠించుచు చేసి, 'చత్వారి శృఙ్గా' అను మంత్రము మొదలుకొని 'ఔపాసనవిధిః' అను అధ్యాయములో చెప్పినట్లుగ సాయమౌపాసనమును మాత్రమే అభివాదనాంతముగ చేయ వలెను. ఇచ్చట వివాహాగ్నిలో ప్రప్రథముగ సాయమౌపాసనమును మాత్రమే చేయుచుండుటచే అది ప్రాతరౌపాసనముతో సంసర్గమగు ప్రసక్తి లేదు. అందుచే ఔపాసానంతరము ఆహుతిసంసర్గ (వనస్పతి) హోమము చేయ నక్కఱ లేదు.

555 స్థాలీపాకము జరిగిన దినమునుండి మూడురాత్రులు దంపతులు వివాహదీక్షను పాటింప వలెను. దీని ప్రకార మీవాక్యములు చెప్పుచున్నవి: యస్మిన్నహని=ఏనాడు, గృహప్రవేశ హోమాదిస్థాలీపాకాన్తం కర్మ= గృహప్రవేశము స్థాలీపాకాంతముగా,కరోతి=చేయునో, తతః స్థాలీపాకాదారభ్య=ఆస్థాలీపాకముతో మొదలిడి, దంపత్యోః=దంపతులకు, వివాహదీక్షా= వివాహదీక్ష, అనుష్ఠేయమ్=చేయదగినది;తదేతదహః =ఆదినమే,అవధిత్వేన=దీని నారంభిం చుటకు తగిన హద్దుగా, విజానీయాత్=తెలియవలెను; తత ఆరభ్య=అది మొదలు, ఉభయో ర్దంపత్యోః=దంపతులిర్వురికి, త్రిరాత్రం=మూడురాత్రులు, అధశ్శయ్యా స్యాత్=నేలపై శయ నము: ఏకస్మిన్ తల్పే శయన మిత్యర్థః = ఒకటే పడకలో శయనము; న తు ఖట్వాదౌ= కాని మంచముపై కాదు; నాపి పృథక్శయ్యా, ఉభయోరితి గ్రహణాత్ = ఇర్వురు శయనింపవలె ననుటచే వేర్వేరుగా కాదు– అనగా, మంచముపై గాక నేలపై పఱుపు వేసికొని దంపతు లిర్వురు పండుకొనవలెనని అర్థము; తయోః శయ్యామ్= ఆదంపతుల పడకలో,అన్తరేణ= వారిమధ్య,

విజానీయాత్। తత ఆరభ్య ఉభయోర్దంపత్యోః త్రిరాత్రమధశ్శయ్యా స్యాత్। ఏకస్మిన్ తల్పే శయనమిత్యర్థః।న తు ఖట్వాదౌ।నాపి పృథక్శయ్యా, ఉభయో రితి గ్రహణాత్। తయోశ్శయ్యా మంతరేణ దండో గన్ధలిప్తో వాససా సూత్రేణ పరివీత స్తిష్ఠతి। తస్మిన్ తథాష్టాంగమైథున వర్జనలక్షణం బ్రహ్మచర్యం స్యాత్।

## గంధర్వస్థాపనవిధిః

[556] తయోర్వ్రతస్థయోర్దంపత్యో శ్శయ్యామన్తరేణ వాససా సూత్రేణ వా పరివీతో గంధానులిప్తః పుష్పైరలంకృతో అశ్వత్థో దండో విశ్వావసుగంధర్వ భావనయా 'విశ్వావసు సోమ గంధర్వ' మిత్యావాహ్య, షోడశోపచారాన్ కృత్వా ప్రతిష్ఠాపయేత్।

---

దండః=ఒక పొడవైన రావిసమిధ, గన్ధలిప్తః=చందనలిప్తమై, వాససా సూత్రేణ వా=క్రొత్తవస్త్రము తో లేక తెల్లదారముతో, పరివీతః=చుట్టబడినది, తిష్ఠతి=ఉండును(ఉంచవలెను). తథా= అట్లు వారికి (మూడురాత్రులు), అష్టాంగమైథునవర్జనలక్షణం=అష్టాంగమైథునరహితమైన, బ్రహ్మ చర్యం స్యాత్=బ్రహ్మచర్యము గలదు. (శ్లో॥ స్మరణం,కీర్తనం,కేళిః,ప్రేక్షణం, గుహ్య భాషణం। సంకల్పోధ్యవసాయశ్చ క్రియా నిర్వృత్తిరేవ చ। ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః॥ 1.అన్యోన్యస్మరణము, 2. పరస్పరకీర్తనము, 3. ఉభయులు క్రీడించుట,4. పరస్పరవీక్షణము, 3.ఏకాంతభాషణము, 6. మైథునసంకల్పము, 7. తత్ప్రయత్నము, 8. మైథునక్రియ – ఇవి అష్టాంగమైథునములని ఈశ్లోకమున కర్థము) అనగా, ఒకే పడకలో పండుకొన్నను, ఇవేవియు లేక దంపతులు మూడురాత్రులు బ్రహ్మచర్యమును పాటింపవలెననుట. వారిమధ్య పడకలో విశ్వావసువను గంధర్వుని చిహ్నముగా నుంచిన రావి (లేక మోదుగు)దండము దంపతుల మధ్య ఇట్టి అష్టాంగ మైథునము జరుగకుండ సాక్షిగా నుండునని నమ్మకము. ఈ దండప్రతిష్ఠా విధానము క్రింద చెప్పబడినది. గమనిక: పూర్వము 5 రోజులపాటు పెండ్లి జరుగునప్పుడు ఇది చేయుచుండెడివారేమో! కాని ఒకరోజులో పెండ్లి చేయు నీరోజులలో దీనిని చేయుటకు వీలు లేకున్నది. పైగా దంపతు లేక శయ్యాగతులు కానిచో దీనితో అవసరము లేదని 'స్మార్తకారికా' కర్తయైన నృసింహపండితుని అభిప్రాయము.

556 తయోర్వ్రతస్థయోర్దంపత్యో=అట్లు వివాహవ్రతమును చేయుచున్న దంపతులయొక్క, శయ్యామన్తరేణ=పడకమధ్యలో, పుష్పైరలంకృతః=పుష్పములచే నలంకృతమైన, వాససా సూత్రేణ వా= వస్త్రముచేతగాని, తెల్లదారముతోగాని, పరివీతః=చుట్టబడిన, గంధానులిప్తః= గంధ

[557] తత్ప్రకారః: వరః ప్రాణానాయమ్య, '*అస్యాం శుభతిథౌ దమ్పతిదీక్షాసంరక్షణార్థం విశ్వావసు గంధర్వదేవతాస్థాపనం పూజనం చ కరిష్యే*' - ఇతి సంకల్ప్య,

మం॥ వి॒శ్వావ॑సుగ్ం సోమ గన్ధర్వమ్। ఆపో॑ దద్రృశుషీః। తద్రృతేనా వ్యా॑యన్న్। తద॒న్వవై॑త్। ది॒న్ద్రో॑ రారహా॒ణ ఆ॑సామ్। పరి॒ సూర్య॑స్య పరి॒ధీగ్ం॑రపశ్యత్। వి॒శ్వావ॑సు ర॒భి తన్నో॑ గృణాతు। ది॒వ్యో॑ గన్ధ॒ర్వో॑ రజ॑సో వి॒మానః॥ (తై.ఆ.4.11.47)

శ్లో॥ విశ్వావసోత్ర గన్ధర్వ దండే రాత్రిత్రయం వస।
ఆవయోః ప్రీతిముత్పాద్య రక్ష మాం శుభలక్షణమ్॥

విశ్వావసు గన్ధర్వప్రతిష్ఠాపన ముహూర్తస్సుముహూర్తోఽస్తు। విశ్వావసు గన్ధర్వప్రతిష్ఠాపనకాలే సూర్యాదీనాం నవగ్రహాణా మానుకూల్యఫలసిద్ధిరస్తు। ఇతి నమస్కృత్య,

---

ముచే పూయబడిన, అశ్వత్థోదండః=రావికఱ్ఱను, విశ్వావసుగంధర్వభావనయా=విశ్వావసు గంధర్వునిగా నెంచుచు,'విశ్వావసుసోమగంధర్వ' మిత్యావాహ్య='విశ్వావసుసోమగంధర్వ' మను మంత్రముతోఆసమిధలో విశ్వావసు నావాహనము చేసి, షోడశోపచారాన్ కృత్వా=దానికి షోడశోపచారపూజను చేసి, ప్రతిష్ఠాపయేత్=స్థాపించవలెను. అనగా ఒక రావి (లేక మఱ్ఱి, లేక జువ్వి) కఱ్ఱకు ఒకమామిడికొమ్మను కట్టి, రెంటిని కలిపి తెల్లదారముతో చుట్టి, చందనపుష్ప ములచే నలంకరించి, 'విశ్వావసు సోమ గంధర్వ' మను మంత్రముతో నాసమిధలో విశ్వావసు నావాహనము చేసి, షోడశోపచారపూజను చేసి దంపతులకు మధ్య శయ్యలో నుంచవలె ననుట.
557దాని విధాన మిట్లున్నది: వరుడు ప్రాణాయామము చేసి,'అస్యాం శుభతిథౌ ---విశ్వావసు గంధర్వదేవతాస్థాపనం పూజనం చ కరిష్యే' - అని సంకల్పించి, 'విశ్వావసుగ్ం సోమ గన్ధర్వ' మను మంత్రమును పఠించి, తర్వాత నిచ్చిన శ్లోకమును, 'అస్తు' అంతమందుగల రెండు వాక్య ములను పలికి ఆ సమిధకు నమస్కరించి, 'విశ్వావసు గంధర్వదేవతాయై నమః --- ఏతే గంధా క్షతధూపదీపనైవేద్యాస్సర్వోపచారాః' – అనుదాని పర్యంతము విష్వక్సేనార్చనలోవలె షోడ శోపచారపూజను చేసి, దానిని శయ్యపై దంపతుల మధ్య నుంచి, శేషహోమపర్యంత మా దండమును ఔపాసనానంతరము పూజించుచుండవలెను.

*'విశ్వావసు గంధర్వదేవతాభ్యో నమః/ధ్యాయామి/ఆవాహయామి/ఆసనం సమర్ప-యామి --- ఏతే గంధాక్షతధూపదీపనైవేద్యాన్సర్వోపచారాః'* – ఇతి విష్వక్సేనార్చన వత్ విశ్వావసుగంధర్వాయ షోడశోపచారపూజాం కృత్వా, దండం దంపత్యోః శయ్యా మధ్యే స్థాపయిత్వా, శేషహోమపర్యంతం ఔపాసనానంతరం తత్పూజాం కుర్యాత్।

గంధర్వోత్థాపనవిధిః

[558] చతుర్థ్యామపరరాత్ర్యాం సుస్నాతౌ, నవవస్త్రాలంకృతౌ, ధృతతిలకోర్ధ్వపుండ్రౌ, వధూవరౌ గన్ధర్వోత్థాపనం కుర్యేతామ్। తత్ప్రకారః: వరః ద్విరాచమ్య, ప్రాణానా యమ్య, *'అస్యాం శుభతిథౌ అనయా నవోఢయా వధ్వా సహ విశ్వావసుగంధర్వ దేవతాపూజనం ఉద్వాసనం చ కరిష్యే'* - ఇతి సంకల్ప్య, *'విశ్వావసుగంధర్వ దేవతాభ్యో నమః/ ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యామి'* – ఇతి షోడ శోపచారపూజాం కృత్వా, 'ఉదీర్ష్వాత' ఇతి ద్వాభ్యాం తద్దండముత్థాప్య,ప్రక్షాళ్య స్వస్థానాదన్యత్ర నిదధాతి। (తై.మం.పా.1.10)

మం॥ ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేడామహే త్వా। అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సంజాయాం పత్యా సృజ॥౧॥ ఉదీర్ష్వాతః పతివతి హ్యేషా విశ్వావసుం నమసా గీర్భిరీట్టే। అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాగ్ం స తే భాగో జనుషా తస్య విద్ధి॥౨॥

---

558 ఇట్లు మూడురాత్రులు కడచిన పిదప, నాల్గవనాటి రాత్రి మూడవజామున దంపతులు సుస్నాతులై క్రొత్తబట్టలను, తిలకోర్ధ్వపుండ్రాదుల ధరించి గంధర్వపూజను చేసి, ఉద్వాసన చేయవలెను. దీనికై వరుడు రెండు సార్లాచమించి, ప్రాణాయామం చేసి, 'అస్యాం శుభతిథౌ .... ఉద్వాసనం చ కరిష్యే' అని సంకల్పించి, దానికి షోడశోపచారపూజను చేసి, 'ఉదీర్ష్వాతః' 'ఉదీర్ష్వాతః పతివతిహి' అను రెండు మంత్రములను చదివి, దండమును కదలించి, దానికి చుట్టిన దారమును విప్పివేసి, (పాలతో) కడిగి, ఇంకొకచోట నుంచవలెను.

## శేషహోమప్రయోగః

**పరిషదనుజ్ఞా:** [559] చతుర్థ్యా మపరరాత్ర్యాం వధూవరౌ అభ్యంగనస్నానం కృత్వా, నవవస్త్రాలంకృతస్సన్, ధృతతిలకోర్ధ్వపుండ్రస్సన్, రంగవల్ల్యాద్యలంకృతవివాహ వేదికాం ప్రాప్య, వేదికాయాః ఉత్తరభాగే బృహస్పతిం దక్షిణాభిముఖముపవేశ్య, తాంబూలఫలపరిషద్దక్షిణాసమేత హరిద్రాక్షతపాత్రం హస్తే ధృత్వా, వేదికాయాః పశ్చాద్వధూసహితః తిష్ఠన్ బ్రూయాత్।

[560] *ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై*/ (తై.సం.3-2-4-14)/ *సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యా స్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్*/ (తై.బ్రా.1-2-1-26)

---

559 చతుర్థ్యాం=నాల్గవనాటి, అపరరాత్ర్యాం=మూడవజామున, అనగా తెల్లవారుజామున – రాత్రిని మూడుభాగములు చేసి, మొదటి రెండు భాగములవరకు పూర్వదినముగను, మూడవ భాగమునుండి పరదినముగను భావింతురు. అందుచే నాల్గవనాటి రాత్రి మూడవజామున చేసినకార్యము 5వ దినమునకు చెందునని అర్థము; వధూవరౌ=దంపతులు, అభ్యంగన స్నానం కృత్వా=అభ్యంగనము చేసి, నవవస్త్రాలంకృతస్సన్=నూతనవస్త్రములు కట్టుకొని, ధృతతిల కోర్ధ్వపుండ్రస్సన్= (ఆమె) తిలకమును, (అతడు) ఊర్ధ్వపుండ్రములను ధరించి, రంగవల్ల్యా ద్యలంకృత వివాహవేదికాం ప్రాప్య=ముగ్గులచే నలంకృతమైన హోమవేదిక కడకు వచ్చి, బృహస్పతిం=వాధ్యారును, వేదికాయాః ఉత్తరభాగే=వేదికి ఉత్తరభాగమున, దక్షిణాభిముఖ ముపవేశ్య=దక్షిణముఖముగా కూర్చుండబెట్టి, తాంబూలఫలపరిషద్దక్షిణాసమేత హరిద్రాక్షత పాత్రం= తాంబూలము,పండ్లు,పరిషత్తున కిచ్చు దక్షిణతో గూడిన పసుపక్షతలపాత్రను, హస్తే ధృత్వా =చేతిలో పట్టుకొని, వేదికాయాః పశ్చాత్=వేదికి పడమట, వధూసహితః=తన కుడికి వధువుండగా, తిష్ఠన్=నిలబడి, బ్రూయాత్=(ఉత్తరోక్తవిధముగా) పల్కవలెను. (గమనిక: ఈకాలములో నేకదినమున అదే వేదికపై శేషహోమాంతము పెండ్లి జరుగుచుండుటచే, ఇచ్చట చెప్పబడిన అభ్యంగనాదులు చేయుట కవకాశము లేదనుట స్పష్టము. ఐనను శాస్త్రోక్తవిధాన మిచ్చట చెప్పబడినది. దీనిని యథాసౌకర్యముగా నాచ రింపవలసియుండును.)

560 తర్వాత 'ఓం నమస్సదసే' నుండి 'భవన్తోమహాన్తోనుగృహ్ణన్తు' వరకు చెప్పి, పరిషత్తుకు నమస్కరించి, 'తథాస్తు,ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు' అని పరిషదనుగ్రహమును పొందవలెను.

*సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః। స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే శేషహోమ చతుర్థీహోమకర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్త్వితి భవన్తో మహాన్తోఽను గృహ్ణన్తు। లగ్నస్య సర్వే గ్రహాశ్శుభైకాదశస్థానఫలదాస్సుప్రసన్నా భూయాసురితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు। ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్త్వితి భవన్తో మహాన్తోఽను గృహ్ణన్తు।''* - ఇతి ప్రార్థ్య నమస్కుర్యాత్. ''*తథాస్తు। ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు।''* - ఇతి పరిషద్వచనమ్.

**సంకల్పః:** [561] ఇతి పరిషదనుజ్ఞాం గృహీత్వా, దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః, ప్రాణానాయమ్య, *'హరిరోం తత్సత్, శ్రీ గోవింద గోవింద గోవింద----శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం అనయా నవోఢయా వధ్వా సహ వివాహశేషహోమం కరిష్య, తద్ధోమ నిర్విఘ్న పరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్య'* – ఇతి సంకల్ప్య విష్వక్సేనారాధనం కుర్యాత్।

**ఆజ్యభాగః:** [562]స్థండిలం కల్పయిత్వా, వివాహౌపాసనాగ్నిం ప్రతిష్ఠాప్య, పరిధ్యర్థం శమ్యాః నిధాయ, షట్పాత్రప్రయోగక్రమేణ చక్షుర్హోమాంతమాజ్యభాగం కృత్వా, పత్న్యా అన్వారబ్ధః చతుర్గృహీతేన 'అగ్నే ప్రాయశ్చిత్తే త్వ'మితి సప్తభిర్హుత్వా, ప్రతి మంత్రం హుతశేషమాజ్యం కస్మింశ్చిన్నాగవల్లీదళే వా చిత్పాత్రే వా నిక్షిపేత్।

---

561 తర్వాత వధూవరులు దక్షిణోత్తరపు పీటలపై దర్భలు వేసికొని కూర్చొని, వరుడు పవిత్ర పాణియై, ప్రాణాయామము చేసి, *'హరిరోం తత్సత్.....పరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్య'* అని సంకల్పించి, ముందుగా 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధనమును చేయవలెను.

562 తర్వాత స్థండిలమును కల్పించి, వివాహసంబంధమైన ఔపాసనాగ్ని నచ్చట ప్రతిష్ఠించి, పరిధులకై శమ్యలను వేయుచు 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా చక్షుర్హోమాంతముగా ఆజ్యభాగమును చేసి, వధువు తనను తాకుచుండగా క్రింద నిచ్చిన ఏడు మంత్రములతో చతుర్గృహీతాజ్యముతో ప్రధానహోమము చేయుచు, ప్రతి ఆహుతి చివర దర్వీలో శేషించిన ఆజ్యము నొక తమలపాకులో (లేక దొప్పలో) చేర్చుకొనుచుండవలెను.

ప్రధానహోమమంత్రాః (తై.మం.పా.1.10)

1. అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథ-కామః ప్రపద్యే యాఽస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీలక్ష్మిఘ్నీ జారఘ్నీమస్యై తాం కృణోమి స్వాహా౟అగ్నయ ఇదం న మమ॥
2. వాయో ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథకామః ప్రపద్యే యాఽస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మిఘ్నీ జారఘ్నీమస్యై తాం కృణోమి స్వాహా। వాయవ ఇదం న మమ॥
3. ఆదిత్య ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథ-కామః ప్రపద్యే యాఽస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీలక్ష్మిఘ్నీ జారఘ్నీమస్యై తాం కృణోమి స్వాహా।ఆదిత్యాయేదం న మమ॥
4. ప్రజాపతే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథ-కామః ప్రపద్యే యాఽస్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మిఘ్నీ జారఘ్నీమస్యై తాం కృణోమి స్వాహా।ప్రజాపతయేదం న మమ॥
5. ప్రసవశ్చోపయామశ్చ కాటశ్చార్ణవశ్చ ధర్ణసిశ్చ ద్రవిణం చ భగశ్చాన్త-రిక్షం చ సిన్ధుశ్చ సముద్రశ్చ సరస్వాగ్శ్చ విశ్వవ్యచాశ్చ తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మస్స్వాహా। ప్రసవాదిభ్య ఇదం న మమ॥
6. మధుశ్చ మాధవశ్చ శుక్రశ్చ శుచిశ్చ నభశ్చనభస్యశ్చేషశ్చోర్జశ్చ సహశ్చ సహస్యశ్చ తపశ్చ తపస్యశ్చ తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మస్స్వాహా। మధ్వాదిభ్య ఇదం న మమ॥
7. చిత్తం చ చిత్తిశ్చాకూతం చాకూతిశ్చాధీతం చాధీతిశ్చ విజ్ఞాతం చ విజ్ఞానం చ నామ చ క్రతుశ్చ దర్శశ్చ పూర్ణమాసశ్చ తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి

తమే॑ష॒ాం జమ్భే॑ దధ్మ॒స్స్వాహా᳚। చిత్తాదిభ్య ఇదం న మమ॥

**జయాది:** [563]ఇధ్మసన్నహనాన్యద్భిస్సగ్గ్ంస్పృశ్యాఽగ్నౌ ప్రహృత్యాపః స్పృశ్య। జయాదిహోమం కృత్వా,శమ్యా అపోహ్య,సంస్రావం,ప్రాయశ్చిత్తం,ప్రాణాయామం, ఉత్తరపరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం, అగ్న్యుపస్థానం చ కృత్వా, అగ్నేః పశ్చాత్ప్రాఙ్ముఖీం పత్నీముపవేశ్య, తస్యాశ్శిరసి హుతశేషమాజ్యం దర్వ్యా మాదాయ, స్వాహాకారాభిస్సర్వేషామన్తే సకృత్ వధ్వాశ్శిరసి నినయతి।

మం॥ భూస్స్వాహా᳚। భువ॒స్స్వాహా᳚। సువ॒స్స్వాహా᳚। ఓగ్ స్వాహా᳚॥

వా॥ అథ వధూ వరం 'అపశ్యం త్వే'తి సమీక్షతే।

మం॥ అప॑శ్యం త్వ॒ా మన॑స॒ా చేకి॑తాన॒ం తప॑సో జ॒ాతం తప॑స॒ో విభూ॑తమ్। ఇ॒హ ప్ర॒జామి॒హ ర॒యిగ్ం రరా॑ణః ప్రజా॑యస్వ ప్ర॒జయా॑ పుత్రకామ ॥ (తై.మం.పా.1.11)

వా॥ అనంతరం వరో వధూం 'అపశ్యం త్వే'తి సమీక్షతే।

మం॥ అప॑శ్యం త్వ॒ా మన॑స॒ా దీధ్యా॑న॒ాగ్॒ స్వాయా᳚ం త॒నూగ్ం ఋత్వి॒యే నాథ॑మానామ్। ఉప॒ మామ॒ుచ్చా యు॑వ॒తిర్బ॑భూ॒యాః ప్రజా॑యస్వ ప్ర॒జయా॑ పుత్రకామే ॥ (తై.మం.పా.1.11)

---

563లోగడ ఇధ్మములకు కట్టిన దర్భత్రాటిని నీటిలో తడిపి అగ్నిలో వేసి, ప్రోక్షణిలోని నీరు ముట్టి, 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా జయాదిహోమమును చేసి, శమ్యలను తీసివేసి, సంస్రావప్రాయశ్చిత్తహోమములు చేసి, ప్రాణాయామము, ఉత్తరపరిషేచనము, ప్రణీతామోక్షణము,బ్రహ్మోద్వాసనము, అగ్న్యుపస్థానము – అన్నియును చేసి, అగ్నికి పడమట తూర్పుముఖముగా వధువును కూర్చుండబెట్టి, వరుడు పశ్చిమముఖుడై నిల్చొని, హుతశేషాజ్యమును దర్వితో తీసికొని భూస్స్వాహా – ఇత్యాది నాల్గుమంత్రములను చదివి, అవి చదివిన తర్వాత నొకసారి ఆజ్యము నామె తలయం దుంచవలెను. తదుపరి వధువు క్రింద నిచ్చిన 'అపశ్యం త్వా మనసా చేకితానం' అను మంత్రముతో వరుని నొకసారి చూడవలెను. పిదప వరుడు 'అపశ్యం త్వా మనసా దీధ్యానాగ్ం' అను మంత్రముతో వధువు నొకసారి చూడవలెను.

వా॥[564]ఆజ్యాభ్యక్తాభ్యామఙ్గుష్ఠానామికాభ్యామ్, 'సమంజన్తు విశ్వేదేవా' ఇత్యేతయా తయోర్హృదయదేశే యుగపత్సంమృశతి।

మం॥ సమంజన్తు విశ్వేదేవాస్సమాపో హృదయాని నౌ। సం మాతరిశ్వా సం ధాతా సము దేష్ట్రీ దిదేష్టు నౌ॥

వా॥[565]తతః 'ప్రజాపతే తన్వం మ' ఇతి తిస్రో జపిత్వా, అభ్యుదయం, పుణ్యాహం చ కుర్యాత్।

మం॥ ప్రజాపతే తన్వం మే జుషస్వ త్వష్టర్దేవేభిస్సహసామ ఇన్ద్ర। విశ్వైర్దేవై రాతిభిస్సగ్ం రరాణః పుగ్ంసాం బహూనాం మాతరస్స్యామ॥౧॥(మం.పా.1.11)

ఆ నః ప్రజాం జనయతు ప్రజాపతిరాజరసాయ సమనక్త్వర్యమా। అదుర్మఙ్గలీః పతిలోకమావిశ శం నో భవ ద్విపదే శం చతుష్పదే॥౨॥ (తై.మం.పా.1.11)

తాం పూషఞ్ఛివతమామేరయస్వ యస్యాం బీజం మనుష్యా వపన్తి। యా న ఊరూ ఉశతీ విస్రయాతై యస్యాముశన్తః ప్రహరేమ శేఫమ్॥౩॥ (తై.మం.పా.1.11)

[566]తత స్సంధ్యాద్యోపాసనాంతం కృత్వా, అభ్యుదయం పుణ్యాహం చ కుర్యాత్।

## [567] అభ్యుదయమ్

ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీ భగవ*

---

564 వధూవరు లిర్వురు ఎదురుగా కూర్చుండి, వరుడు తన అంగుష్ఠానామికలను హుతశేషాజ్యముతో నద్దుకొని, 'సమంజన్తు విశ్వే దేవా' అను మంత్రమును చెప్పుచు ఏకకాలమున ఆ నేతిని బొటనవ్రేలితో వధూవక్షమునందును, అనామికతో తన వక్షమునందును రాచుకొనవలెను.

565 తర్వాత 'ప్రజాపతే తన్వం మే' ఇత్యాది మూడు మంత్రములను జపించి, అభ్యుదయమును, పుణ్యాహవాచనమును చేసికొనవలెను.

566 తదుపరి వరుడు సంధ్యావందనౌపాసనములను ముగించుకొని, వివాహకర్మాంగభూతములైన అభ్యుదయమును, కర్మణః పుణ్యాహవాచనమును చేయవలెను.

567 వరుడు ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ*

*దాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం వివాహాకర్మాంగభూత మభ్యుదయం కరిష్యే'* – ఇతి సంకల్ప్య, పూర్వోక్తవిధినా హిరణ్యరూపేణాభ్యుదయం కుర్యాత్।

## కర్మణః పుణ్యాహవాచనమ్

[568] వరః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాంశుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం వివాహకర్మాంగభూతం కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే'* – ఇతి సంకల్ప్య , పూర్వోక్తవిధానేన కర్మణః పుణ్యాహం వాచయిత్వా ఆత్మానం భార్యాం చ పుణ్యాహజలేన ప్రోక్షయేత్।

## శేషహోమకట్నమ్

[569]అథ వరస్య స్యాలో వా తత్సమానికో వా వరాయ శేషహోమకట్నం (నూతనక్షౌమం) యచ్ఛతి. తత్సమయే ఆచార్యః వక్ష్యమాణ మన్త్రపూర్వకాశీర్వచనవాక్యాని పఠతి. *మం॥ఆశాస్తే౾యం యజమానో౾సౌ/ ఆయురాశాస్తే/ సుప్రజాస్త్వమాశాస్తే/ సజాత-వనస్యామాశాస్తే/ ఉత్తరాన్దేవయజ్యామాశాస్తే/ భూయో హవిష్కరణమాశాస్తే/ దివ్యం*

---

---*వివాహకర్మాంగభూతమభ్యుదయం కరిష్యే'* – అని సంకల్పించి 'నాందీశ్రాద్ధవిధిః' అను అధ్యాయములో నిచ్చినట్లుగా హిరణ్యరూపకముగా అభ్యుదయమును చేయవలెను.

568 వరుడు మఱల ప్రాణాయామము చేసి, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా ---వివాహకర్మాంగభూతం కర్మణః పుణ్యాహవాచనం కరిష్యే'* – అని సంకల్పించి 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా కర్మణః పుణ్యాహవాచనము చేసి, తనను, భార్యను పుణ్యాహజలముతో ప్రోక్షించుకొనవలెను.

569 అప్పుడు వధువు సోదరుడుగాని, తత్సమానుడుగాని వరునికి నూతనపట్టువస్త్రములను కట్నముగా నిచ్చుట సంప్రదాయము. అట్టి వ్యక్తి ఒక తట్టలో వస్త్రములను పెట్టుకొని, వానిపై ఫలతాంబూలములను పెట్టుకొని వరుని కెదురుగా నిలుచుండగా పురోహితుడు 'ఆశాస్తేయం' అను మంత్రమును చదువవలెను. అది చదివిన పిమ్మట అతడు వస్త్రములను, ఫలతాంబూలములను వరుని కీయవలెను. వరుడా నూతనవస్త్రములను ధరించివచ్చి పీటలపై కూర్చొని తర్వాతి ఫలదానాదికార్యక్రమమును చేయవలెను. ఈసందర్భములో వధూవరుల కిర్వురికి గాక, వరునకు మాత్రమే విలువైన నూతనవస్త్రము లిచ్చుట ఆచారముగా నున్నది.

*ధామాశాస్తే/ విశ్వం ప్రియ మాశాస్తే/ యదనేన హవిషాఽఽశాస్తే/ తదశ్యాత్తదృధ్యాత్/ తదస్మై దేవా రాసన్తామ్/ తదగ్నిర్దేవో దేవేభ్యో వనతే/ వయమగ్నేర్మానుషాః/ ఇష్టం చ వీతం చ/ ఉభే చ నో ద్యావాపృథివీ అగ్ంహసస్పాతామ్/ ఇహ గతిర్వామస్యేదం చ/ నమో దేవేభ్యః//* (తై.బ్రా.3.5.10)

## సమావేశనమ్-ఫలదానాని

**సంకల్పః:** [570]వధూవరౌ కస్మింశ్చిత్పాత్రేషు తాంబూల నారికేళకదళ్యాదిఫలాని నిక్షిప్య, తత్పాత్రౌ స్వాంకే సంస్థాప్య, ఫలదానార్థముపక్రామ్యతి। తతో వరః ప్రాణానాయమ్య, '*పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయా మస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా*

[570] సమావేశన మనగా వధూవరుల కలయిక ( మైథునార్థమై). ఆసమావేశనకాలములో చదువవలసిన మంత్రములు సమావేశనమంత్రములు. ఈమంత్రములు చదివిననాటి రాత్రి వధూవరు లేకశయ్యాగతులై మైథునమును నెరపుట జరుగుచున్నది. కాని పూర్వకాలములో కన్య రజస్వల కాక మునుపే వివాహము చేయుచుండుటచే, వివాహములో నీ మంత్రములను చదివినను, కన్య రజస్వలయైన తర్వాత నొక సుముహూర్తమున ఈమంత్రములతోనే గర్భాదానము చేయుచుండెడివారు. కాని ఈకాలమున ఈ ప్రత్యేకగర్భాధానకర్మకు అవసరమే లేకున్నది. ఈ సమావేశనమంత్రములను చదువుటకు ముందుగా, సత్సంతానప్రాప్తిని కోరి ఇతరదంపతులకు ఫలదానము చేయుట పరిపాటిగా నున్నది. ఇందుకై, వధూవరౌ=వధూవరులు, కస్మింశ్చిత్పాత్రేషు =కొన్నిపాత్రలలో(లేక బుట్టలలో), తాంబూల నారికేళ కదళ్యాది ఫలాని=తాంబూలములను, కొబ్బెరికాయలను కదళీఫలములను, నిక్షిప్య=ఉంచుకొని, తత్పాత్రౌ= అట్టి రెండు బుట్టలను, స్వాంకే=వారివారి ఒడిలో (లేక సమీపములో), సంస్థాప్య=పెట్టుకొని, ఫలదానార్థం = ఫలదానమునకై, ఉపక్రామ్యతి=ఆరంభింతురు; తతః=అప్పుడు, వరుడు వధువు తన కుడి కుండునట్లుగా పీటలపై కూర్చొని, ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త ఏవంగుణవిశేషణ విశిష్టాయాం --- ఫలప్రదానాని కరిష్య' అని సంకల్పించి, దంపతులను వివాహవేదికపైకి ఆహ్వానించి, వారిలో స్త్రీ వధువున కెదురుగను, పురుషుడు వరున కెదురుగను నిలబడగా వధూవరులు తమతమ బుట్టలలో నున్న తాంబూలఫలదక్షిణలను అట్లు ఎదురుగా నిల్చున్న వారి కీయవలెను. అట్లు ఇచ్చు సందర్భమున పురోహితుడు 'యాః ఫలినీర్యా' అను మంత్రమును, 'ఫలం మనోరథఫలం'

*శ్రీమన్నారాయణప్రీత్యర్థం మమ ధర్మపత్న్యా సహ సమావేశన కర్మ కరిష్యమాణః తదంగం ఆవయోః సత్సంతానసిద్ధ్యర్థం యావచ్ఛక్తిఫలప్రదానాని కరిష్య'* – ఇతి సంకల్ప్య , యథాశక్తి దంపతీభ్యః '*యాః ఫలినీర్యే*'తి ఫలదానం సమర్పయేత్।

మం॥ *యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః।*
*బృహస్పతిప్రసూతాస్తా నో ముఞ్చన్త్వగ్ంహసః।* (తై.సం.4.2.6)

శ్లో॥ *ఫలం మనోరథఫలం ప్రదదాతి సదా నృణామ్।*
*పుత్రపౌత్రపౌత్రాదివృద్ధిం చ శ్రియం పుష్టిం ప్రయచ్ఛ మే॥*

''*ఫలదానకల్పోక్త సకలఫలావాప్తిరస్తు।*'' - ఇతి గ్రహీతౄణాం ప్రతివచనమ్।[571]అథ వధూవరౌ పాత్రయోః ఇతోధికఫలదక్షిణాతాంబూలాదీని గృహీత్వా, సమ్యగన్వారభ్యోపవిశతః। తతో వరః 'ఆరోహోరుముపబర్హస్వ' ఇత్యాదిమంత్రాన్ జపతి।

## సమావేశనమంత్రాః

మం॥ ఆరోహోరుముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాగ్ం సుమనస్య-మానః। తస్యాం పుష్యతం మిథునౌ సయోనీ బహ్వీం ప్రజాం జనయన్తౌసరేతసా। ఆర్ద్రయాఽరణ్యా యత్రామన్థత్పురుషం పురుషేణ శక్రః। తదేతౌ మిథునౌ స-

---

అను శ్లోకమును చెప్పవలెను. ఫలదానము తీసికొన్న దంపతులు 'ఫలదానకల్పోక్త సకలఫలావాప్తిరస్తు' అని వధూవరులను దీవించవలెను.

[571]అథ=తదుపరి, వధూవరౌ=వధూవరులు, పాత్రయోః=బుట్టలయందు, ఇతోధికదక్షిణాఫలతాంబూలాదీని=మునుపటికంటె అధికముగా దక్షిణను, తాంబూలనారికేళాదిఫలములను గృహీత్వా=తీసికొని,సమ్యగన్వారభ్య=ఒకరినొకరు తాకుచు దగ్గరగా,ఉపవిశతః=కూర్చొందురు; తతః=అప్పుడు,వరః=వరుడు,'ఆరోహోరుముపబర్హస్వ' ఇత్యాదిమంత్రాన్ ='ఆరోహోరుముపబర్హస్వ' మున్నగు మూడు సమావేశనమంత్రములను, జపతి=జపించును. దీనికి ముందుగా సదస్సులోని పెద్దలకు హరిద్రాక్షతల నీయవలెను. కర్మాంతమున వారును, వాధ్యారును 'అయం సమావేశనముహూర్తస్సుముహూర్తోఽస్తు' అని చెప్పుచు దంపతులపై ఆ అక్షతలు వేసి దీవించవలెను.

యోనీ ప్రజయాఽమృతేనేహ గచ్ఛతమ్। అహం గర్భమదధామోషధీష్వహం విశ్వేషు భువనేష్వన్తః। అహం ప్రజా అజనయం పితృణామహం జనిభ్యో అవ-రీషు పుత్రాన్। పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతమ్। ఉభా హిరణ్య పేశసా వీతిహోత్రా కృతద్వసూ। దశస్యంత్వాఽమృతాయ కగ్ం శమూధో రోమశగ్ం హథో దేవేషు కృణుతో దువః॥౧॥ (తై.మం.పా.1.12)

విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పిగ్ంశతు। ఆసిఞ్చతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే। గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి। గర్భం తే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజా। హిరణ్యయీ అరణీ యం నిర్మన్థతో అశ్వినా। తం తే గర్భగ్ం హవామహే దశమే మాసి సూతవే। యథేయం పృథివీ మహీ తిష్ఠన్తీ గర్భమాదధే। ఏవం త్వం గర్భమాధత్స్వ దశమే మాసి సూతవే। యథా పృథివ్యగ్నిగర్భా ద్యౌర్యథేన్ద్రేణ గర్భిణీ। వాయుర్యథా దిశాం గర్భ ఏవం గర్భం దధామి తే। విష్ణో శ్రేష్ఠేన రూపేణాస్యాం నార్యాం గవీన్యామ్। పుమాగ్ంసం గర్భమాధేహి దశమే మాసి సూతవే। నేజమేష పరాపత సపుత్రః పునరాపత। అస్యై మే పుత్రకామాయై గర్భమాధేహి యః పుమాన్। వ్యస్య యోనిం ప్రతి రేతో గృహాణ పుమాన్పుత్రో ధీయతాం గర్భే అన్తః। తం మాతా దశమాసో బిభర్తు స జాయతాం వీరతమస్స్వానామ్। ఆ తే గర్భో యోనిమేతు పుమాన్బాణ ఇవేషుధిమ్।ఆ వీరో జాయతాం పుత్రస్తే దశమాస్యః॥౨॥(మం.పా.1.13)

కరోమి తే ప్రాజాపత్యమా గర్భో యోనిమేతు తే। అనూనః పూర్ణో జాయతామ-శ్లోణోఽపిశాచధీతః। పుమాగ్ స్తే పుత్రో నారి తం పుమాననుజాయతామ్। తాని భద్రాణి బీజాన్యృషభా జనయన్తు నౌ। యాని భద్రాణి బీజాన్యృషభా జనయన్తి

నః। త్రైస్త్వం పుత్రాన్ విన్దస్వ సా ప్రసూర్ధేనుకా భవ। కామప్రమృధ్యతాం మహ్యా-
మపరాజితమేవ మే। యం కామం కామయే దేవ తం మే వాయో సమర్ధయ॥3॥

[572]అథ వధూవరౌ బృహస్పతయే నమస్కారపూర్వకం తాని ఫలాని సమర్పయేత్। బృహస్పతిస్సదస్యాశ్చ *'అయం సమావేశనముహూర్తస్సుముహూర్తోఽస్తు'* – ఇతి హరిద్రాక్షతైః దంపతీభ్యా మాశీర్వచనం అనుగ్రహం కుర్యుః। తతో వర ఔపాసనాగ్ని మాత్మసమారోపణం కృత్వా, సాత్త్వికత్యాగం, 'కాయేన వాచే' తి భగవదర్పణం కుర్యాత్।

## అగ్న్యుద్వాసనమ్

[573] *మం॥ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః। తాని ధర్మాణి ప్రథమాన్యాసన్న్ । తే హ నాకం మహిమానస్సచన్తే। యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః।*

ఇతి దీక్షాగ్ని నుద్వాస్య, *'శోభనకాలే పునరాగమనాయ చ'* - ఇత్యగ్నేః పశ్చాత్ హరిద్రాక్షతాన్ నిధాయ నమస్కుర్యాత్।

## బృహస్పతిసంభావనా

---

[572]ఈమంత్రములు జపించిన పిదప వధూవరులు వాధ్యారుకు ఫలదక్షిణాదుల నిచ్చి నమస్కరింపవలెను. అప్పుడు వాధ్యారు, సదస్యులు 'అయం సమావేశనమహూర్తస్సుముహూర్తోఽస్తు' అని చెప్పుచు దంపతులపై అక్షతలు వేసి దీవించవలెను. అనంతరము వరుడా అగ్నిని 'ఔపాసనవిధిః' అను అధ్యాయములో చెప్పినట్లుగా ఆత్మసమారోపణము చేసికొని సాత్త్వికత్యాగము చేసి, చివరకు 'కాయేన వాచా మనసేంద్రియైర్వా ---నారాయణాయేతి సమర్పయామి॥ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు॥' అని కర్మను భగవదర్పణము చేయవలెను.

[573] తరువాత నగ్ని నుద్వాసన చేయవలెను. దీనికై వరుడు తూర్పుముఖముగా నుండి, ఒక సమిధను తీసికొని, 'యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః' అను మంత్రమును చెప్పుచు, ఆ సమిధతో అగ్నిని కొంచెము తూర్పునకు త్రోసి ఉద్వాసన చేసి,హరిద్రాక్షతలు అగ్నికి పడమట నుంచుచు 'శోభనకాలే పునరాగమనాయ చ' అని చెప్పి నమస్కరింపవలెను.

[574] మం॥ ఓమ్। బృహస్పతే సవితర్బోధయైనగ్ం సగ్ంశితం చిత్సన్తరాగ్ం
సగ్ంశిశాధి। వర్ధయైనం మహతే సౌభగాయ విశ్వే ఏన మనుమదన్తు దేవాః॥
ఇతి బృహస్పతిం గన్ధపుష్పాక్షతైరలంకృత్య, '----గోత్రేణ ---శర్మణా కన్యాపిత్రా
అనయోర్వధూవరవివాహమహోత్సవే సమర్పిత మిదం సదక్షిణతాంబూలమ్' –
ఇతి బ్రహస్పతయే సదక్షిణతాంబూలం దద్యాత్.

## తాంబూలసత్కారాదీని

[575]తతస్సదస్యేభ్యః యథాశక్తి ఫలదక్షిణాసహితతాంబూల సత్కారం కారయేత్।
సుమంగళీభిః మంగళారాత్రికం, బ్రాహ్మణేభ్యః వేదమంత్రాశీర్వచనం చ కారయేత్।

## లౌకికమ్ (అప్పగింతలు)

'అప్పగింత' లనగా లాంఛనప్రాయముగా వధువును వరపక్షమువారికి అప్పగించుట.
దీనిని కొందరు చేయుచున్నారు; కొందరు చేయుట లేదు.
దీనికై వధూపక్షమువారొక పరిశుద్ధస్థలమున పీటలను వేసి, దీపములు వెలిగించి, ఆ పీటలకు ముందర ఒక పాలతో నిండిన పళ్లెమును పెట్టించి, అందులో హరిద్రాక్షతలను వేసి యుంచవలెను. వరుడచ్చట నొకపీటపై తూర్పుముఖముగ కూర్చొనవలెను. వర పక్షములోని బంధువులు మగవారు ఆడవారు అతనికి దక్షిణమునకు పీటలపై తూర్పు ముఖముగ కూర్చొనవలెను. అప్పుడు వధూపితరులు (లేదా తత్సమానులు) వధూ యుతముగా నక్కడికి వచ్చి, వరపక్షమువారి యెదుట నిలుచుండవలెను. అట్లు నిలు చున్న తర్వాత వధూమాత (లేక తత్సమానురాలు) వధువుతోగూడ వంగి, వధూహస్త

---

[574] తరువాత 'బృహస్పతే...మదన్తు దేవాః' అను మంత్రమును చదివి, గంధపుష్పాక్షతలతో బృహస్పతిని పూజించి,'---గోత్రేణ---శర్మణా కన్యాపిత్రా అనయోర్వధూవరవివాహమహో త్సవే సమర్పిత మిదం సదక్షిణతాంబూలమ్' అని బృహస్పతికి దక్షిణాతాంబూలముల నిచ్చి అతని ఆశీర్వాదమును గైకొనవలెను.

[575] తరువాత సదస్యులకు ఫలతాంబూలాదిసత్కారములు చేసి, సుమంగుళులచేత దంపతు లకు మంగళహారతి నిప్పించవలెను. వేదవిప్రులచేత నాశీర్వాదము చేయించవలెను.

ముల నా పాలలో నద్దించి, వరపక్షములోని దంపతులలో ముందుగా పురుషుల దోసిళు లందును, అనంతరము స్త్రీల దోసిళులందును వధూహస్తముల నుంచవలెను. ఇట్లు వారి హస్తములను మూడుసారులు స్పృశింపజేయవలెను. ఇట్లు స్పృశింపజేయునపుడు వధువుయొక్క తండ్రిగాని తత్సమానీకుడుగాని ఈక్రింది శ్లోకమును చెప్పుట పద్ధతి:

*శ్లో॥ అష్టవర్షా భవేత్కన్యా పుత్రవత్పాలితా మయా।*
*ఇదానీం తవ దాస్యామి స్నేహేన పరిపాలయ॥*

(ఎనిమిది సంవత్సరములు నిండి కన్యాత్వమును పొందిన నీమెను పుత్రునివలె పెంచి నాను. ఇప్పుడు మీకు ఈమెనిచ్చుచున్నాను. మీరీమెను స్నేహముతో (ప్రేమతో) చూచికొనుడు– అని ఈశ్లోకమున కర్థము. ఇచ్చట వరునియొక్క వివిధసంబంధీకు లకు అప్పగించునపుడు 'తవ దాస్యామి' అని ఉన్నచోట 'తవ పుత్రస్య దాస్యామి', 'తవ భ్రాతుః దాస్యామి', 'తవ పౌత్రస్య దాస్యామి' ఇత్యాదిగా సందర్భోచితముగ చెప్పవలెను.)

వరపక్షములోని వితంతువుల కచ్చట గాక, వారున్నచోటికి వధువును గొనిపోయి అప్పగించవలెను. ఈకార్యము నకే అప్పగింతలని పేరు.

## ఒకేదినమున వివాహమునంతయు పూర్తిచేయు పద్ధతి

పూర్వము విరామముగా సశాస్త్రీయముగా వివాహమును 5రోజులు చేయుచుండెడి వారు. కాని ఈకాలములో ద్రవ్యాభావముచేతగాని, సమయాభావముచేతగాని, ఇతర కారణములచేతగాని వివాహకార్యమును సమావేశనమంత్రపర్యంతముగ ఒకేవేదికపై నొకే దినమున ముగించుచున్నారు. ఇట్టి పరిస్థితిలో కొన్ని క్రియలను చేయుట కసలు అవకాశము కలుగుట లేదు. మఱికొన్ని సంక్షేపముగా చేయవలసి వచ్చుచున్నది. ఇట్లు ఏకదినమున వివాహపరిపూర్తికి అవలంబించవలసినపద్ధతి ఇచ్చట నీయబడుచున్నది.

ఇట్టి పరిస్థితిలో ఈగ్రంథములో నీయబడినట్లుగా ప్రధానహోమాంతము యథా విధిగా చేసి, వీలున్న ఉత్తంభనాదిమంత్రముల పఠించి, యదృతాదిహోమము, ప్రవిశ్య హోమము, ఆగ్నేయస్థాలీపాకహోమము, శేషహోమములను చేయునప్పుడాయా సంకల్పములను మాత్రము చెప్పి, పాత్రాసాదనాదులను చేయకుండ మునుపు ప్రతిష్ఠిం

చిన అగ్నిలోనే ఆయాహోమములను మాత్రము చేసి, జయాదులను ప్రతిసారి చేయ కుండ చిట్టచివరికి శేషహోమాంతమున చేసి, సమావేశనమంత్రజపము చేసి ముగించ వచ్చును. ఈహోమములలో స్థాలీపాకహోమము కొంత ప్రత్యేకముగా నున్నది. అందులో నుంచవలసిన పరిధుల నిదివరలో ప్రధానహోమములో నుంచిన శమ్యలకు ప్రక్కనే పెట్టి, స్థాలీపాకహోమములో వచ్చు పరిధిప్రహరణసమయములో వాని నగ్నిలోవేయవలెను. అట్లే ఇతరహోమములలో లేని పరిధ్యంజనలేపకార్యములు కూడ అచ్చట చేయవలసి యుండును. శేషహోమములో ప్రధానాహుతులు పూర్తియైన తర్వాత జయాదులను, శమ్యావిసర్జనమును, అనాజ్ఞాతాదిహోమములను, ప్రణీతా మోక్షణమును, బ్రహ్మోద్వాసనమును, అగ్న్యుపస్థానమును పూర్వహోమముల కన్నిటికి కలిపి ఒకేసారి చేయవలసియుండును. ఒకే వేదికపై ఏకదినమున ఈ హోమ ముల నన్నిటిని చేసినపుడు అది పగలైనను సాయమౌపాసనమునే చేయవలెను గాని ప్రాతరౌపాసనమును చేయగూడదు. ఉన్న పరిస్థితులను, సమయమునుబట్టి వాధ్యారు లీవిధానమునందలి ఉచితానుచితములను గ్రహించి సాధ్యమైనంతవఱకు శాస్త్రసమ్మత ముగా నుండునట్లు కార్యము నిర్వహింపదగును.



# దీక్షాగ్నినష్టప్రాయశ్చిత్తహోమః

(ఉపనయనవివాహములను ఒకనాటి ప్రమాణములో ముగించుచున్న ఈకాలములో తన్నిమిత్తమై పరికల్పించిన అగ్ని నష్టమగుట సంభవము కాకపోవచ్చును. ఐనను, ఒక వేళ ఇది నష్టమైనచో చేయవలసిన కర్తవ్యము ఈ అధ్యాయములో చెప్పబడుచున్నది. ముందుగా కొన్ని నియమములు:

1. వివాహములో గృహ్యాగ్ని ప్రతిష్ఠింపబడిన తర్వాత ఆ అగ్ని ఔపాసనారంభమునకు పూర్వమెప్పుడైనను నశించినచో, అంకురారోపణ, ప్రతిసరబంధ, వరప్రేషణాదులను విడిచిపెట్టి, క్రియ చేయకుండ లాజహోమపర్యంతము గల మంత్రముల నన్నిటిని చదివి (అనగా 'అభ్రాతృఘ్నీం' అను మంత్రమునుండి 'అతిగాహే మహిద్విషః' అను మంత్రము వరకు చదివి), అగ్ని పునస్సంధానము చేసి మిగితా కార్యములను యథాశాస్త్రముగా చేసికొనవలెను.
2. వివాహములో ప్రతిష్ఠింపబడిన అగ్ని ప్రధానహోమమునకుగాని, పాణిగ్రహణము నకుగాని ముందెప్పుడైనను నశించినచో, అంకురారోపణ, ప్రతిసరబంధ, వరప్రేషణా దులను విడిచి, క్రియ చేయకుండ ప్రధానహోమమునకు ముందుగల మంత్రముల నన్నిటిని చదివి (అనగా 'అభ్రాతృఘ్నీం' అను మంత్రమునుండి 'వశినీ త్వం విదథ మావదాసి' అను మంత్రమువరకు చదివి), అదే భస్మము మీద పునరగ్నిపరికల్పన చేసి ప్రధానహోమాదికార్యములను యథాశాస్త్రముగా చేసికొనవలెను.
3. వివాహములో ఔపాసనానంతరము శేషహోమాత్పూర్వము అగ్ని నష్టమైనచో నిచ్చట చెప్పినట్లుగా అగ్నినష్టప్రాయశ్చిత్తహోమమును చేసికొని అందులో మిగిలిన హోమముల నన్నిటిని యథాశాస్త్రముగ చేసికొనవలెను.
4. శేషహోమము, ఆత్మసమారోణము జరిగిన తర్వాత ఔపాసనాగ్ని నష్టమైనచో దంపతులు విచ్ఛిన్నాగ్నిసంధానము చేసికొని అందులో రోజువారీ ఔపాసనాదులను చేసికొనవలెను.
5. ఉపనయనములో వటువుయొక్క ప్రాతస్సమిదాధానానంతరము అగ్న్యుద్వాసనకు లోగ వటుదీక్షాకాలములో దీక్షాగ్ని నష్టమైనచో నిచ్చట చెప్పినట్లుగ అగ్నినష్టప్రాయ

శ్చిత్తహోమమును చేసికొని అందులో మిగిలిన హోమముల నన్నిటిని యథాశాస్త్ర ముగ చేసికొనవలెను.

6. ఉపనయనములో సమిధాధానమునకు ముందగ్ని నష్టమైనచో, ఆబూడిదలోనే పున రగ్నికల్పనము చేసి కావలసిన హోమాదులను చేసికొనవచ్చును.)

## ప్రయోగః

[576]యది దీక్షాగ్ని నష్టస్స్యాత్ తదా అగ్నినష్టప్రాయశ్చిత్తం కుర్యాత్. తత్ప్రయోగః– వధూవరౌ (అథవా వటుః) హోమస్థలం ప్రాప్య, వరః (వటుః) ద్విః ప్రాణానాయమ్య, *‘శ్రీగోవింద గోవింద---శుభతిథౌ, శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం వివాహాగ్ని (ఉపనయనాగ్ని )నష్టప్రాయశ్చిత్తహోమం కరిష్యే*"- ఇతి సంకల్ప్య, లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య,

---

[576]వివాహములోగాని, ఉపనయనములోగాని దీక్షాగ్ని నష్టమైనచో చతుష్పాత్రప్రయోగవిధానముతో లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అందులో అగ్నినష్టప్రాయశ్చిత్తహోమమును చేయవలెను. దీని ప్రయోగ మిట్లున్నది: వధూవరులు (లేక వటువు) హోమస్థలమునకు వచ్చి, వరుడు (లేక వటువు) రెండుసార్లు ప్రాణాయామము చేసి, *‘శ్రీగోవింద గోవింద---శుభతిథౌ, శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం భగవత్కైంకర్యరూపం వివాహాగ్ని (ఉపనయనాగ్ని ) నష్టప్రాయశ్చిత్తహోమం కరిష్యే* "-అని గీతలుంచిన చోట ప్రధానసంకల్పములో చెప్పవలసిన దేశ కాలములను చెప్పుచు సంకల్పించి, చతుష్పాత్రప్రయోగవిధానముతో లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, *"అపహతా అసురా", "శన్నో దేవీరభిష్టయ"* అను రెండుమంత్రములతో నష్టాగ్నిభస్మమును నీటిచే ప్రోక్షించి, *"అయం తే యోనిః"*- అను మంత్రముతో ఆ భస్మమునందొక సమిధనుంచి, పిదప "*అజుహ్వానస్సుప్రతీకః", "ఉద్బుధ్యస్వాగ్నే "* అను రెండుమంత్రములతో లౌకికాగ్నిలోనా భస్మసహితమైన సమిధను చేర్చి, అగ్నిపరిస్తరణము, దర్వ్యాజ్యసంస్కారము, పరిషేచనాంతముగ చేసి (వివరములకు చతుష్పాత్రప్రయోగమును చూచునది),"*అయాశ్చాగ్నే "* ఇత్యాది 31మంత్రములతో స్రుక్కుతో చతుర్గృహీతాజ్యముతో ఆజ్యహోమమును చేసి, తరువాత స్రువములోనికి ఒకసారి మాత్రమే నేతిని తీసికొనుచు అనాజ్ఞాతహోమమును చేసి, ఉత్తర పరిషేచనము చేసి, ఆ యగ్నిలోనే శాస్త్రోక్తవిధముగా వివాహాంగ (లేదా ఉపనయనాంగ) హోమములను చేయవలెను.

1. *అపహతా అసురా రక్షాగ్ంసి పిశాచా యే క్షయన్తి పృథివీ మను। అన్యత్రేతో గచ్ఛన్తు యత్రైషాం గతం మనః।*
2. *శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శం యోరభిస్రవన్తు నః।"*

   - ఇతి ద్వాభ్యాం కూర్చేన భస్మమద్భిః ప్రోక్ష్య,

   *"అయం తే యోనిర్ ఋత్వియో యతో జాతో అరోచథాః। తం జానన్నగ్న ఆరోహా ఽథా నో వర్ధయా రయిమ్।"* (తై.సం.4.7.13.28)

   - ఇతి సమిధయా సహ తద్భస్మ ఆదాయ, లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య,

1. *ఆజుహ్వానస్సుప్రతీకః పురస్తాదగ్నే స్వాం యోని మాసీదసాధ్యా। అస్మిన్థ్సధస్థే అధ్యుత్తరస్మిన్విశ్వేదేవా యజమానశ్చసీదత।* (తై.సం.4.7.13)
2. *ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యేనమిష్టాపూర్తే సగ్ంసృజేథామయం చ। పునః కృణ్వగ్గ్ స్త్వాపితరం యువానమన్వాతాగ్ంసీత్త్వయి తన్తుమేతమ్।*

-ఇతి లౌకికాగ్నౌ భస్మసహితం తత్సమిధమాదాయ, అగ్నిం పరిస్తీర్య, ఆజ్యం దర్వీం చ సంస్కృత్య, పరిషిచ్య, ఏకం, ద్వే, త్రీణి, చత్వారి - ఇతి చతుర్గృహీతాజ్యేన జుహోతి:

1. *అయాశ్చాగ్నే ఽస్యనభిశస్తీశ్చ సత్యమిత్త్వమయా అసి। అయసా మనసా ధృతో ఽయసా హవ్యమూహిషే ఽయా నో ధేహి భేషజగ్గ్ స్వాహా। అగ్నయే అయస ఇదం నమమ।* (తై.మం.పా.1.5)
2. *అగ్నిర్ హోతా। అశ్వినా ఽధ్వర్యూ। త్వష్టా ఽగ్నీత్। మిత్ర ఉపవక్తా। సోమస్సోమస్య పురోగాః। శుక్రశ్శుక్రస్య పురోగాః। శ్రాతాస్త ఇన్ద్ర సోమాః। వాతాపేర్ హవనశ్రుత స్వాహా। అగ్నయ ఇదం నమమ।* (తై.ఆ.3.3)
3. *బ్రాహ్మణ ఏకహోతా। స యజ్ఞః। స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః। యజ్ఞశ్చ మే భూయాత్స్వాహా। బ్రాహ్మణాయ ఇదం నమమ।* (తై.ఆ.3.7)
4. *అగ్నిర్ద్విహోతా। స భర్తా। స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః। భర్తా చ మే భూయాత్స్వాహా। అగ్నయ ఇదం న మమ।* (తై.ఆ.3.7)

5. పృథివీ త్రిహోతా/ స ప్రతిష్ఠా/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ ప్రతిష్ఠా చ మే భూయాత్స్వాహా/ పృథివ్యా ఇదం న మమ/ (తై.ఆ.3.7)
6. అన్తరిక్షం చతుర్హోతా/ స విష్ఠాః/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ విష్ఠాశ్చ మే భూయాత్స్వాహా/ అన్తరిక్షాయేదం న మమ/ (తై.ఆ.3.8)
7. వాయుః పఞ్చహోతా/ స ప్రాణః/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ ప్రాణశ్చ మే భూయాత్స్వాహా/ వాయవ ఇదం న మమ/ (తై.ఆ.3.8)
8. చన్ద్రమాష్షడ్ఢోతా/ స ఋతూన్కల్పయాతి/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ ఋతవశ్చ మే కల్పన్తాగ్ స్వాహా/ చన్ద్రమస ఇదం న మమ/ (తై.ఆ.3.9)
9. అన్నగ్ం సప్తహోతా/ స ప్రాణస్య ప్రాణః/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ ప్రాణస్య చ మే ప్రాణో భూయాత్స్వాహా/ అన్నాయేదం న మమ/
10. ద్యౌరష్టహోతా/ సోఽనాధృష్యః/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ అనాధృష్యశ్చ భూయాసగ్ స్వాహా/ దివ ఇదం న మమ/ (తై.ఆ.3.9)
11. ఆదిత్యో నవహోతా/ స తేజస్వీ/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ తేజస్వీ చ భూయాసగ్ స్వాహా/ ఆదిత్యాయేదం న మమ/ (తై.ఆ.3.10)
12. ప్రజాపతిర్దశహోతా/ స ఇదగ్ం సర్వమ్/ స మే దదాతు ప్రజాం పశూన్పుష్టిం యశః/ సర్వం చ మే భూయాత్స్వాహా/ ప్రజాపతయేదం న మమ/ (తై.ఆ.3.10)
13. మనో జ్యోతిర్జుషతామాజ్యం విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమం దధాతు/ యా ఇష్టా ఉషసో నిమ్రుచశ్చ తాస్సందధామి హవిషా ఘృతేన స్వాహా/ మనసే జ్యోతిష ఇదం న మమ/
14. యన్మ ఆత్మనో మిన్దాఽభూదగ్నిస్తత్పునరాహార్జాతవేదా విచర్షణిస్స్వాహా/ మిన్దాదిభ్యో దేవతాభ్య ఇదం న మమ/
15. పునరగ్నిశ్చక్షురదాత్ పునరిన్ద్రో బృహస్పతిః/ పునర్మే అశ్వినా యువం చక్షురాధత్తమక్ష్యోస్స్వాహా/ అగ్నీన్ద్రబృహస్పత్యశ్విభ్య ఇదం న మమ/
16. తన్తుం తన్వన్రజసో భానుమన్విహి జ్యోతిష్మతః పథో రక్ష ధియా కృతాన్/

అనుల్బణం వయత జోగువామపో మనుర్భవ జనయా దైవ్యం జనగ్ం స్వాహా। అగ్నయే తన్తుమత ఇదం న మమ।

17. భూరగ్నయే పృథివ్యై స్వాహా। అగ్నయే పృథివ్యా ఇదం న మమ।
18. భువో వాయవేఽన్తరిక్షాయ స్వాహా। వాయవేంతరిక్షాయేదం న మమ।
19. సువరాదిత్యాయ దివే స్వాహా। ఆదిత్యాయ దివ ఇదం న మమ।
20. భూర్భువస్సువశ్చంద్రమసే దిగ్భ్య స్స్వాహా। చంద్రమసే దిగ్భ్య ఇదం న మమ।
21. భూరన్నమగ్నయే పృథివ్యై స్వాహా। అగ్నయే పృథివ్యా ఇదం న మమ।
22. భువోన్నం వాయవేఽన్తరిక్షాయ స్వాహా। వాయవేఽన్తరిక్షాయేదం న మమ।
23. సువరన్నమాదిత్యాయ దివే స్వాహా। ఆదిత్యాయ ఇదం న మమ।
24. భూర్భువస్సువరన్నం చంద్రమసే దిగ్భ్యస్స్వాహా। చంద్రమస దిగ్భ్య ఇదంన మమ।
25. భూరగ్నయే చ పృథివ్యై చ మహతే చ స్వాహా। అగ్నయే పృథివ్యై చ మహత ఇదం న మమ।
26. భువో వాయవే చాన్తరిక్షాయ చ మహతే చ స్వాహా। వాయవ్యన్తరిక్షాయ మహత ఇదం న మమ।
27. సువరాదిత్యాయ చ దివే చ మహతే చ స్వాహా। ఆదిత్యాయ దివే మహత ఇదం న మమ।
28. భూర్భువస్సువశ్చంద్రమసే చ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతే చ స్వాహా। చంద్రమసే నక్షత్రేభ్యో దిగ్భ్యో మహత ఇదం న మమ।
29. ఓం భూస్స్వాహా। అగ్నయ ఇదం న మమ।
30. ఓం భువస్స్వాహా। వాయవ ఇదం న మమ।
31. ఓగ్ం సువస్స్వాహా। సూర్యాయేదం న మమ।
32. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం న మమ।

ప్రాణానాయమ్య, 'అస్మిన్ దీక్షాగ్నినష్టప్రాయశ్చిత్తహోమకర్మణి జ్ఞాతాజ్ఞాతాది

*సకలదోషనిర్హరణార్థం అనాజ్ఞాహుతీర్హోష్యే'* – ఇతి సంకల్ప్య, స్రువేణ సకృద్గృహీతే నాజ్యేన జుహోతి:

32. *అనాజ్ఞాతం యదాజ్ఞాతమ్। యజ్ఞస్య క్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ంం హి వేత్థ యథా తథగ్గ్ స్వాహా। అగ్నయ ఇదం న మమ।*
33. *పురుషసమ్మితో యజ్ఞః। యజ్ఞః పురుషసమ్మితః। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ంం హి వేత్థ యథా తథగ్గ్ స్వాహా। అగ్నయ ఇదం న మమ।*
34. *యత్పాకత్రా మనసా దీనదక్షాన। యజ్ఞస్య మన్వతే మర్త్తాసః। అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్। యజిష్ఠో దేవాగ్ంం ఋతుశో యజాతి స్వాహా। అగ్నయ ఇదం న మమ।*
35. *శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం న మమ।*

- ఇతి హుత్వా, ఉత్తరపరిషేచనం కృత్వా, తస్మిన్నగ్నౌ శేషవివాహాంగహోమాన్ (శేషోపనయనాంగహోమాన్వా) యథాశాస్త్రం కుర్యాత్.



# గర్భాధానప్రయోగః

(పూర్వము కన్య రజస్వల కాక మునుపే వివాహముచేసి, ఆమె రజస్వలయైన పిదప రజోదర్శనాది నాల్గు రాత్రులను విడిచిపెట్టి, తరువాతి 12 రాత్రులలో ఏదో యొక శుభ ముహూర్తమున వధూవరుల సమావేశనార్థము గర్భాధానకర్మను జరిపెడివారు. కాని ఈకాలములో కన్య రజస్వలయైన తర్వాత అనేకసంవత్సరముల కామెకు వివాహము జరుగుచుండుటచే, వివాహములోనే శేషహోమానంతరము సమావేశనమంత్రములను పఠించి అదియే గర్భాధానముగా పరిగణించుచున్నారు. అందుచేత ఈకాలములో తదితరమైన గర్భాధానకర్మతో అవసరమే కన్పించుట లేదు. వస్తుతః ఇదియే సామాన్యముగా జరుగుచున్నది. ఐనను గర్భాధానము షోడశసంస్కారములలో ప్రప్రథమ సంస్కారముగా పేర్కొనబడుటచేతను, ఎవరైన ప్రత్యేకముగా దీనిని చేసికొనదలచిన యెడల వారి కుపయోగపడునను తలంపుచేతను, ఇచ్చట గర్భాధానప్రయోగ మీయబడుచున్నది.)

[577]స్త్రీణాం రజోదర్శనాది షోడశరాత్రిషు ఆదౌ చతస్రో రాత్రీః పరిహాప్య, అన్యాసు ద్వాదశాసు రాత్రిషు శుభముహూర్తే ఋతుసమావేశనం కుర్యాత్। తత్ప్రకారః।

**పరిషదనుజ్ఞా:** [578]గర్భాదానదినే విచ్ఛిన్నాగ్నిసంధానం, ఔపాసనంచ కృత్వా, సాయంకాలే వధూవరౌ స్నాత్వా, శుభముహూర్తాత్పూర్వమేవ శుభవేదికాం ప్రాప్య, వరః హరిద్రాక్షతపాత్రం హస్తే గృహీత్వా, ప్రాఙ్ముఖస్తిష్ఠన్, 'ఓం నమస్సదసే' ఇత్యను

---

[577] స్త్రీణాం=స్త్రీలకు, రజోదర్శనాది షోడశసురాత్రిషు=రజోదర్శనమైనది మొదలుకొని 16 రాత్రులందు, ఆదౌ చతస్రో రాత్రీః పరిహాప్య=తొలి నాల్గురాత్రులను విడిచిపెట్టి, అన్యాసు ద్వాదశాసు రాత్రిషు=మిగిలిన 12 రాత్రులందు (ఏకాదశీత్రయోదశులను మినహాయించి), శుభముహూర్తే=ఒకానొక శుభముహూర్తమున, ఋతుసమావేశనం కుర్యాత్=గర్భాధానకర్మను చేయవలెను.

[578] గర్భాధానదినమందు పగలు విచ్ఛిన్నాగ్నిసంధానమును, ఔపాసనమును చేసికొని, వధూవరులు సాయంకాలము స్నానము చేసి, శుభముహూర్తమునకు ముందుగానే శుభవేదిక కడకు రావలెను. అచ్చట వధువు తన కుడికి ఉండునట్లుగా తూర్పుముఖముగా నిలబడి, వరుడు

వాకముక్త్వా, *'సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః। స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం దక్షిణాం యత్కించిదపి యథోక్తదక్షిణామివ స్వీకృత్య అస్మిన్దినే గర్భాధానకర్మారంభముహూర్త స్సుముహూర్తోఽస్తు। ఉత్తరే కర్మణ్య విఘ్నమస్త్వితి భవంతో మహాన్తోనుగృహ్ణన్తు।'* ఇతి ప్రార్థ్య పారిషదం నమస్కృత్య, *'సుముహూర్తోఽస్తు। ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు'* ఇత్యనుజ్ఞాప్య,

**సంకల్పః, విష్వక్సేనారాధనం చ:** [579]ప్రాణానాయమ్య, *'శ్రీగోవింద గోవింద గోవింద– అస్య శ్రీ భగవతో మహాపురుషస్య శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వన్తరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్త-మాన వ్యావహారిక ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే .......నామ సంవత్సరే ....... అయనే .......ఋతౌ .......మాసే ....... పక్షే .......తిథౌ .......వాసరయుక్తాయాం ...... నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణవిశేషణవిశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థంభగవత్కైంకర్యరూపం మయా ధర్మపత్న్యా సహ గర్భాధానకర్మ కరిష్యమాణః తత్కర్మనిర్విఘ్నపరి-సమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్య'* - ఇతి సంకల్ప్య విష్వక్సేనారాధనం కుర్యాత్।

**కర్మణః పుణ్యాహవాచనమ్:** [580] పునః ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణ*

---

హరిద్రాక్షతపాత్రమును పట్టుకొని, 'నమస్సదసే' అను మంత్రమును చదివి, 'సర్వేభ్య శ్శ్రీవైష్ణ-వేభ్యో నమః। గర్భాధానముహూర్త ---మహాన్తోనుగృహ్ణన్తు' – అని పరిషత్తును ప్రార్థించి, 'ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు' అని పరిషదనుజ్ఞను పొంది,

[579] అచ్చట వధువు తన కుడికి ఉండునట్లుగా వధువుతో సహ తూర్పుముఖముగా కూర్చుండి, ప్రాణాయామము చేసి,'శ్రీగోవిందగోవింద---గర్భాధానకర్మ కరిష్యమాణః తత్కర్మనిర్విఘ్న పరిసమాప్త్యర్థమాదౌ విష్వక్సేనారాధనం కరిష్య' అని సంకల్పించి,'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా ముందుగ విష్వక్సేనారాధనను చేయవలెను.

[580]మఱల ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త---కర్మణః పుణ్యాహవాచనం కరిష్య' అని సంక

*విశిష్టాయామస్యాం శుభతిథౌ మమ ధర్మపత్న్యా సహ కరిష్యమాణ గర్భాధాన కర్మాంగత్వేన కర్మణః పుణ్యాహవాచనం కరిష్య'* –ఇతి సంకల్ప్య కర్మణః పుణ్యాహ వాచనం కృత్వా, పుణ్యాహజలేనాత్మానం వధూం చ ప్రోక్షయేత్।

**నూతనవస్త్రధారణమ్:** [581]అథ వధూవరౌ శ్వశురదత్తనవవస్త్రాణి ధృత్వాచమేత్।

మం॥ అర్చ్చత ప్రార్చ్చత। సుమంగలీరియం వధూ రిమాగ్ం సమేత పశ్యత।

సౌభాగ్యమస్మై దత్వా యాథాస్తం విపరేతన। (ఇతి వధ్వాః)

మం॥ అర్చ్చత ప్రార్చ్చత। యువం వస్త్రాణి పీవసా వసాథే। యువో రచ్ఛిద్రామన్తవో హ సర్గాః। అవాతిరతమనృతాని విశ్వా। ఋతేన మిత్రావరుణా సచేథే।

(తై.బ్రా.2.8.6)। (ఇతి వరస్య। మంత్రముచ్చార్య తత్తద్దాతృనామ వదేత్।)

**సమావేశనమంత్రజపః:** [582]వధూవరౌ పూర్వవదుపవిశ్య, వరః ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ----గోత్రాం---నామ్నీం మమ ధర్మపత్నీం గర్భాధానేన కర్మణా సంస్కరిష్యామి'* – ఇతి సంకల్ప్య, ఏకస్మిన్

---

ల్పించి,'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా కర్మణః పుణ్యాహవాచనము చేసి, పుణ్యజలముచే తనను ప్రోక్షించుకొని, వధువును ప్రోక్షింపవలెను.

[581]తర్వాత వధూవరులు అత్తగార లిచ్చిన నవవస్త్రములను కట్టుకొని వచ్చి పీటలపై కూర్చొని ఆచమనము చేయవలెను. వధువున కీవస్త్రములను 'సుమంగలీరియం' అను మంత్రముతోను, వరునకు 'యువం వస్త్రాణి' అను మంత్రముతోను ఈయవలెను. వస్త్రముల నిచ్చిన తర్వాత వస్త్ర దాతలపేరును, ఉదాహరణకు 'శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య శ్రీమాన్ రామాచార్యులవారు గర్భాధానసుముహూర్తమున తమ అల్లునకు సమర్పించు నూతనవస్త్రములు' –ఇత్యాదిగా చెప్పవలెను.

[582]అప్పుడు వరుడు ప్రాణాయామము చేసి, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం శుభతిథౌ----గోత్రాం---నామ్నీం మమ ధర్మపత్నీం గర్భాధానేన కర్మణా సంస్కరిష్యామి'* – అని తన గోత్రమును, వధువునామమును చెప్పుచు సంకల్పము చేసి, ఒకపాత్రలో నారికేళకద ళ్యాదిఫలములను, తాంబూలమును, దక్షిణను పెట్టుకొని, దంపతులు పరస్పరము తాకుచు

పాత్రే నారికేళకదళ్యాదిఫలతాంబూలదక్షిణాదీని నిక్షిప్య, అన్వారబ్ధౌ ఉభౌ తత్పాత్రం గృహీత్వా , సమావేశనమంత్రాన్ జపేత్।

## సమావేశనమంత్రాః

మం॥ ఆరోహోరుముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాగ్ం సుమనస్యమానః। తస్యాం పుష్యతం మిథునౌ సయోనీ బహ్వీం ప్రజాం జనయన్తౌసరేతసా। ఆర్ద్రయాఽరణ్యా యత్రామన్థత్పురుషం పురుషేణ శక్రః। తదేతౌ మిథునౌ సయోనీ ప్రజయాఽమృతేనేహ గచ్ఛతమ్। అహం గర్భమదధామోషధీష్వహం విశ్వేషు భువనేష్వన్తః। అహం ప్రజా అజనయం పితౄణామహం జనిభ్యో అపరీషు పుత్రాన్। పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతమ్। ఉభా హిరణ్యపేశసా వీతిహోత్రా కృతద్వసూ। దశస్యంత్వాఽమృతాయ కగ్ం శమూధో రోమశగ్ం హథో దేవేషు కృణుతో దువః॥౧॥

విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పిగ్ంశతు। ఆసిఞ్చతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే। గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి। గర్భం తే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కరస్రజా। హిరణ్యయీ అరణీయం నిర్మన్థతో అశ్వినా। తం తే గర్భగ్ం హవామహే దశమే మాసి సూతవే। యథేయం పృథివీ మహీ తిష్ఠన్తీ గర్భమాదధే। ఏవం త్వం గర్భమాధత్స్వ దశమే మాసి సూతవే। యథా పృథివ్యగ్నిగర్భా ద్యౌర్యథేన్ద్రేణ గర్భిణీ। వాయుర్యథా దిశాం గర్భ ఏవం గర్భం దధామి తే। విష్ణోః శ్రేష్ఠేన రూపేణాస్యాం నార్యాం గవీన్యామ్। పుమాగ్ంసం గర్భమాధేహి దశమే మాసి సూతవే। నేజమేష పరాపత సపుత్రః

---

దగ్గరగా కూర్చుండి, ఆ తట్టను ఉభయులు కలిసి పట్టుకొనవలెను. అప్పుడు వరుడు 'ఆరోహోరు' ఇత్యాది సమావేశనమంత్రములను జపించవలెను.

పునరాపత। అస్యై మే పుత్రకామాయై గర్భమాధేహి యః పుమాన్। వ్యస్య
యోనిం ప్రతి రేతో గృహాణ పుమాన్పుత్రో ధీయతాం గర్భో అన్తః। తం మాతా
దశమాసో బిభర్తు స జాయతాం వీరతమస్స్వానామ్। ఆ తే గర్భో యోనిమేతు
పుమాన్ బాణ ఇవేషుధిమ్। ఆ వీరో జాయతాం పుత్రస్తే దశమాస్యః॥౨॥
కరోమి తే ప్రాజాపత్యమా గర్భో యోనిమేతు తే। అనూనః పూర్ణో జాయతామ-
శ్లోణోఽపిశాచధీతః। పుమాగ్ స్తే పుత్రో నారి తం పుమానను జాయతామ్। తాని
భద్రాణి బీజాన్యృషభా జనయన్తు నౌ। యాని భద్రాణి బీజాన్యృషభా జనయన్తి
నః। తైస్త్వం పుత్రాన్ విన్దస్వ సా ప్రసూర్ధేనుకా భవ। కామప్రమృధ్యతాం మహ్య-
మపరాజితమేవ మే। యం కామం కామయే దేవ తం మే వాయో సమర్ధయ॥3॥
[583]అథ వధూవరౌ బృహస్పతయే నమస్కారపూర్వకం తాని ఫలాని సమర్పయేత్।
బృహస్పతిస్సదస్యాశ్చ *'అయం సమావేశనముహూర్తస్సుముహూర్తోఽస్తు'*
ఇత్యుక్త్వా హరిద్రాక్షతైః వధూవరాభ్యా మాశీర్వచనం అనుగ్రహం కుర్యుః।

**ఫలదానమ్:**[584]తతో వరః ప్రాణానాయమ్య, *'పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశి
ష్టాయామస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం మమ*

---

[583]ఈమంత్రములు జపించిన పిదప వధూవరులు బృహస్పతికి ఫలదక్షిణాదుల నిచ్చి నమస్కరింపవలెను. అప్పుడు బృహస్పతి, సదస్యులు 'అయం సమావేశనముహూర్తస్సుముహూర్తోఽస్తు' అని చెప్పుచు దంపతులపై అక్షతలు వేసి దీవించవలెను.

[584]తర్వాత వరుడు ప్రాణాయామము చేసి, 'పూర్వోక్త---ఫలప్రదానాని కరిష్య' అని సంకల్పించి, 'యాః ఫలినీర్యా' అను మంత్రమును, 'ఫలం మనోరథఫలం' అను శ్లోకమును బృహస్పతి చదివిన వెనుక, 'ఇదం ఫలం—తుభ్యమహం సంప్రదదే న మమ' అను వాక్యమును చెప్పుచు బ్రాహ్మణులకు, లేదా దంపతులకు ఫలదక్షిణాతాంబూలముల నీయవలెను. వారు 'ఫలదానకల్పోక్తసకలఫలావాప్తిరస్తు' అని దంపతులను దీవించవలెను. తరువాత బ్రాహ్మణా

*ధర్మపత్న్యా సహ గర్భాధానకర్మ కరిష్యమాణః తదంగం ఆవయోః సత్సంతాన సిద్ధ్యర్థం యావచ్ఛక్తి ఫలప్రదానాని కరిష్య'* – ఇతి సంకల్ప్య , యథాశక్తి దంపతీభ్యః (బ్రాహ్మణేభ్యః) **'**యాః ఫలినీర్యే**'**తి ఫలదానం సమర్పయేత్।

మం॥ *యాః ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః।*

*బృహస్పతిప్రసూతా స్తానో ముఞ్చన్త్వగ్ం హసః॥*

శ్లో॥ *ఫలం మనోరథఫలం ప్రదదాతి సదా నృణామ్।*

*పుత్రపౌత్రపౌత్రాభివృద్ధిం చ శ్రియం పుష్టిం ప్రయచ్ఛ మే॥*

*ఇదం ఫలం సతామ్బూలం సదక్షిణాకం తుభ్యమహం సంప్రదదే న మమ॥*

ఏవం సర్వత్ర బ్రాహ్మణేభ్యః (దంపతీభ్యః) ఫలప్రదానాని దద్యాత్।

"*ఫలదానకల్పోక్త సకలఫలావాప్తిరస్తు।*" - ఇతి ప్రతివచనమ్।

అనంతరం బ్రాహ్మణాశీర్వాదం, సుమంగళీభిః మంగళగీతహారతిః। తద్రాత్రౌ భార్యా సంగమమ్।

**పరేద్యుః కర్తవ్యమ్:** [585]పరేద్యుః స్నాత్వా, ప్రాతఃకాలికనిత్యకర్మాణి ఔపాసనం చ కృత్వా, పత్న్యాసహ ప్రాణానాయమ్య, '*గర్భాధానకర్మాంగమభ్యుదయశ్రాద్ధం కరిష్య'* ఇతి సంకల్ప్య, హిరణ్యరూపేణాభ్యుదయశ్రాద్ధం కుర్యాత్। తతః పత్న్యా

---

శీర్వాదము, ముత్తైదువలచేత మంగళహారతి నిప్పించవలెను. తదనంతరము వధూవరు లారాత్రి సంగమించవలెను.

[585]మరునాడు వధూవరులు సుస్నాతులై, ప్రాతఃకాలికనిత్యకర్మలను, ఔపాసనమును చేసి, పత్నీయుతుడై వరుడు ప్రాణాయామము చేసి, 'గర్భాధానకర్మాంగ మభ్యుదయశ్రాద్ధం కరిష్య' అని సంకల్పించి 'నాందీప్రయోగః' అను అధ్యాయములో నిచ్చినట్లుగా హిరణ్య రూపకముగా నభ్యుదయశ్రాద్ధమును చేసి, పునఃప్రాణాయామము చేసి, 'గర్భాధానకర్మాంగం శుద్ధి పుణ్యాహం వాచయిష్య' అని సంకల్పించి, 'పుణ్యాహవాచనమ్' అను అధ్యాయములో నిచ్చినట్లుగా శుద్ధిపుణ్యాహమును చేసి, పుణ్యజలముచే తనను ప్రోక్షించుకొని, వధువునుకూడ ప్రోక్షించవలెను.

సహ పునః ప్రాణానాయమ్య ‘ *గర్భాధానకర్మాంగం శుద్ధి పుణ్యాహం వాచయిష్య’*
ఇతి సంకల్ప్య, శుద్ధిపుణ్యాహం కృత్వా, తజ్జలేన ఆత్మానం, వధూం చ ప్రోక్షయేత్।



# పుంసువనసీమంతోన్నయనమ్

(గర్భవతి యైన భార్యకు ఆమె ప్రసవించులోగా జేయు స్త్రీప్రధానమైన సంస్కారములు పుంసువనము, సీమంతోన్ననయనము (సీమంతము) అనునవి. ఇవి ప్రథమగర్భము నందు జేయు గర్భసంస్కారములు. అనగా తర్వాతిగర్భములకు వీనిని చేయనక్కఱ లేదని అర్థము. ఐనను కామ్యకర్మలుగా తర్వాతి గర్భములకు గూడ వీనిని చేసికొన వచ్చునని కొందఱు ప్రయోగకారుల అభిప్రాయము. పుంసువనమునే పుంసవన మనియు, పుగ్ంసువన మనియు వ్యవహరింతురు. గర్భిణియైన భార్యకు పురుషశిశు వును కలిగింపజేయుటకై చేయబడు సంస్కారము పుంసువనము. దీనికిని సీమంతమున కును కర్త భర్తయే. ఒకవేళ భర్త దేశాంతరగతుడో మృతుడో అయి సమక్షములో లేకున్న అతని సోదరుడో, గురుడో, జ్ఞాతి యో ఈకర్మను చేయవచ్చును. గర్భము స్పష్టమైన పైని రెండవ, లేక మూడవ, లేక నాల్గవ, లేక ఆఱవ నెల ప్రవేశింపగానే దీనిని చేయ వచ్చును. అట్లు గాకున్న నాల్గవ, లేదా ఆఱవ, లేదా ఎనిమిదవ నెలయందు చేయ వలసిన సీమంతముతోబాటు దీనిని చేయవచ్చునని శాస్త్రము. ఒకవేళ అట్లు చేసిన, ముందుగా పుంసువనము చేసి, తర్వాత సీమంతమును చేయవలసియుండును. ఒకవేళ వీనిని ప్రసవమునకు పూర్వమే చేసికొన లేకపోయినచో ప్రసవానంతరము జాతకర్మకు ముందుగా ప్రజాపత్యకృచ్ఛ్రమును, పాహిత్రయోదశహోమమును చేసి, శిశువును ఒడిలో నుంచుకొని వీనిని చేసికొని తదుపరి జాతకర్మను చేసికొనవలెనని శాస్త్రము.

ధర్మసింధువను ధర్మశాస్త్రము పుంసువనమునకు హితమైన కాలముల నిట్లు చెప్పు చున్నది: శుక్లపంచమినుండి కృష్ణపంచమిలోగా వచ్చు నవమి, చతుర్దశి, పున్నమ, చవితి తిథులను విడిచి, రవిమంగళగురువారములలో నొక దానితోగూడిన ఇతరతిథి ప్రశస్తము. సోమ,బుధ,శుక్రవారములుగూడ తగునని కొందరి మతము. పురుషనామక మైన నక్షత్రములు ప్రశస్తములు. అవి పుష్యమి, శ్రవణము, పునర్వసు, హస్త, మృగశిర, మూల, అభిజిత్తు, అనూరాధ, ఆశ్విని అనునవి. ఈతిథివారనక్షత్రములే సీమంతము నకుగూడ తగినవని ధర్మసింధువు చెప్పుచున్నది.

ఈకాలములో పలువురు పుంసువన,సీమంతములను కలిపియే ఒకేనాడు చేసికొను చున్నారు. ఈపద్ధతియే ఇచ్చట నీయబడుచున్నది. ఐనను ఇందులోని సంకల్పము లను కొంచెము మార్చి చెప్పిన ఈ సంస్కారములు రెండింటిని వేర్వేరుగా చేయు క్రమము సిద్ధించును. ఇట్లీ సంస్కారములను వేర్వేరుగా చేసికొనగోరువారికై యథావ సరముగా నిట్టి సంకల్పభేదములుసైత మీయబడుచున్నవి.)

## ప్రయోగః

**ఉదకశాన్తిః:** [586]పుంసువనదివసస్య పూర్వదినే వరః విచ్ఛినాగ్నిసంధానం, ఔపాసనం చ కృత్వా, తత్సాయంకాలే ఉదకశాన్తికర్మ కుర్యాత్। సంకల్పే *'శ్రీగోవింద---భగవ*

---

[586]పుంసువనము చేయుదినమునకు ముందుదినమున వరుడు విచ్ఛిన్నాగ్నిసంధానమును చేసి, ఔపాసనమును చేసి, ఆనాటిరాత్రి ఉదకశాన్తి చేసికొనవలెను. పుంసువనసీమంతములను ఔపాస నాగ్నిలోనే చేయవలెనను నియమముండుటచే ఇట్లు ఔపాసనాగ్నిపరికల్పనము చేసికొని, ఆ అగ్నిని రక్షించుకొనియో, ఆత్మసమారోపణము చేసికొనియో మరునాడు ఔపాసనాగ్నిలో పుంసువనసీమంతములను చేయవలెను. ఉదకశాన్తిసంకల్పములో 'శ్రీగోవింద' అని ప్రారంభించి 'భగవత్కైంకర్యరూపం' వఱకు యథాప్రకారము చెప్పి, అటుపైని 'మమ ధర్మపత్న్యాః గర్భ సంస్కారార్థం శ్వః కరిష్యమాణ పుంసువన (సీమంతోన్నయన) లగ్నసాద్గుణ్యార్థం, యేయే గ్రహాః అరిష్టస్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం శుభస్థానఫలావాప్త్యర్థం, యేయే గ్రహాః శుభ స్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం అతిశయఫలావాప్త్యర్థం, ఆదిత్యాదినవగ్రహాణాం శుభైకాదశ స్థానఫలావాప్త్యర్థం, సమస్తసన్మంగళావాప్త్యర్థం, ఏభిః శ్రీవైష్ణవైస్సహ బోధాయనోక్తప్రకారేణ ఉదకశాన్తికర్మ కరిష్యే' - అని చెప్పవలెను. ఇచ్చట పుంసువనసీమంతముల నేకకాలమున చేయ దలచినచో బ్రాకెట్లలో నిచ్చిన 'సీమంతోన్నయన' అను పదమును చేర్చి చెప్పవలెను. పుంసువన మును మాత్రమే చేయుచున్నచో ఈపదమును వదలిపెట్టవలెను. అట్లే పుంసువనమును చేయక సీమంతోన్నయనమును మాత్రమే చేయుచో, 'పుంసువన'పదమును వదలిపెట్టి, 'సీమంతో-న్నయన'పదమును మాత్రమే చెప్పవలెను. సర్వత్ర నిట్లే చేయవలెను. గమనిక: ఇచ్చట పుంసు వనసీమంతములయందు సమానముగా వచ్చు ఆనుషంగికకర్మలైన ఉదకశాన్తి, విష్వక్సేనా రాధన, ప్రతిసరబంధ, అభ్యుదయ, పుణ్యాహవాచనముల సంకల్పములు ఈరెండుకర్మలకు

*త్కైంకర్య రూపం మమ ధర్మ పత్న్యాః గర్భ సంస్కారార్థం శ్వః కరిష్యమాణ పుంసు-వన(సీమంతోన్న యన) లగ్న సాద్గుణ్యార్థం, యేయే గ్రహాః అరిష్టస్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం శుభస్థానఫలావాప్త్యర్థం, యేయే గ్రహాః శుభస్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం అతిశయఫలావాప్త్యర్థం,ఆదిత్యాదినవగ్రహాణాం శుభైకాదశస్థానఫలావాప్త్యర్థం,సమస్త సన్మంగళావాప్త్యర్థం,ఏభిః శ్రీవైష్ణవైస్సహ బోధాయనోక్తప్రకారేణోదకశాన్తికర్మ కరిష్యే'* – ఇతి వదేత్|

## ముహూర్తదినే కర్తవ్యమ్

**పరిషదనుజ్ఞా**: [587]వరః భార్యాయుతః ఔపాసనం వా,విచ్ఛిన్నాగ్నిసంధానౌపాసనే వా కృత్వా, '*అస్మిన్కాలే పుంసువన (సీమంతోన్న యన) కర్మారంభముహూర్త స్సుముహూర్తోఽస్తు| ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు*|' – ఇతి ప్రార్థ్య, '*తథాస్తు!సుముహూర్తోఽస్తు| ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్తు!*' – ఇతి పరిషదనుగ్రహం ప్రాప్య,

**విష్వక్సేనారాధనమ్**:[588]ప్రాణానాయమ్య, '*శ్రీగోవింద— భగవత్కైంకర్య రూపం---*

---

సమిష్టిగా వర్తించునట్లును, లేకున్న ఈరెంటిలో ఏదోయొక కర్మకు వర్తించునట్లును చెప్పుకొనుటకు వీలుగా వ్రాయబడినవి. అగ్నిసంధానము, హోమములు మాత్రము ఏకర్మ కాకర్మకే ప్రత్యేకముగా నీయబడినవి.

[587]వరుడు(భర్త) భార్యాసమేతముగా ముందురోజు పరికల్పించుకొని రక్షించుకొన్న ఔపాసాగ్నిలో గాని, లేక అప్పుడు పునస్సంధానము చేసికొన్న అగ్నిలోగాని ఔపాసనమును చేసికొని, మొదటి అధ్యాయములో చెప్పినట్లుగా '*నమస్సదసే*' అను మంత్రమును చదివి, '*పుంసువన (సీమంతోన్న యన) కర్మారంభముహూర్తస్సుముహూర్తోఽస్తు| ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు|*' – అని పరిషత్తును ప్రార్థించి, నమస్కరించి, '*తథాస్తు! సుముహూర్తోఽస్తు| ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్తు!*' – అని పరిషదనుగ్రహమును పొంది కర్మనారంభించవలెను.

[588]భర్త ప్రాణాయామము చేసి, 'శ్రీగోవింద' నుండి 'భగవత్కైంకర్యరూపం' అను పదము వఱకు మొదటి అధ్యాయములో నిచ్చినట్లుగా చెప్పి, ఆతర్వాత ' ---*గోత్రాయాః---నామ్న్యాః*

*గోత్రాయాః---నామ్న్యాః మమ ధర్మపత్న్యాః పుంసువన(సీమన్తోన్నయన)కర్మాఙ్గం తత్కర్మ నిర్విఘ్నపరిసమాప్త్యర్థం విష్వక్సేనారాధనం కరిష్యామి'* – ఇతి సంకల్ప్య, విష్వక్సేనారాధనం కుర్యాత్।

**ప్రతిసరబన్ధః:**[589] తతో వరః ప్రాణానాయమ్య, *'శ్రీగోవింద—భగవత్కైంకర్యరూపం --- గోత్రాయాః---నామ్న్యాః మమ ధర్మపత్న్యాః పుంసువన(సీమన్తోన్నయన)కర్మాఙ్గం ప్రతిసరబంధకర్మ కరిష్యామి'* – ఇతి సంకల్ప్య, ప్రతిసరబంధకర్మ కృత్వా పత్న్యాః వామ హస్తే 'బృహత్సామే'తి మంత్రేణ రక్షాసూత్రం బధ్నీయాత్। నాత్ర వరస్య రక్షా బన్ధనమ్।

**పుంసువనసంకల్పః:**[590] ప్రాణానాయమ్య, *'శ్రీగోవింద—భగవత్కైంకర్యరూపం---- గోత్రాం---నామ్నీమిమాం ధర్మపత్నీం గర్భిణీం ప్రథమగర్భసంస్కారద్వారా సర్వ*

---

*మమ ధర్మపత్న్యాః పుంసువన (సీమన్తోన్నయన) కర్మాంగం తత్కర్మ నిర్విఘ్నపరిసమాప్త్యర్థం విష్వక్సేనారాధనం కరిష్యామి'* – అని సంకల్పించి, 'విష్వక్సేనారాధనమ్' అను అధ్యాయములో చెప్పినట్లుగా విష్వక్సేనారాధనము చేయవలెను. ---గోత్రాయాః---నామ్న్యాః అని ఉన్నచోట వరుసగా తనగోత్రముపేరును, భార్యపేరును చెప్పవలెను.

[589] భర్త ప్రాణాయామము చేసి, 'శ్రీగోవింద' నుండి 'భగవత్కైంకర్యరూపం' అను పదమువఱకు మొదటి అధ్యాయములో నిచ్చినట్లుగా చెప్పి, ఆతర్వాత ' *---గోత్రాయాః---నామ్న్యాః మమ ధర్మపత్న్యాః పుంసువన (సీమన్తోన్నయన) కర్మాంగం ప్రతిసరబంధకర్మ కరిష్యామి'* – అని సంకల్పించి,'ప్రతిసరబంధప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా కర్మను చేసి, 'బృహత్సామ' అను మంత్రముతో భార్య ఎడమచేతికి రక్షాసూత్రమును కట్టవలెను. ఇచ్చట భర్తకు రక్షా సూత్రమును కట్టుకొనవలసిన అవసరము లేదు. సంకల్పములో ---గోత్రాయాః---నామ్న్యాః అని ఉన్నచోట వరుసగా తనగోత్రముపేరును, భార్యపేరును చెప్పవలెను. (కొందఱు పూర్తి ప్రతిసరబంధప్రయోగమును చేయక, లఘుమార్గముగా రక్షాసూత్రమునకు షోడశోపచారపూజ చేసి, 'బ్రహత్సామ' మంత్రముతో స్త్రీ ఎడమచేతికి కట్టుచున్నారు.)

[590] మఱల ప్రాణాయామము చేసి, *'శ్రీగోవింద'* నుండి *'భగవత్కైంకర్యరూపం'* అను పదము వఱకు మొదటి అధ్యాయములో నిచ్చినట్లుగా చెప్పి, ఆతర్వాత ' *---గోత్రాం---నామ్నీ మిమాం*

*గర్భసంస్కారార్థం పుంసువనేన కర్మణా సగ్‌స్కరిష్యామి'* – ఇతి సంకల్ప్య,

[591]సూ॥న్యగ్రోధస్య యా ప్రాచ్యుదీచీ వా శాఖా తతస్సవృషణాం శుంగామాహృత్య, సీమంతవదగ్నే రుపసమాధానాది।

[592]**ఆజ్యభాగః:** స్థండిలం కల్పయిత్వా, ఔపాసనాగ్నిం ప్రతిష్ఠాప్య, ఇత్యారభ్య షట్పాత్రప్రయోగక్రమేణ ఆజ్యభాగం కుర్వన్, పాత్రప్రయోగకాలే ప్రాగుదగ్వాశాఖా

---

*ధర్మపత్నీం గర్భిణీం ప్రథమగర్భసంస్కారద్వారా సర్వగర్భసంస్కారార్థం పుంసువనేన కర్మణా సగ్‌స్కరిష్యామి'* అని పుంసువనమునకై సంకల్పించవలెను. గమనిక:ఈసంకల్పము కేవలము పుంసువనమునకు మాత్రమే వర్తించునట్లు చెప్పబడినది.

[591]ఇచ్చట 'న్యగ్రోధస్య' అను సూత్రమున్నది. దీని యర్థము: న్యగ్రోధస్య=మఱ్ఱిచెట్టుయొక్క, ప్రాచ్యుదీచీ వా=తూర్పునకుగాని, ఉత్తరమునకుగాని, యా శాఖా=ఏకొమ్మగలదో, తతః= దానినుండి, సవృషణాం=వృషణాకారములో రెండు ఫలములుగల, శుంగాం=జానెడు పొడవు గల చిగురాకులతోగూడిన కొమ్మను, ఆహృత్య=తీసికొనివచ్చి, సీమంతవత్=సీమంతములో వలెనే, అగ్నేరుపసమాధానాది=అగ్నిపరికల్పనము మొదలుకొని ఉత్తరపరిషేచనాంతముగా చేయునది. ఇట్టికొమ్మను ముందే తెచ్చుకొని యుంచుకొనవలెను.

[592]స్థండిలమును పరికల్పించి, దానిపై ఔపాసనాగ్నిని ప్రతిష్ఠించి, 'షట్పాత్రప్రయోగః' అను అధ్యాయములో చెప్పినట్లుగా, పరిధులను వేయుచు ఆజ్యభాగమును చేయవలెను. పాత్రా సాదన చేయునపుడు పైసూత్రములో చెప్పిన మఱ్ఱికొమ్మను, ఒక చిన్న తెల్లని క్రొత్తబట్టను, కల్వ మును, కల్వపుగుండును అన్నిటి నొకేసారి తీసికొని అగ్నికి ఉత్తరమున నుంచవలెను. ఇట్లు చక్షుర్హోమాంతము చేసి, భార్య తనను తాకుచుండగా క్రింద నిచ్చిన 8మంత్రములతో ప్రధాన దర్వీతో ఆజ్యాహుతులను చేయవలెను. ఇచ్చట వేయవలసిన పరిధులను, అదనముగా నుంచ వలసిన వటశుంగాది మనుష్యపాత్రలనుగుఱించి బ్రాకెట్లలో నిచ్చినరెండుకారికలున్నవి.'పుంసు వనములో ఆజ్యభాగమును చేయవలెను. ఇందులో లేపకార్యము లేదు. పరిధులనగ్నిలో దహింప వలెను. అగ్నిముఖాంతమున పరిధ్యంజనము చేసి, లేపకార్యము చేయకుండ పరిధుల నగ్నిలో పడవేయవలెను' – అని మొదటికారికకును, 'ఫలద్వయముతో కూడిన చిగురులుగల మఱ్ఱి కొమ్మను, దృషత్పుతౌ– అనగా కల్వమును, కల్వపుగుండును, ఒక తెల్లని క్రొత్తబట్టను - వీటి నన్నిటి నొకేసారి తీసికొని (అగ్నికి ఉత్తరమున) ఉంచవలెను' – అని రెండవకారికకును అర్థము.

జాతం ఫలద్వయసంయుక్తం వటశుంగాం, నవవస్త్రం, దృషత్పుత్రద్వయం చ సకృదేవ సాదయిత్వా, పరిధీం నిధాయ, ఆజ్యభాగాన్తే పత్న్యాన్వారబ్ధాయాం స్రుచా 'ధాతా దదాతు నో రయి' మిత్యాద్యష్టభి రాజ్యహోమం కుర్యాత్।

(అత్ర కారికాః:

శ్లో॥ పుంసవేప్యాజ్యభాగం స్యాన్నలేపః పరిధిం దహేత్।
ముఖాంతే యత్ర లేపస్స్యాత్పరిధిప్రహరణం తథా॥౧॥

శ్లో॥ ఫలద్వయేన సంయుతం వటాంకురం దృషత్సుతౌ।
సుపావనం చ వస్త్రకం క్షిపే త్సహైవ పుంసవే॥౨॥)

## ప్రధానహోమమంత్రాః

1. *ధాతా దదాతు నో రయిమీశానో జగతస్పతిః। స నః పూర్ణేన వావనత్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥* (తై.సం.3.3.11.34)
2. *ధాతా ప్రజాయా ఉత రాయ ఈశే ధాతేదం విశ్వం భువనం జజాన। ధాతా పుత్రం యజమానాయ దాతా తస్మా ఉ హవ్యం ఘృతవద్విధేమ స్వాహా। ధాత్ర ఇదం న మమ॥* (తై.సం.3.3.11.34)
3. *ధాతా దదాతు నో రయిం ప్రాచీం జీవాతుమక్షితామ్। వయం దేవస్య ధీమహి సుమతిగ్ం సత్యరాధసస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥*(తై.సం.3.3.11.34)
4. *ధాతా దదాతు దాశుషే వసూని ప్రజాకామాయ మీఢుషే దురోణే। తస్మై దేవా అమృతాస్సంవ్యయన్తాం విశ్వే దేవాసో అదితిస్సజోషాస్స్వాహా। ధాత్ర ఇదం న మమ॥* (తై.సం.3.3.11.34)
5. *యస్త్వా హృదా కీరిణా మన్యమానోఽమర్త్యం మర్త్యో జోహవీమి। జాతవేదో యశో అస్మాసు ధేహి ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యాగ్ స్వాహా। అగ్నయే జాతవేదస ఇదం న మమ॥* (తై.సం.1.4.46.52)
6. *యస్మై త్వగ్ం సుకృతే జాతవేద ఉ లోకమగ్నే కృణవస్స్యోనమ్। అశ్వినగ్ం స పుత్రిణం వీరవన్తం గోమన్తగ్ం రయిం నశతే స్వస్తి స్వాహా। అగ్నయే జాతవేదస ఇదం న మమ॥* (తై.సం.1.4.46.52)

7. *త్వే సుపుత్ర శవసోఽవృత్రన్కామకాతయః। న త్వామింద్రాతిరిచ్యతే స్వాహా। ఇంద్రాయ పుత్రిణ ఇదం న మమ॥* (తై.సం.1.4.46.52)

8. *ఉక్థఉక్థే సోమ ఇంద్రం మమాద నీథేనీథే మఘవానగ్ం సుతాసః। యదీగ్ం సబాధః పితరం న పుత్రాస్సమానదక్షా అవసే హవన్తే స్వాహా। ఇంద్రాయ మఘవత ఇదం న మమ॥* (తై.సం.1.4.46.52&53)

[593]ఇతి హుత్వా, ఇధ్మసన్నహనాన్యద్భిః సగ్ంస్పృశ్యాగ్నౌ ప్రహృత్యాప ఉపస్పృశ్య, అనన్వారబ్ధో జయాదిసౌవిష్టకృత్యన్తం హుత్వా, ఆజ్యాభ్యక్తాన్ పరిధీన్ ప్రహృత్య, దర్వ్యైకయా సంస్రావహోమం కృత్వా, ప్రాయశ్చిత్తాహుతీశ్చ హుత్వా, అగ్నిం పరిషిచ్య, ప్రణీతా విమోక్ష్య, బ్రహ్మవిసర్జనం కుర్యాత్।

**నూతనవస్త్రధారణమ్:** [594]అథ శ్వశురౌ వధూవరాభ్యాం నవవస్త్రాణి యచ్ఛతః। వరస్తాన్ ధృత్వాఽఽచమ్యాగచ్ఛతి। వధూస్తద్వస్త్రముత్తరీయవత్ పరిదధాతి।

మం॥ అర్చత ప్రార్చత। సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత। సౌభాగ్యమస్యై దత్వా యాథాస్తం విపరేతన। (ఇతి వధ్వాః)

---

[593]పై ఎనిమిది మంత్రములతో హోమము చేసి, భార్య తనను తాకక యుండగా, ఇధ్మములకు కట్టిన దర్భత్రాటిని నీటిలో దడిపి అగ్నిలో వేసి, ప్రోక్షణిలోని నీరు ముట్టి, షట్పాత్రప్రయోగములో నిచ్చినట్లుగా జయాదులను, స్విష్టకృద్ధోమాంతముగ చేసి, పరిధ్యంజనము, పరిధిప్రహరణమును చేసి, సంస్రావహోమం, ప్రాయశ్చిత్తహోమం, ప్రణీతామోక్షణం, బ్రహ్మవిసర్జనము చేయవలెను. గమనిక: ఇచ్చట సంస్రావహోమము నొకేదర్వీతో చేయవలెను.

[594]తర్వాత వధువుయొక్క పితరులుగాని, తత్సమానులు గాని దంపతులకు నూతనవస్త్రములనీయవలెను. వరుడప్పుడే ఆనూతనవస్త్రములను కట్టుకొని, ఆచమనము చేసి వచ్చి పీటలపై కూర్చొనవలెను. వధువు వారిచ్చిన చీరను ఊర్ధ్వకాయముపై చుట్టుకొని కూర్చొనవలెను. వధువున కీవస్త్రములను 'సుమంగలీరియం' అను మంత్రముతోను, వరునకు 'యువం వస్త్రాణి' అను మంత్రముతోను ఈయవలెను. వస్త్రముల నిచ్చిన తర్వాత వస్త్రదాతలపేరును, ఉదాహరణకు 'శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య శ్రీమాన్ రామాచార్యులవారు పుంసువనసుముహూర్తమున తమ అల్లునకు, కూతురునకు సమర్పించు నూతనవస్త్రములు' –ఇత్యాదిగా చెప్పవలెను.

